ఓం

# రాకమచర్ల వేంకటదాసు
# కీర్తనలు జీవితవిశేషాలు

ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి
డాక్టరేట్ పట్టం పొందిన
సిద్ధాంత గ్రంథం

"భాషాప్రవీణ"

డాక్టర్ సాగి ఆంజనేయ శాస్త్రి
ఎం.ఎ.పి.,ఓ.,యల్.,పి.హెచ్.డి.

ఆంధ్రోపన్యాసకులు గీతా విజ్ఞాన ఆంధ్రకళాశాల
(ఓరియంటల్ డిగ్రీ కళాశాల)
నల్లగొండ.

# Rakamachrla Venkatadasu Keerthanalu Jeevitaviseshalu

**Ph.D. THESIS**

**"Bhasha Praveena"**



By Dr. S. ANJANEYASASTRY
M A P O.L. Ph D.

ప్రథమ ముద్రణ : ప్రమోదనామ సంవత్సరం శ్రావణ శుద్ధ పంచమి
25-7 1990

ప్రతులు : 1000

సర్వస్వామ్యములు గ్రంథకర్తవి

వెల : రూ. 80/-



ప్రతులకు : యస్, సువర్చల
తిలక్‌నగర్ రామగిరి,
నల్లగొండ-508001.

సాగి అనంతరామయ్య
ఒప్పిచర్ల పోస్టు గుంటూర్ జిల్లా,
కారంపూడి మండలం-522614

S. SUVARCHALA
H.No 6-3-671, Tilaknagar,
Ramagiri, Nalgonda-5088001.

Sagi Anantaramaiah
Karampudi (Mandal)
Oppicherla (P.O.)
Guntur Dist-522614.

ఈ గ్రంథం తిరుమల తిరుపతి దేవస్థానం వారి
ఆర్థిక సహాయంతో ప్రచురితం.

గోపాలకృష్ణా ప్రింటింగ్ ప్రెస్ నల్లకుంట, హైదరాబాదు-44




పవిత్రులై — జన్మనిచ్చిన

అమ్మానాన్నలు

దీక్షతో — చదివించిన

పిన్ని బాబాయిలు

ఆసక్తులై — జీవనమార్గం చూపిన

అక్కాబావలు

త్రయీ మూర్తులు

భూలోకదేవతలు

వారికి వినమ్రతతో

సమర్పిస్తున్నా నీకృతి



—గ్రంథకర్త

# విషయసూచిక

విషయ వరుస | పుటల సంఖ్య

:0:

# పూర్వకథనం

తాత్త్విక చింతనాభిలాష గల నాకు (పి.హెచ్.డి) పరిశోధన గావించాలనే కోరిక పుట్టింది. ఆదశలో (1982 సం॥) డా॥ యెల్దంద రఘుమారెడ్డి గారితో పరిచయం కలిగింది. వారు నన్ను పరీక్షించి పరిశోధనకు తగిన విధంగా ప్రోత్స హించే "రాకమచర్ల వేంకటదాసు కీర్తనలు - జీవిత విశేషాలు" అను అంశమునిచ్చి నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ అధికారులు దానికి అనుమతించి నారు. డా॥ రఘుమారెడ్డి గారినే నా పరిశోధనకు మార్గదర్శకులుగా, పర్యవేక్ష కులుగా నిర్ణయించినారు, వీరి మార్గ దర్శనంలో ప్రణాళికాది వివరాలు కూర్చు కోవటం జరిగింది. వీరి అమూల్య పర్యవేక్షణకు - మార్గదర్శనానికి నతులు.

విషయ సేకరణకు ఎంతో ధైర్యానిచ్చి శ్రీ రఘుమారెడ్డి గారు తమ లేఖద్వారా శ్రీ లక్ష్మీనాధాచార్యులను (సంస్కృత అధ్యాపకులు, తాండూరు) పరిచయం చేశారు. పాలమూరు రంగారెడ్డి జిల్లాలలో విషయ సేకరణకు ఎన్నోపాట్లు పడటం సహజమే। ఎందరు పల్లీయులను కదిపినా వేంకటదాసు, వారి కీర్తనల యెడ దాదాపు అందరి అభిప్రాయం ఒక రకంగానే ఉంది. వీలైనంతవరకు మిగలకుండా సేకరించాను. సేకరణకు ముందు ఎంతో విషయం లభ్యమౌతుందని ఆశించాను. కాని సేకరణ ప్రారంభించి ఆయాప్రాంతాలలోని పెద్దలను, మఠాధిపతిని, వేంకటదాసు భక్తులను, పల్లీయులను చిన్నా పెద్దా తేడా లేకుండా ఎందరిని కదిపినా చెప్పిన విషయం ఒకటి గానే ఉంది. సుమారు 480 కీర్తనలు అచ్చయి,నామి అచ్చులో లేవని చెప్పబడుతున్న ఇరువది రెండు సంవాద కీర్తనలు, పదునాల్గు విధి కీర్తనలు, ఒక బుర్రకథను నేను సేకరించాను. ఇంతకు మించి కీర్తనలు లభ్యం కావటంలేదు. వేంకటదాసు కీర్తనల ప్రభావాన్ని తెలుసుకునేందుకు వారి వారి అభిప్రాయాలను సేకరించాను. పల్లె పల్లెను ఎంతో ఓర్పుతో, ప్రేమతో నా వెంటతిరిగి ఎందరో ప్రముఖులను పరిచయంచేసి విషయ సేకరణలో నాకు కుడిభుజమైన శ్రీలక్ష్మీనాధాచార్యుల ఋణం తీర్చుకోలేనిది.

కోరినదే తడవుగా వారి పనులను కూడా మానుకుని అప్పటికప్పుడు భజన కార్యక్రమాలను ఏర్పాటు చేసి కీర్తనలు పాడటమేకాక, ఆ కీర్తనలు టేపు చేసుకు

నేందుకు సహకరించి, అడిగిన ప్రశ్నలన్నింటికి దాపరికం లేకుండా సమాధానాలు ఇచ్చి విషయసేకరణకు తోడ్పడిన రంగారెడ్డి జిల్లావాసులు కండ్లపల్లి దుర్గయ్య, పరమారెడ్డి, భుజంగరెడ్డి, రాచయ్య, ప్రభు, వీరయ్య, చంద్రయ్య, మణయ్య, బ్రహ్మయ్య, వెంకటయ్య, మల్లయ్య, మోకిల పరమారెడ్డి, చంద్రయ్య, నరసింహులు, లక్ష్మయాచారి, దుర్గయ్య, నాగయ్య, మల్లయ్య, పర్మయ్య, కిష్టయ్య, కోదండం, భగవాన్, ముత్యం రెడ్డి, సుల్లారెడ్డి, శంకరపల్లి వెంకటాద్రివు, పాడిగోపాల్‌రెడ్డి, బీర్ల అడివయ్య, పోకల నరసింహులు పర్మటి నాగిరెడ్డి, యం. నరసింహయ్యశాస్త్రి, వి. అనంతరెడ్డి కమ్మంపాటి గోపాల్‌రెడ్డి, జె రఘువీరశర్మ, ఇ. హన్మంతరెడ్డి, ప్రతాప్‌రెడ్డి, జె. సత్తిరెడ్డి, యస్. విఠల్, ఎ. సత్యనారాయణ మొదలైన వారికి, పాలమూర్ జిల్లా నివాసులైన గాజుల శివప్ప, చెన్నకిష్టయ్య, శంకరమ్మ (వేముల) కన్యనూరు విశ్వనాథం, పల్లె బిచ్చయ్య. సామవేదం రంగాచార్యులు ఇంకా ఇందు చేర్చబడక పరోక్షంగా సాయపడిన వారందరికి నా చేమోడ్పులు. కృతజ్ఞతా భావంతో కొందరి ఛాయాచిత్రాలను సిద్ధాంత వ్యాసంలో పొందుపరుస్తున్నాను.

రాకమచర్ల వేంకటదాసు జీవిత విశేషాలను వెలుగులోకి తెచ్చేందుకు తోడ్పడిన ముఖ్యమైన వ్యక్తి శ్రీ ముల్గర రంగారావుగారు. దాసుగారి వంశచరిత్రను, వంశ వృక్షాన్ని వాత్సల్యంతో నాకందించిన వీరు వేంకటదాసు వంశీకులు. వీరికి నేనెంతో ఋణపడి ఉన్నాను. వీరికి నాహార్దిక కృతజ్ఞతలు.

కోరినంతనే తమలేఖల ద్వారా సమాచారాన్ని అందించిన చరిత్రకారులు, సాహితీ వేత్త అయిన శ్రీ కపిలవాయి లింగమూర్తి గారికి, నాగలింగశివయోగి గారికి నా అభివాదాలు.

కోరినంతనే అత్యంత ఆత్మీయతతో వేంకటదాసు కీర్తనలను సంప్రదాయ బద్ధంగా రాగతాళ నిర్ణయం చేసి చెప్పిన కర్ణాటక గాత్ర సంగీత విద్వాన్ సి. ఎచ్. భాస్కర్ (కర్ణాటక గాత్ర ఉపన్యాసకులు) గారికి నా హృదయపూర్వక నతులు.

నా పరిశోధనాంశాన్ని విని ఆనందించి విలువైన విషయాలను అందించిన శ్రీ జోగి విఠలయ్య, శ్రీ లక్ష్మీకాంతరావు, రామకృష్ణపంతులు, తమ్మళి విఠలయ్య గార్లకు నా కృతజ్ఞతలు.

కోరిన వెంటనే మఠాధిపతుల వివరాలను వివరించి, మఠాన్ని ఫోటో తీసేందుకు అనుమతించిన ప్రస్తుత మఠాధిపతి శ్రీ గోవిందయ్యకు నా వందనాలు. ఆఫోటోలను సిద్ధాంతవ్యాసంతో పొందుపరుస్తున్నాను.

రాకమచర్ల గుడికి సంబంధించిన విషయాలు తెలిపిన పూజారి శ్రీ పూడూరు నరసింహాచార్యులు, అచ్చుకాని బుర్రకథ ప్రతిని నా కందజేసిన శ్రీ భీమాచారి పంతులు, భజనవిషయంలో పూర్వీకులు వ్రాసుకున్న ఫర్మానాను నాకందించిన పరమయ్య గార్ల వాత్సల్యం మరువలేను. వారికి నా కృతజ్ఞతలు. ఆ ఫర్మానాను సిద్ధాంత వ్యాసంలో పొందుపరచినాను.

విషయ సేకరణకు పాలమూర్, రంగారెడ్డి జిల్లాలకు వెళ్లినపుడు ఆ ప్రాంతాలకు క్రొత్తవాడినైనా అత్యంత అదరణంతో నన్నాదరించినవారందరికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

సిద్ధాంత వ్యాసానికి అనుగుణంగా బొమ్మలను గీసి బొట్టుదిద్దిన ఆత్మీయులు శ్రీ నాగార్జున (ఉపాధ్యాయుడు, నల్లగొండ)కు మరియు ఆయా గ్రంథాలను వ్యాసాలను పత్రికలను పరిశోధన వేళ సందర్భ శుద్ధికై ఉపయోగించుకున్నాను. ఆయా గ్రంథకర్తలకు, వ్యాసకర్తలకు, పత్రికారచయితలకు కృతజ్ఞతలు,

నేను పరిశోధన చేసేందుకు అనుమతించిన గీతావిజ్ఞాన ఆంధ్రకళాశాల యాజమాన్యానికి, పరిశోధనా వ్యాసానికి ఉపయుక్త గ్రంథాలను అందించిన గీతా విజ్ఞాన ఆంధ్రకళాశాల గ్రంథాలయం వారికి, ఆర్యసమాజం గ్రంథాలయం, నల్లగొండ, వారికి నా కృతజ్ఞతలు. ఇంకా హితైషులెందరో సహకరించారు. వారందరికి ధన్యవాదాలు

ఎంత ప్రమాణంగా సిద్ధాంతవ్యాసాన్ని రూపొందించటానికి ప్రయత్నించినా, అక్కడక్కడ ప్రింటింగ్ దోషాలు చోటుచేసుకున్నాయి. విజ్ఞులు గమనించి మన్నింప వేడుదు.

ప్రభవనామ సంవత్సరం.

సాగి ఆంజనేయ శాస్త్రి.

ఫాల్గుణ శుద్ధ
తేదీ : 23-2-1988,

డా॥ వారణాసివీరనారాయణశర్మ
M.A., Ph.D.
అధ్యక్షులు
పరిశోధకమండలి, నల్లగొండ.

# భక్తి పరిశీలనము - క్రొత్త ఆలోచన

సకలచరాచర సృష్టిలో మానవ జన్మము శ్రేష్ఠతరమైంది. అయితే మానవుడు దివ్యుడుగా వలయునని చేసెడు ప్రయత్నము సదాకొనసాగుచునేవచ్చుచున్నది. దానవత్వమును నిరసించి, దివ్యత్వమునకై సాగెడు నీ ప్రస్థానము, సర్వం సహా మండలమున, సకలబుద్ధిజీవులచేత నుత్తమమైనదిగా నెన్నబడుచున్నది. అదియే ఆధ్యాత్మికచింతనముగా, సత్యాహితరచనగా, సదాచార సంపత్తిగా, రూపొంది, మానవజాతిని తరింపజేయుచున్నది. ఈ మహోద్యోగమున నెందరో మహర్షులు, మహాత్ములు, మతప్రవక్తలు తాము దర్శించిన సాధన మార్గమును లోకమున కాదర్శముగ బోధించియున్నారు. ఆసాధనమే బహుముఖముల విస్తరించి, భారత కాలమునాటికి- వేదవ్యాసప్రోక్తమై జ్ఞాన, కర్మ, భక్తి మార్గములుగా విస్పష్టమైనది. అందు జ్ఞానము సర్వోత్తమము, కత్తిమీది సామేయయినప్పటికిని, కర్మమార్గము లోకమునకు సదాచరణీయమైనది కాగా భక్తి మార్గము సర్వజనసులభమై, ముముక్షు జనామోదకారణమై విలసిల్లినది భక్తియే తుదకు జ్ఞానముగ, బర్యవసించి, మోక్ష హేతువగునని వేదవ్యాసుని హృదయము. ఇట్టి భక్తిని గూర్చివేదములు చెప్పలేదని, అదియవైదికమని, యొక క్రొత్తపుంత ద్రొక్కినవారు డా॥ సాగి ఆంజనేయశాస్త్రి గారు వారు నాకు మిత్రులు, ఆప్తులు, సన్నిహితులు, మాపరిశోధకమండలి సభ్యులు కూడ "రాకమచర్ల వేంకటదాసు కీర్తనలు - జీవితవిశేషాలు" అనువారి సిద్ధాంత గ్రంథము, సాహితీలోకమున కొక క్రొత్త కానుక.

బహుళ ప్రచారమునంది, దైవభక్తిని పంచిపెట్టిన రాకమచర్లవారి కీర్తనలను సేకరించి, పరిశోధించి, బహుశ్రమలకోర్చి, వారు చక్కని సిద్ధాంత గ్రంథమును వెలువరించినారు. మహాత్ముల జీవితములు సామాన్యుల కాదర్శమగుట లోకసహజము

బోధకు, ఆచరణమునకు, అవినాభావ సంబంధము. ఒకటిలేకున్న రెండవది నిలువదు. జ్ఞానము శ్రేష్ఠమేకాని ఆచరణమంతకన్న ముఖ్యము. కేవలజ్ఞానము నిష్ప్రయోజనము. పవిత్రజీవనము, నిరంతరభగవన్నామస్మరణము, సమభావము, నిష్కామకర్మాచరణము ననునవి జ్ఞానస్థితికి మూలములు కాగా వానిని ప్రస్ఫుట మొనర్చునది భక్తి. దానినే యవలంబించి, మోక్షమునందిన మహాత్ముడు, రాకమచర్ల వేంకటదాసు గారు

భగవత్ తత్త్వమును, అదికీర్తనలలో ప్రతిబింబించిన వైనమును డా॥ శాస్త్రి గారు సమగ్రముగ బరిశీలించి, పరిశోధన రంగమునకొక మంచి సిద్ధాంత గ్రంథమునందించినారు. వారి కృషి పండితజన ప్రశంసాపాత్రమైనది. వారికపైని తోధిక కృషి యొనర్చి, పరిశోధన రంగమునకు వన్నె తేగలరని యాకాంక్షించుచు, వారిని హృదయ పూర్వకముగ అభినందించుచున్నాను.

నల్లగొండ,

27-7-1990

డా॥ వారణాసి వీరనారాయణశర్మ



# సంకేత పద సూచిక

1. అ.కో. : అమరకోశము.
2. అ.మం. : అధర్వణవేద మంత్రం
3. ఆ.వి. : ఆర్యాభివినయము.
4. ఈ.ఉ. : ఈశావాస్యోపనిషత్తు.
5 ఈ.ర.సా.ఋ.మం. : ఈశ్వర రహస్యసారము ఋగ్వేదమంత్రం
6. ఐ.ఉ. : ఐతరేయోపనిషత్తు
7. క.ఉ. : కఠోపనిషత్తు
8. కా.సం. : కావ్యాలంకార సంగ్రహము.
9 క్రౌ.సం.వి. : క్రొత్త సంగీత విద్యాదర్పణము.
10. గా.క.బో. : గాన కళాబోధిని
11. ఛాం.ఉ. : ఛాందోగ్యోపనిషత్తు
12. జా.సా. : జానపద సాహిత్యం
13. తి.నా.న.ప. : తిరునామాములు - సమగ్రపరిశీలనము.
14. తై.ఉ. : తైత్తిరీయోపనిషత్తు
15. నా.భ.సూ. : నారధ భక్తి సూత్రములు.
16. ప.ప్ర. : పల్లె పదాలలో ప్రజాజీవనము
17. ప్ర.ఉ. : ప్రశ్నోపనిషత్తు
18. బా.వ్యా. : బాలవ్యాకరణం.
19. బృ.ఉ. : బృహదారణ్యకోపనిషత్తు
20. భ.త.ద. : భక్తి తత్త్వ దర్శనము.
21. భ.గీ. : భగవద్గీత.
22 శ్రీ.మ.భా : శ్రీమహాభాగవతం.
23. శ్రీ.మ.భా.మ.పు. : శ్రీమద్భాగవతమహాపురాణమ్.
24. శ్రీ.మ.మ.భా. : శ్రీమదాంధ్రమహా భారతము.
25. మ.స్మృ. : మనుస్మృతి

26. శ్రీ.మ.హ.చ. : శ్రీమన్నెంకొండ హనుమద్దాస చరిత్ర.
27. శ్రీ.మా.చ. : శ్రీమాణిక్య ప్రభు చరిత్ర
28 మాం.ఉ. : మాండూక్యోపనిషత్తు
29. య.భా. : యజుర్వేద భాష్యము
30. ముం.ఉ. : ముండకోపనిషత్తు
31. యో.ద. : యోగదర్శనము
32. రా.కీ. : రాకమచర్ల కీర్తనలు.
33. శ్రీ.రా.మా.వేం.జీ భ.చ. : శ్రీరాకమచర్ల మహాత్మ్యము వెంకటదాసు గారి జీవితము వీరిభక్త బృందచరితములు.
34. వే.ద : వేదాంత దర్శనము.
35 ఋ.భా.భూ. : వేదతత్త్వప్రకాశము (ఋగ్వేదాది భాష్యభూమిక)
36. శ.ర. : శబ్ద రత్నాకరము
37. శ్రీ.వే.హ.చ. : శ్రీవేపూరి హనుమద్దాసు చరిత్ర
38. వై ద : వైశేషిక దర్శనము
39 శ.బ్రా. : శతపథబ్రాహ్మణం
40 శ్వే.ఉ. : శ్వేతాశ్వతరోపనిషత్తు
41. స ప్ర : సత్యార్థ ప్రకాశిక
42. సం.పా.యో.ద. : సంక్షిప్త పాతంజల యోగదర్శనము
43. స ప్ర.సం. : సత్యార్థ ప్రకాశ సందేశము
44. సాం.ద. : సాంఖ్యదర్శనము
45. సా.వే హిం.భా. : సామవేదహిందీభాష్యము
46. ప.శీ.న : పరిశీలన
47. హిం.స్వ. : హిందూస్వరూపము
48. క్షే.ప.సా. : క్షేత్రయ్య పదసాహిత్యం

# దార్శనికం

దార్శనికం లేనికావ్య స్పర్శనమింకెందుకురా
శివంలేని శవంకాద శివర్చాత్రులు ఎందుకురా

జానపద వాఙ్మయం సామాన్య జనజీవనమయం. అంటే పల్లీయం, కేవలం పల్లీయుల్లో పుట్టిందే అచ్చమైన జానపద వాఙ్మయం. దీనికున్న లక్షణాలు విలక్షణమైనవి. అంతే పల్లీయులకోసమైపుట్టించిన జానపదవాఙ్మయమనబడేది మరొకస్థాయిది ఇది వేదవిరుద్ధమైన శైవ వైష్ణవమత ప్రచారంలో పుట్టించినది ప్రాచీన తెలుగు సాహిత్యంలో ఉన్నట్లే జానపద సాహిత్యంలో కూడా శైవ వైష్ణవ ప్రచారసాహిత్యం పుట్టించబడింది దీనికి జానపదవాఙ్మయలక్షణాలు వర్తించవు. రాకమచర్ల కీర్తనలు ఈకోవలోకి వర్తిస్తాయి

రాకమచర్ల వేంకటదాసు వైష్ణవ భక్తికి అంకితమై తత్సంబంధ కీర్తనలు రచించటం తమచుట్టు ఉన్న ప్రజలకందించటం జరిగింది. దీన్ని జనులందుకున్నారు. కొంతమటుకు తమదిగా గొంతు కలుపుకున్నారు. నేడు ప్రత్యేకంగా పాలమూరు, రంగారెడ్డి జిల్లాల్లో ప్రజలు ఈ కీర్తనలు ప్రత్యేక సందర్భాలలో పాడుకుంటుంటారు.

ఈ కీర్తనల సంఖ్య చాలా అధికంగా ఉంటాయన్న భావనతో సేకరణ మొదలిడితే సమగ్రంగా ప్రయత్నిస్తే భావించినంతగా కీర్తనల వస్తువు లభించలేదు, లభించినంతవరకు శ్రీ డా॥ S. ఆంజనేయశాస్త్రి గారు ఈ పరిశోధ నకుతగిన కృషి చేసి న్యాయం చేకూర్చారు, ప్రత్యేకించి ఈ కీర్తనలను వైదికా వైధిక విమర్శతో పరిశీలించారు. దీనివల్ల సత్యాసత్యములు తెలుసుకోబడ్డాయి. సాహిత్యంలో హితమెంత? అనే ప్రశ్నకు సమాధానంకూడా దొరికింది. అనబడే సాహిత్యాన్ని వినబడే విమర్శతో పరిశోధనలు సాగిస్తున్న విశ్వవిద్యాలయాలకు హితమెంత? అనే ప్రశ్నపుట్టటానికి మార్గదర్శనం డా॥ శాస్త్రిగారి ఈ పరిశోధనావ్యాసం.

జానపదవాఙ్మయం సంపూర్ణ సాహిత్యంగా కూడా భావించరాదు. దీనిస్థాయిలో దీపంవెలిగించినంత. ఇంతేగాని సూర్యునితో పోల్చరాదు. అంటే క్రాంతదర్శన

...షికసత్త్వానికి తూచరాదు. పరిశోధకులు దొరికిందే బతికినట్లు కాకుండా, సత్య మెంత? హితమెంత? అనేది ప్రధానంగా గుర్తించాలి. ఇట్లాగుర్తించేదానికి ఈ పరి శోధనమొకమాపర.

రాకమచర్ల కీర్తనలు తగిన సంగీతబలంతో ఉన్నాయి. అ బలనిరూపణ క... ఇందు చూపబడింది సంగీత బలంలో మతభావాలను రంగరించుటలో రాకమ చర్ల వేంకటదాసుకు స్వాభావికమైనచేయితిరిగింది. తానుగుర్తించినంత జనానికి వర్తించింది. అ వర్తించినంత ఈ పరిశోధనవల్ల తేటతెల్లమైంది. వేంకటదాసుగారి జీవితవిశేషాలు కూడా ప్రత్యక్ష అధారాలమీద తెలుసుకోబడినదంత తెలుపబడింది. అభూత కల్పలతో ఏనిపించే ఆతని విషయాలను సవిమర్శకంగా తూచటం మెచ్చుకోదగింది.

వివిధ భాషాసాహిత్యాల పడుగే అడుగు దప్పింది. ఇది రెండున్నర్రవే సంవత్సరాల ఈవలావలి ఏతాల అనుసరణం లక్ష్యమెరుగని సాహిత్యం... బడాయిగా చెప్పుకోవటం జరుగుతున్నది. కనీసం పరిశోధకులైనా సత్యమూ మెరిగి వివేచిస్తే కొంత శ్రేయస్సయినా కలుగుతుంది. ఆదియే అభ్యుదయ నిశ్శ్రేయసానికి దారిలభిస్తుం...

కలి॥ సం॥ 5091.
భాద్రపద శుద్ధ షష్ఠి
ఆర్షవేద గురుకులం
శాహాపూర్ (గండిపేట) రంగారెడ్డి జిల్లా.

సద్దర్శనాభిలాషి
జాతీయ విప్లవకవి
డాక్టర్ రఘుమన్న

# ఛాయాచిత్రాలు


రాకమచర్ల గుడి


అంజనేయ విగ్రహం


రేకమ గుడి


గరుడ విగ్రహం



ముచుకుందానది



వేంకటదాసు తంబూర



యోగానంద లక్ష్మీనృసింహుడు



ఏకనాథ స్వామి



శ్రీ జోశి పితలయ్య



శ్రీ సామవేదం రంగాచార్యులు



జోశిరామకృష్ణ పంతులు
తమ్ముడు పితలయ్య



శ్రీ యం. రంగారావు



సాలగ్రామం



వేంకటదాసు మఠం (పెద్ద ఉమ్మెంతాల)



తిరుమలయ్య సమాధి



ఏకనాధస్వామి సమాధి

మొదటి ప్రకరణము

# భారతీయ తత్త్వం

తత్త్వ జ్ఞానానికి భారత భూమి పుట్టినిల్లు. ఈ భూమికే ఆర్యావర్తమని ప్రాచీన నామం. ఆర్యులు నివసించిన భూమి కాబట్టి ఆర్యావర్తమన్నారు. సృష్ట్యాదిలో ఉన్న మనుష్య జాతిలో ధార్మికులు, విద్వాంసులు, ఆప్త పురుషులు అయిన వారు ఆర్యులని, దుష్టులు అధార్మికులు అవిద్వాంసులైన వారు, దస్యులని ఋగ్వేదం తెలిపింది. (స. ప్ర. అ. స. 284 పే) "విజానీహ్యార్యాన్యేచ దస్యవో బర్హిష్మతే రంధయా శాసదవ్రతాన్" (ఋ. మం. 1 సూ. 5, మం. 8) అనే ఋగ్వేద మంత్రాన్ని బట్టి నాటి పరిభాషలో ఆర్యులంటే జ్ఞానులు, శ్రేష్ఠులని అర్థం. ఇట్టి జ్ఞాన సంపన్నులకు విద్వాంసులు, దేవులు అనేవి పర్యాయ వాచకాలు. ఇట్టి దివ్యజ్ఞాన సంపన్నులున్న మన భూమి ఆర్యావర్తమని పిలువబడింది.

## తత్త్వం :

సమస్త, విద్యలకు మూలాధారమైన వేదవాణి వెలసిన ఈ పుణ్యభూమి తరగని తత్వజ్ఞాన నిక్షేపాలు కలిగియుంది. మానవుడు ధర్మ అర్థ కామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థ సిద్ధిని పొందాలని వేదం తెలుపుతున్నది. ఈ పురుషార్థాలలో చివరిదైన మోక్షసిద్ధికి భగవదుపాసన సాధనం. అట్టి సాధన ద్వారా పొందే జ్ఞానమే "తత్వం". ఇట్టి తత్వ సిద్ధివల్ల తానెవరు ? ఈ సృష్టి స్వభావమేది? ఏది మూల హేతువు? మొదలైన ప్రశ్నలు ఉదయిస్తాయి. ఫలితంగా భౌతికాసక్తిని విడిచి, అంతర్మథనం నుండి పొందే జ్ఞానమే తత్త్వం.

తత్త్వానికి "పరమాత్మ, స్వభావం" అనే అర్థాలున్నాయి. (శ.ర. 330 పే). స్వభావం ఆంతరంగిక వర్తనం. ఇది తెలుసుకోవాలంటే సూక్ష్మాతిసూక్ష్మమైన నిశిత పరిశీలన, ఏకాగ్రత కావలె. తత్వమంటే వేదార్థం పరమాత్మ. ఒక వ్యక్తి సస్వరూపుని తత్వజ్ఞతకు ఎంత కష్టపడాల్సి ఉంటుందో అనుభవైకవేద్యమేకదా! అట్టి యెడల రూపగుణరహితుడైన పరమాత్మ తత్త్వం తెలుసుకునేందుకు మాటలు చాలవు. సాధన చేయాలి. ప్రాకృతిక పరిమితులను అధిగమిస్తే జ్ఞాన, కర్మ, ఉపాసనల ద్వారా ఈ తత్త్వ జ్ఞానం ఎరుక పడుతుంది. ఆ జ్ఞానమే సత్యం, చైతన్యం, ఆనందం.

తత్ + త్వం తత్వం. తత్ అంటే అది. సృష్టి కారణ మూల శక్తి. పరమాత్మ. త్వం అంటే నీవు, జీవుడు. తత్ శబ్ద వాచ్యం, రూపరహితమైన పరబ్రహ్మం త్వం శబ్ద వాచ్యం జీవుడు. జీవునికి లక్ష్యం పరమాత్మను తెలిసి సిద్ధిని పొందడం. జ్ఞానవ్యక్తం రూపరహితం, ప్రకాశవంతం, సార్వకాలికం, సర్వ వ్యాపకం. అయిన అనంత కాంతిపుంజమే పరమాత్మ. ఇట్లా తత్‌ను తెలిసికొని సిద్ధని పొందటమే తత్వోద్దేశం. ఇదే వేదోక్త సత్యం.

సామవేద వాక్యమని చెప్పబడుచున్న "తత్వమసి" అనేది సామ బ్రాహ్మణానికి భాగమైన ఛాందోగ్యోపనిషత్తు లోనిది. ఈ వాక్యానికి చెందిన ప్రకరణ మిట్లా ఉంది. "సతు ఏషోఽణి మైత దాత్మ్య మిదం సర్వం స ఆత్మా "తత్వమసి" శ్వేతకేతో : ఇతి భూయ ఏవ మా భగవాన్ విజ్ఞాపయ త్వితి తథా సోమ్యేతి హోవాచ" (ఛాం. ఉ. 6.8.7) ఇది ఉద్దాలకుడు తనపుత్రుడైన శ్వేతకేతువుకు ఉపదేశం చేసే సందర్భం. ఈ ప్రకరణ భావం ఇట్లా గ్రహించాల్సి ఉంది. పూర్వం వర్ణింపబడిన పరమాత్మ జగత్తుకంతటికి ఆత్మ.

అది అత్యంత సూక్ష్మం. ప్రకృతి, జీవాత్మలకంటే మిక్కిలి సూక్ష్మమైనది. ఆ ఆత్మే సత్యం; నిత్యం, అదే జగత్తు కంతటికి అంతర్యామియై ఆధారమై అధిష్ఠానమై ఉంది. ఆ ఆత్మే బ్రహ్మం, బ్రహ్మ సనాతనం, నిర్వికారం, సత్యరూపం, అనంతం. ఇట్లా అర్థాన్ని కలిగియున్న ఈ ప్రకరణం

లోని 'తత్వమసి' అనే వాక్యాన్ని తత్ + త్వమ్ + అసి అని మూడు భాగాలుగా విభజించినా తస్మిన్ + త్వం అని "తత్వం" పదానికి విగ్రహం చేసి తస్మిన్ ఆ పరమేశ్వరునందు, త్వం నీవు, అసి ఉన్నావు. వ్యాపకుడైన పరమేశ్వరునందు జీవుడవైన నీవు ఉన్నావు అని అర్థం చెప్పాలి. లేదా తదాత్మక స్త్వమసి "తత్త్వం". పరమేశ్వరుడే ఆత్మగా కలవాడవు (ఛాం. 292 పే) అని ప్రకరణోచితంగా అర్థాన్ని తెలుసుకోవాలి. అంతేగాని 'తత్వమసి' అనే వాక్యానికి "నీవే బ్రహ్మవై ఉన్నావని" చెప్పటం సత్యార్థం కాదు

కుమ్మరి-మట్టి-కుండ అనే మూడు పదార్థాలున్నాయి. కుమ్మరి తన జ్ఞాన ప్రతిభతో మట్టితో కుండను నిర్మిస్తాడు. కాలక్రమేణ కుండ మట్టిలో లీనమైపోతుంది. కాని కుమ్మరి పోనట్లే జీవుడు అంటే జీవధారియైన శరీరం ప్రకృతిలో లీనమవుతుంది. పరమాత్మలో కాదు. లీనమైనప్పటికీ కుండను చూచినప్పుడు ప్రతిభావంతుడైన కుమ్మరే గుర్తుకు వచ్చినట్లు అంతర్లీనమైన పరమాత్మ ప్రతిభే నీవు అంటే జీవుడు అనే సన్నిహిత భావాన్ని 'తత్త్వమసి' అనే వాక్యం గుర్తుచేస్తుంది.

ఎట్లాగంటే "మంచెలు అరుస్తున్నాయి" అన్నపుడు జడపదార్థమైన మంచెలు అరవటం సాధ్యపడదు కాబట్టి లక్ష్యార్థాన్ని గ్రహించి మంచస్థ పురుషులని ఎట్లా అర్థం చేసుకుంటున్నామో అట్లాగే "తత్వమసి" అనే వాక్యానికి వ్యాపకుడైన పరమేశ్వరునందు జీవుడైన నీవున్నావనే అర్థాన్ని గ్రహించాల్సి ఉంది. ఎందుకంటే బ్రహ్మము సర్వశక్తిమత్వ, దోషరహితత్వ గుణాలుకలది. జీవుడు అల్పశక్తిమత్వ, భ్రాంతిమత్వ దోషగుణ యుక్తుడు. అందువల్ల జీవ బ్రహ్మము లేకమే అనటం భ్రాంతి మూలకమే అవుతుంది.

"ప్రజ్ఞానమానందం బ్రహ్మ" (5—3) అనే ఐతరేయ బ్రాహ్మణవాక్యం బ్రహ్మస్వరూపాన్ని తెలుపుతున్నది. ఈ వాక్యానికి ప్రకృష్టజ్ఞానం స్వరూపంగా కల బ్రహ్మ అని అర్థం. భూత భవిష్యద్వర్తమానాలలో సర్వజగత్తును వృద్ధిచేసేది, భక్తులకు మోక్షానంద మిచ్చేది, మొదట గణింపతగింది బ్రహ్మమని స్వరూప స్వభావాలను తెలిపింది. జగత్తులో సర్వ సత్య పదార్థాలకన్న ప్రియతమమై

జీవాత్మలో వ్యాపించి అంతర్యామిగా ఉన్న పరమేశ్వరుడు ఆత్మలకాత్మ. అట్టి పరమాత్మను ఉపాసించిన వానికి ఆనందం కలుగుతుంది. బ్రహ్మ జ్ఞానం పొందిన వారు సమస్త ప్రాణుల సుఖదు:ఖాలతో తాదాత్మ్యం పొంది పరస్పర సుఖోన్నతికి యత్నిస్తారని శతపథబ్రాహ్మణం (శ. బ్రా 14.3.2.18 నుండి 22) తెలిపింది. పరమేశ్వర సామర్థ్యం వల్లనే జగత్తు సృష్టింపబడింది. ఈ జగత్తుకు మరియొక నిమిత్త కారణం లేదు. సృష్టికి పూర్వం సర్వశక్తి మంతమైన బ్రహ్మము ఒక్కటే ఉన్నది «హిరణ్య గర్భః' సమవర్తతాగ్రే భూతస్యజాత : పతిరేక ఆసీత్" (ఋ. 8.7.3.1) అనే ఋగ్వేద మంత్రం ఈ విషయాన్నే తెలిపింది. అవిద్యా నిద్రనుండి మేల్కొని ఎవడు బ్రహ్మ విద్యాప్రకాశాన్ని పొందుతాడో వాడే ఆ బ్రహ్మయందలి నిత్య సుఖాన్ని అనుభవించగలుగుతాడు. "అనిత్యమందు నిత్యభావన, అశుచియందు శుచి భావన కలిగి ఉండటం అవిద్య' (పా.యో.ద. 2.5) వామదేవ మహర్షి అట్టి బ్రహ్మజ్ఞానాన్ని పొంది, ఆ జ్ఞాన సామర్థ్యంతో తనకు లోపల వెలుపల ఉన్నది బ్రహ్మయే అని తెలుసుకున్నాడు. ఇట్టి జ్ఞానాన్ని సమాధి ప్రజ్ఞ అంటారు. (పా. యో. ద. 1.20) ఆత్మాది పదార్థాలను యథావిధిగా తెలుసుకోవటం సమాధి ప్రజ్ఞ. ఇట్టి విచారణ వల్ల జీవాత్మ పరమాత్మలు వేరని తేట పడుతుంది. ఈ రెండు వ్యాప్యవ్యాపక సంబంధాన్నే కలిగి ఉన్నాయి. వ్యాప్యం వ్యాపకాన్ని వదలి మనలేదు. అంతమాత్రాన రెండూ ఒకటే అనకూడదు. ఎట్లాగంటే ఆకాశం కంటే గృహం, గృహం కంటే ఆకాశం వేరుగా ఉండవు. అంతమాత్రాన ఆరెండూ ఒకటే అనలేము కదా! ఈ విషయంలో వేద తత్వ ప్రకాశమనబడే 'ఋగ్వేదాది భాష్యభూమిక" (122 పే) ఇట్లా తెలిపింది. "సర్వజగత్కర్త'సర్వశక్తి మంతుడు, ఎల్లరకు ఇష్టుడు, ఎల్లరిచేత ఉపాసింపదగినవాడు, సర్వధారణ కర్త, సర్వవ్యాపకుడు, సర్వకారణుడు, ఆద్యంతాలు లేనివాడు, సచ్చిదానంద స్వరూపుడు, అజన్ముడు, న్యాయకర్త మొదలైన విశేషణాలతో వేదాది శాస్త్రాలు వర్ణించిన పరమేశ్వరుడే ఎల్లరకు ఇష్టదేవుడు. అతని కంటె భిన్నవ్యక్తిని గాని, భిన్న పదార్థాన్ని గాని ఇష్టదేవుడుగా అంగీకరించువాడు అనార్యుడనదగును. కాబట్టి ఎల్లరకు ఆత్మయైన పరమేశ్వరునే మానవులంగా ఉపాసించాలి" అనే వాక్యాలు జీవేశ్వరులు ఒకటి కాదనే విషయాన్ని తేట పరుస్తున్నాయి. అందువల్ల వేదమునందు పరమాత్మ, జీవాత్మ, పకృతి తత్త్వం ఎట్లా చెప్పబడిందో తెలుసుకుందాం.

## పరమాత్మ తత్త్వం :

ఋచో అక్షరే పరమేవ్యోమనస్మిన్ దేవా అధి విశ్వేనిషేదు: యస్తన్న వేద కిమృచా కరిష్యతి య ఇతద్విదుస్త ఇమే సమాసతే (ఋ 1.164.39) అనే ఋగ్వేద మంత్రం ఎవడు సకల దివ్యగుణ స్వభావాలను, విద్యలను దాల్చి యున్నాడో, ఎవనియందు సమస్త, పృథ్వి సూర్యాదిలోకాలు ఉపస్థితమై ఉన్నాయో, ఎవడు ఆకాశం వలె వ్యాపించియున్నాడో, సకల దేవతలకు ఎవడు దేవుడో (పరమేశ్వరుడో) అతనిని ధ్యానించి సుఖపడుదురు. అని పరమాత్మ ఉనికిని తెలుపుచున్నది.

ఈ సందర్భంలో ఒక విషయం గమనించాల్సి ఉంది. అదేమంటే దేవుడు, దేవత, పరమేశ్వరుడు అనే పదాలు లోకంలో సమానర్థకాలుగా వాడ బడుతున్నాయి. అందువల్ల అనేక మంది దేవతలను పరమేశ్వర సదృశులుగా అర్చించటం జరుగు తున్నది. కాని ఈ రెండు పదాలకున్న అర్థ భేదం గమనిస్తే పరమేశ్వరుడొక్కడే అని తేటపడుతుంది.

## దేవుడు :

దేవుడు లేక దేవత అంటే దివ్యగుణాలతో కూడియున్నవారని అర్థం. దీనికి అగ్ని ర్దేవతా, వాయుదేవతా, సూర్యదేవతా, చంద్రమా దేవతా, వసవోదేవతా, రుద్రో దేవతా, ఇంద్రో దేవతా, మరుతో దేవతా, విశ్వేదేవా దేవతా, బృహస్పతిర్ దేవతా ఇంద్రో దేవతా, వరుణో దేవతా, "(య. 14.20) అనే యజుర్వేద మంత్రం ప్రమాణం. దివ్య గుణాలు కలిగిన సకల పదార్థాలు దేవతలని దీని భావం. (ఋ.భా.భూ. 105 పే), ఇట్టి దివ్య గుణాలు కల పృథివి, ఆకాశాది అష్టవసువులు, ప్రాణ అపానాది ఏకాదశ రుద్రులు, చైత్రాది ద్వాదశాదిత్యులు, విద్యుత్తు, యజ్ఞం, అన్నీ ముప్పదిమూడు దేవతలను వర్ణించింది. ఉపాస్య దేవుడు మాత్రం పరమేశ్వరుడొక్కడే అని తెలిపింది కాబట్టి దేవతాశబ్దంతో ఈశ్వరుని గ్రహింపకూడదు. "సమస్త జగత్తు యొక్క ఉత్పత్తి స్థితి ప్రలయాలను చేసేవాడు, న్యాయాధీశుడు, అధిష్టాత అయిన పరమేశ్వరుడు దేవులందరికి దేవుడైన మహాదేవుడ"ని తెలుసుకోవాలి. (స.ప్ర. 225 పే).

"యే త్రింశతి త్రయస్పరో దేవాసో బర్హిరాసదన్ విదన్నహ ద్వితాసన్ "(ఋ 6-2-83-1) అనే ఋగ్వేద మంత్రం ముప్పదిమూడు దేవతలు నా అంత: కరణము నుండి పరమాత్మ నెరుంగు గాక ! (ఋ .భా.భూ. 119 పే) అని పరమేశ్వరుని ప్రత్యేకంగా తెలిపింది. ఈ ముప్పదిమూడు దేవతలకు పైనగల పరమాత్మను దేవాధిదేవుడు, న్యాయకర్త, సచ్చిదానంద స్వరూపుడు, అజన్ముడు ఆదిగాగల విశేషణాలతో వేద శాస్త్రాలు వర్ణించాయి. ఈ పరమేశ్వరుడే ముప్పది నాల్గవ దేవత.

ఎల్లరకు ఆత్మయైన ఆ పరమాత్మనే అందరూఉపాసించాలి (ఋ . భా. భూ. 120 పే) లోకంలో మంచి. చెడు అనే రెండు కర్మలు నిత్యం జరుగుతూనే ఉన్నాయి. అందులో మంచి అనే కర్మను ఆచరించినవాడు ఆనంద ఉత్సాహలను పొందుతున్నాడు. చెడు కర్మాచరణం భయ సంకోచ, లజ్జాహేతువై ఉండటం నిత్యానుభవం ఈవిషయాన్ని "ఈశావాస్యమిదగ్ం సర్వం" (య. 40.1) అనే యజుర్వేద మంత్రం ఈ జగత్తునందంతట వ్యాపించి నియమించువాడు ఈశ్వరుడొక్కడే, అతనిని ఉపాసిస్తూ అన్యాయాన్ని విడిచి న్యాయరూపమైన ధర్మమార్గం అను సరిస్తూనే ఆత్మద్వారా ఆనందం అనుభవించమని తెలిపింది. (స.ప్ర. 225 పే) ఈ. విషయాన్నే సిరుక్తం (7.4) ఇట్లా తెలిపింది. వేదాలలో అనేక విధాలుగా పరమేశ్వరోపాసన వర్ణింపబడింది ఇట్టి పరమేశ్వర సామర్థ్యంతోనే ఇతర దేవతలన్ని కొందక ప్రయోజన సిద్ధి కొఱకు నిర్మింపబడ్డాయి. దేవతలను ఉత్పన్నంచేసి ధరించి రక్షిస్తున్న ఆ పరమేశ్వరుని కంటే మఱియొక ఉత్కృష్ట పదార్థమేదీలేదు. సర్వమంగళకారియైన ఆ పరమేశ్వరునే ఉపాసించాలి. వ్యవహారములో ఉపయోగపడే దేవతలను ఉపాసించరాదు (ఋ .భా.భూ. 115, 116 పే) హిరణ్యగర్భ : సమవర్తతాగ్రే భూతస్య.... కస్మై దేవాయహవిషా విధేమ "(ఋ .8.7-3-1) అనే ఋగ్వేద మంత్రం కూడా సృష్టికి పూర్వం పరమేశ్వరుడొక్కడే ఉన్నాడు. అతడే జగత్తుకు స్వామి. అందువల్ల ఆ సుఖస్వరూపునే మనమందరం ఉపాసించాలని పై విషయన్ని స్పష్ట పరుస్తున్నది.

ఈశ్వర నిర్మితమైన జీవాత్మ శరీరం, ఇంద్రియాదులు జీవుని అధీనంలోనే ఉంటాయి, వాటి ద్వారా పనిచేసే జీవుడే కర్మ ఫలాన్ని అనుభవిస్తాడు. అంతేగాని

జీవుడి కర్మలను పరమేశ్వరుడు అనుభవించడు. కాబట్టి జీవుడు కర్మలు చేయ టంలో స్వతంత్రుడు. అట్లాగే న్యాయాచరణాది, కార్యనిర్వహణలో పరమాత్మ స్వతంత్రుడని గ్రహించాలి. జీవుడు తనపరిధిలో కర్మాచరణ విషయంలోస్వతంత్రుడైనా మోక్ష ప్రాప్తి విషయంలో జీవుడు పరమాత్మ అధీనుడై ఉంటాడు. ముండకోపనిషత్తు ఇట్లా తెలిపింది.

"సమానే వృక్షే పురుషోని మగ్నో
అగీశయా శోచతి ముహ్యమానః
జుష్టం యదా పర్యత్యన్యమీశం
అస్యమహిమాన మితి వీతశోకః" (ముం. 3-1-2)

ఒక వృక్షమునందు అందే శరీరమునందున్న పరమాత్మ జీవాత్మలలో అస్వాధీనతవల్ల జీవాత్మ మోహన్ని పొందుతాడు. తద్వారా సుఖ, దుఃఖాలను అనుభవి స్తాడు. ఇట్లా జ్ఞాతగా ఉన్న జీవాత్మ జ్ఞేయమై, జ్ఞానప్రతీకగా ఉన్న పరమాత్మను మహిమగలవానినిగా తెలుసుకొని శోకరహితుడౌతాడు, అనే భావం, జీవాత్మ కర్మలు చేయటంలో స్వతంత్రుడని, మోక్షవిషయంలో పరమాత్మను ఆశ్రయించాలని వ్యక్తి కరిస్తున్నది

జీవేశ్వరులిద్దరూ చేతన స్వరూపులే. (స.ప్ర. 245 పే) చేతనమైనా జీవాత్మ అవిద్యతోకూడి ఉంటుంది, కాబట్టి మాయతోను. అవిద్యాయుక్తం కాని చేతన పరమాత్మ ను ఆతపంతో పోల్చిచెప్పింది కఠోపనిషత్తు (కఠ 3.1) ఈశ్వరుని స్వరూపం చేతనతత్త్వమొక్కటే కాబట్టి అవతరించుట అనేది ఈశ్వరునికి వర్తించదు. కాలక్రమేణ మతాలు ఏర్పడి మతాచార్యులు తమబోధనలతో లోకులను పెడమార్గం పట్టించి నందు వల్ల లోకంలో జడవాదం ప్రబలి ఈశ్వర అవతారం వాదం వేళ్ళూనుకుంది. ఈశ్వ రుడు అవతారమెత్తడని చేప్పేందుకు "అజఏకపాత్" (య. 34-53 "సపర్యగాచ్ఛు క్రమకాయమ్ (య. 40-8) అనే యజుర్వేద వచనాలు ప్రమాణం. ఈశ్వరుని ధర్మ నియుక్తం కర్మం. జ్ఞాన ఆనందాదులు గుణాలు. జీవుడికి సంతానోత్పత్తి, మంచి, చెడు గుణాలు అనేకాలున్నాయి. ఆకలి, దప్పిక, సంతోషం, శోకం అనేవి జీవాత్మకు

పరమాత్మకంటే భిన్నగుణాలు. దేహంలో జీవాత్మ ఉండేంతవరకు ఈగుణాలుంటాయి. వదలి పోగానే ఈ గుణాలు వెదలి పోతాయి. ఇది మనం జీవన విధానంలో అనుభవ పూర్వకంగా గమనిస్తున్న విషయమే। దీపం వెలిగి ఉన్నప్పుడే ప్రకాశం ఉంటుంది. దీపం మలగంగనే వెలుగు పోతుంది. అట్లాగే జీవాత్మ శరీరాన్ని వదిలిన వెంటనే కోరిక, ద్వేషాది గుణాలు కూడా పోతాయి. అందువల్ల పై గుణాలన్నీ జీవాత్మకే చెందినవని చెప్పే వీలుకలుగుతున్నది. అవి పరమాత్మకు చెందినవి కావని తేలు తున్నది. జీవాత్మతో పాటు శరీరంలో ప్రవేశించిన పరమేశ్వరుడు. నిత్యుడు. కాబట్టి అనుప్రవిష్ట రూపమందే చెక్కు చెదరకుండా ఉంటాడు. జీవాత్మ అంత: కరణాలు శరీరగతితోనే పనిచేస్తుంటాయి. ఒకవ్యక్తి ఇంకో వ్యక్తిగా మారనట్లు బ్రహ్మ జీవుడుగా మారజాడని చెప్పటం అసంబద్ధ విషయం. ఈశ్వరుడు సత్తు,చిత్తు,ఆనంద స్వరూపుడు జీవుడు సత్తు, చిత్తు, ఆనంద రహితుడు కాబట్టి జీవుడుఆనందాన్నిపొందటానికి నిరంతరం ఈశ్వరోపాసన చేయాలి.

"సత్యం జ్ఞానం అనంత స్వరూపం, అంతర్యామి అయిన బ్రహ్మాన్ని స్వబుద్ధి జ్ఞానంతో స్థిమితమై ఉన్నదిగా తెలుసుకున్న జీవుడు వ్యాపకుడైన పరమేశ్వరుని యందు మోక్ష సమయంలో స్థిరుడౌతాడు. సమస్తదుఃఖాల నుండి విడవడి ఎల్లవేళల పరమేశ్వరునితో ఆనందాన్ని పొందుతాడు. "(తై.ఉ. 1-1) అనే తైత్తిరీయ ఉపనిష ద్వాక్యాలు జీవుడు పరమాత్మ సాన్నిధ్యమందుడి ఎల్లయెడల ఆనందం అనుభవించడ మే మోక్షం అనే భావాన్ని వ్యక్తీకరిస్తున్నాయి. కాబట్టి ప్రకృతి పురుషులను వేరు వేరుగా తెలుసుకోవటం వివేకం అవుతుంది. స్థిరమైన ఆ వివేక ఖ్యాతే ముక్తికిమార్గను వుతుంది. "అవిద్య అదర్శన అజ్ఞానాదుల యొక్క అభావంతో ప్రకృతి పురుష సంయోగాభావం కలుగుతుంది, ఇదే ఆత్మయొక్క కేవలత్వం. కైవల్యం. ముక్తి. (సం. పా. యో. ద. ౭-25,26) అని పాతంజలయోగదర్శనం వివరించింది. ముక్తిలో జీవుడు పరబ్రహ్మతో సహచరియౌతాడు. అంతేకాని లీనంకాడు. అంటే బ్రహ్మం, జీవుడు ఒకటి కాదని భావం. నేను అతడు ఒకటి అన్నపుడు ఇరువురు అవిరోధులని భావం. అట్లాగే నేను బ్రహ్మము ఒకటే అన్నపుడు కూడ ఇరువురు అవిరోధులనే అర్థం. "తత్వమసి" అనే ఛాందోగ్యోపనిషత్తు యొక్క వాక్యార్థమిదే। బృహదారణ్యకంకూడా ఈ భావాన్నే ఇట్లా వ్యక్తం చేసింది. ఏ పరమేశ్వరుడు ఆత్మయందు జీవునియందు

స్థితుడై జీవాత్మ కంటే భిన్నుడై ఉన్నాడో ఏ పరమేశ్వరుడికి జీవాత్మ శరీర మో, ఏ పరమాత్మ జీవునికన్న భిన్నుడై జీవుని పుణ్య పాపాలకు సాక్షియై ఫలాన్నిస్తున్నాడో అంతర్యామియైన అతడే ఆత్మ. (బృ.ఉ. 3_7.22) సమాధి దశలో పరమేశ్వర సాక్షాత్కారం పొందిన యోగి కూడా అయమాత్మా బ్రహ్మ" నియందు వ్యాపకుడైన బ్రహ్మ సర్వత్ర వ్యాపించి ఉన్నాడు. (స.ప్ర. 250 పే) అని తెలుసుకుంటాడు. ఇట్టి వివేచన వల్ల జీవేశ్వరులు ఒకటి కాదని బోధపడుతున్నది.

శివాజ్ఞ లేంది చీమైనా కుట్టదు. పరమేశ్వరుని ప్రేరణతోనే జీవుడు కర్మలను చేస్తున్నాడు. అనేలోక వ్యవహారం అజ్ఞానంతో కూడుకున్నది. 'చరాచరాత్మకమైన ఈ జగత్తుకు పరమేశ్వరుడు ఈశ్వరుడు. అతని ఆధీనంలోనే ఈ జగత్తు ఉంటుంది.' (ఋ. 8-7.3.3) 'చరాచరాత్మకమైన సమస్త జగత్తు యొక్క సృష్టి ప్రళయాదులు పరమేశ్వర ఆధీనాలు' (అథ, 13.3.3.3) అనే ఋగ్వేద, అథర్వణవేద వాక్యాలకు పై విధంగా ఈశ్వరుడు ఈ జగత్తుకు నియంత, దేవుడు స్వతంత్రుడు కాడు, జీవుడు చేసే కర్మలన్నీ నియంత అయిన ఈశ్వరుని మూలకంగానే జరుగుతున్నాయి. కాబట్టి, ఈశ్వరుడే సర్వకర్మలకు కారణమని అర్థం చెప్పటం అసంబద్ధ వాదనే అవుతుంది. ఎట్లాగంటే న్యాయధిపతి ఒక నేరస్తున్ని ఎందుకు నేరం చేశావని ప్రశ్నిస్తే నేరం చేసేందుకు అవకాశం వుంది కాబట్టి చేశాను. అవకాశమే లేకుంటే చేయనుగదా! అనే సమాధానం ఎంత సమంజసముగా ఉంటుందో జీవుడిచేత ఈశ్వరుడే సర్వ కర్మలు చేయుచున్నాడనటం కూడా అంతే సమంజసముగా ఉంటుంది. సత్యజ్ఞాన స్వరూపుడైన ఈశ్వరుడు జీవులను చెడు కర్మలకు ప్రోత్సహిస్తాడని చెప్పటం, తల్లి దండ్రులు తమ బిడ్డలను చెడుపనులకు ప్రోత్సహిస్తారని చెప్పడం వంటిదే! జీవుడు రాగాది దోషయుక్తమైన లౌకిక కర్మనుగాని, వైదిక కర్మను గాని చేయ ప్రయత్నించినపుడు హృదయస్థ పరమేశ్వరుడు జీవుడు చేయబోయే కార్యం చేయతగిందో కాదో ప్రబోధిస్తాడే కాని బలవంతంగా జీవున్ని సత్కార్యాలయందు ప్రవర్తింప చేయడు. దీనినే భగవత్ప్రేరణ అంటారు. వ్యక్తత తెలిసిన బిడ్డకు తల్లి దండ్రులు మంచి చెడులను తెలుపుతారే గాని అతడు చేయబోయే కర్మ నుండి బలవంతాన మల్పరు కదా! ఈ భావాన్ని మనుస్మృతి ఇట్లా వ్యక్తం చేసిందని వేదాంతదర్శనం (421 పే) తెలిపింది,

యమో వైవస్వతో దేవో యస్తవైష హృదిస్థితః
తేన చేదవివాదస్తే మాగంగాం మాకురూన్‌గమః (మను 8.92)

"నీవు చేయదలచిన కార్యం నీ హృదయ స్థిత దయామయుడు నియంత అయిన దేవునిచేత అంగీకరింపబడినట్లైతే అది కర్తవ్యమని, అంగీకరింపబడనట్లైతే అకర్తవ్యమని ఎంచుము.

బిడ్డలు స్వతంత్రించి తమతమ పరిసర సమాజంలో తిరిగేప్పుడు మంచి, చెడులలో ఏ ప్రభావం వారిపై ఎక్కువగా పడుతుందోవారు దానికి అలవాటు పడటం అనుభూతవిషయమే। అట్లాగే రాగాదియుక్తుడైన జీవుడు కూడా తనకర్మలు చేయటంలో స్వతంత్రుడై అంటే కర్తయై పుణ్య పాప ఫలితాలు అనుభవిస్తున్నాడు. బద్ధి సత్వంతో సంబంధమున్నంత వరకు జీవుడు లౌకిక వైదిక కర్మలను ఆచరించి కర్త అవుతున్నాడు. సమాధి, సుషుప్తి, మోక్షాలలో జీవుడికి బుద్ధి సత్వంతో సంబంధ ముండదు కాబట్టి అకర్త అవుతాడు. వడ్రంగి తన పనిముట్లతో కొయ్యను ఛేదించి నరకటం అనే కర్మకు కర్త అవుతున్నాడు. అట్లాగే జీవాత్మకూడా సాధన సంపత్తితో సంబంధ మున్నపుడే కర్తయై, సంబంధం లేనపుడు అకర్త అగునని. భావం. జీవుడు క్రియాశక్తి అంటే ప్రయత్నాన్ని కలిగి ఉన్నపుడు కర్త అవుతున్నాడు. ఈ క్రియాశక్తి నిత్యం కాదు కాబట్టి అది లేనపుడు అకర్త అవుతున్నాడు సమాధి, సుషుప్తి మోక్షాలలో అకర్తగా ఉంటాడు. (వే.ద. 415) ఇట్లా స్వతంత్రుడై జీవుడు చేసే సర్వకర్మలకు ఫలప్రదాత మాత్రం బ్రహ్మయే। (వే.ద. 524 పే) ఒక వస్తువులో మరొకవస్తువున్నా ఒకదాని గుణాలను ఇంకొకటి ఎట్లా పొందలేదో అట్లాగే సర్వవ్యాపకుడైన బ్రహ్మ సమస్త వస్తువులలో అంతర్యామిగా ఉన్నా ఆ వస్తువికారాలు పరబ్రహ్మకు అంటవు. సమస్త లోకానికి నేత్రం వంటి వాడైన సూర్యుడికి లోకుల యొక్క నేత్రదోషాలు ఎట్లాఅంటవో, అట్లాగేసర్వభూతాంతరాత్ముడైన పరమేశ్వరుడికి కూడా ప్రాణుల సుఖదుఃఖలు అంటవని (క. ఉ. 5.11) కఠోపనిషత్తు తెలిపింది. న్యాయాధిపతి నేరస్తుని నేరము యొక్క స్వభావాన్నిబట్టి కారాగారం, ఉరి, శిక్షాదులు ఎట్లా విధిస్తాడో అట్లాగే పరమాత్మకూడా జీవుని కర్మానుసారం ఫలితాల నిస్తాడు. అందుకే ఒవాత్మ నుద్దేశించి కర్మలు; చేస్తూనే నూరేండ్లు బ్రతుకగోరుము

(య. 13-43) పాచికలతో జూదమాడకుము. (ఋ. 7-8.5.16) స్వాధ్యాయాన్ని విడువకుము (తై. ఉ. 1.11) ఇంద్రియాలను వశపరుచుకో, చిత్తమును స్వాధీనము నందుంచుకో. సదాచారాన్ని విడవద్దు. నిత్యాగ్ని హోత్రం చేయాలి. అలసత్వం వదలి పరమాత్మ నామాన్ని ప్రణవాన్ని జపించు (మను. 4-145) మొదలైన విధంగా విధినిషేధ పూర్వక ధర్మాన్ని వేదశాస్త్రాలు ఉపదేశిస్తున్నాయి.

ఇట్లా కర్మఫలితాన్ని అనుభవింపజేసే భగవంతుణ్ణి ఎందుకు ప్రార్థించాలి? అనే ప్రశ్నకు సమాధానమిది. జీవుడి బుద్ధి నిర్మలమై సుకర్మలలో ప్రవర్తింప జేసేందుకు భగవంతుని ప్రార్థించాలి. ప్రార్థన మానసిక కర్మ, అందువల్ల బుద్ధి నిర్మలమౌతుంది. జీవునికి కర్మానుష్ఠాన సమయంలో పరమేశ్వర ప్రేరణ కలుగుతుంది. ఈ ప్రేరణ జీవుణ్ణి నిర్బంధించదు. ఏ జీవుడు అట్టి ప్రేరణకు అనుకూలంగా నడుస్తాడో అతడు ఊర్ధ్వ లోకాలను పొందుతాడు. ప్రేరణకు విరుద్ధంగా కర్మలను అనుష్ఠించినవాడు అధోలోకాన్ని పొందుతాడు. (క.ఉ. 3.8) అంటే భగవంతుని నిగ్రహానుగ్రహాలు కర్మల స్వభావాన్ని అనుసరించే లభిస్తాయి, జీవుడు కర్మ చేయటంలో స్వతంత్రుడే కాని ఫలితానుభవంలో పరతంత్రుడనే సారాంశం బోధపడుతున్నది.

ఈశ్వరుడు సగుణుడా? నిర్గుణుడా? అనే సంశయానికి సమాధానమిది. 'యద్గుణైస్సహ వర్తమానం తత్సగుణం, గుణేభ్యోయన్నిర్గతం పృథగ్భూతం తన్నిర్గుణం' (ఈ, ర. సా. 12 పే) గుణాలతోకూడి యున్నది సగుణం. గుణరహితమైంది నిర్గుణం. అనంత జ్ఞానబలాది గుణాలతో సహితుడవటం వల్ల పరమేశ్వరుడు సగుణుడు అనబడుతున్నాడు. జడస్వరూపం, జీవుడికున్న దోషాది గుణాలు పరమేశ్వరుడికి లేక పోవటం చేత నిర్గుణుడని పిలువబడ్డాడు. ఇట్లా పరమేశ్వర సగుణ, నిర్గుణాలు తెలుసుకోవలసివుంది.

ఈశ్వరుడు సాకారుడనటం కుదరదు. సాకారం పరిమితమైనట్టిది. పరమేశ్వరుడో సర్వవ్యాపకుడు, కాబట్టి ఆయనకు ఈ పరిమితి వర్తించదు. సాకారుడైన జీవుడికివలె పరమాత్మకు అవయవాలు లేవు, పరమాత్మ సర్వవ్యాపకుడు కాబట్టి

అల్పజ్ఞుడైన జీవుడివలె కాక సమస్తాన్ని రచించటం, గ్రహించటం, చూడటం, వినటం, అనే ప్రజ్ఞను కలిగియున్నాడు. సాకారుడైన జీవుడికి ఈ ప్రజ్ఞలేదు యజుర్వేదం 'న తస్య ప్రతిమా అస్తి' (య. 31_3) అనితెలిపింది. భగవంతునికి రూపంలేదు; అంటె నిరాకారుడని అర్థం.

కాని సర్వాంతర్యామి అయిన పరమాత్మను వర్ణించేప్పుడు వేద మంత్రాలలో ఉపనిషత్తులలో అటనట అవయవకల్పన గోచరమవుతున్నది. ఉదాహరణకు ఈ అథర్వణ వేద మంత్రాలు గమనిద్దాం.

"యస్య భూమిః ప్రమ్యా న్త రిక్షముతోదరం
దివం యశ్చక్రేమూర్థానం తస్మై జ్యేష్ఠాయబ్రహ్మణే నమః"
(అథ. 10_7_32)

"యస్య సూర్యశ్చక్షుశ్చంద్ర మాశ్చ పునర్నవః
అగ్నిం య శ్చక్ర ఆస్యం తస్మైజ్యేష్ఠాయబ్రహ్మణే నమః"
(అథ. 10_7_33).

'ఎవనికి భూమి పాద పీఠమో, అంతరిక్షం ఉదరమో, ద్యూలోకం మూర్ధమో, సూర్య చంద్రులు నేత్రాలో, అగ్ని ఆస్యమో, అట్టి జ్యేష్ఠ బ్రహ్మకు నమస్కారం" (వే. ద. 156 పే), అని పరమాత్మ రూపం అవయవకల్పనతో వర్ణింపబడింది. ఛాందోగ్యోపనిషత్తు (చాం. 262 పే) అవయవ కల్పనతో విరాట్ స్వరూపాన్ని ఇట్లా తెలిపింది. "తస్యహవా ఏతస్యాత్మనో వైశ్వానరస్యమూర్ధైవ సుతేశ్చక్షుర్ విశ్వరూపః ప్రాణః పృథగ్ వర్త్మాత్మా సందేహో బహులో బస్తిరేవరయిః పృథివ్యేవ పాదావురఏవ వేదిర్లోమాని బర్హిర్ హృదయం గార్హపత్యో మనోఽన్వాహార్యపచన ఆస్యమాహవ నీయః" (ఛాం. ఉ. 5_18_2) అనే ఛాందోగ్యోపనిషద్వాక్యం వైశ్వానరాత్మయైన పరబ్రహ్మ తేజోమయమైన ద్యులోకం శిరస్సు, వాయువు ప్రాణం'

సూర్యుడు నేత్రం, అనంతమైన ఆకాశం అతని మధ్య శరీరం ఐశ్వర్య రూపమైన జలం అతని మూత్రాశయము, పృథివి పాదాలు; యజ్ఞవేది వక్షస్థలం గార్హపత్యాగ్ని హృదయం, అన్వాహార్యపచనాగ్ని మనస్సు, ఆహవనీయాగ్ని ఆస్యం। అంటూ మనుష్యరూపాన్ని పోలిన రూపాన్ని కల్పిస్తూ వర్ణించింది. ఇట్టి వర్ణనలను ఆధారంగా తీసుకొని అజ్ఞానులు నిరాకారధ్యానం కష్టసాధ్యం అని ప్రచారం చేస్తూ పరమాత్మను కల్పనారూపంతో స్థిరపరిచారు. అంతేగాని పరమాత్మ సాకారుడుకాడు. సత్యజ్ఞానం ఆ విషయాన్నే ప్రతిపాదించింది.

'క్లేశ, కర్మ విపాక ఆశయాలకు అతీతుడైన పురుష విశేషుడు ఈశ్వరుడు (సం. పా. యో. ద. ప్ర. పా. 24, 27 సూ).

పురుషుడంటే జగత్తనే పురమందంతట నిండియుండే వాడని భావం ''పుర్" అంటే ముందు "ఉష' అంటే కాల్చుట. సృష్టికి పూర్వమే పాపాలను దగ్ధంచేశేవాడు పురుషుడు, (బృ.ఉ, 28 పే) ఈశ్వరుడంటే సత్యవిచారశీలజ్ఞానం, అనంత ఐశ్వర్యం కలవాడని భావం ఇట్టి ఈశ్వరుణ్ణి తెలిపే శబ్దం 'ఓం' కారం. (సం.పా.యో.డ. 1.27) అకార ఉకార మకారాల కలియికే 'ఓం' కారం. 'అ' అంటే సమస్త సృష్టిని విరాజింప చేసే విరాట్టు, అగ్ని, విశ్వుడు అని అర్థం. 'ఉ'అంటే సమస్త సృష్టి గర్భమునందు గల సూక్ష్మ స్థితియందున్న హిరణ్యగర్భుడు, తైజసుడు, వాయువు అని 'మ' అంటే సమస్త ఐశ్వర్యాలను ఇచ్చే ఈశ్వరుడు, ఆదిత్యుడని తెలుసుకోవాలి. ఇట్లా అకార ఉకార మకార బీజాక్షరాలున్న 'ఓం' కారం సర్వజ్ఞుడైన పరమాత్మకు విశిష్టనామమై ఉంది. (స.ప్ర.ప్ర.స 13 నుండి 16 పే). ఇట్టి 'ఓం' కార అక్షర బ్రహ్మను నిత్యం ఉపాసంచే జీవుని ప్రాణం ఉర్ధ్వగతిని పొందుతుంది. చిత్తం సత్వగుణ ప్రధానమై నిర్మలమౌతుంది. చిత్త సంస్కారాలు ఉడిగి పోతాయి. పాము కుబుసాన్నివిడిచి నూతన దేహకాంతితో ఏట్లా ప్రకాశిస్తుందో అట్లానే నిత్యం ఓంకార బ్రహ్మను ఉపాసించిన జీవుడు నిర్వికల్ప సమాధిని పొంది జ్ఞానరూప తేజస్సుతో ప్రకాశిస్తాడు. (ప్ర.ఉ. 5-2 నుండి 5 శ్లో). అంతేగాక 'ఓం' కారం వేదత్రయ రూపం ఋగ్యజుస్సామ అథర్వణ వేదాలు ఆ 'ఓం' కారంలోనే సమావిష్టాలై ఉన్నాయి. కాబట్టి వేదత్రయ సారమే 'ఓం' కారమని శిష్టుల తలంపు. అదెట్లాగంటే 'ఓం'కారంలోఉన్న

అకారం ఋగ్వేద మాత్ర రూపం. ఋగ్వేదం పదార్థ విజ్ఞానాన్ని కలిగిస్తుంది. కాబట్టి ఓంకారంలోని అకార రూప ఏక మాత్రోపాసన ఎవడు చేస్తాడో వాడు లోకజ్ఞానం కల వాడై అందరిచేత ఆదరింపబడుతాడు. ఇంద్రియ నిగ్రహం కలుగుతుంది. బ్రహ్మ చర్యాన్ని పాటిస్తూ సత్యవ్రతుడౌతాడు 'ఓం' కారంలో ఉన్న అకార ఉకారాలనే ద్వి మాత్రవాచ్య బ్రహ్మను ధ్యానించేవాడు ప్రసన్న చిత్తుడౌతాడు, చిత్తశాంతిని పొందు తాడు ఋగ్వేద మూలన జ్ఞానవంతుడౌతాడు యజుర్వేద మూలాన జ్యోతిష్టామాది కర్మ లను ఆచరిస్తూ, బ్రహ్మోపాసనతో సుఖిస్తాడు. అకార ఉకార మకారలనే త్రిమాత్ర ఉపాసనవల్ల సూర్యతేజః ప్రాప్తి జ్ఞానసంపద కలుగుతుంది. అకార రూపక ఋగ్వే దంవల్ల పదార్థ విజ్ఞానం, ఉకార రూపక యజుర్వేదం వల్ల అగ్నిహోత్రాది శుభ కర్మ లను ఆచరించి తాద్వారా సౌశీల్యుడౌతాడు. మకార రూపక సామవేదంవల్ల ప్రాణ విద్యను అభ్యసించి యోగాభ్యాసాన్ని ఆచరించి సమాహిత చిత్తంతో బ్రహ్మను తెలుసుకుంటాడు. ఇట్లా త్రిమాత్రాత్మకమైన 'ఓం, కారాన్ని ఉపాసించే యోగిచిత్త కాగ్రితను పొంది ముక్తుడౌతాడు (ప.ఉ. 5 ప్ర. 3,4,5,7) చిత్తఏకాగ్రతకు ప్రణవ జపం తదర్థ భావన సాధనమని పతంజలి మహర్షి తెలిపాడు. (సం.పా.యో.ద. 1-28).

## ప్రకృతి తత్త్వం

సృష్టికి పూర్వమున్న అనాది పదార్థాలు మూడు. అవి ఈశ్వరుడు, జీవుడు ప్రకృతికి. వేదశాస్త్రిలు సృష్టిక్రమాన్ని తెలిపాయి. విషయ వివేచనలో ఈ రెంటిక్కి, భేదం కనపడదు. ఎట్లాగంటే మట్టి గోడను కడుతున్నాడు అని చెప్పినపుడు రాళ్ళు మట్టి నీరు సమయ ప్రయత్నం అనే ముడు విషయాలు గోడకట్టడం అనే విషయ ములో ఎట్లా ఇమిడి ఉన్నాయో అట్లాగే సృష్టి తత్వాన్ని తెలిపే విషయములో వేద శాస్త్రిలు భేదాన్ని కలిగి ఉండలేదు. (ఈ.సా.ర. 125 పే).

ముందుగా ఈశ్వరుడు సూక్ష్మరూపంగా ఉన్న ప్రకృతి నుండి ఆకాశాన్ని విస్తృత పరిచాడు. తరువాత క్రమంగా ఆకాశంనుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలం, జలం నుండి పృథ్వి, పృథ్వి నుండి ఓషధులు, ఓషధుల

నుండి అన్నం, అన్నం నుండి వీర్యం, వీర్యం నుండి పురుషుడు అంటే శరీరాన్ని కలుగజేశాడు. (తై. ఉ. బ్ర.నం. న.ప్ర. అ. 35 పే).

పరబ్రహ్మజ్ఞానమయ సంకల్పంచేత అవ్యక్త సూక్ష్మ ప్రకృతి క్రమంగా స్థూల రూపాన్ని ధరిస్తుంది. అదే సృష్టి (ముం. ఉ. 1—1—8) ఈ సృష్టికి ఈశ్వరుడు నిమిత్త కారణం. ప్రకృతి ఉపాదానకారణం వడ్రంగి వస్తువును చేస్తాడు. కాని అందు లీనం కానట్లే, పరమేశ్వరుడు సృష్టిని నిర్మాణం కావిస్తాడు. అందులీనంకాడు. కాబట్టి పరమేశ్వరుడు నిమిత్తకారణం. కలపతనంత తానుగా వస్తురూపం ఎట్లా ధరించలేదో అట్లాగే ప్రకృతి తనంత తానుగా మార్పుచెంది రూపాన్ని పొందలేదు. కాబట్టి ప్రకృతి తానుచేయకున్న ఉపాదన కారణం. తాను చేయటం వల్లనే ఏదేని అగుటయు, తాను చేయకున్న కాకుండుటయు, తాను స్వయంగా మార కుండా మరియొక దానిని మరియొక విధంగా చేయటం నిమిత్త కారణ లక్షణం. తనులేద్దని ఏదియు కాకుండుట, తానే అవస్థాంతరంగా మారేది ఉపాదాన కారణం అనబడుతుంది." [సం. ప్ర. 8—270 పే).

స్థూలం, జడం అయిన జగత్తు ఉత్పన్నం కావటానికి ఉపాదన కారణం కావాలి. కారణం లేకుండా ఏ కార్యం జరగదు. పరమేశ్వరుడు కూడా కారణం లేకుండా ఏ కార్యంచేయడు. కాబట్టి కార్యమనేది ఎల్లప్పుడు కారణానికి అనుకూలం గానే ఉంటుంది. అందువల్లనే కారణం ద్వారా కార్యం చేయటానికి కర్త ఎంతైన అవసరం. కుమ్మరి లేకుండా కుండలు చేయటం అసంభవం, కుండలు చేయటం అనే క్రియలో కుమ్మరి నిమిత్త కారణం, మన్ను ఉపాదానకారణం. దండ చక్రాదులు సామాన్య కారణాలు. దీనినే సాధారణ కారణం అంటారు. చేయటం అనే క్రియలో సాధన భూతమై సాధారణ నిమిత్తమై ఉండేది సాధారణ కారణం అనబడుతుంది. (స.ప్ర.స. 8-27 పే), అట్లాగే సృష్టి నిర్మాణ క్రమంలో క్రమంగా పరమాత్మ, ప్రకృతి, జీవుడు నిమిత్త ఉపాదన, సాధారణ నిమిత్త, కారణాలు.

ప్రథమావస్థలో పరమ సూక్ష్మమై ఉన్న ప్రకృతి రూప కారణం నుండి కొంచెం స్థూలమైనప్పుడు దానిని 'మహతత్త్వం' అంటారు. మహతత్త్వం అంటే బుద్ధి. పరమేశ్వరుని మహత్త్వం ఉదయిస్తుంది. దాని నుండి అహంకారం, అహంకారం నుండి మనస్సు జనిస్తుంది. మహతత్త్వం

అని చెప్పబడే స్థూల ప్రకృతి వికారమే బుద్ధి. ఇది సత్త్వగుణ ప్రధానమై ఉంటుంది. (శ్వే. ఉ. 27 పే) ప్రకృతి యొక్క అహంకారావస్థ నుండి పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, నానావిధ ఔషధాలు, వాటి నుండి అన్నం, అన్నం నుండి వీర్యం - వీర్యం నుండి శరీరం కలుగుతున్నాయి. దీనిని మైథున సృష్టి అంటారు. (స ప్ర. 269 పే) ఇట్లాపరమాత్మస్త్రీ పురుష శరీర నిర్మాణం కావించి జీవులను సంయోగ పరచిన పిమ్మట మైథున సృష్టి ప్రారంభం అవుతుంది.

గర్భంలోపల శిశువు ఎట్లా ఉంటాడో అట్లాగే ఈశ్వరుని లోపల జగత్తు ఒదిగి ఉంటుంది. బయటి పదార్థ సహాయం లేకుండా సాలీడు తనలోనుండి దారాన్నితీసి గూడు కట్టుకొని ఆ గూటియందు తానే ఎట్లా క్రీడిస్తూ ఉంటుందో అట్లాగే బ్రహ్మం తనలో నుండి జగత్తును రచించి తానే క్రీడిస్తున్నాడు.

"సత్త్వ, రజ, స్తమో గుణాలు మూడు సమపాళ్ళలో ఉండే అవస్థకే 'ప్రకృతి. అని పేరు. (స.ప్ర.సం. 46 పే) ఈ ప్రకృతి క్రియాస్థితి శీలాన్ని కలిగి ఉంటుంది" "ప్రపంచానికి బీజాల వంటి సత్త్వ రజస్తమస్సుల యొక్క సామ్యావస్థ ప్రకృతి అనబడుతుంది, అందు సత్త్వము ప్రకాశ శక్తి, రజస్సు క్రియాశక్తి తమస్సు స్తంభన శక్తి. ఈ మూడు శక్తులు ఎక్కడ సమానంగా ఉంటాయో అట్టి పరమ సూక్ష్మమైన మహాశక్తి ప్రకృతి" (వే. ద. 15 పే) అని వేదాంత దర్శనం తెలిపింది. పై మూడు గుణాలు సమపాళ్ళలో లేనపుడు ప్రకృతి విచ్చిన క్రియ ప్రారంభమౌతుంది. ప్రకృతిలోని అహంకారతత్వం అందలి గుణాలను బట్టి సాత్త్విక, రాజసిక, తామసిక అహంకారాలుగా ఏర్పడుతుంది. సాత్త్విక రాజసిక అహంకారాల వల్ల మనస్సు ఇంద్రియాలు ఏర్పడతాయి. రాజసిక తామసిక అహంకారాల కలయికవల్ల పంచ గుణాలు అంటే శబ్ద స్పర్శరూప రసగంధాదులు, పంచభూత సృష్టి జరుగుతుంది' వీటి ద్వారా స్థూల జగత్తు నిర్మాణం జరుగుతుంది. (స. ప్ర. సం. 46 పే).

జగత్తుకు ఉపాదన కారణమైన వస్తువు ప్రకృతి. ఈ ప్రకృతి బ్రహ్మ కంటే భిన్నమై పృథి వ్యాదులకు ఉపాదన కారణమై ఉంది. పృథివ్యాదిపరమాణువులు అనంతాలుగాఉన్నాయి. లోకంలో ఉన్నస్థూల ఘటాది కార్యాన్ని అవయవాలుగా విభజిస్తూపోతే

చివరకు అల్పతమ అవయవ విభాగావస్థను పొందుతుంది. విద్యుత్తు సహాయంచేత కూడా విభజింప అలవి కాని ఆ అవస్థనే పరమాణువు అంటారు. అవాంతర భేదాల చేత ఈ పరమాణువులు సత్త్వ, రజస్తమాలనే మూడు విధాలుగా విభజింప బడతాయి. వీటిని సాంఖ్యయోగ వేదాంతులు గుణాలు అంటారు. నైయ్యాయిక, మీమాంసిక, వైశేషికులు 'పరమాణువులు' అంటారు. ఈ పరమాణువుల దివ్య శక్తి స్వరూపమే సృష్టికి మూల కారణమైన ప్రకృతి అనబడుచున్నది. (వై. ద. 4-1-2, 3) ముముక్షువులకు దురతిక్రమమైన ఈ ప్రకృతిని గూర్చి ఋగ్వేదం ఇట్లా తెలిపింది

> "నమృత్యుర్‌రాసీ దమృతం నతర్హి న రాత్ర్యా అహ్న ఆసీ
> త్ప్రకేత: అనీద వాతం స్వధయా తదేకం తస్మాద్ధ
> న్యనః పరఃకించ నాస" (ఋ,మ. 10 సూ. 129).

పరమేశ్వర సంకల్పంచేత మూల ప్రకృతిలో సంచలన మేర్పడుతుంది. దానివల్ల సత్త్వగుణబహుళంగా ఒక భాగమేర్పడుతుంది. దానికి మహతత్త్వము అని పేరు. అ మహతత్త్వం యొక్క అవస్థా విశేషమే అహంకారం. ఈ అహంకారానికి సంబంధించిన సత్త్వ గుణభాగంనుండి ప్రతి జీవికి ఈశ్వరనియమాను సారం మనస్సు రూపొందుతుంది. ప్రకృతిలోని తమోగుణ భాగం నుండి వ్యాపకాలైన కాలాలు, దిక్కులు, శబ్ద, స్పర్శ, రూప రస గంధాదులు జనిస్తాయి. శబ్ద తన్మాత్రలవల్ల ఆకాశము, స్పర్శతన్మాత్రవల్ల వాయువు రూప రస గంధతన్మాత్రలవల్ల క్రమంగా అగ్ని, జల, పృథ్వి భూతాలు ఉద్భవిస్తాయి. (వై.ద. 132 పే) ఇట్లా సృష్టికి మూలా కారణమైన ప్రకృతికి దైవశక్తి, పరాశక్తి, మాయ, మహామాయ, ప్రకృతి అవ్యక్తం అవ్యాకృతమని పేర్లు. (వై. ద. 131 పే).

## జీవాత్మ తత్త్వం :

ప్రకృతి యొక్క వికృతులద్వారా ఏర్పడ్డ శరీరంలో జీవులను సంయుక్త పరిచే వాడు పరమేశ్వరుడే అనితెలుసుకొంటిమి, శరీరంలో జీవుల సంయోగాన్ని జన్మ అని శరీరం నుంచి జీవుల వియోగాన్ని మృత్యువని వ్యవవ్యవహరిస్తున్నాం. స్థూలమైన

ఈ ప్రపంచంలో శుభా శుభా కర్మలను ఆచరిస్తూ, సుఖ దుఃఖాలను అనుభవించేవాడు జీవుడు. ఇచ్ఛాద్వేషాలు, సుఖ దుఖ. జ్ఞాన ప్రయత్నాలు జీవుని గుణాలు సమస్త ప్రాణులు పుట్టుకతోనే రాగద్వేష జనితమైన సుఖదుఃఖాది ద్వంద్వ రూపమైన వ్యామోహం వల్ల అజ్ఞానాన్ని పొందుతున్నాయి. (భ.గీ.అ, 7 శ్లో 27). చేతనతత్త్వమైన జీవ తత్వం శరీరంలో నుండి శరీరంలో లోకంతో ప్రవర్తించేపుడు జీవగుణాలైన ఇచ్ఛా ద్వేషాదులను మనం గమనించవచ్చు. జీవుడు శరీరం నుండి వెడలిన మరుక్షణంలో ఈ గుణాలు కానరావు. ఎవడి ఆధీనంలో శరీరం, ప్రాణం, ఇంద్రియాలు, అంతః కరణాలు ఉన్నయో వాడే కర్త. స్వతంత్రుడు కర్త అని పాణిని తెలిపాడు. ఈ శరీరాన్ని అంటిపెట్టుకుని జీవుడు అనేక కర్మలు చేస్తుంటాడు. కర్మను చేసేవాడు కర్త దాత్వర్థ వ్యాపారాశ్రయం కర్త (బా.వ్యా కా.స. 3 స్క) అని బాలవ్యాకరణం తెలిపింది. కాబట్టి జీవుడు స్వతంత్రుడై ఒక అయుధంతో ఒకణ్ణి ఖండిచి పట్టుబడ్డాడు. ఖండించదం అనే ధాత్వర్థ వ్యాపారా శ్రయుడై పట్టుబడ్డ ఆ వ్యక్తే శిక్షార్హుడు అంతేగాని ఆయుధం కాదు. అట్లాగే జీవుడు స్వతంత్రుడై తాను చేసిన పాపకార్యాలకు ఈశ్వరునిచేత నిర్దేశింపబడిన ఫలితాలను అనుభవిస్తాడు

కాబట్టి జీవుడు కర్మలు చేయటంలో స్వతంత్రుడై ఫలాను భవంతో పర తంత్రుడిని తేలింది. అయితే అన్ని శరీరాలలో అతడు ఒక్కడే ఉంటాడా ? లేక వేరువేరుగా ఉంటాడా ? ఇనే సంశయానికి సమాధానం ఇట్లా చెప్పవచ్చు. అన్ని శరీరాలలో జీవుడొక్కడే ఉన్న యెడల ప్రాణులు సుఖ దుఃఖాది కర్మానుభవంలో బేదముండకూడదు. అంటే సుఖపడిన, అందరూ సుఖపడాలి. దుఃఖపడిన, అందరూ దుఃఖపడాలి. కాని ప్రత్యక్షానుభవం తద్విరుద్ధముగా ఉంది. అంతేగాక అన్ని ప్రాణు లయందు ఒకే జీవుడుంటే అతడే సర్వ వ్యాపకుడుగా ఉండాలి. మరణమే సంభవించ కూడదు. ఒకవేళ సంభవిస్తే అందరూ ఒకేసారి మరణించాలి. ఇట్టి ఘటన ప్రత్యక్షాను భవంలో అసంభవమని గ్రహిస్తూనే ఉన్నాం. ఇట్టి ప్రత్యక్షానుభవాన్ని బట్టి ప్రతి శరీరంలో ఒక్కొక్క జీవుడుంటారని, వారివారి సంస్కారాలను బట్టి ఉనికిని బట్టి కర్మలను చేస్తూ ఫలితాలను అనుభవించటం జరుగుతున్నదని చెప్పవచ్చు. ఇందుకు పమాణం ఈ ఋగ్వేద మంత్రం.

"తిరశ్చీనో వితతో రశ్మిరేషా మధఃస్విదాసీదుపరి స్విదాసీత్
రేతోధా ఆసన్ మహిమాన ఆస్యత్స్వధా అవస్తాత్,
ప్రయతిఃపరస్తాత్"
(ఋ. అ 2 అ 7 వ 17 మం. 5)
ఈ మంత్ర భావమిది.

'పరమాత్మ, జీవాత్మ, జగత్తునకు మూలకారణమైన ప్రకృతి, అనే ఈ మూడింటికి తేజః కిరణమొకటి అన్నివైపుల వ్యాపించెను. అయ్యదిపైన క్రింద నాలుగువైపుల ఆశ్చర్యకారకమయ్యెను. జలాన్ని ధరించి పోషించు జీవులనేకులున్నారు ఆత్మలో మొదటి నుండి నిజధారణ శక్తి, అంతంవరకు నడిచే ప్రయత్నం ఉన్నాయి. (ఋ.భా.భూ, 208 పే).

జనన మరణాలు జీవునియందు ముఖ్యంకాదు. గౌణం మాత్రమే। లోకంలో వీడు పుట్టాడు. వీడు మరణించాడు. అనే వ్యవహారాన్ని బట్టి జీవుడికి జనన మరణాలు ఉన్నట్లు మనం తెలుసుకుంటున్నాం. ఈ జనన మరణాలు శరీరానికి సంబంధించిన ప్రత్యక్ష ధర్మాలు. అంతేగాని అప్రత్యక్షమైన జీవుడికి సంబంధించినవికావు. ఇందుకు 'చరాచరవ్యపాశ్రయస్తు తద్వ్యపదేశో భాక్తస్తద్భావ భావితత్వాత్' (వేం. ద. అ2 పా3 సూ 16) జనన మరణ కథనం చరాచర శరీరాలకు సంబంధించింది. ఈ జనన మరణాలు శరీరాలు ఉన్నపుడు మాత్రమే కలుగుచున్నందున ఇవి జీవాత్మ యందు గౌణమని వ్యవహరింపబడింది. అనే వేదాంత దర్శనం ప్రమాణం. బృహదారణ్యకం అవి నాశీవా అరే అయమాత్మా నుచ్ఛిత్తి ధర్మా' (బృ 4-5-14) ఆత్మనాశంలేనిది, నాశనమవటం దీని ధర్మం కాదు, అని చెప్పటం వల్ల జనన మరణాలు ఆత్మకు చెందిన ధర్మాలు కావని గ్రహించాల్సి ఉంది.

"న జాయతే మ్రియతే వావిపశ్చి
న్నాయంకుతశ్చి న్నబభూవకశ్చిత్
అజోనిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే" (కఠ. ఉ. 2-18)

ఈ కఠోపనిషద్వాక్యాలు, జీవాత్మ శరీరంతో పాటు పుట్టిందికాదు. శరీరం రజః శుక్లాదులవల్ల ఏర్పడుతుంది. అట్లాగే ఆత్మకూడ మరి యొక పదార్థం వల్ల ఏర్పడేదికాదు కాబట్టి శరీరం నశించునట్లు జీవాత్మ నశించదు; అనే భావాన్ని వ్యక్తీకరిస్తూ పై విషయవివేచనకు ప్రమాణంగా ఉన్నాయి. జనన మరణాలు లేని జీవాత్మ జ్ఞానస్వరూపుడు. ఉత్క్రాంతిగత్యా గతులు కలిగినవాడని "ఉత్క్రాంతి గత్యాగతీనామ్" (వే. ద. అ2 పా3 సూ. 19) వేదాంతదర్శనం తెలిపింది.

ఉత్క్రాంతి అంటే శరీరం నుండి వెడలటం అని అర్థం లోకాంతర గమనాన్ని "గతి" అని అంటారు. (వే.ద. 397 పే) చక్షువులనుండి కాని, మూర్థంనుంచి గాని, ఇతర అంగాలనుండిగాని జీవాత్మ నిష్క్రమిస్తుంది. అలోకం నుండి ఈ లోకానికే జీవుడు కర్మ నిమిత్తమై వస్తాడు. ఒక కర్మ పూర్తి చేసేంతవరకు మరో కర్మ వంకపోదని జీవుని ఉత్క్రాంతిని బృహదారణ్యకం (4.4-2,6) తెలిపింది.

కేశాగ్రంలో నూరవ భాగంలో నూరవ భాగమెంత సూక్ష్మంగా ఉంటుందో జీవాత్మ అంత సూక్ష్మంగా ఉంటుంది. ఈ విషయాన్ని "బాలాగ్రశత భాగస్యశతదా కల్పితస్య చ భాగో జీవః" (శ్వే. ఉ. 5-9) అని శ్వేతాశ్వతరోపనిషత్తు తెలిపింది. వేసవిలో ఫాల భాగంలో ధరించే చందనం శరీరమంతటికి ఎట్లా చల్లదనాన్ని ఇస్తుందో అట్లాగే శరీరంలో అణువై సూక్ష్మరూపుడుగా ఉన్న జీవుడు శరీరమంతట సంభవించే శైత్యాన్ని అనుభవిస్తాడు. రాజు మంత్రుల సహాయంలో కార్యచరణతో విశేషజ్ఞుడైనట్లు జీవుడు బుద్ధి సత్త్వం ద్వారా శరీరమంతట కలిగే శీతోష్ణాదులు తెలుసు కుంటాడు. సుఖదుఃఖాదులు అనుభవిస్తుంటాడు బుద్ధితత్వం ప్రకృతి జన్యమైంది. అందువల్ల అది శరీరం వలె అనిత్యమైంది. జీవునికి బ్రహ్మసాక్షాత్కారం కలగిన మరుక్షణంలో బుద్ధి సత్వం నశిస్తుంది. అంతవరకు ఈ బుద్ధి సత్వం జీవుడికి లోకవ్యవహార జ్ఞాన సాధనంగా ఉంటుంది. (వే. ద. 2-3-23 నుండి 30).

"యోన : పితాజనితాయోవిధాతా" (ఋ. 8-3-17-3) "త్వంహితనః పితావసో" (ఋ. 6-7-21-11) అనే ఋగ్వేద మంత్రాలవల్ల జీవులకు పరమేశ్వరుడు తండ్రివంటివాడని తెలుస్తుంది. ఈశ్వరుడు వ్యాపకుడు. జీవుడు వ్యాప్యం. వ్యాప్య వ్యాపకాలు ఒకదానిని విడిచి మరొకటి దూరంగా ఉండవు. లోకంలోపితా పుత్రులకున్న

అంశాంశి సంబంధం కూడా ఇట్టిదే! పుత్రుడు మాతృగర్భంలో చేరకముందు తండ్రితో అవిభక్తుడై ఉంటాడు, తరువాత మాతృ గర్భంలో చేరతాడు. అనంతరం వేరుగా వ్యవహరింపబడతాడు. అట్లాగే జీవుడు ముందు అభిన్నుడై అనంతరం భిన్నుడుగా వ్యవహరింపబడతాడు. (వే. ద. 425 పే).

జీవులకు స్థానమైన హృత్ప్రదేశం యమసదనం అనబడుతుంది. (వే. ద. 474 పే) అందుండే భగవంతుడు జీవులకు హితాహిత జ్ఞానం కలిగిస్తాడు. భగవత్ప్రేరణానుకూలంగా ఉపాసనాదులను ఆచరించిన జీవులు దేవయాన మార్గంలో బ్రహ్మలోకాన్ని చేరతారు. తద్విరుద్ధంగా కర్మలను ఆచరించే జీవులు పితృయాన మార్గం ద్వారా చంద్రలోకాన్ని చేరతారు. అచట కర్మఫలాన్ని అనుభవిస్తారు. ఈ రెండు మార్గాలకు విరుద్ధంగా క్షుద్రకర్మలను ఆచరించేవారు మాటి మాటికీ భూమిపైననే జనన మరణాలను అనుభవిస్తుంటారని ఛాందోగ్యోపనిషత్తు (ఛాం. ఉ. 5-10-1;8) తెలిపింది. ఈ దేవయాన పితృయాన మార్గాలను ఛాందోగ్యం. వైశేషిక దర్శనం. బృహదారణ్యకం విపులంగా వివరించాయి. ఇష్టాది కర్మలను చేసి చంద్రలోకానికి పోయినవారు ఆ మార్గంలోనే మరలివచ్చి ఆకాశం, వాయువు, మేఘం, వర్షం, మొదలైనవాటి సాదృశ్యాన్ని పొందుతారు. భూమికి చేరుతారు. అచట వ్రీహాదిరూప సహాయంతో అంటే వడ్లు, వనస్పతులు, నువ్వులు, మినుములు, మొదలైనవాటి సహాయంతో పురుష శరీరాన్ని చేరి వీర్యం ద్వారా స్త్రీగర్భాన్ని చేరుకుంటారు. తద్వారా జన్మను పొందుతారు. పగలంతటా తిరిగి తిరిగి అలసి సొలసి రాత్రి వేళలో చెట్టు కొమ్మను ఆశ్రయించే పక్షిలాగా జాగ్రత్, స్వప్న అవస్థలలో జీవుడు విషయాసక్తుడై అలసిపోయి సుషుప్తిలో విషయాలనుండి తొలగిపోయి బ్రహ్మయందు అంటే సత్తులో లీనుడైనట్లుంటాడు. "ప్రాణోత్క్రమణం వల్ల జీవుడు లింగ దేహంతో కూడి దేహాంతరానికి పోతాడు. (వే. ద. 3.1.3) లయాన్ని పొందేది లింగదేహం అనబడుతుంది. (యో. ద. 67 పే).

ప్రాచీన భారతవనిలోని వైదిక ధర్మం ఇట్లా అనంత జ్ఞాన ప్రకాశాన్ని అందిస్తూంటే ప్రస్తుత అవైదికకాలంలో మౌఢ్యం పెరిగి మతాలహోరు జోరుగా సాగిపోతున్నది. వైదిక ధర్మం అంటే ఏమిటో, దాని లక్షణాన్ని, ప్రయోజనాన్ని,

తెలుసుకుంటే, ఈనాటి అజ్ఞాన పూరితమైన అవైదిక మత పరిస్థితిని విడనాడి ప్రజలు, జ్ఞాన జ్యోతిని వెలిగించుకోవలసిన అవశ్యకత ఎంతైనా ఉందని స్పష్ట పడుతుంది

వైదిక ధర్మం :

దేనివల్ల అభ్యుదయం, నిశ్శ్రేయసం ప్రాప్తిస్తాయో అది ధర్మం, లేక దేనివల్ల అభ్యుదయం దాని మూలాన నిశ్శ్రేయసం సిద్ధిస్తాయో అది ధర్మం. "(వై. ద. 1-1-2) అభ్యుదయం అంటే ఇహపరలోకాలకు సంబంధించిన ఐహిక, ఆముష్మిక కార్యసాఫల్యం. త్రివిధ దుఃఖాలను అంటే ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, అధిదైవిక దుఃఖాలను సాంతంగా పోగొట్టటం నిశ్శ్రేయసం. దీనినే ముక్తి అంటారు. ఇట్టి ధర్మాన్ని వేదాలు ప్రతిపాదిస్తున్నాయి. (వై. ద 1-1 3) "వేదో2 ఖిలో ధర్మమూలమ్ "(మ. 2-6) అని మను ధర్మశాస్త్రం, "చోదనాలక్షణోఅర్థోధర్మః (మీ. అ1పా1సూ2) వేదవిహితార్థ కర్మయే ధర్మమని మీమాంస చెప్పింది.

ఇట్టి ధర్మాన్ని వేదంప్రతిపాదించింది. మోక్షాపేక్షకులు, ధర్మాన్ని తెలియగోరే వారికి వేదమే ప్రమాణం (మ. 2-13) అని మనుధర్మ శాస్త్రం తెలిపింది. కాబట్టి భారతీయ సంస్కృతికి వేదాలు మూలకందాలు. అవి అపౌరుషేయాలు, విజ్ఞానకోశాలు సమస్త మానవులకు కల్యాణ ప్రదమైంది. ఈ వేదవాణి, (య. అ. 16 మం. 2) యజుర్వేదం తెలిపింది. ఇది గ్రహించిన పాశ్చాత్యులు వేద ప్రశంస చేశారు. వేదాన్ని గూర్చి పై అభిప్రాయలనే వారు ధృవీకరించారు. ఉదాహరణకు కొన్నింటిని చూపుతాను. ఈ ఉదాహరణలు 'వేద ధర్మం' అనే (8, 9, 10 పే) మాసపత్రిక నుండి గ్రహిస్తున్నాను.

ప్రొఫెసర్ హీరేన్ అనే క్రైస్తవ విద్వాంసుడు వేదాన్ని గూర్చి ఇట్లా అభిప్రాయపడ్డాడు. నిస్సందేహంగా వేదాలు సంస్కృతంలో ప్రాచీన మతగ్రంథాలు, ప్రాచీన సంస్కృత గ్రంథాలలో వాటి సంకేతాలు కనబడుతున్నాయి. అవి తమ మహత్వం వల్ల మనుష్య మాత్రుని ఉన్నతికి దివ్యమైన ఏకైక ప్రకాశస్తంభంవంటివి. దీని మాతృక ఇది;

They (The Vedas) are without doubt the oldest works composed in Sanskrit. Even the most ancient Sanskrit writings allowde to the Vadas as already existing. The vedas stand alone in their sditary splendour standing as beacon of divine light for the on ward march of hamanity. (Historical Reserches by prof. Hearen VOL. II-P-127).

"లార్డ్ మోక్లే అనే విద్వాంసుడు వేదాలలో ఉన్న విషయం మరెక్కడా కనపడదు. అన్నారు. దీని మాతృక ఇది. What is found in the vadas exists no where else. (The Ninteenth century and after)

"అమెరికా సర్వోచ్ఛ న్యాయాలయం వేదగురుత్వాన్ని మహత్త్వాన్ని గూర్చి ఇట్లా కొనియాడింది. వేదం సమస్త జ్ఞానానికి ఆది స్రోతస్సు. ఈశ్వరీయజ్ఞానం దీని ప్రేరణకు ముఖ్య ఆధారం. దివ్య జ్ఞానం, శాశ్వత సత్యం యొక్క మహాభండారం" దీని మాతృక ఇది;

The Vedas is the fountain head of knowledge, the Prime Source of inspiration, may the grand respository of pithy passages of divine wisdom and even eternal truths. (Vedic India, Mother of parliaments by N. B. Pafgee).

ఇట్లా వేదాలు స్వతః ప్రమాణాలు. నాగరికత నిర్మాణానికి భారతదేశం వేసిన పునాది రాళ్ళు. యుగయుగాల పర్యంతం ప్రజల మేలుకోసం విశిష్టమైన భాషలో వ్యక్తం చేయబడి, ఋషుల నుండి పరంపరగా మౌఖికంగా మనకు ప్రాప్తించాయి. ఈ వేదధర్మానికి ఒక మతంగాని, మందిరంగాని, సంప్రదాయంగాని సంస్థాపకుడుగాని లేడు. సర్వకాలికం, సర్వజనీనమై ఉన్నాయి.

"వేదాలయందు ఈశ్వరుడు మానవులకు ఏది చేసేందుకు ఆజ్ఞాపించాడో, ప్రేరణచేశాడో అదే ధర్మం. ఏది చేయకూడదని నిషేధించాడో అది అధర్మం. ఈశ్వరుడు నిషేధించింది అధర్మమని తెలిసికొని దానిని విడచిపెట్టి ధర్మాన్ని ఆచరించటం మానవత' (ఋ. భా భూ. 202 పే). ఈ ధర్మజ్ఞానం మూడు విధాలుగా కలుగుతుంది. ధర్మాత్ములైన విద్వాంసుల శిక్షణ, ఆత్మశుద్ధివల్ల సత్యాన్ని

తెలుసుకునే కోరిక, పరమేశ్వర ప్రసాదిత వేదవిద్యాభ్యాసం అనే మూడు కర్మలవల్ల సత్యాసత్యాలను మానవులు తెలుసుకొగలుగుతారు.

"సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవోమనాంసి జానతామ్,
దేవాభాగం యథాపూర్వే సంజానానా ఉపాసతే"
(ఋ. 8-49-2)

అనే ఋగ్వేద మంత్రం పై భావాన్ని తెలుపుతున్నదని ఋగ్వేదాది భాష్యభూమిక (167 పే) తెలిపింది. ఒక విషయంలో సంశయం కలిగి నట్లయితే పరిపూర్ణ విద్వాంసులు పక్షపాతరహితులు, ధర్మాత్ములు అయిన వారిని ఆలోచించి వారు చెప్పినట్లు చేయాలి. అట్లాచేస్తే సంశయం తొలగిపోతుంది. అధర్మం పోయి ధర్మస్థాపన జరుగుతుంది. దీనినే శిక్షణ లేక ఉపదేశం అంటారు. (ఋ. భా. భూ. 193 పే)

"వ్రతేన దీక్షామాప్నోతి దీక్షయాప్నోతి దక్షిణామ్,
దక్షిణాశ్రద్ధమాప్నోతి, శ్రద్ధయాసత్య మాప్యతే"
(య. 19-30)

అనే యజుర్వేద మంత్రానుసారం దృఢ నిశ్చయంతో సత్యాన్ని ఆచరించటం దీక్ష. మానవుడు దీక్షితుడై ఉత్తమ గుణాలతో ఉత్తమాధికారి అయినపుడు అందరూ సత్కరిస్తారు. ఆ సత్కారమే దక్షిణ అనబడుతుంది. ధర్మాది శుభగుణాచరణంతో మానవుడు ఆ దక్షిణను పొందుతాడు. (ఋ. భా. భూ. 179 పే)

సమాజిక నియమ వ్యవస్థ సమానమై ఉండలి. సమాజంలో మానవులంతా సమాన గౌరవం పొందాలి. శుభకర్మల పట్ల బుద్ధి, శరీర బలం, పరాక్రమం మొదలైన గుణాలు వర్ధిల్లాలి, అందరికి విద్యాభ్యాసం అందుబాటులో ఉండాలి. మీరు ఒక వస్తువును వేరొకరికి ఇచ్చేప్పుడు గ్రహించేప్పుడు ధర్మ బద్ధంగా ఉండాలి. ఎల్లప్పుడు మీతో సత్యం, సత్యంతో మీరు అవినాభావ సంబంధం కలిగి ఉండాలి. ఇట్లా ఈశ్వరుడు

మొదలు భూమి వరకు ఉన్న పదార్థాలలో గుప్తంగా ఇమిడి ఉన్న గుణాల ధర్మాన్ని ఏది తెలుపుతుందో అది మంత్రం. (ఋ, భా. భూ. 170 పే) ఇట్లా మానవులకు ధర్మం యెడ ప్రవృత్తి కలిగేందుకు వేదోక్త రీతిలో పరమేశ్వరుణ్ణి ఉపాసించాలి.

తైత్తిరీయ అరణ్యకం ప్రథమ పాదంలో తెలుపబడిన పంద్రెండు ధర్మ లక్షణాలను ఋగ్వేదాది భాష్యభూమిక (191, 192, 193 పే) ఇట్లా వివరించింది.

1. ఋతం :

మానవులు తమ జ్ఞాన విద్యను పెంపుజేసుకొంటూ పరమేశ్వరుని ఉపాసించటం., వేదశాస్త్రాలను చదవటం-చదివించటం.

2. స్వాధ్యాయప్రవచనం :

ప్రత్యక్షాది ప్రమాణాల ద్వారా విషయాన్ని చక్కగా పరిశీలించి తెలుసుకోవటం. తెలుసుకున్న దానిని ఇతరులకు చెప్పటం. చెప్పటంతోపాటు చదవటం, చదివించటం.

3. తప :

విధులను గ్రహించటానికి బ్రహ్మచర్యాశ్రమాన్ని పాటించటం. ధర్మనిరతునిగా ఉండటం.

4. దమ :

నేత్రాది ఇంద్రియాలను అధర్మం నుండి మరలించి ధర్మంపై ఉంచటం.

5. శమ :

ఆత్మను, మనస్సును ధర్మంపై లగ్నం చేయటం.

6. అగ్నుయ ;

వేదాలు, అగ్ని మొదలైన పదార్థాలను సేవించి పురుషార్థాలను సాధించటం.

7. అగ్నిహోత్రం :

అగ్నిహోత్రం మూలాన వాయువును వృష్టి జలాన్ని శుద్ధిచేయటం, యజ్ఞాదులను చేసి సృష్టికి మేలు చేకూర్చటం.

8. అతిదయ :

సత్పురుషులను సేవించటం, విద్వాంసులకు కష్టంకలిగింపక సత్యవ్రతాన్ని పాటించటం.

9. మానుషం :

మానవ మర్యాదలకు, ప్రజావ్యవస్థలకు, రాజవ్యవస్థలకు భంగంలేని మార్గంలో ధనాదులను సంపాదించి రక్షించటం. వాటిద్వారా సత్కార్యాలు చేస్తూ, పురుషార్థ సిదిని పొందటం.

10. ప్రజా :

తగినవిధంగా స్వ సంతానపాలన చేయటం.

11. ప్రజన :

సంతానం కలగడానికి పుత్రేష్టి చేయటం. అంటే పౌష్టిక ఆహారం తీసుకోవటం. ఔషధం సేవించటం. గర్భరక్షణ కావించటం.

12. సత్యం :

ఎల్లప్పుడు సత్యాన్ని పలకటం. ఇట్టి ధర్మాచరణవల్ల కలిగే ప్రయోజనమేమిటో ఇప్పుడు తెలుసుకుందాం.

## ధర్మప్రయోజనం

సత్యం అంటే బ్రహ్మం. దాని వల్ల సమస్తలోకాలకు ప్రకాశం వాయ్వాది పదార్థ రక్షణం జరుగుతుంది. సత్యభాషణం వల్ల మనుజులు ఉత్తమసుఖాన్ని పొందుతారు. తపస్సువల్ల కామ క్రోధాదులను జయించి, ధర్మమునందు స్థిరత్వాన్ని కలిగి పరమేశ్వరుని పొందుతారు. దమము సర్వపాపాలను పోగొడుతుంది. బ్రహ్మచర్యాశ్రమ నిర్వహణకు తోడ్పడుతుంది. శమం శుభం చేకూరుస్తుంది దానం వల్ల యజ్ఞ సంపన్నత, శత్రుజయం కలుగుతుంది. ధర్మాచరణవల్ల లోకుల విశ్వాసాన్ని చూరగొంటారు. పాపాలు తొలగిపోతాయి. ప్రజననం అంటే జన్మం. దీనివల్ల మానవుల సంఖ్య పెంపై పరం నిలుస్తుంది. జ్ఞానులకు సేవచేయుటం వల్ల ఋణం తీరుతుంది. అగ్నయః అంటే వేదాలు. అగ్నులు శ్రేష్ఠములని ఎంచటం వల్ల, అచరించటంవల్ల విద్వాంసులు జ్ఞానమార్గాన్ని పొందుతారు. పృథివి, ఆకాశ, స్వర్గలోకాలకు సంబంధించిన విద్యలనుపొందుతారు. అగ్నిహోత్రం వల్ల దుర్గంధనష్టం, సుగంధప్రాప్తి కలుగుతుంది. దీనివల్ల జనులు ఎల్లప్పుడు సుఖిస్తారు. యజ్ఞ విద్యవల్ల శత్రుజయం, మిత్రప్రాప్తి కలిగి సుఖిస్తారు. మనస్సు పవిత్రంగా ఉంచటం వల్ల విద్వాంసులు ప్రజాపతి అయిన పరమేశ్వరుని తెలుసుకుని నిత్యసుఖాన్ని పొందుతారు. ధర్మకార్యాలన్నీ సిద్ధిస్తాయి.

మనుస్మృతి తెలిపిన ధృతి, క్షమ, దమం, అస్తేయం, శౌచం, ఇంద్రియనిగ్రహం, ధీ, విద్య, సత్యం, అక్రోధమనే పది ధర్మలక్షణాలను "ఈశ్వరరహస్యసారము" (192 నుండి 228 పే) ఇట్లా వివరించింది. ధృతి అంటే ధైర్యాన్ని ధారణ చేయటం, నీ తప్పిదం అనుచితమైంది. అయినా చింతలేదు. పొరపడితివి, క్లేశపడకు, నీవు క్షమింప తగినవాడవు. ఇట్టివని ఇకమీద నీవల్ల కలుగకుండేందుకై ఈశ్వరుణ్ణి వేడుకో, అని చెప్పి అపరాధాన్ని మనస్సు నుండి పోనాడటం క్షమ; దీనినే అహింస అంటారు. ధర్మలక్షణాలలో సంపూర్ణ సుఖదాయకమైనది క్షమ అని చెప్పవచ్చు. దమమంటే మనోవృత్తి నిగ్రహం. అస్తేయం అంటే దొంగిలింప కుండటం. పరులకు ఏ విధమైన కీడును, తనకు ప్రయోజనం పాటింపని గుణానికి అస్తేయం అని పేరు. ఇది మానసిక, వాచిక, కాయికమని మూడు విధాలుగా ఉంటుంది. బాహ్యాభ్యంత

రాలను నిర్మలంగా ఉంచటం శౌచం, నీటిచేత శరీరశుద్ధి, సత్యాచరణం చేత మనశ్శుద్ధి, తపోవిద్యాదుల చేత అంటే జ్ఞానం వల్ల ఆత్మ శుద్ధి (శౌచం) అని గ్రహించాలి. ఇంద్రియాలను అధర్మంవైపు పోకుండా మళ్ళించటం, ధర్మాచరణపై కేంద్రీకరించటం ఇంద్రియ నిగ్రహం అనబడుతుంది. ధీః, అంటే బుద్ధి. రజస్తమో గుణాలతో కూడి ఉన్న బుద్ధిని సత్యజ్ఞానం వైపు మళ్ళించి మోక్షాన్ని పొందాలి. దేనివల్ల సంపూర్ణ పదార్థాల యొక్క యదార్థ స్వరూపం తెలుస్తుందో అది విద్య అనబడుతుంది. ఎట్లా చూడబడిందో, ఎట్లా వినబడిందో, లోపల ఎట్లాఉందో అట్లా పలకటం సత్యం. ఇట్టి సత్యం వల్ల ధర్మం వర్ధిల్లుతుంది. తమోగుణ ప్రధానమైన క్రోధాన్ని శాంతగుణంతో జయించి జ్ఞానాన్ని పొందటం అక్రోధం.

"అనంతావై వేదాః" (తై. బ్రా. 3-10-11) అన్నట్లు వేదాలలో చెప్పబడిన ధర్మం కూడా అనంతమైందే. ధర్మ సహాయంలేకుండా లోకంలో మానవుడు తన జీవితాన్ని నిర్విఘ్నంగా కొనసాగించలేడు. అగ్నిముందు తృణంలాగా లోకంలో ఉన్న ధన, దేహ, అధికార బలాదులన్నీ ధర్మబలం ముందు న్యూనతను పొందటం గమనిస్తూనే ఉన్నాం. కాబట్టి ధర్మం ఒక్కటే మానవుడికి సత్యమైన మిత్రుడు. ఇట్టిధర్మాన్ని మార్చేందుకు అధికారం ఎవ్వరికీలేదు. (మను. 12-108) ఇట్లా వేదంలో ధర్మమనే శాశ్వతమైన అపూర్వ, అపురూపమైన ప్రయోగం చేయబడిందే తప్ప మతం అనే పదప్రయోగమేదీ లేదు.

ఇట్లా వేద ప్రతిపాదిత ధర్మాన్ని ఋషులు, జ్ఞానులు, అనేకులు తమ క్రాంత దర్శనం ద్వారా తెలుసుకుని, తమ తమ అనుభూతుల్ని మేళవించి, వేరు వేరు సిద్ధాంత రూప సూత్రాలను కూర్చి సత్యజ్ఞానాన్ని లోకానికి వెల్లడించారు. వారి ప్రయత్న ఫలమే వేదాంగాలు, ఉపాంగాలు, బ్రాహ్మణాలు ఆరణ్యకాలు, స్మృతులు, సూత్రాలు, ఉపనిషత్తులు.

భారతావని ఇట్టి వైదిక ధర్మాన్నివీడి వైదిక జీవనానికి దూరమైన అవైదిక దశలో పరాధీనమైంది. నాటినుండి మతాలు ఏర్పడ్డాయి. అట్టి మతతత్త్వాన్ని తెలుసుకుందాం.

మతం :

మతం అంటే అభిప్రాయం, సమ్మతి, శాస్త్రం అని అర్థాలు (శ. ర. 601, పే) వాడిఅభిప్రాయంవాడిది అనేందుకు బదులు వాడి మతం వాడిది అని వ్యవహరించటం వింటూనే ఉంటాం. ఇట్లా మతం, అభిప్రాయం అనే పదాలు పర్యాయ పదాలుగా, సమానార్థకాలుగా ఉన్నాయి. 'రెలియిజన్' అనే అంగ్ల పదం ఈ మత పదానికి సమానార్థకం.

మత పదానికి సమానార్థకమైన 'అభిప్రాయం' వ్యక్తికి సంబంధించింది. కాబట్టి మత పదం కూడా వ్యక్తికి సంబంధించిందే అని చెప్పవచ్చు. వైదిక ధర్మం విధి వికృతమైన దశలో భారతదేశంలో ఏర్పడ్డ జైన, బౌద్ధ, శైవ, శాక్తేయ, వైష్ణవ, శాంకర (అద్వైతం) రామానుజ (విశిష్టాద్వైతం) మాధ్వ (ద్వైత) వల్లభ, నింబార్క, కబీర్, నానక్, క్రైస్తవ, మహమ్మదీయ, మతాల పేర్లు పరిశీలిస్తే పై విషయం తేటపడుతుంది.

అహింసను బోధించిన బౌద్ధమతానికి మూలసూత్రాలు మూడు ఉన్నాయి. అవి బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి అనేవి. ఇందులో మెదటి సూత్రమైన బుద్ధం శరణం గచ్ఛామి అనేది ఆ మత ప్రవక్త అయిన వ్యక్తి యొక్క ప్రాధాన్యాన్ని తెలియజేస్తున్నది. (కురాన్) చెప్పిన దేవుణ్ణి అంగీకరించేది మహమ్మదీయ మతం అందులో "లాఇలాహి ఇల్లల్లాహ మహమ్మద్ రసూల్ అల్లాహ" అనే వాక్యంలోని "మహమ్మద్ రసూల్ అల్లాహ" అనే భాగానికి మహమ్మదు అల్లానుండి సందేశం తెచ్చాడని భావం. ఈ భావాన్ని అంగీకరించక పోతే అతడు మహమ్మదీయుడు కాలేడు. అంగీకరిస్తే మహమ్మదు ప్రాధాన్యాన్ని అంగీకరించినట్లే కదా ! ఇట్లా మహమ్మదీయ మతం ఆ మతప్రవక్త అయిన మహమ్మదు ప్రాధాన్యాన్ని తెలుపుతున్నది. అట్లాగే క్రైస్తవ మతంలో క్రీస్తు జైనమతంలో జినుడు, ప్రాధాన్యం వహిస్తున్నారు. కాబట్టి మతం అనే పదం వ్యక్తి ప్రాధాన్యం కలిగి ఉంది.

భారతీయ ధర్మం ఈ మతాలవలె కాక కొంత విలక్షణ విశిష్ట చరిత్ర కలిగింది, ప్రాచీనకాలంలో ఆర్యావర్తమని, భారతదేశమని పిలువబడ్డ ఈదేశం, క్రమంగా మహమ్మదీయ పాలనలో "హిందుస్తాన్" అని క్రైస్తవుల (ఇంగ్లీషువారి) పాలనలో 'ఇండియా' అని వ్యవహరింపబడింది. మహమ్మదీయ పాలనకు ముందువరకు ఈ దేశ ప్రజలు వేదధర్మాన్ని పాటిస్తూ ఉండేవారు అందువల్ల వైదికులని పిలువ బడేవారు. ఈ వేదభూమిలో మహమ్మదీయులు తమ పాలనాప్రాభవం పెంపు చేసుకునేందుకు ఇస్లాం మతాన్ని ఇక్కడి ప్రజలకు అంటగట్టే ప్రయత్నానికి సాధనమయ్యారు. ప్రలోభలకు లొంగి ఇస్లాం మతాన్ని అంగీకరించి షేకులు, అబ్దులాలుగా చలామణి కావటం మొదలు పెట్టారు. శిఖాసూత్రాలను వదిలేసి జుట్టు గొరిగించుకొని గడ్డాలు పెంచి సున్నతులు చేయించుకునేందుకు సిద్ధపడ్డారు. కొందరు వైదిక ధర్మ పరాయణులు మాత్రం ఆత్మ విశ్వాసంతో వారి ఆటలను సాగనివ్వలేదు. ప్రలోభాలకు లొంగలేదు. ఇట్లా తమకు లొంగని వారిని అందరిని మతవిశ్వాసం లేనివారుగా పరిగణించి 'హిందువులు' అనే పేరుతో పిలవటం ప్రారంభించారు.

"హిందూ" పదం పర్షియన్ భాషకు చెందింది. పర్షియన్‌లో ఈ హిందూ పదానికి డాకు, చోర్, బద్మాష్, గులామ్‌కాఆద్మీ, కాఫిర్ అనే అర్థాలున్నాలు. 'కాఫిర్' అంటే పాపం చేసినవాడు అని అర్థం. (సం. 1 సం. 3 పే 15) వేదధర్మము ఈ అర్థం స్ఫురించేట్లు తమకు లొంగని వైదికులను హిందువులని వ్యవహరిస్తూ వారిపట్ల మహమ్మదీయులు తమ కసి తీర్చుకున్నారు. మిగిలిన మతాల మాదిరిగా భారతావనిలో ఉన్న శైవ, వైష్ణవాది సర్వమత సంప్రదాయాలు కలిపి హిందూమతమని చెప్పటం జరుగుతున్నది. ఇట్లా వ్యక్తి ప్రాధాన్యత, ఆరాధనలతో వివిధ మతాలు ఏర్పడ్డాయి. నేటికీ మరికొన్ని పుట్టగొడుగుల్లా పుడుతూనే ఉన్నాయి. మఖలో పుట్టి పుబ్బలో మాడి పోతూనే ఉన్నాయి.

అయితే హిందూ శబ్దం మహమ్మదీయుల పాలన కంటే ముందే ఉందని, అది మహమ్మదీయులు ప్రచారం చేసిన నీచర్థ వ్యాఖ్యకంటే భిన్నంగా ఉందని ఈ క్రింది విషయం స్పష్టం చేస్తున్నది.

"ఈ దేశంపై మహమ్మదీయ ఆధిపత్యం ఏర్పడకముందు 'హిందూ'' శబ్దం అవమానకరార్థంతో ఎవ్వరూ వాడలేదు. అరబ్బీ నిఘంటువులలో "హిందూ" శబ్దం ఒక దేశానికి పేరు అని ఉన్నది. మహమ్మద్ పైగంబర్ కన్నా ఇరువది నాలుగు సంవత్సరాలకు ముందు అరేబియా దేశంలో "లాబీ" అనే సుప్రసిద్ధ కవి ఉన్నాడు. ఆ మహాశయుడు భారతదేశంలో ఋషుల అంతఃకరణాలలో జరిగిన వేద విజ్ఞాన అవిర్భావాన్ని గూర్చి "అయాముబారికల్ అర్జెయొశయ్యేను - హామినల్ హిందేహా రాదకల్ లాహామయ్యే నజ్జెలాజక్రతున్" అంటూ కవితను వ్రాశారు. ఈ అరబ్బి కవిత దారూన్‌రషీద్ గారి దర్బార్ కవి అయిన అస్రాయానులేకున్‌శారా చేత సంగ్రహింపబడిన 'సీరుల్‌ఉకూల్' అనే పుస్తకం (118పే) లో ఉన్నది. ఇంకా 'వేదోంతా యదార్థస్వరూప్' అనే (74పే) గ్రంథంలో కూడా ఉంది. ఈ కవిత భావమిది. హే! హిందు భూమే! ఈశ్వరుడు తన (వేద) జ్ఞానాన్ని నీపైననే ప్రకాశ పరచి ఉన్నాడు. అందుచేత నీవు ధన్యవు. (హిం. స్వ1, 2పే) దీనిని బట్టి మహమ్మదీయుల కంటే ముందువాడయిన 'లాబీ' 'హిందె' పదంతో వైదిక భారత దేశాన్ని కొనియాడినట్లు, తెలుస్తున్నది.

ఇట్టి హిందూ శబ్దానికి, మహ్మదీయులు, ఆంగ్లేయులు తమ ప్రాబల్యాన్ని నిలుపు కోవటం కోసమే ? చార్థ వ్యాఖ్యలు ప్రచారం చేశారని స్పష్టపడుతున్నది. నిజానికి 'హిందూ'' శబ్దం ఒక విశిష్ట జీవన వ్యవస్థను సూచిస్తూ భారతావనికి అరబ్బులు చేసిన నామకరణం అని పై విషయం స్పష్టం చేస్తున్నది.

## భారత సమాజ వైశిష్ట్యం

సమాజ స్వరూపాన్ని యజుర్వేదం ఇట్లా వివరించింది.

"బ్రాహ్మణోఽస్యముఖమాసీత్ బాహూరాజన్యః కృతః
ఊరూతదస్యయద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత"
(య, అ 31 మం 11)

ఈ మంత్రభావమిది. సమాజ పురుష శరీరానికి బ్రాహ్మణులు శిరస్థానీయులు క్షత్రియులు బాహుతుల్యులు, వైశ్యులు ఊరువులు. పాదతుల్యులు శూద్రులు

మానవ శరీర అవయవాలలో ఉన్నశక్తితో పోలుస్తూ చెప్పబడ్డ సమాజ పురుషుని వర్ణన ఇది. అట్లాగే ఇట్టి వైదిక సమాజంలో మనిషి ఎట్లా ఉండాలి అనే విషయాన్ని కూడా యజుర్వేదం ఇట్లా చెప్పింది.

"తం యజ్ఞం బర్హిషిప్రోక్షన్ పురుషం జాత మగ్రతః
తేన దేవా అయజంత సాధ్యా ఋషయశ్చయే"
(య, 5-31-9)

"అందరి కంటే ప్రథముడు, జగత్కర్త, జగత్తునందు పరిపూర్ణుడై ఉండే వాడు. పూజ్యుడైన పరమేశ్వరుణ్ణి ఏ మనిషి ప్రేమ,భక్తి సత్యాచరణాలతో హృదయ కోణాన పూజిస్తాడో అతడే ఉత్తమ పురుషుడు-మనిషి. (ఋ. భా. భూ 220 పే) ఇట్టి ఉత్తమ గుణాలున్న మనిషి ఏ సమాజంలో ఉంటాడో ఆ సమాజం సదా జీవించి ఉంటుంది. అనటంలో సంశయముండదు.

విశిష్ట విచార ధారాధారితులై జీవనం సాగించిన దేవతలు, బ్రహ్మ, ఇంద్రుడు, విష్ణువు, భృగువు, మరీచి మొదలైన ఆది ఋషులు, మహర్షులు ఈ సమాజంలో పూర్వీకులు. వీరి ఉత్తరాధికారులే ఆర్యులు. వైదిక కర్మానుష్ఠాన పరులైన ఈ ఆర్యసంతతే క్రమంగా భారతీయులుగా ప్రసిద్ధి చెందారు. ఈ పరంపరలో నామ మాత్రంగా మిగిలిన ఈనాటి మనం, హిందువులుగా పిలువ బడుతున్నాం.

సర్వజగత్తంతా 'ఓం' అక్షర వ్యాఖ్యానం. ఈ ఓంకార వాచ్యమే పరబ్రహ్మ (మాం. ఉ. 1) ఈతణ్ణి సత్తు, చిత్తు సూక్ష్మం అని ఋషులు తెలుసుకున్నారు. (ఋ. భా. భూ. 205 పే) ఈ పరబ్రహ్మకు ఆత్మఅనిపేరు. (ఐ. ఉ. 1). ఈ ఆత్మ చైతన్యవంతం. ఇదే ఈ జగత్తుంతా వ్యాపించిఉంది. (ఛాం. ఉ. 3-13)

ప్రాణులలో నాశవంతమైంది, నాశములేనిది అనే రెండు వస్తువులు ఉంటాయి. నాశవంతమయింది శరీరం. నాశంలేంది, స్థిరంగా ఉండేది, ఈ ఆత్మయే. (భ. గీ 15-16)

ఈశ్వర జీవ ప్రకృతులు అనే మూడు సనాతనమైనవి. (వే. ద. పే 117) జీవుడు ప్రకృతి మూలంగానే వివిధయోనులను ఆశ్రయించి

దానిని అనుభవిస్తుంటాడు. త్రిగుణాత్మకమయిన ప్రకృతి మూలంగానే వివిధ యోనులను పొందుతుంటాడు. (భ. గీ. 13.21) పునఃజన్మిస్తుంటాడు. (వే. ద. పే 683) జీవుడు స్థూలశరీర సంబంధంతో విషయ సుఖాలను అనుభవించటమే సంసారం (వే. ద. 4-2-8) ప్రళయ మోక్షాదులలో జీవుడు దేహ సంబంధాన్ని వీడి సూక్ష్మదేహసంబంధి అవుతాడు. సూక్ష్మ శరీరంతో కూడిన జీవుడు చక్షురాది ఇంద్రియాల ద్వారా, ఇతర సూక్ష్మనాడులద్వారా వెదలి పోతాడు. (బృ. ఉ. 4.4.2).

కాబట్టి బాహ్యేంద్రియాలకు కనబడడు. ఇట్లా ఆస్తిక్యం, ఆత్మవాదం, జన్మ, పునర్జన్మ, కర్మఫలం, వర్ణాశ్రమ, ధర్మ వ్యవస్థల వంటి తత్త్వజ్ఞానాన్ని భారతీయ సమాజం కలిగి ఉంది. ఈ సమాజం కలిగి ఉన్న వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థను గూర్చి కొంత తెలుసుకుందాం.

## వర్ణ వ్యవస్థ

రమేష్‌చంద్రదత్త, మాక్స్‌ముల్లర్ వంటి మహాశయులు వైదికయుగం బ్రాహ్మణగ్రంథయుగం, ఉపనిషద్యుగం, సూత్రగ్రంథయుగం, బౌద్ధయుగం పురాణయుగం, మొదలైన విధంగా భారత వర్ష ఇతిహాసాలను గూర్చి వ్రాసే సందర్భాలలో తెలిపారు. (ఈ. ర. సా. 106 పే) కాని ఈయుగ విభజన సరి అయిందిగా తోచదు. వేద ధర్మాన్ని ఆచరిస్తూ, వైదిక పద్ధతులను అనుసరించి మానవులు తమ వ్యవహారాలను నెరవేర్చుకున్నంత వరకూ అది వైదిక యుగమని, ఆర్యజాతి వైదిక పద్ధతిని అతిక్రమించి ఎప్పుడు ప్రవర్తించిందో అప్పటి నుండి అవైదిక యుగమని చెప్పటం సమంజసంగా ఉంటుంది. ఎందుకంటే సూర్యుడి ప్రకాశం ఉన్నంత వరకు సూర్యయుగం అంటే సూర్యుడు ప్రాముఖ్యం వహించిన సమయం అని అర్థం. అట్లాగే చంద్రుడి ప్రకాశం ఉన్నంతవరకు చంద్రయుగం, చోళులు రాజ్యమేలినంత వరకు చోళయుగం, రాయల రాజ్యమేలినంతవరకు రాయల యుగం అనిగదా ప్రసిద్ధి. కాబట్టి వేద పద్ధతులను అనుసరించి ప్రజలు జీవనం గడిపినంతవరకు వైదిక యుగమని, తద్వ్యతిరిక్తంగా జీవన ప్రారంభమైనప్పటి నుండి అవైదిక యుగమని చెప్పటం సమంజసం. అట్లాగే వైదికయుగాన్ని

జ్ఞానయుగం లేక ప్రకాశయుగమని, అవైదికయుగాన్ని అజ్ఞాన యుగం లేక అంధకారయుగమని చెప్పవచ్చు.

ఇతర ప్రాణులతో పాటు పరమాత్మ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యశూద్రులను సృష్టించాడు. ఈ నాలుగు వర్ణాల ఉత్పత్తిని గూర్చి యజుర్వేదం (అ. 31. మం 11) తెలిపింది. విద్యాదిగుణాలు, సత్యమైనపల్కు, సత్యోపదేశాది ఉత్తమగుణ కర్మవల్ల బ్రాహ్మణవర్ణం ఉత్పత్తి అయింది. బలపరాక్రమాది గుణకర్మను కలిగి ఉన్నవర్ణం క్షత్రియులు. కృషి, వ్యాపారం సమస్త దేశభాషలు నేర్చుకోవటం పశు పాలన మొదలైన మధ్యమ గుణకర్మలు కలది వైశ్యవర్ణం. మూర్ఖత్వాది నీచగుణ కర్మలవల్ల శూద్రవర్ణం ఏర్పడింది. ఇట్లా పరమేశ్వరుని ఆజ్ఞానుసారం గుణకర్మ స్వభావాలను అనుసరించి చాతుర్వర్ణ్యవ్యవస్థ ఏర్పడింది. "వేదరీతిలో ఈ వర్ణాలు, ఆర్యులు, దస్యులు అని రెండు విధాలు. దీనికి "విజానీహ్యార్యా" (ఋ . 1-15-8) అనే ఋగ్వేద మంత్రం ప్రమాణం. మనుష్యులలో శ్రేష్ఠులు ఆర్యులని దుష్ట స్వభావం కలవారు దస్యులని ఈ మంత్రభావం. (ఋ. భా. భూ. 422 పే)

ఋగ్వేద యజుర్వేదాలలో రాజస్వభావం, ధర్మం ఇలా చెప్పబడింది, (ఋ. భా. భూ. 390 నుండి 393 పే) సూర్యకిరణాలలాగా సత్యం, న్యాయం. పల్కుతూ అందరికీ హితాన్ని చేకూర్చ గలిగి ఉండాలి. సర్వవిద్యాయుక్తుడై ఉండాలి. రాజార్యసభ, ఆర్యావిద్యాసభ, ఆర్యధర్మసభ అనే మూడు సభలను సుశోభితం చేయాలి. కేవలం, రాజకార్యాలు జరిగేది రాజార్యసభ. విద్యాప్రచారాలు, దానిపురోభివృద్ధి కార్యక్రమాల సమీక్ష ఆర్యవిద్యాసభ నిర్వహిస్తుంది ధర్మానికి ఉన్నతి, అధర్మాన్ని నాశనం చేసేట్లుగా ఉపదేశం చేసేది ఆర్యధర్మసభ. ఈ మూడు. సభలను ప్రత్యేకంగా కాకుండా, దాని వ్యవహారాలలో భాగంగా ప్రజలందరితో కలిసి నిర్వహించాలి. విద్వాంసులైన బ్రాహ్మణులతో కలిసి వీరులు, శాకారులైన క్షత్రియులు రాజకార్యాలను నెరవేర్చాలి. అట్లా ఏ దేశంలో నెరవేరుస్తారో ఆదేశంలో ధర్మోన్నతి జరుగుతుంది మనుస్మృతి (1-89) భగవద్గీత (18-43) శ్లోకాలు రాజలక్షణాన్ని ఇట్లా తెలిపాయి. ప్రజలను న్యాయమార్గంలో రక్షించటం, విద్యా, ధర్మప్రచారాలను చేయటం, దానమివ్వటం, యజ్ఞాలు చేయటం, వేదశాస్త్రాధ్యయనం,

జితేంద్రియుడుగా ఉండటం, యుద్ధం, ధైర్యం మొదలైనవి క్షత్రియ లక్షణాలు.

పశుపాలన, విద్య, ధర్మాలను అభివృద్ధి పరచటం, అగ్నిహోత్రాది యజ్ఞ కార్యనిర్వహణం, వేదశాస్త్రపఠనం, వ్యాపారం, సేద్యం, వైశ్యుని గుణకర్మలని మనుస్మృతి (1-90) తెలిపింది.

శూద్రుడు పరిశ్రమ చేసేవాడు, తపస్వి, సాహసికుడు అని ''తపసేశూద్రమే" (య. 30-5) అనే యజుర్వేదమంత్రం తెలిపింది. ఈర్ష్య, అభిమానాదులను వదలి బ్రాహ్మణులకు సేవచేయటం శూద్రుని గుణకర్మలని మనుస్మృతి (1-9) తెలిపింది.

ఇంతేగాక నాలుగు ఆశ్రమ విధానాలను కూడ వేదం తెలిపింది. ఇవి ప్రజలు తమ జీవితాన్ని విభజించుకుని క్రమ పద్ధతిలో ధర్మాను గుణంగా నడుపుకుని ముక్తులయ్యేందుకు మార్గదర్శకాలు. ఇట్టి ఆశ్రమాలు నాలుగున్నాయి. అవి బ్రహ్మచర్యం, గృహస్థం, వానప్రస్థం, సన్యాసం అనేవి. వీటిని గూర్చి సంక్షిప్తంగా తెలుసుకుందాం.

## వర్ణాశ్రమ ధర్మాలు :

### బ్రహ్మచర్యం :

ఈ బ్రహ్మచర్యాశ్రమాన్ని అథర్వణ వేదం 'పూర్వోజాతో బ్రాహ్మణో "బ్రహ్మచారీ" (11-3-5-5) "బ్రహ్మచార్యేతి సమిధాసమిద్ధం" (11-3-5-6) 'బ్రహ్మచారీజ యన్" (11-3-5-7) "బ్రహ్మచర్యేణ కన్యా' (11-3-5-18) మొదలైన మంత్రాలలో విపులంగా వివరించింది. వీటి సారాంశమిది. మాతృగర్భం నుండి జీవుడికి లభించేది ప్రథమ జన్మం. తరువాత ఆచార్యుడు అనే తండ్రి, విద్య అనే తల్లి సంపర్కం వల్ల రెండో జన్మ కలుగుతుంది. విద్యార్థులు పాఠశాల వెళ్ళి గురువు సమీపస్థులై గురూపదేశాను సారం పరమేశ్వర జ్ఞాన తత్పరులై ఉంటారు. అట్టిబాల బాలికలను బ్రహ్మచారిణులు బ్రహ్మచారులు అంటారు. బ్రహ్మచారి ప్రాణవిద్యను, లోక విద్యను గ్రహిస్తాడు. మృగ చర్మాలను ధరించటం, కేశాలను, మీసాలను ధరించటం మొదలైన బ్రహ్మ చర్య చిహ్నాలతో సర్వ ఆశ్రమాలకు భూషణమైన ధర్మానుష్ఠాన నియమంతో

ఉత్కృష్ట జ్ఞానాన్ని పొందుతాడు. అగ్నిహోత్రాదులు, ధర్మానుష్ఠాన ఉపదేశం పరిశ్రమలతో లోకాన్ని సంపన్నం చేస్తాడు. బ్రహ్మచర్య తపస్సుతో రాజ్య ప్రజలను రక్షించటానికి తగిన యోగ్యతను పొందుతాడు. ఇట్లా నియమపూర్వకంగా మోక్ష ప్రాపక విద్యలను అభ్యసించిన బ్రహ్మచారి, అవిద్యను వదిలి సూర్యుడివలె ప్రకాశిస్తాడు. బ్రహ్మచర్యాశ్రమంతో విద్య నభ్యసించి యవ్వనావస్థను పొందిన పిదప కన్య, యువకుని పతిగాను, పురుషుడు కన్యను భార్యగాను పొంది గృహస్థాశ్రమంలో అడుగు పెడతారు.

గృహాశ్రమం :

ఈ గృహాశ్రమాన్ని "యద్గ్రామే యదరణ్యే, యత్ సభాయాం" (య. 3-45) "దేహిమే దదామి తేనిమే దేహి" (య. 3-50) "గృహామాబిభీత మావేపధ్వ మూర్జంబి భ్రత్యమని" (య. 3-41) "యేషానుధ్యేతి ప్రవసన్" (య. 3-42) "ఉప హోతా ఇహగావ ఉపమాతా అజానయః" (య. 3-43) మొదలైన యజుర్వేద మంత్రాలు ఇట్లా తెలుపుతున్నాయి. గృహాశ్రమాన్ని స్వీకరించిన మనుష్యులు సత్యాన్ని చెప్పటం, అంగీకరించటం, ఆచరించటం, వినటం చేయాలి ఇట్లా ప్రతి వ్యవహారం సత్యంతో కూడి ఉండాలి. పుణ్యం, విద్యాప్రచారం, సంతానోత్పత్తి, సర్వులకు ఉపకారం కలిగించే నియమపాలన చేయాలి. సమస్త జంతువులు వాయువు నాశ్రయించి ఉండునట్లు, సమస్త ఆశ్రమాలు గృహాశ్రమాన్ని అంటిపెట్టుకొని ఉంటాయి. బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్యాసం అనే మూడు ఆశ్రమాలవారికి ప్రతి దినం అన్నదానం గృహస్థే చేస్తాడు. సర్వ పురుషార్థ సిద్ధికి గృహాశ్రమమే ఆధారం. కాబట్టి అన్ని ఆశ్రమాలలో ఇది జ్యేష్ఠాశ్రమం (స. ప్ర. 156 పే) అనవచ్చు.

వానప్రస్థం :

"త్రయో ధర్మస్కంధాయజ్ఞోఽధ్యయనందా న మితి
ప్రథమ స్తప ఏవద్వితీయో బ్రహ్మచార్యాచార్య కులవాసీ
తృతీయోఽత్యంత మాత్మాన మాచార్యకులేఽవసాదయన్
సర్వఏతే పుణ్యలోకాభవంతి బ్రహ్మసంస్థోఽమృ
తత్త్వమేతి" (ఛాం. ఉ. 2-23-1)

ఈ ఛాందోగ్యోపనిషద్వాక్యం వానప్రస్థాశ్రమాన్ని ఇట్లా తెలుపుతుంది. ధర్మా నికి మూడు శాఖలున్నాయి. యజ్ఞ, అధ్యయనం, దానం అనే మూడు ధర్మానికి ప్రథమ శాఖ. తపస్సు రెండవ శాఖ. మూడవది బ్రహ్మచారి అధ్యయనాదుల మూలాన అజ్ఞానాన్ని పోగొట్టుకుంటూ ఆచార్యకులంలో ఉండుట. ఈ మూడు ఆశ్రమవాసులంతా పుణ్యులే. వీరిలోకూడా బ్రహ్మనిష్ఠుడయినవాడు ముక్తుడౌతాడాని పై వాక్య భావం. దీనిని బట్టి గృహాశ్రమాన్ని పూర్తిచేసిన మనుష్యులు అరణ్యానికిపోయి, బ్రహ్మవిచారణ విద్యాధ్యయనం, తపస్సు చేయటం వానప్రస్థం. ఈ వానప్రస్థాశ్రమాన్ని మనుస్మృతి (మం. 6-1 నుండి 26) ఇట్లా తెలిపింది. బ్రహ్మచర్య పూర్వకంగా గ్రహాశ్రమం నిర్వహించిన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు నిశ్చింతగా అరణ్యానికి పోవాలి. గ్రామ సంబంధములైన సమస్త వ్యవహారాలను, అలంకారాదులను వదిలి పెట్టాలి. భార్యను, పుత్రుని దగ్గర ఉంచిగాని, లేక వెంటతీసుకొని గాని వెళ్ళాలి. సాంగోపాంగంగా అగ్నిహోత్రాన్ని తీసుకొని జితేంద్రియుడై అరణ్యానికి బయలు దేరాలి. కందమూల ఫలపుష్పాదులతో అతిధి సేవ నిర్వర్తించాలి. అందరి యెడ స్నేహభావం కలిగిఉండాలి. స్వాధ్యాయంతో దయాళువై ఉండాలి. శరీర సుఖాన్ని త్యజించాలి. ఆశ్రిత పక్షపాతం కలిగి ఉండకూడదు. మమతానురాగాలను విడిచి పెట్టాలి. వృక్షమూలవాసం, భూశయనం పాటించాలి.

అభ్యాదధామి సమిధ మగ్నే వ్రత పతేత్వయి.
వ్రతంచ శ్రద్ధాంచోపై మీంధే దీక్షితో అహమ్." (యం. 22. 24)

అనే యజుర్వేద మంత్రం వానప్రస్థ విధిని సంక్షిప్తంగా ఇట్లా తెలిపింది. 'నేను అగ్ని యందు హోమంచేసి దీక్షితుడనై వ్రతాన్ని, సత్యచరణం. శ్రద్ధను పొందుతాను. తద్వారా పవిత్రత చేకూరుతుంది. సన్యాసం స్వీకరించే నిశ్చయం కలిగినపుడు భార్యను కుమారుని యొద్దకుపంపి సన్యాస ఆశ్రమం స్వీకరించాలి. (స ప్ర 158 పే )

సన్న్యాసం :

విద్వాంసుడు, రాగద్వేషరహితుడు, ఎల్లప్పుడు సమస్త మానవుల యెడ ఉప కారబుద్ధి గలవాడే సన్న్యాస ఆశ్రమం స్వీకరించేందుకు అర్హుడు అల్పజ్ఞుడికి ఈ అధికారం లేదు. సత్యోపదేశరూపక బ్రహ్మయజ్ఞం, బ్రహ్మోపాసనరూపక దేవయజ్ఞం, విజ్ఞానుల యెడ గౌరవ రూపక పితృయజ్ఞం, సర్వభూత దయారూపక భూతయజ్ఞం, నిరభిమాన సత్యోపదేశంతో సర్వమానవ సత్కార రూపక అతిథియజ్ఞం అనే పంచ మహాయజ్ఞాలను సన్న్యాసి ఆచరించాలి. పరమేశ్వర ఉపాసనతో ధర్మానుష్ఠానం చేయటం సన్న్యాసి కర్తవ్యం. (ఋ.భా భూ. 445 పే).

నడిచేటప్పుడు సన్న్యాసి భూమిపైననే దృష్టి నిలపాలి. నీటిని వడపోసి త్రాగాలి. సత్యాన్నే పలకాలి. కోపాన్ని విడిచిపెట్టాలి. ఓంకార పూర్వక సప్త వ్యాహృతులచేత విధిపూర్వకంగా ప్రాణాయామం చేయాలి. సమస్త భావాలు, పదా ర్థాల యెడ నిస్పృహ కలిగిఉండాలి. ఈ ప్రకారంగా సమస్త సంగదోషాలను వదలి హర్ష శోకాది సమస్త ద్వంద్వాలనుండి విముక్తుడై- సన్న్యాసి బ్రహ్మమునందే అవ స్థితుడౌతున్నాడు. (స. ప్ర. 162 నుండి 166 పే)

ఇట్లా ప్రజలు సుఖాన్ని పొందేందుకు, ధర్మబద్ధులై పరమేశ్వరుణి చేరేందుకు అనువైన వర్ణవ్యవస్థ, వర్ణాశ్రమ ధర్మాలనే కాక నేటి పాలకుల ప్రజాపాలన, ప్రజా న్యాయస్థానాలవంటి వసలేని అన్నింటికీ వేదం సమాధానమిస్తున్నది. రాజ్యమెట్లా ఉండాలి? మంత్రుల లక్షణాలేంటి? ధర్మాధర్మ నిర్ణయాధికార పరిషత్తు స్వరూప స్వభావాలేంటి? మొదలైన విషయాలతో ప్రజలకు సుఖాన్నిచ్చే మార్గాలన్నీ వేదంలో ఉన్నాయి. ఇట్లా వేదకాలం అన్నీ సమకూర్చిపెట్టింది.

భారతదేశంలో ఐదువేల సంవత్సరాలకు పూర్వం వరకు వేదధర్మం తప్ప, వేరే ధర్మంకాని, మతంకాని లేదు. సకల మానవులకు చెందిన ఈ వేదజ్ఞానం అందుకోలేని భ్రష్టజీవనం ప్రజలలోమొదలైంది. ప్రజా జీవనంలో వేద బాహ్య వ్యవహారాలు చోటుచేసుకున్నాయి. అజ్ఞానాంధకారం వ్యాపించింది. అవిద్య హెచ్చు పెరిగింది. ప్రజల బుద్ధికి భ్రమ ఆవరించింది. తమ తమ ఇష్టానుసారం స్వేచ్ఛగా మతాలను కొనసాగించటం మొదలుపెట్టారు. రఘు వంశీకుడైన శ్రీరాముని వేదధర్మ జీవనం విశ్వ హితానికి చెంది వుండగా, అదే కాలంలోని రావణుడు వేద ధర్మాన్ని ఆచరింపక దుష్టుడై భ్రష్టుడైనాడు. సార్వజీవనుడై విశ్వానికి ఆహుతు డయ్యాడు. ఇట్లా ధర్మాన్ని ఆచరించే మానవ సమాజంలో క్రమంగా దిగజారి

పోయింది. ఇది అనువుగా తీసుకొని కొందరు ఆయాకాలాల్లో తమ తమ ఆలోచన విధానాలు ప్రజలకు బోధించటం, అవి కార్యక్రమంలో వారివారి మతాలుగా నిల ద్రొక్కుకోవటం జరిగింది. ఆనాటి నుండి అవైదిక కాలం మొదలైంది.

ప్రపంచంలో వున్న సమస్త జీవకోటి సుఖ జీవనం గడపడానికి తగిన ధర్మాలు, విధులు, ఆచరణ విధానాదులను తెలిపే వేద ధర్మ ప్రచారానికి భారత యుద్ధానంతరం నష్టం కలిగింది. మనుష్యుల ఈర్ష్యాద్వేషాలు పరస్పరం ఎక్కువకా సాగాయి. బలవంతుడొక ప్రక్క రాజ్యం చేజిక్కించుకునే ప్రయత్నం చేస్తుంటే మరోప్రక్క నేటికి అగ్రవర్ణాలుగా ప్రసిద్ధిలో వున్న బ్రాహ్మణులు తమ మాటల గారడీలతో ప్రజలను భ్రమింప చేశారు. తామే సాక్షాత్తు భగవంతులమని వేద సత్య విషయానికి అగాధం సృష్టించారు. వేద విరుద్ధపురాణ వచనాలతో ప్రజల ఆలోచనా జ్ఞానానికి ఆనకట్ట వేశారు, బ్రహ్మజ్ఞానం కలిగినవాడు బ్రాహ్మణుడనే వేద సత్య వాక్కును కప్పిపుచ్చారు. గుణకర్మాది స్వభావాలతో పరమాత్మచేత సృజింప బడిన బ్రాహ్మణాది వర్ణ వ్యవస్థను వేదవిరుద్ధంగా బ్రహ్మనుండి స్థిరపరిచారు. మౌఢ్యం పెరిగిన ప్రజలు నేటికి అదే నమ్ముతున్నారు.

ఇట్లా జన్మనుండి స్థిర పరచిన వర్ణ వ్యవస్థలో వేదాధ్యయనానికి శూద్రుడు అనర్హుడు. అతనికి ఆ యోగ్యత లేదనే మిధ్యా వాక్యం ప్రచారంలోకి వచ్చింది. ఇది వేద విరుద్ధమైన ప్రచారం. వేదం శూద్రుని విషయంలో ఎక్కడా న్యూన తను చేప్పలేదు. పైగా యజుర్వేదం (30 5) శూద్రుడు తపస్వి, సాహసిక డని చెప్పింది. దీనిని బట్టి శూద్రుని పట్ల వేదభావమేమిటో గ్రహింపవచ్చు. యోగ్యత ఉన్న ఎడల శూద్రుడు వేదం అధ్యయనం చేయవచ్చు. లేనప్పుడు విద్వాంసుల వల్ల వినవచ్చు. వానికి ధర్మకర్మలందు నిషేధం లేదు. ధర్మాత్ముడైన శూద్రుడు ఎట్లాగైతే ఉత్తమ పురుషుల యొక్క ఆచరణలు చేస్తాడో అట్లాగే ఇహ పరాలలో ఉత్కృష్టతను పొందుతాడని మనుస్మృతి (10-126 నుండి 128 పే) తెలిపింది. అంతేగాక "బ్రహ్మచర్యేణ కన్యా 2 యువాం విందతే పతిమ్" (అ. 11-24.3-15) అనే అధర్వణ వేదమంత్రం స్త్రీకివున్న వేదాధ్యయన అర్హతను తెలుపు తున్నది. పంచభూతాలు, సూర్య చంద్రాది సమస్త పదార్థాలను పరమాత్మ సృష్టించి అందరికోసం ప్రకాశింప జేస్తున్నట్లే వేదం కూడా సమస్త ప్రజానీకానికి చెందు

తుందని తెలుసుకోవటమే నిజమైన జ్ఞానం అవుతుంది. ఈ సందర్భంలో సామాజిక నియమ వ్యవస్థ సమానమై ఉండాలి సమాజంలో మానవులంతా సమాన గౌరవాన్ని పొందాలి అని చెప్పిన ఋగ్వేద వాక్యం మననం చేసుకోవలసి ఉంది, (ఋ. భా. భూ. 168)

## అవైదిక వర్ణ వ్యవస్థ

వేద విరుద్ధంగా జన్మనుంచి స్థిరపరచిన ఈ వర్ణవ్యవస్థలో చాతుర్వర్ణ్య వ్యవస్థకు వేదం నిర్దేశించిన ధర్మంకూడా తారుమారౌతున్నది. "జ్ఞానులైనవారు బ్రహ్మమునే ఎఱింగి, తమ బుద్ధిని విశాలమొనర్చుకోవాలి. అప్పుడే వారు బ్రాహ్మణులు అనబడతారని శతపథ బ్రాహ్మణం తెలుపుతున్నది. (ఋ. భా. భూ. 349 పే). ఈ కాలం వర్ణ వ్యవస్థలో అట్టి బ్రహ్మజ్ఞానం లేక నామమాత్ర బ్రాహ్మణ్యం అధికంగా ఉంది. వైదిక వర్ణ వ్యవస్థా నియమాలను వదిలి కృషివ్యాపారాదులు అవలంబించటం చేత ఈ వ్యవస్థ బ్రాహ్మణున్ని వైశ్యుడనాల్సిఉంది. అట్లాగే గుణకర్మ స్వభావాదులను బట్టి శూద్రుడని చెప్పవలసి రావచ్చు. కాబట్టి వర్ణవ్యవస్థ జన్మతః వచ్చిందనే నిర్ణయం తప్పని తెలుసుకోవాలి. అంటే బ్రాహ్మణుని సంతతి బ్రాహ్మణుడు, శూద్రుని సంతానం శూద్రుడు కానక్కరలేదు. కులం ఏదో తెలియని జాబాలి, క్షత్రియ వర్ణస్థుడైన విశ్వామిత్రుడు, చండాల కులజుడైన మాతంగుడు బ్రాహ్మణులైనట్లు చరిత్ర తెలియ జేస్తున్నది. మొత్తం మీద ఉత్తమవిద్య ఉత్తమ స్వభావాన్ని ఎవరు కలిగి ఉంటారో వాళ్ళే బ్రాహ్మణ పదానికి అర్హులనే సారాంశం గ్రహించాల్సి ఉంది. అయితే వేదోక్త రీత్యా ఆలోచించినప్పుడు నేటికాలంలో ఈ క్రింది తెలుపబడిన అవైదిక వర్ణ వ్యవస్థ ఆమోదించాల్సి ఉందని ఈశ్వర రహస్య సారము (26 పే) అనే గ్రంథంలో అవైదిక వర్ణ వ్యవస్థ ఇట్లా తెలుపబడింది.

## అవైదిక వర్ణ వ్యవస్థ

1. బ్రాహ్మణుడు :-

| | | |
|---|---|---|
| బ్రాహ్మ | ... | బ్రాహ్మణుడు |
| బ్రాహ్మ | .... | క్షత్రియుడు |

| | | |
|---|---|---|
| బ్రాహ్మ | .... | వైశ్యుడు |
| బ్రాహ్మ | ... | శూద్రుడు |

2. క్షత్రియుడు

| | | |
|---|---|---|
| క్షత్రియ | .... | క్షత్రియుడు |
| క్షత్రియ | .... | బ్రాహ్మణుడు |
| క్షత్రియ | .... | వైశ్యుడు |
| క్షత్రియ | .... | శూద్రుడు |

3. వైశ్య

| | | |
|---|---|---|
| వైశ్య | .... | వైశ్యుడు |
| వైశ్య | .... | బ్రాహ్మణుడు |
| వైశ్య | .... | క్షత్రియుడు |
| వైశ్య | .... | శూద్రుడు |

4. శూద్ర :

| | | |
|---|---|---|
| శూద్ర | ... | శూద్రుడు |
| శూద్ర | .... | బ్రాహ్మణుడు |
| శూద్ర | .... | క్షత్రియుడు |
| శూద్ర | | వైశ్యుడు |

ఈ నాలుగు వర్ణాలలో చేరనివారు "పంచములు". అంటే మద్య మాంసాది అభక్ష్య భక్షణం, దుష్టకర్మలు ఆచరించేవారని గ్రహించాలి. వీరినే చండాలురు, దస్యులని వేదం చెప్పింది.

విభిన్న మతాలు :

సృష్ట్యాది నుండి భారత యుద్ధం వరకు వైదిక ధర్మమే ప్రపంచమంతా ఆచరింపబడింది. ఈ ఆచరణకు దూరమైన కాలంలోనే అంటే సుమారుగా 6000

సంవత్సరాల నుంచి మానవ జాతి అజ్ఞానం, అనాచారం కారణంగా అనైక్యతకు గురయింది. మానవ జాతిలో చీలికలేర్పడ్డాయి. రాజులు అధికార, అహంకార పిపాసులైనారు. వేరువేరుగా రాజ్యాలు నిర్మించుకున్నారు. యుద్ధాలతో చిచ్చుపెట్టుకున్నారు. ఇట్లా ఆర్యావర్తం తునాతునకలైంది.

గత 3000 సంవత్సరాల క్రింద ఘోర యుద్ధాల ఫలితంగా భారత భూమిలోని పుణ్యస్త్రీ సమూహాలు వైధవ్యాన్ని పొందారు. తత్ఫలితంగా విషయాసక్తి తామరతంపరైంది. ఆ విషయాసక్తి సాధనంగా వామమార్గ సంఘాలు ఏర్పడ్డాయి. (ఈ ర. సా. 113 పే) నాస్తికులైన అనార్యులు కపటంతో నామ మాత్రంగా ఆర్య సిద్ధాంతాలను వల్లిస్తూ,; సంపూర్ణనాస్తిక సిద్ధాంతాలతో ప్రసిద్ధులైన ఆర్యుల పేరుతో గ్రంథరచనలు చేశారు. క్రమంగా ఆర్యులను కూడా వారివైపుకు మళ్ళించే ప్రయత్నాలు సాగించారు. కాలక్రమంలో నాస్తికులలోనే భేద భావాలు తలెత్తాయి. దాని ఫలితంగా పరస్పరం కలహించుకొని మతాంతరులై భిన్న ఆచారాలను విషయాలను కల్పించుకున్నారు.

వామ మార్గయులలో చారవాక, బాణక, శాక్తేయ, భైరవ మొదలగు శాఖలేర్పడ్డాయి. ఈ భిన్న శాఖీయులు మరల కాలం గడిచిన కొద్ది మతాంతరులైనవారు. అట్లాగే శైవం, శైష్ణవం, చార్వాకం, విరోచనం, లోకాయతం, వైశేషికం, బౌద్ధం మొదలైన మతాలు కూడా శాఖాలుగా ఏర్పడ్డాయి. తిరిగి అంతఃకలహాలతో ఈ శాఖలవారు విభిన్నమత శాఖలను ఏర్పాటు చేసుకున్నారు. ఉదాహరణకు శైవమతంలో లింగాయతం, పాశుపతం, వీరశైవం- మొదలైన శాఖలేర్పడగా, వైష్ణవులు పాంచరాత్రం-శ్రీవైష్ణవం, రామానుజం, మాధ్వంగా విడిపోయారు. ఇంతలో ఆగక వల్లభమతం, నింబార్క మతం, మొదలైన పేర్లతో వ్యక్తి ప్రాధాన్యాన్ని సూచిస్తూ చిత్ర విచిత్ర గతులలో విభిన్న మతాలు నెలకొల్పబడ్డాయి. అట్లాగే క్రైస్తవ, మహమ్మదీయ మతాలలో కూడా చీలికలు అయినాయి. చీలికలైన ఈ మతాలు కూడా నాటి అవైదిక మతాలవలెనే నేటి భారతములో తిష్టవేసుకొని, సత్యజీవిత మార్గ గమనానికి అడ్డుగోడలై ప్రజల జీవన విధానాన్ని తికమక పరుస్తున్నాయి అభివృద్ధిని నిరోధిస్తున్నాయి.

## పతనమైన మానవ జీవనం

నాస్తికులైన అనార్యులు మాయోపాయంతో వేదజ్ఞానానికి బదులు, అవైదికము లైన పురాణాలను కల్పించారు. "ఈ పురాణాల వల్లనే లోకంలో ద్వైతం, అద్వైత్వం, విశాష్టాద్వైతం-శైవం వైష్ణవం మొదలైన మతాలు కలహిందాయి" "(ఈ. ర సా. 92 పే). ఇట్టి మృషాజ్ఞానంతో ఈ అవైదిక మత పురాణవచనాలతో ప్రజా జీవనాన్ని వేదజ్ఞానం నుంచి ఎట్లా తిరోగమింప చేశారో గమనిద్దాం.

"త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషమ్
యద్దేవేషు త్ర్యాయుషం తన్నో2స్తుత్ర్యాయుషమ్"
(య. 3-62)

ఈశ్వర ప్రార్థనకు సంబంధించిన ఈ యజుర్వేద మంత్రంలోని సత్యార్థాన్ని ఋగ్వేదాది భాష్య భూమిక (146పే) ఇట్లా వివరించింది. "ఓ జగదీశ్వర! నీ అనుగ్రహంతో మా కశ్యపనామక-ప్రాణం మొదలైన అంతః కరణాలు, జమదగ్ని నామక నేత్రాది సర్వేంద్రియాలు మూడు వందల సంవత్సరాల వరకు జీవించి ఉండు నుగాక" ఈ విషయాన్ని శతపథ బ్రాహ్మణం కూడా ఇట్లా విశదీకరించింది.

"చక్షుర్ వై జమదగ్నిర్ ఋషిర్ యదేనేన జగత్
పశ్య తథో మనుతే తస్మాచ్చక్షుర్ జమదగ్నిర్ ఋషిః"
(శత. 8-1)

"కశ్యపో వై కూర్మః ప్రాణో వై కూర్మః (శత. 7-5)

చక్షువు పేరు జమదగ్ని.కశ్యపుడు, ప్రాణం-కూర్మం అనబడుతుంది. అని పై వాక్యాలకు అర్థం. ఈ విషయాన్నే "ఈశ్వర రహస్య సారం" (74, 75 పే) అనే గ్రంథంలో ఇట్లా వ్రాయబడివుంది, ఈశ్వరుడు అనంత సృష్టి చేసినందువల్ల పరమాత్మకు కూర్మమని పేరు. కూర్మ శబ్దానికి కశ్యప శబ్దం పర్యాయపదం, అట్లాగే రాత్రికి అహల్యఅని, ఇంద్ర శబ్దానికి సూర్యుడని, రాత్రిని జీర్ణించుకునేవాడు కాబట్టి సూర్యుడికి జార అనికూడ పేరున్నది.

ఇట్లా జమదగ్ని, కశ్యపాది మంత్రస్థ పదాలు దేహధారులైన మనుజుల నామాలు కావని తెలుసుకోవలసి ఉంది. ఇట్టి వైదిక సత్యార్థాలను మరుగుపరిచి పురాణాలు జమదగ్ని, కశ్యపాది శబ్దాదులు మనుష్య నామాలుగా చిత్రించాయి. కూర్మ శబ్దాన్ని కూర్మ పురాణంగా, కూర్మ అవతారంగా సృష్టించాయి. ఇట్లాగే ఇంద్ర, అహల్యా శబ్దాలకు మానవ ఆకారాన్ని అంటగట్టి తప్పుడు కల్పనలుచేసి వ్యభిచార కథలను రచించారు, అవైదిక పురాణ రచయితలు. వేదం సర్వమానవు లకు గ్రహింప యోగ్యమైందని యజుర్వేదం (31.7) తెలుపుతుంటే స్త్రీ వేదం విన కూడదు, శూద్రుడు వేదం చదువకూడదనే మిథ్యా వాక్యాన్ని ప్రజలకు అర్థంకాని రీతిలో చెప్పి వారిని భయభ్రాంతుల్ని చేశారు. తీర్థాలు, వ్రతాలు, విగ్రహారాధనలు, ఉపవాసాలు, గ్రహశాంతులను కల్పించారు. ''ఇవే వేదోక్త మోక్ష మార్గాలని ప్రజ లను నమ్మించి వారిచేత అచరింపచేశారు. వేదోక్త ఉపాసనా పద్ధతులను మరుగు పరిచి పురాణోక్త పూజా వందనాదులను ఉపదేశించారు. ప్రజలలో అజ్ఞానాన్ని పెంపొందింపజేశారు. విద్యా విహీనులుగా మార్చారు.

వీరి మోసపు బుద్ధిని బయలుపరుస్తూ సత్యార్థ ప్రకాశిక (449 పే) చూపిన ఒక ఉదాహరణం గమనిద్దాం. "ఆకృష్ణేన రజసా" (య. 33-43) ''ఇమందేవా'' (9.40) ''అగ్నిర్మూర్ధాదివః'' (3-12) "ఉద్బుధ్యస్వాగ్నే'' (15.54) ''బృహస్పతే'' (26-3) "శుక్రమంధస'' (19-72) అనే యజుర్వేద మంత్రాలు క్రమంగా భూ, దివా కరుల ఆకర్షణను, రాజుల గుణాలను, అగ్నిని, యజమానిని, విద్వాంసులన వీర్యాన్ని, జలం, ప్రాణం, పరమేశ్వరుణ్ణి, మిత్రుణ్ణి, జ్ఞాన గ్రహణ విధానాన్ని తెలుపుతున్నాయి. ఇట్టివేదమంత్రాలకు వరుసగా సూర్య, చంద్ర, మంగళ, బుధ, బృహస్పతి, శుక్ర, శని, రాహువు, కేతువులనే గ్రహాలుగా అర్థం చెప్పి రూపకల్పన చేశారు. అనార్యులు. ఇంతతోఆగక ఇదే వేద సత్యమని మోక్షమార్గమని, భ్రమన భ్రాంతిని కలుగజేశారు. ఇట్టి అవైదిక రూపాలయెడ భయభక్తులను. కలుగజేసి ప్రజాజీవనంలో చీకటి నింపారు. దిక్కు తోచని ప్రజలు బావిలో కప్పలవలె అనార్యుల మాటలనే మననంచేస్తూ నేటికి సూర్యోదయాన్ని (వేద సత్యజ్ఞానం) చూడలేకపోతున్నారు.

ఇంతేగాక వామ మార్గీయులు శివ ఉవాచ, భైరవీ ఉవాచ, పార్వతీ ఉవాచ అనే పేర్లతో గ్రంథాలు తయారుచేసి వాటికి ''తంత్రాలు'' అని నామకరణం చేశారు. అజ్ఞానంతో దిక్కుతోచని ప్రజలు వేద విరుద్ధ, అధర్మ మార్గ ఉపదేశాన్నిచేసే తంత్రాలే శ్రేష్ఠమైనవిగా తలంచసాగారు. అంతేగాక మద్యంసేవించినవాడే చక్రవర్తి,

రజస్వల స్త్రీతో సంగమిస్తే పుష్కర స్నానఫలం దక్కుతుంది, మాల, చాకలి స్త్రీలతో సంగమిస్తే కాశీయాత్ర చేసి మధుర క్షేత్రాన్ని దర్శించిన ఫలం కలుగుతుంది, మొదలైన వేద విరుద్ధ వ్యర్థ ప్రలాపాలను ప్రచారంచేశారు. వేదశాస్త్రిలు సామాన్య వేశ్యల వంటివి, అనే అక్రమ, మిధ్యా వాక్యాలతో స్వార్థపరులై ప్రజలను పెడత్రోవ పట్టించారు. వేద ధర్మానికి నష్టం వాటిల్లచేశారు. తల్లీ కూతురు అనే విచక్షణ అక్కరలేదు. కామాచారమే పరమ ధర్మమని అవైదిక పూజా పద్ధతులను ప్రవేశ పెట్టి ప్రజలలో వేద వైముఖ్యాన్ని పెంచి తమ వైపు తిప్పుకున్నారు.

ఇంతలో వారిలో వారు కీచులాడుకొని కొందరు వేరైనారు. అందులో ధనార్జనే ప్రధాన ఉద్దేశ్యంగా కలిగిన పోపులు జైనమతంలో చేరారు. బ్రాహ్మణేతరులను పోపులన్నారు. (స౦. ప్ర. 11న 361 పే) బ్రాహ్మణేతరులంటే అనార్యులే కదా! జైన మత ప్రవక్తలను తీర్థంకరులంటారు. ఈ తీర్థంకరులు అవతార పురుషులమని, వేదోద్ధారణ చేశామని, పాషాణాది మూర్తి పూజల ప్రచారం మొదలుపెట్టారు.

ఇది ఇట్లా ఉంటే నురోవైపు గౌతమబుద్ధుడు ప్రవక్తగా ఉన్న బౌద్ధమతంలో అనేక శాఖలు విస్తరిల్లాయి. ఈ బౌద్ధులు అనీశ్వర వాదాన్ని ప్రజలలో ప్రతిష్ఠించారు. ఆ సమయంలో శ్రీ శంకరాచార్యులవారు జైన బౌద్ధ మతాలను ఖండిస్తూ "బ్రహ్మసత్యం, జగత్తు మిధ్య, జీవబ్రహ్మము లొక్కటే'' అనే తత్వాన్ని ప్రజా జీవనంలో నిలిపారు. శ్రీ శంకరులు భారతావనిలో పర్యటించి నలుమూలల నాలుగు పీఠాలు నెలకొల్పారు. వీరు బాదరాయణ బ్రహ్మసూత్రాలకు సత్య వ్యాఖ్యానం చేద్దామనుకున్నారు. కాని శ్రీ శంకరుల మరణానంతరం ఆతని అనుయాయులు శంకరుల అభిప్రాయాన్ని తెలుసుకోలేక వారు స్థాపించిన పీఠాన్ని రక్షించుకోవటమే ముఖ్య లక్షణంగా పెట్టుకున్నారు. తత్ఫలితంగా శంకర వచనాల పేరుతో ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతాలనే పేర్లతో కొంగ్రొత్త మతాలు వెలిశాయి. ప్రజల అజ్ఞానం భ్రమ వల్లనే నేటికీ ఇట్టి మతాలు భారతావనిలో కొనసాగుతున్నాయి. (స. ప్ర. సం 63 పే).

తరువాత శైవ, వైష్ణవ మతాలు వచ్చాయి. ఈ రెండు మతాలలో కూడా శాఖోపశాఖలు విస్తరిల్లాయి. వామమర్గీయులు శైవంలో చేరారు. వీరు దేవి అనే శివుని

వహ్నిని ఆరాధించసాగారు. శైవులు మహాదేవున్ని ఆరాధించారు. వైరు "త్ర్యాయుషం జమదగ్నే" (య. 3-62) అనే యజుర్వేద మంత్రానికి అసత్యమైన అర్థాన్ని కల్పించి, ఈ మంత్రంద్వారా భస్మధారణ, త్రిపుండ ధరణ, రుద్రాక్ష ధారణను సాధించారు. (స. ప్ర. 394 పే)

"పవిత్రం తేవితతం బ్రహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః
అతప్త తదార్న్న తదామో అశ్నుతే శృతాస ఇద్వహన్తస్త త్సమాశత"
(ఋ.9-3-1)

"తపోష్పవిత్రం వితతం దివస్పతే2" (ఋ. 9-3-1)

అనే ఋగ్వేద మంత్రాలు ఎవరు పరమాత్మను పొందుతారో, పొందేందుకు అర్హులో తెలియజేస్తున్నాయి. శైవులకంటే ఎందులోనూ తీసిపోని వైష్ణవులు ఈ ఋగ్వేద మంత్రాలనుండి చక్రాంకిత ముద్రలను తయారు చేశారు. (స. ప్ర. 399 పే) ఇట్లా వేద విరుద్ధ భావాలతో శైవులు శైవ పురాణ గ్రంధాలను, వైష్ణవులు వైష్ణవపురాణ గ్రంధాలను తమ తమ శక్తిమేరకు వ్రాయటం మొదలు పెట్టారు. ఎవరికి వారు తమతమ ప్రత్యేకతలను నిలబెట్టుకొంటూ సత్యం, ధర్మం అనే పదాలనే మరచి పోయారు.

ఇట్టి పురాణాల ఆధారంగా శైవులు శరీరానికి రుద్రాక్షలు, భస్మధారణా చేయాలంటే, వైష్ణవుల శంఖ, చక్ర, గద పద్మాకారాలు ఉన్న ముద్రలను భుజాలపై ధరించాలన్నారు. శివుణి నిందించిన వాడి నాలుక కోసి ఉప్పుకారం పెట్టాలని వీర శైవులంటే, శంఖ చక్రాది వాతలు (చిహ్నాలు) శరీరం మీద లేకపోతే జీవుడు పరమాత్మను పొందలేదని వైష్ణవులు నిబంధించారు. ఇట్లా పరస్పరం సహనంలేని బోధలతో ఆవేశకావేశాలు ప్రజాజీవనంలో కల్పించారు. అజ్ఞానైక్యాన్ని పెంచారు. మౌఢ్యాన్ని స్థిరపరచారు.జైనులు ప్రారంభించిన మూర్తి పూజను శైవులు, వైష్ణవులు అనుసరించారు. అయితే ఈ పూజవిధానం తమతమ అభిరుచులకు అనుగుణంగా ఉండేట్లు, తమప్రత్యేకతను నిలుపుకునే విధంగా మూర్తులను సృష్టించుకొని ప్రజల ఆలోచనకు నిరోధం కల్పించి వేదజ్ఞానంపై అవగాహన లేకుండా చేశారు.

ఇట్లా వేదధర్మం ప్రజాజీవనంలో నష్టమైన నాటినుండి భారత దేశంలో ఉన్న సంబంధాన్ని అరబ్బులు ఇతరదేశాలు వదులుకున్నాయి. భారత యుద్ధానంతరం అనేక మతాలు పుట్టగొడుగుల్లా వెలిశాయి. వేద ఉద్దేశ్యాలపట్ల అవగాహనలేక తమకు తోచినట్లు పలికిన మాటల ఫలితమే క్రైస్తవ మతం. సత్య విరుద్ధమైన వాక్యాలు ఈ మత గ్రంధాలలో కుప్పలు తెప్పలుగా ఉన్నాయి. ఉదాహరణకు ఒకటి, రెంటిని గమనిద్దాం. సృష్టితత్వాన్ని గూర్చివేదం ఏమితెలిపిందో ఇంతకు ముందే తెలిపాను. ఈ విషయంలో క్రైస్తవుల మాటలు గమనిద్దాం మొట్ట "మొదట ఈశ్వరుడు భూమ్యాకాశలను సృష్టించాడు. మొదట భూమి ఎగుడు దిగుడుగా ఉండేది. దానిపై అంతా శూన్యంగా ఉండేది. ఏట్టి జీవులు కూడా ఉండేవికావు. ఈశ్వరుని ఆత్మ నీటిపై తేలియాడుతూ ఉండేది" (స. ప్ర. 640 పే) దేవుడు వెలుగు కమ్మని ఆజ్ఞ నియ్యగా వెలుగు కలిగెను. వెలుగు మంచిదైనట్లు దేవుడు చూచెను." (స. ప్ర. 642 పే) క్రైస్తవుల మతగ్రంథమైన బైబిలులోని (1 : 1..., 1 : 3-4) వాక్యాలివి. "సత్యం,జ్ఞానం అనంతం బ్రహ్మ" అని వేదాలు చెప్తుంటే వెలుగుమంచిదైనట్లు దేవుడు చూడటమేమిటి ? ఇట్లా వేదంలోని సత్యార్థాన్ని తెలుసుకోలేక పలికిన అసత్య వాక్యాలతో నిండి వున్నాయి ఈమత గ్రంధాలు.

ఏ ప్రాంతంలో మూసా (మోజస్) ఈసా (ఏసు) తమ ప్రచారాన్ని సాగించారో ఆ ప్రాంతంనుంచే 'ఖురాను' మతం కూడా ప్రచారంలోకి వచ్చింది. 'ఖురాను' అనే మత గ్రంథం మూసా ఈసాలను పైగంబరులని తెలిపింది. మహమ్మదుసాహెబ్ ఆఖరి పైగంబరుగా పేర్కొంది, (స. ప్ర. సం. 74) ఇంజీలు, బైబిల్ అనే క్రైస్తవ మతగ్రంథాలలో ఉన్నట్లే ఈ ఖురానులో కూడా వేదవిరుద్ధమైన అసత్య వాక్యాలు నిండుగా వున్నాయి "అల్లా మార్గమున మీతో పోట్లాడిన వారితో పోట్లాడాడు. మీరు వారు దొరికిన చోట నరికి వేయుడు 'కతల్' నఱికి వేయుటకంటే "కుఫ్ర్". పాపము పెద్దది. కుఫ్ర్ దూరమయి అల్లా మతము స్థిరపడు వరకు పోట్లాడుడు. మీ యెడవారు చేసినన్ని అత్యాచారములు మీరు వారియెడ చేయుడు. "(స. ప్ర. 786 పే) ఖురాన్ లోని ఈ వాక్యాలవల్ల అల్లా పక్షవాతం కలవాడుగా ఈర్షాద్వేషాలను పెంచేవాడుగా తెలుస్తున్నది. చివరి రెండు వాక్యాలు తమ మతం స్థిరపరుచుకునేందుకు అరాచకాన్ని

మార్గంగా బోధిస్తున్నాయి. వేదం సర్వజన సౌఖ్యాన్ని కోరుతుంటే వీరు ఈ విధమైన అజ్ఞానపు వ్రాతలతో ప్రజాజీవనాన్ని కలుషితం చేసారు.

ఇట్లా అనేక మతాల విభిన్న సిద్ధాంతాలు, ఉపదేశాల హోరులో ప్రజలు అజ్ఞానాంధకారంలో దిక్కుతోచక ఉన్న సమయాన 18వ శతాబ్దిలో శ్రీ దయానంద సరస్వతి ఏకేశ్వరవాదాన్ని ప్రతిపాదించారు. వేదావిహిత సత్యధర్మ పునరుద్ధరణకు నడుం కట్టారు. వీరు అన్ని మతాలను వాటి సిద్ధాంతాలను, ఆచార వ్యవహారాలను క్షుణ్ణంగా పరిశీలించి అందులో ఉన్న లోపాలను, సహేతుకంగా నిరసించారు. సహేతుకమైన, నీతిబద్ధమైన అధ్యాత్మిక, నైతిక ధర్మాలను బోధిస్తున్నది ఒక్క వైదిక ధర్మమేనని ప్రతిపాదించారు. ప్రజల అంతర్జీవన విధి నిర్ణేత, బహిర్జీవన. కర్మాధారం, ప్రపంచానికిపునాదీవేదమేనని చాటి చెప్పారు, వేదసంహితలు సుసంగతంగా ఏకేశ్వర వాదాన్ని ప్రతిపాదిస్తున్నాయని సిద్ధాంతీకరించారు. ఈ సిద్ధాంతం భౌతిక విజ్ఞానాగ్నిలో సంతప్త మౌతున్న పాశ్చాత్య దేశాలకు మత కట్టుడులకులో నై జీవచ్ఛవాలవలె ఉన్నప్రాచ్యదేశాలకు నవయుగ ప్రకీర్తి అవుతుందని ఆశించార.

భూగోళ మందంతట వ్యాపించి ఉన్న సమస్త విద్యలు, మతాలు ఆర్యావర్త దేశం నుంచే ప్రచారానికి వచ్చాయి. దీనికి ప్రమాణంగా సత్యార్థప్రకాశిక (359 పే) ఇట్లా తెలిపింది. ఫ్రాన్సు దేశంవాడైన జై కాలట్ అనే విద్వాంసుడు సమస్త విద్యలూ శుభాలకు నిధియైన ఈ ఆర్యావర్త దేశం నుంచే ప్రచారంలోనికి వచ్చాయిని చెప్పి 'ఓ పరమేశ్వరా! పూర్వకాలం ఆర్యావర్త దేశం ఎట్టి ఉన్నతస్థితియందున్నదో ఆ వున్నతస్థితి మాదేశానికి ప్రసాదించమని' "బైబిల్ ఇన్ ఇండియా" అనే గ్రంథంలో వ్రాశారు. దీనిని బట్టి వైదిక కాలం యొక్క గొప్పతనమే కాక వేదం సకల మానవులకు చెందినది అనే ఉన్నత భావం వెల్లడియౌతున్నది.

కాని వేదధర్మం నశించి అవైదిక కాలం వచ్చింది. మతాల అలజడిలో ప్రజలు తమఔన్నత్యాన్ని కోల్పోయారు. వర్తమానకాలంలో కూడా రాజకీయ దృష్టిననుసరించి, మనో వృత్తి భేదంతో కొద్ది మార్పులతో ఒకొక్కరు మతాన్ని అవలంభిస్తున్నారు. ఈ స్థితికి కారణం వేద ధర్మాన్ని వదలటంచేత మానవుడికి కలిగిన మతివికారభ్రమే అని చెప్పవచ్చును. ఆ భ్రమే మతంగా రూపుదిద్ద

కుంటున్నది. వర్తమాన కాలంలో మతానికి పార్టీ అనే పర్యాయపదాన్ని తగిలించి 'మతి వికారమే మతం' మతులెన్నో మతాలన్ని అనే నానుడులకు జీవం పోస్తున్నారు. వేద ధర్మాన్ని వదిలి పుట్టుకోనీతి పురుషుడికో సూక్తి వల్లించడం మూలాన్నే ఇన్ని మతాలు ఉప్పతిల్లాయి. ధర్మభ్రష్టత కలిగించి ప్రజలను ఉన్మాదుల్ని చేశాయి. "అంధగజన్యాయంగా" తమ ఉపదేశాలతో ప్రజలను ఉరుకులు పెట్టించి ప్రజా జీవనాన్ని (ధర్మజీవనాన్ని) పతనం చేశాయి. వేద విరుద్ధం, ధర్మవిరుద్ధం అయిన మతాల మత్తును వదిలించుకోవటం శ్రేయస్కరం, సత్యమార్గమని తెలుసుకోవటం విజ్ఞత.

ఇచట వైదిక, అవైదిక తత్త్వాలను గూర్చి సంక్షిప్తంగా తెలిపాను. ఇక వేంకటదాసు కీర్తనలలోని అవైదిక భక్తి తత్త్వాన్ని వివరిస్తాను.



రెండవ ప్రకరణం

# వేంకటదాసు కీర్తనలలో భక్తి

శ్రేష్ఠులు ఎట్లా వ్యవహరిస్తారో దాన్నినే ఇతర జనులు అనుకరిస్తారు. (భ.గ. 3 అ 21 శ్లో, బ్రహ్మజ్ఞాన సంపన్నులు సదాచారాల పట్ల ఏర్పాటు చేసిన ప్రమాణాలనే సామాన్య జనులు అవలంభిస్తారు, అని భావం. కాబట్టి శ్రేష్ఠులైన వారు తమ ఆచరణ విషయంలో బహుజాగరూకత కలిగి ఉంటారు. ఎందుకంటే వారు పెట్టిన వరవడే ముందుతరాలకు ఆదర్శ ప్రాయంగా ఉంటుంది. కనుక వారు శాస్త్ర విరుద్ధం కానిదై, సత్యబాహ్యం కానిది అయిన వేదప్రతిపాదిత ధర్మాన్నే నియమం తప్పక ఆచరిస్తారు. సత్యజ్ఞానాన్ని ముందు తరాలకు అందిస్తారు.

అవైదికమైన పురాణకాలం నుండి ఇట్టి శ్రేష్ఠులసాహచర్యం జన సామాన్యానికి ఎండ మావులలో దాహం తీర్చుకునే ప్రయత్నం లాగానే మిగిలి పోయింది. మొదటి ప్రకరణంలో వివరించిన విధంగా ఏర్పడిన విభిన్న మతాల ప్రచారాన్ని భుజాన వేసుకొని మోశాయి పురాణాలు. వేద విరుద్ధ ఉపదేశాలతో విశ్వశ్రేయస్సనే సాహిత్య ప్రయోజనాన్ని నష్టపరిచాయి. వసుధైక కుటుంబ సభ్యుడుగా మానవుడు నిర్మాణమైనప్పుడే విశ్వశ్రేయస్సు కలుగుతుందనే వేద భావాన్ని వక్రీకరించాయి. మతాలే మానవుణ్ణి ఉద్ధరిస్తాయని ప్రచారం చేశాయి.

ఎట్లాగంటే మానవులు ఆశ్రమధర్మాలకు జ్ఞాపకార్థంగా సంస్కారయుక్తమైన యజ్ఞోపవీతం ధరించాలని వేదధర్మం తెలుపుతుంటే తులసిపూసలు, రుద్రాక్షమాలలు,

త్రిపుండ్ర, ఊర్ధ్వపుండ్రాలు, లింగాలు, ముద్రలను ధరించేవాళని పురాణమతాలు ప్రవేశపెట్టాయి. బ్రతికున్న వృద్ధ మాతాపిత్రాదులను శ్రద్ధగా సేవించాలని వేద ధర్మం బోధిస్తుంటే చచ్చినవారికి చేయతగింది శ్రాద్ధామని పురాణమతాలు వక్ర భాష్యాన్ని బోధించాయి స్త్రీలకు వేదాధికారం ఉందని, పతిని సేవించటం, భగవద్భక్తి, ముక్తి మార్గాలని వేదధర్మం చెబుతుంటే స్త్రీకి వేదాధికారం లేదని, ఉపవాసాలు, పూజలు, వ్రతాలు, నదీతీర్థాలు. ముక్తిదాయకాలని పురాణమతాలు ప్రచారం చేశాయి. ఈశ్వరుడు అజన్ముడు, సర్వవ్యాపి, నిరాకారుడని వేదం తెలుపుతుంటే ఈశ్వరుడికి పుట్టుక, చావులతో పాటు భౌతిక సుఖ దుఃఖాలను అంటగట్టి అవి భగవంతుని లీలలని, భగవంతుడు సాకారుడేననీ పురాణమతాలు ప్రజలకు అజ్ఞానాన్ని పంచాయి. ఉత్తమ గుణయుక్తమైన జ్ఞానం వల్ల మోక్షం కలుగుతుందని వేదం ప్రతిపాదిస్తుంటే రామ, నారాయణ, గోవింద, శివాది నామోచ్చరణ మాత్రం చేతనే మోక్షం అబ్బుతుందని పురాణమతాలు చెప్పాయి.

అవైదిక కాలంలో ఇట్లా అసత్యజ్ఞానంతో పురాణాలు కొల్లలుగా వెలిశాయి. నేటికి భక్తులుగా, జ్ఞానులుగా చలామణిలో ఉన్న త్యాగయ్య, క్షేత్రయ్య, రామదాసు మొదలైనవారు, స్వామీజీలుగా గౌరవాన్ని అందుకుంటున్న వారందరు ఈ పురాణ జ్ఞాన ప్రభావానికి లోనై ఏదో ఒక మతానికి అంకితమై ఉన్నారు. సమకాలీన సామాన్య జ్ఞానాన్ని తమ ప్రభావానికి లోను జేసి తమ వెంట నడుపుకుంటూనే ఉన్నారు. వీరిలో కొందరు సత్యజ్ఞాన సంపన్నులైనా ఒకరిద్దరు తప్ప మిగిలిన వారంతా అవైదిక పద్ధతులనే ప్రజలకు బోధించి అనుసరింపజేస్తూనే ఉన్నారు. వైదికమైన సత్యజ్ఞానాన్ని వారు ప్రజలకు అందించక పోవటానికి గల కారణమేమో అర్థంకాని విషయమే. అందుకు పరిపూర్ణ సిద్ధిని సాధించి ఉండక పోవటమే కారణమై ఉంటుందని చెప్పుకోవచ్చు. ఈ వరుసలో పదునెనిమిదవ శతాబ్దికి చెందిన శ్రీరాకమచర్ల వేంకటదాసు ఒకరు వీరు అవైదికమైన భక్తి మార్గాన్ని ఎన్నుకుని తమకీర్తనల ద్వారా ప్రచారంచేశారు. ఈతడు సమకాలీనంలోని సామాన్యజనాన్ని తన ప్రభావంతో నడుపుకున్నాడు. ముందు అవైదిక భక్తి అంటే ఏమిటో, తెలుసుకొని తదుపరి ఈ భక్తి మార్గమే మోక్ష ప్రాప్తికి శ్రేష్ఠమైందని ఈతడు కంఠోక్తిగా చెప్పిన విధానాన్ని గమనిద్దాం. మతపరమైన భక్తి అవైదిక

మనిగ్రహించేందుకు ముందుగా వేదం ఈ విషయంలో ఏమి చెప్పిందో తెలుసు కుందాం.

సృష్టి ప్రారంభ కాలంలో పఠన పాఠన వ్యవస్థ లేదు. సర్వ సామర్థ్యంతో కూడియున్న ఆ పరమేశ్వరుని నుండి ఋక్, యజు, సామ, అధర్వ వేదాలు పుట్టాయి. (ఋ. భా. భూ. పే 8) ఈ నాలుగు వేదానికి పేర్లు. మనుష్య శరీరం నుండి శ్వాస బయటికి వచ్చి, తిరిగి శరీరంలో ఎట్లా ప్రవేశిస్తుందో అట్లాగే ఈశ్వరుడు సర్గారంభంలో ప్రపంచంలో వేదాలు ప్రకటించాడు. బీజంలో అంకురం ఉన్నట్లుగా ప్రళయకాలంలో కూడా వేదాలు నాశం లేకుండా పరమేశ్వర జ్ఞానంలో స్థిరంగా ఉంటాయి.

వేదమంటే జ్ఞానం దేనిని చదవటంవల్ల యదార్థ విద్యల విజ్ఞానం కలుగుతుందో అది వేదం. దేనిని చదవటంవల్ల విద్వాంసులౌతారో అది వేదం.'' (ఋ. భా. భూ. 34 పే) ఇట్టి వేదాధ్యయనం చేసిన తరువాతే మానవాళికి గ్రంథరచన చేసే సామర్థ్యం కలిగిఉంటుందని చెప్పవచ్చు. ఈ విషయాన్ని ఈశావాస్యోపనిషత్తు (8 మం) ఇట్లా తెలిపింది. "పరమేశ్వరుడు కల్పారంభంలో వేదం మూలాన, శబ్దార్థాలు, వానికి గల సంబంధం తెలుపు విద్యలను ఉపదేశింపకున్నచో లోకంలో మానవులెవరూ విద్వాంసులయ్యేవారు కారు'' ఈ వేదాన్ని అనుసరించే పాణిని, పతంజలి మొదలైన మహర్షులు వ్యాకరణం, నిరుక్తాది శాస్త్రాలను రచించారు. కాబట్టి వేదం సమస్త విద్యలకు మూలమని గ్రహించాలి.

చిన్న పిల్లలకు అవసరమైన అన్నపానాదులు సమకూర్చి, భాషణాది వ్యవహార సాంగత్యం లేకుండా చేస్తే వారు ఎన్నటికీ మాట్లాడకపోవటం గమనింపతగిన విషయం. అలాగే నిర్మానుష్యమైన అరణ్యంలో పెరిగిన మానవుడు వన్యపశు ప్రవృత్తితో పోలిఉంటాడు. సామాన్యంగా లోకంలో విద్వాంసుల నుండి అనేక విషయాలు గ్రహించిన తరువాతే విద్యాప్రాప్తి (జ్ఞానం) కలుగుతుంది. అలాగే సృష్ట్యారంభంలో జనించిన వేద విజ్ఞానం ఋషుల ద్వారా మనకు బోధపరచబడింది అనటానికి శతపథ బ్రాహ్మణం (కాం. 11 అం. 5 బ్రా. 2 కం. 3). శ్వేతాశ్వతరోపనిషత్తు (అ 9, శ్లో 18) లు ప్రమాణాలు.

ఇట్టి వేదంలో మతపరమైన సంకీర్తన, అర్చనాదులతో కూడుకొని ఉన్న "భక్తి" విషయ ప్రసక్తి లేదు. మతపరమైన భక్తిని ఆచరిస్తే ముక్తి రాదు. ముక్తిని పొందే విధానమేమిటో వేదం ఇట్లా తెలిపింది "బ్రహ్మాండంలో ఉన్న సమస్త పదార్థాలు నా జ్ఞానమందే ఉన్నాయి. యోగ విద్యను ఎరుగనివాడు వానిని తెలుసుకో లేడు. నన్ను ఉపాసించందే ఎవరూ యోగులు కాజాలరు. యోగాంగాలతో చిత్తాది అంతఃకరణ వృత్తులను నిరోధించాలి. అవిద్యాది దోషాలను నివారించాలి. ఎవరి కైనా పరమేశ్వరుని తెలుసుకోవాలనే కోరిక ఉంటే వారు యోగాభ్యాసం చేస్తే, తమ ఆత్మ యందు చూడగలుగుతారు" (య. బా. అ. 7, మం 4, 5, 42). ఈ విష యాన్ని ఋగ్వేగాది భాష్యభూమిక (180, 178, 176 పే) ఇట్లా తెలిపింది. వేద విద్యలోను, పరమేశ్వర జ్ఞానంతో కూడిన మానవులు తమ జ్ఞానాన్ని పెంచుకోవాలి. బ్రహ్మం నిర్గుణం. పురుషార్థం, సత్యవిద్య, ధర్మాచరణం అనే శుభగుణాలను మాన వులు ఆచరించాలి. జీవించినంతకాలం సర్వోపకారకాలైన సత్యకర్మలను సాధించ టానికి పురుషార్థ సాధన చేయాలి. సత్యభావంతో పురుషార్థమొనరించి ధర్మం ఆచ రించేవాడిని, ఈశ్వరుడు కృపతో చూస్తాడు. సర్వసుఖాలను ప్రాప్తింపచేసే ధర్మ ప్రవృత్తి గలగటానికి మానవులు పరమేశ్వరుని వేదోక్త రీతిలోనే ఉపాసించాలి. ఈ ప్రమాణ వాక్యాలు పరమేశ్వరుని తెలుసుకునేందుకు, ముక్తిని పొందేందుకు యోగవిద్య ఆవశ్యకమని, వేదం తెలిపిన ధర్మాన్ని ఆచరించాలని తెలుపుతున్నాయి.

## వేదవిషయం

వేదం సమస్త విషయాలను గురించి తెలిపింది. ముఖ్యంగా ఆ విషయాలను నాలుగు విధాలుగా విభజింపవచ్చు. అందు మొదటిది యదార్థ జ్ఞానం. రెండవది కర్మ, మూడవది ఉపాసన, నాల్గవది సత్యజ్ఞానం. (ఋ. భా. భూ. 75 పే) ఈ నాలుగు విభాగాలను కాండలని వ్యవహరిస్తారు.

## 1. యదార్థ విజ్ఞానం :

పరమేశ్వరునిచే రచింపబడిన సమస్త పదార్థాలను, వాటి గుణస్వభావాలను సత్యజ్ఞానంతో అవగాహన చేసికోవటం, కర్మ, ఉపాసన, జ్ఞానములను సక్రమంగా

పిన్రయోగించుకొని తగిన విధంగా ఫలితాన్ని పొందటం విజ్ఞానం. వేదా, పరా, అపర అనే రెండు విద్యలను తెలపింది. సర్వవ్యాపకుడైన, సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుని యదార్థజ్ఞానం తెలిపేది పరవిద్య. గడ్డిపోచ మొదలుకొని ప్రకృతి వరకున్న పదార్థాల గుణదోషాలను తెలుసుకుని, వాటిని ఉపయోగించుకునే తీరు తెన్నులు తెలిపేది అపరవిద్య. ఈ రెంటిలో పరవిద్యే ఉత్తమమైంది. ఈవిషయాన్ని ముండకోపనిషత్తు ఇట్లా తెలిపింది. (ము ఉ. 1.1.6) పరావిద్యవల్ల తెలియబడే పరతత్త్వం జ్ఞాన, కర్మేంద్రియాలకు అందనిది. జ్ఞానేంద్రియాలు కర్మేంద్రియాల ద్వారా గ్రహింపబడే శబ్దరూప రసగంధాది గుణాలుగాని, స్థౌల్యాది గుణాలుగాని ఈ పరతత్త్వానికిలేవు. హస్తపాదాది అవయవాలేవియులేని ఈ పరతత్త్వం విశ్వమంతటి పదార్థాలన్నింటికి మూలమై "భూతయోని" అనబడుతున్నది. ఋగాది వేదాలు వర్ణించిన ఇట్టి పరతత్త్వాన్ని పొందేందుకు ముముక్షువులు ఇంద్రియ నిగ్రహాది తపస్సులాచరిస్తారు. యావజ్జీవ బ్రహ్మచర్యాది మహావ్రతాలు చేస్తారు. (కఠ. ఉ. 2-5) ఈ ప్రమాణాలను బట్టి పరవిద్యయే శ్రేష్ఠమని, ఆ పరవిద్యవల్ల తెలియబడే పరతత్త్వాన్ని పొందేందుకు తపశ్చర్యాద్యనుష్ఠానం ముఖ్యమని అవగతం అవుతున్నది. భగవంతుడు నిర్గుణుడని స్పష్టమైంది. పరతత్త్వానికి కరచరణాద్యవయాలు కల్పించి భక్తితో ఈ తత్త్వాన్ని తెలుసుకుంటామనటం అజ్ఞానం, అవైదికమని తేటపడుతున్నది.

## 2. కర్మ :

వేదం ప్రతిపాదించిన విషయంలో ఇది రెండవది. ఈ కర్మ రెండు విధాలుగా ఉంది. ఒకటి పరమార్థ మార్గం. రెండవది లోకవ్యవహారసిద్ధికి ఉపయోగించే మార్గం. ఈ మార్గాలను ఋగ్వేదాది భాష్య ఇట్లా వివరించింది. (ఋ. భా. భూ 31, 82 పే) పరమార్థ మార్గమంటే "పరమేశ్వరుని సర్వశక్తి మత్త్వాది గుణాలను కీర్తించటం, ఉపదేశించటం, శ్రవణం చేయటం (ప్రార్థన) ఈశ్వర సహాయాన్ని అర్థించటం ఈశ్వర స్వరూపాన్ని (తత్త్వాన్ని) తెలుసుకునే అందు నిమగ్న మవటం, (ఉపాసన) ఈశ్వరోపదిష్ట ధర్మ స్వరూపాన్ని తెలిసికుని సత్యోపాసన జేయటం." కర్మకాండలో ప్రధానమైన ఈ మార్గాన్ని అనుసరించిన

మానవునికి మోక్షప్రాప్తి కలుగుతుంది. రెండవదియైన లోకవ్యవహారసిద్ధి, మానవుడు ధర్మయుక్తమైన పురుషార్థసిద్ధిని పొందటానికి తోడ్పడుతుంది. మానవుడి కేవల పరమేశ్వర ప్రాప్తి కొరకే ధర్మయుక్తకార్యములను ఆచరించినట్లైతే వానిని నిష్కామ మార్గమంటారు. అట్లాకాకుండా సాంసారిక సుఖాలను కోరినట్లైతే దానిని సకామ మార్గమంటారు, ఈ రెంటిలో నిష్కామ కర్మ మార్గం శ్రేష్ఠమైంది. సకామ కర్మ ననుసరించిన మానవుడు జనన మరణాది కర్మల నుంచి ముక్తిని పొందలేడు.

దీనిని బట్టి ఈశ్వరప్రార్థన, ఉపాసనలతో నిష్కామమార్గ గామియైన వానికే ముక్తి లభిస్తుంది. అన్యుడికి లభించదని తెలుస్తున్నది. అట్టియెడ సంసారలంపటులై, పుక్కిటి పురాణాల అసత్య ప్రమాణాలతో వేదము తెలిపిన కర్మకాండయందలి ప్రార్థన, ఉపాసనాదుల్ని అవగతం చేసుకోలేక నవవిధ భక్తుల్ని, ఏకాదశవిధ భక్తుల్ని ప్రతిపాదించుకుని ఏకాగ్రతను చీలికలు చేస్తున్న భక్తిమోక్ష సాధకమనటం, అవైదికమౌతుంది. సకామ మార్గగాములే జనన మరణాది కర్మలనుండి ముక్తులు కాలేరని పైన తెలుపబడింది. భక్తిసకామయుక్తమైంది కాబట్టే భక్తులు, బాబాలు, స్వాములు, పునర్జన్మ పొందారు, పొందుతారు అనే వ్యవహారం లోకంలో వ్యాప్తి నెందింది.

## 3. ఉపాసన :

వేదం చెప్పిన మూడవ కాండం ఉపాసనావిషయం. ఉపాసన అంటే పరమేశ్వరుని సమీపస్థము అని అర్థం. ఈ ఉపాసన ముక్తికి ఉత్తమ సాధనమని ఋగ్వేదం (1-1-11-1) తెలుపుతున్నది. దీనిని ఉపాసనాయోగమంటారు. ''పరమేశ్వరుని సృష్టిలో ఉపసనాయోగమొనర్చి తన ఆత్మశుద్ధి చేసుకోవాలి. శుద్ధ మనసుతో ప్రకాశమనెడి పరమేశ్వరానందాన్ని పొందాలి'' (య. అ. 11 మం, 2) చిత్తవృత్తులను నిరోధించాలి (యో. ద. సా. పా. 2 సూ). యోగసిద్ధిని పొందిన వానిని యోగి అంటారు. "బ్రహ్మజ్ఞానం పొందేందుకు యోగి తన మనస్సును మొదట పరమేశరునందు లగ్నం చేయాలి. అట్లా లగ్నం చేసిన యోగి యొక్క బుద్ధిని కృపతో పరమేశ్వరుడు తనయందు లగ్నం చేసుకుంటాడు. యోగి పరమేశ్వరుని కృపను అంటే ప్రకాశాన్ని పరమేశ్వరునిదిగా నిశ్చయించి తనలో పరమాత్మను ధరిస్తాడు. పృథివిలో యోగిలక్షణమిదే" (య. అ. 11-1)

ఉపాసనా యోగం ఎనిమిది అంగాలను కలిగిఉంది. వీటిని అనుష్ఠాన చేసినట్లయితే అవిద్యాక్లేశం క్షీణిస్తుంది. జ్ఞాన ప్రకాశం వర్ధిల్లుతుంది. తద్వారా జీవుడు మోక్షాన్ని పొందుగాడు. ఉపాసనాయోగం కలిగియున్న ఎనిమిది అంగాలను ఇట తెలియజేస్తాను. యోగదర్శనం యోగాంగాలను ఇట్లా తెలిపింది. (యో.ద 29 సూ) యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి అనేవి ఎనిమిది యోగాంగాలు. అహింస, సత్యం, అస్తేయం (దొంగతనం చేయకుండుట), బ్రహ్మచర్యం, అపరిగ్రహం (విషయాల యెడ అభిమాన దోషం లేకుండుట), అనే ఈ ఐదు యమములు "మనస్సుతోపాటు ఇంద్రియాలను విషయాల నుండి యమింప. ఉపరమింపచేస్తాయి; కాబట్టి ఇవి యమములని పిలువబడతాయి. (యో. ద 30) ఈ ఐదు యమాలను ఆచరించి నట్లయితే ఉపాసనా యోగ బీజం నాటబడుతుంది. (ఋ. భా. భూ. 308 పే)

శౌచము, సంతోషం, తపస్సు స్వాధ్యాయం (అధ్యయన - అధ్యాపనం) ఈశ్వర ప్రణి ధానం అంటే "సర్వ సామర్థ్యం, సర్వగుణాలను, ప్రాణాలను, ఆత్మను, మనస్సును మొదలైనవాటి నన్నింటిని ప్రేమ భావంతో ఈశ్వరుని కర్పించటం (ఋ. భా. భూ. 310 పే) అనే ఈ ఐదింటిని నియమాలు అంటారు. ఈ నియమాలలో శౌచము అంటే శుద్ధి లేక పవిత్రత అని యర్థం. ఈ పవిత్రత రెండు విధాలుగా ఉంది. మొదటిది అభ్యంతర శుద్ధి, ధర్మాచరణం, సత్యభాషణం, విద్యాభ్యాసం, సత్సంగం, మైత్రి, కరుణ మొదలైన శుభలక్షణాల ద్వారా రాగద్వేషాదులను విడనాడి చిత్తము నిర్మలంగా ఉంచుకోవటం అభ్యంతర శుద్ధి. రెండవది యైన బాహ్య శుద్ధి. అంటే మృత్తిక, జలము మొదలైన వాటితో శరీరాన్ని, సాత్వికాహారాదులను తీసుకోవటంతో ఉదరాన్ని శుద్ధిగావించుకోవటం. సత్యధర్మానుష్ఠానంతో ప్రసన్నుడై యుండటం సంతోషం అనబడుతుంది. సుగుణాలతో ఆత్మను, మనస్సును నిర్మలం చేసికోవటం తపస్సు. వేదశాస్త్రాలను చదవటం, చదివించటం, ఓంకార నిరూపణతో ఈశ్వరుని నిశ్చయించటం స్వాధ్యాయం, ఈ నియమానుష్ఠానంవల్ల అంతఃకరణ శుద్ధి కలుగుతుంది. మనసు నిర్మలమై ఏకాగ్రత కుదురుతుంది. తద్వారా ఇంద్రియాలను జయించే శక్తి కలుగుతుంది. ఆత్మ సాక్షాత్కార యోగ్యత లభిస్తుంది. సమాధి స్థితిని సులభంగా పొందే వీలు కలుగుతుంది.

ఉపాసనా సమయంలో దర్భలు- మృగచర్మం పరచుకొంటారు. దానినే ఆసనమంటారు. నిశ్చలమైన సుఖాన్ని కలిగించేది ఆసనం అని యోగదర్శనం తెలిపింది. (యో. ద. సా. పా. 46 సూ) కూర్చుండే స్థితిని కూడ ఆసనమంటారు. (ఋ. భా. భూ. 315 పే) ఉపాసకుడు పద్మాసనాది ఆసనాలలో ఇచ్ఛానుకూల ఆసనంతో కూర్చుండి ఉపాసన కుద్యమించాలి. ఆసనంలో దృఢత యేర్పడగానే ఏకాగ్రత కుదురుతుంది (యో. ద. సా. పా. 48 స)

ఆసన సిద్ధి కలిగినమీదట ఉచ్ఛ్వాస నిశ్వాసల యొక్క స్వాభావిక గతి నిరోధము ప్రాణాయామము. ఇది రేచకము, పూరకము, కుంభకము, కేవల కుంభకము అని నాలుగు విధాలుగా వుంది. "లోపలి వాయువును బయటికి తీసి అచటనే స్తంభింపచేయటం రేచకము. దీనినే బాహ్యావృత్తి ప్రాణాయామంటారు. బాహ్యవాయువును లోనికి తీసుకొని అచట స్తంభింపచేయటం పూరకం. దీనిని అభ్యంతర వృత్తి అంటారు. లోపలి వాయువు బయటికి కాని, బయటి వాయువు లోపలికి కాని పోకుండా ఎచటి వాయువు నచటనే నిలుపుచేయటం కుంభక ప్రాణాయామం. దీనినే స్తంభవృత్తి ప్రాణాయామమంటారు. కుండలోని నీరు కదలనట్లు కదలిక ఉండదు కాబట్టి కుంభకం. ప్రాణాయామ అభ్యాసంవల్ల సాధకుడు చిత్తనైర్మల్యాన్ని, ఉపాసనతో స్థిరత్వాన్ని పొందుతాడు. బ్రహ్మజ్ఞాన యోగ్యతా శక్తి అజ్ఞాన విచ్ఛేదమై జ్ఞాన ప్రకాశం కలుగుతుంది. (యో. ద. 50 నుండి 52)

మనస్సును జయించిన ఉపాసకుడు పరమేశ్వర స్మరణ తప్ప అన్య విషయ ప్రసక్తుడు కాడు. అట్టి ఉపాసకుడు మనస్సును. ఇంద్రియాలను శాసించే శక్తిని కలిగిఉంటాడు. ఆ శక్తినే ప్రత్యాహారమంటారు. (యో. ద సా. పా. 55 సూ)

పై అయిదు ఉపాసన యోగాంగాలు సిద్ధించిన మీదట ఉపాసకుని మనశ్చాంచల్యం పోయి, నాభి, హృదయ, నాశిక, జిహ్వాగ్రాది భాగాలలో ఓంకారనామక పరమేశ్వర ధ్యాస స్థిరంగా ఉంటుంది. ఈ స్థితినే "ధారణ" అంటారు. "బాహ్య విషయాలను విడిచి తత్త్వమున కభిముఖమైన చిత్తము యొక్క నాభి చక్రాది స్థానములలో వృత్తి రూపమున నేర్పడు సంబంధము ధారణ" (యో. ద. 1 సూ)

ధారణాభ్యాసంవల్ల అయా ప్రదేశాలలో మనస్సును నిలిపి నాభి చక్రాదులలో అంతర్యామి: వ్యాపకుడగు పరమేశ్వరుని ధ్యానం చేయటం. "చిత్తశుద్ధికి విషయ మైన ధ్యేయ వస్తువునందు కలుగు జ్ఞాన ప్రవాహం ధ్యాన మనబడుతుంది" (యో. ద. వి.పా. 2 సూ.)

పై యేడు ఉపాసన యోగాంగాలు సాధనచేసి, ఫలితాన్ని పొందిన మీదట లోహం అగ్నిలో తపింపబడి అగ్ని రూపాన్ని పొందిన విధంగా ఎనిమిదవ అంగ మైన 'సమాధి' సిద్ధిస్తుంది. పరమేశ్వర జ్ఞానంతో శరీరాన్ని మరచి ప్రకాశరూప మైన ఆనందంతో ఉపాసకుడు తన ఆత్మను పరిపూర్ణం చేసుకుంటాడు. ఈ సమా ధిలో ధ్యాత, ధ్యానం, ధ్యేయం అనే మూడును ఒకటిగానే బోధపడుతుంది. నీటిలో మునిగిన మానవుడు పైకి తేలినట్లుగా జీవాత్మ, పరమాత్మ యందు నిమగ్నమై మరలా వేరుపడుతూ ఉంటాడు (యో. ద. 3 సూ)

ధారణ, ధ్యాన, సమాధి ఫలితాలను కలిపి సంయమము అంటారు [యో. ద. 4 సూ] మనస్సు, నాభి ఆదిగాగల ప్రదేశాలలో ఎచట ధారణ చేయబడింటో అచ టనే ధ్యానము, సమాధి, ధ్యేయవస్తువునైన పరమేశ్వరుని యందు నిమగ్నమవటం సంయమము [ఋ. భా. భూ. 320 పే].

జ్ఞానం :

దేనిచేత ఉన్నది ఉన్నట్లు తెలియనగునో అది జ్ఞానం. "దర్శనం జ్ఞానమితి" (భ.గీ. 13.11 "య ఇత్తద్విదుస్తే అమృతత్త్వమా నశుః (ఋ. 1-16)" తమేవ విదిత్వా 2 తిమృత్యుమేతి " (య. 31.13) జ్ఞానాన్ముక్తిః (సాం.ఖ్యా. ద. 3.23) "తత్వ జ్ఞానాన్నిః శ్రేయసమ్" (వై.ద. 1.1.4) మొదలైన ప్రమాణ వచనాలు బ్రహ్మజ్ఞానం మోక్షసాధనమని తెలుపుతున్నాయి.

ఉపాసన యోగానుష్ఠానం వల్ల సత్యజ్ఞానాన్ని పొందిన జీవుడికి మిధ్యాజ్ఞానం, అవిద్య తొలిగిపోతాయి. అప్పుడు జీవుడిలో రాగద్వేషాలుండవు. జీవుడు ప్రవృత్తి, అధర్మం, అన్యాయం, విషయాసక్తి మొదలైన వాసనలకు దూరమౌతాడు. ప్రవృత్తి

లేనపుడు దానివల్ల సంభవించే జన్మ ఉండదు. జన్మలేకపోతే దుఃఖాభావాన్ని పొందిన జీవుడు పరమానందాన్ని పొందుతాడు. పరమాత్మతో కూడిపొందే ఈ ఆనందమే మోక్షము (న్యా. ద. 1-1-2, 21,22)

బ్రహ్మజ్ఞాన సాధనకు మొదటి సాధనం యజ్ఞయాగాదులు. రెండవది శమద మాది షట్కసంపత్తి, మూడవ సాధనం శ్రవణ మనన నిదిధ్యాస, సాక్షాత్కార ములనబడే శ్రవణ చతుష్టయము (వే.ద. 4-1) జ్ఞానం కలిగే వరకు ఈ మూడు సాధనాలను అనుష్ఠించాలి. జ్ఞానియైన తరువాత శ్రవణ మననాదులను యధాకామంగా అనుష్ఠింపవచ్చు. ఈ స్థితిలో జ్ఞానికి విధి నిషేధాలుండవు. ఈ విషయాన్నే బృహ దారణ్యకం (4-4-23) ఇట్లాతెలిపింది 'బ్రహ్మజ్ఞాని మహిమ కర్మవల్ల ఎక్కువకాదు. తక్కువకాదు. మానవుడు ఆ మహిమా స్వరూపాన్ని తెలుసుకోటానికి యత్నించాలి. ఈ మహిమను తెలుసుకొన్న బ్రహ్మజ్ఞాని యోగి తాడు. బ్రహ్మజ్ఞానికి పాపకర్మ లంటవు. అంటే విహిత, నిషిద్ధ కర్మలను ఆచరించటంలో అతడు స్వతంత్రుడని భావం. ఇట్లా బ్రహ్మజ్ఞాని స్వతంత్రుడైనా లోక సంగ్రహార్థం విహిత కర్మలనే ఆచరిస్తుంటాడు నిషిద్ధ కర్మలను పరిహరిస్తాడు. (ము. ఉ కా. 1-4).

నిదిధ్యాస :

బ్రహ్మజ్ఞాన రూప సాక్షాత్కారానికి నిదిధ్యాస మిక్కిలి 'ఉపయుక్త సాధనం' శాస్త్రం అనేక పర్యాయాలు ఉపదేశించినందువల్ల జ్ఞాన సాధనాలతో ముఖ్యమైన నిదిధ్యాస జ్ఞాన ప్రాప్తి కలిగే దాకా నిరంతరం అభ్యసించాలి" (వే.ద. 4-1-1) బ్రహ్మసాక్షాత్కారం మానవ జీవన లక్ష్యం. కాబట్టి శ్రవణ మనన నిదిధ్యాసలనే సాధనాలతో అది పొందాలి. (అ. బృ. 4.5.6) నిదిధ్యాసకుని విషయం పరమేశ్వ రుడని వేదాలు ఉపనిషత్తులు తెలుపుతున్నాయి. 'వేదాభ్యాసం, ధర్మాచరణం, యోగానుష్ఠానం మూలాన చేతనాచేతన పదార్థాల స్వరూపాన్ని తెలిసికొని ఉపాసకుడు బ్రహ్మమునందు ప్రవిష్టుడై, ఆనందాన్ని అనుభవిస్తాడు. (య. 32-11) సర్వవ్యాపక పరమాత్మను 'ఓం' అని ధ్యానింపుమని ముండకోపనిషత్తు చెప్తున్నది, (2-2-6)

సమాధి స్థితి యేర్పడే దాకా ధ్యానించటం నిది ధ్యాస అనబడుతుంది. బ్రహ్మ సాక్షాత్కారానికి ఉపాసకుడు ఆసన బద్ధుడై నిత్యం ధ్యానం చేయాలి. నిలుచుండియే,

వరుండియే కాక స్థిర పద్మాసనస్థుడై చేయాలి. ఉపాసకుడు చిత్తానికి ఎక్కడ ఏకాగ్రత లభిస్తుందో తదనుకూల ప్రదేశంలోనే ధ్యానం చేయాలి. ఇట్లా ధ్యానాన్ని ఉపాసకుడు మరణ పర్యంతం చేస్తూనే ఉండాలి.

బ్రహ్మసాక్షాత్కారం పొందిన ఉపాసకుడు పూర్వోత్తర కర్మలతో సంబంధం లేని వాడౌతాడు. ప్రారబ్ధ కర్మల ఫలము అనుభవించిన తరువాత దేహంనుండి విముక్తుడై నిరాటంకంగా ఆనందానుభవాన్ని పొందుతాడు. ఈ విషయాన్నే ముండకోపనిషత్తు (2.2 8) తెలిపింది. "సర్వాంతర్యామియైన పరబ్రహ్మ సాక్షాత్కారం పొందిన ఉపాసకునికి కర్మలన్నీ క్షీణిస్తాయి.

అట్లైతే కర్మలన్నీ క్షీణించిన బ్రహ్మజ్ఞాన అగ్నిహోత్రాది కర్మల చేయటం ఎందుకు ? అనే సంశయానికి వేదాంత దర్శనం (4.1.15.16) సమాధానాన్ని చెప్పింది. "అగ్నిహోత్రం వేదాధ్యయనం, సంధ్యోపాసనాది నిత్యకర్మలు ఆయా ఆశ్రమాలలో కర్తవ్యంగా విధింపబడ్డాయి. విజ్ఞానోత్పత్తి కోసమే చేయబడుతున్నాయి. కాబట్టి వాటి ఫలం నశించదు. అంతేగాక వీటి అనుష్ఠానం వల్ల చిత్తశుద్ధి కలిగి జ్ఞానప్రాప్తికి సహకారులౌతాయి."

ముక్తి :

"ప్రకృతి పురుషుల వివేక జ్ఞానంవల్ల ఆధ్యాత్మిక అధిభౌతిక అధిదైవికము లనబడే త్రివిధ దుఃఖాలనుండి విముక్తి కలుగుతుంది. (సా. ద. 3.23) త్రివిధ దుఃఖాలు పూర్తిగా నశించటమే నిశ్శ్రేయసం లేక విముక్తి (వై. ద. 3 పే). ఇట్టి యదార్థ జ్ఞానం వల్ల జీవుడికి అవిద్య నశిస్తుంది. రాగద్వేషాలుపోతాయి. విషయవాసనలు నశించి జన్మరాహిత్యం కలుగుతుంది. ఆ స్థితిలో జీవుడు పరమానందప్రదుడైన పరమాత్మతోకూడి ఆనందానుభవాన్ని పొందుతాడు. మనుధర్మశాస్త్రం (4-14) ప్రకారం మోక్షాపేక్షకులై ధర్మాన్ని తెలుసుకొనే కోరిక ఉన్న మానవులకు వేదమే పరమ ప్రమాణం. అందువల్ల వేదంలో ఉపదేశింపబడిన కర్మలనే ఆచరించాలి. అంటే వేదవిరుద్ధమైన అవైదిక కర్మలను పరిహరించి అది ప్రసాదించిన వైదిక కర్మలనే మోక్షకాముకులు అనుష్ఠించాలి అని భావం. శతపథ బ్రాహ్మణం పదునాల్గవ కాండములో ఈముక్తి విషయం విపులంగా వివరింపబడింది.

సృష్టికర్త, సర్వవ్యాపకుడు, నిర్గుణుడు, నిరాకారుడైన పరబ్రహ్మోపాసనను మిడిమిడిజ్ఞానంతో వైదికశబ్దాలను విపరీత వ్యాఖ్యానాలు చేసి మతోన్మాదులు కొందరు తమ స్వార్థ చింతనతో సమాజాన్ని తప్పుత్రోవ పట్టించారు.

"వైదికశబ్దాలు-వక్రభాష్యాలు" అనే వ్యాసంలో వై. శ్రీనివాసరావు గారి మాటలు ఈ సందర్భంలో గమనింపతగి ఉన్నాయి పరిశీలించండి. "వైదిక శబ్దాలు నిగూఢమైనవి. మనం నేడు ఉపయోగించే లౌకిక సంస్కృతంలోని పదాలతో వైదిక శబ్దాలను వివరించ బూను కోవటం సమంజసంకాదు.........పాశ్చాత్యులలో గ్రిఫిథ్, కీత్ వంటివారు వైదిక సాహిత్యాన్ని భ్రష్టం చేయాలనే దురుద్దేశ్యంతోనే వేదాలకు అనేక కల్పనలు జోడించి వేదాలు పసుల కాపర్ల గేయాలనే వాదానికి నాంది పల్కారు. భారతీయ సంస్కృతిపై అపార శ్రద్ధాసక్తులు కలవాడుగా భావించబడుతోన్న 'మాక్స్‌ముల్లర్' సైతం తనవేదభాష్య అనువాదంలో చాలా చోట్ల మూలానికి వ్యతిరేకంగా వ్రాశాడు. ఉదాహరణకు "యుంజన్తి బ్రధ్నమరుషం చరంతం పరిత స్థుషః రోచన్తే రోచనాదితి" అనే ఋగ్మంత్రంలోని 'బ్రధ్నం' అనే పదానికి (ఋ. 1-6-1) ఆచార్యసాయణులు "సూర్యుడ"ని అర్థం చెప్పగా మాక్స్‌ముల్లర్ "గుఱ్ఱము"ని భాష్యం వ్రాశాడు... ....భారతీయ సంస్కృతిని వక్రంగా చిత్రించుటకు మాత్రమే తను వేద భాష్యం చేసినట్లుగా మాక్స్‌ముల్లర్ తన లేఖల్లో ప్రకటించుకున్నాడు" (సాధన, జులై, ఆగష్టు 1986, సం 19. సం 7,8)

వైదికంగా అగ్ని, వాయువు, చంద్రుడు మొదలైన శబ్దాలకు క్రమంగా ప్రపంచానికి ప్రాణం వంటివాడు, జీవితాన్ని ఇచ్చేవాడు, ఆనందాన్ని ఇచ్చేవాడు అని యజుర్వేదం (32-1) అర్థం చెప్తుంటే దానిని విస్మరించి అజ్ఞానంతో నిప్పు, గాలి, సూర్యుడు మొదలైన రూఢ్యర్థాలను ప్రచారం చేయటం చేతనే బహుదేవతా వాదం పునాదులను ఏర్పర్చుకుంది. "ఏకం సద్విప్రాబహుధావదన్తి" అనే ఋగ్వేద మంత్రం దేవుడు ఒక్కడే నామములనేకాలు అని తెలుపుతుంటే ఇందులోని రెండవ భాగాన్ని మాత్రమే గ్రహించి సత్యజ్ఞానం విడనాడి విష్ణువు, రాముడు, కృష్ణుడు మొదలైన నామాలకు రూఢ్యర్థాలను ఏర్పాటు చేసుకుని బహుదేవతావాదానికి గోడలు నిర్మించి, నిర్గుణ, నిరాకార పరబ్రహ్మకు మూర్తిమత్వాన్ని అంటగట్టి విగ్రహారాధనను అనేకప్పు వేశారు. అంతటితో ఆగక నామ భేదాలతోపాటు విభిన్న

సాంప్రదాయాలను ఏర్పాటు చేసుకున్నారు. ఇట్లా అనేక మతసాంప్రదాయాల అలల తాకిడికి దిక్కుతోచక భక్తిమార్గమనే ప్రవాహంలో జనులు కొట్టుక పోతూనే ఉన్నారు. భిన్నమతాల వారు తమతమ సాంప్రదాయాల ఉన్నతిని చాటుకోవడానికి పరస్పరం కలహించుకుంటూ శత్రువులవుతున్నారు. ఇట్టి మతాలు ప్రతిపాదించిన భక్తిమార్గం అభ్యుదయనిరోధకమై, అవైదికమై కనిపిస్తుంది.

## సంవాద కీర్తనలు

రాకమచర్ల వేంకటదాసుగారిది అవైదిక భక్తిమార్గం. ఈభక్తి మార్గమే గొప్పది అన్న వేంకటదాసుకు జ్ఞానమార్గమే శ్రేష్ఠమైంది అనే నరసింహయోగికి మధ్య సంవాదం జరిగిందట. పెద్ద ఉమ్మెంతాలలో హనుమాన్ల విగ్రహం దగ్గర ఉన్న (పూర్వం) ఏటి ఒడ్డున ఈ సంవాదం జరిగింది. ఏటికి అవల ఒడ్డున నృసింహయోగి, ఈవలి ఒడ్డున వేంకటదాసు నిలచి ఉండి సంవాదం చేశారట. భక్తి, జ్ఞానమార్గాల అధిక్యతను గూర్చిన ఈ వాదోపవాదాలు పదకొండు రోజుల పాటు సాగాయట. ప్రతిరోజూ ఉదయం జ్ఞానమార్గ అధిక్యతను చెప్తూ ఒక కీర్తనను ఈవలి ఒడ్డున ఉన్న దాసుగారికి పంపేవారట. దానికి సమాధానంగా భక్తిమార్గ అధిక్యతను తెలుపుతూ దాసుగారుమరియుక కీర్తనను సాయం సమయం వరకు నృసింహయోగికి పంపేవారట. ఇట్లా వీరిరువురి మధ్య సంవాదం కీర్తనల రూపకంగా జరిగిందట. అందువల్లనే కాబోలు వీరిరువురి కీర్తనలు పదకొండు సంఖ్యనేకలిగి ఉన్నాయి. నృసింహయోగి ముక్తికి భక్తి మార్గమే మేలైనదని అంగీకరించటంతో దాసుగారికి విజయం చేకూరి ఈ సంవాదం ముగిసిందని ఆ ప్రాంతంలోని పెద్దలు, వేంకటదాసు భక్తులు తెలిపారు. నాటినుండి నేటివరకు ప్రతి సంవత్సరం అశ్వీజ బహుళ సప్తమినుండి పెద్ద ఉమ్మెంతాలలో జరిగే ఉత్సవంలో వీరి సంవాద స్థల జ్ఞాపకంగా హనుమంతుని గుడ్డి యొద్దకు పోయి అచట కొన్ని కీర్తనలు గానంచేసి వస్తుంటారు. పెద్ద ఉమ్మెంతాల ఉత్సవంలో ఎదురుకోళ్ళు రోజున ఈ సంవాద కీర్తనలు గానం చేయటమే ప్రధానమైన అంశం. అచ్చులో లేనివిగా చెప్పబడుతున్న ఈ భక్తి జ్ఞానమార్గాల కీర్తనలలోని సంవాదవైనాన్ని గమనిద్దాం.

వేంకటదాసు భక్తితత్త్వప్రచారాన్ని తెలుసుకుని దానిని ఖండించేందుకు నృసింహయోగి ఏరుకు అవలిఒడ్డునుండి అతనికి పంపిన ఈ కీర్తనతో సంవాదం

మొదలై ఉంటుంది. అచ్చులో లేనవిగా చెప్పబడుతున్నవి, నేను సేకరించినవి అయిన ఈ కీర్తనలను అన్నింటిని సాంతంగా ఇందు చూపుతాను.

నృసింహయోగి మొదటి రోజు పంపిన కీర్తన ఇది.

## సంవాద కీర్తనలు

"యోగికే యెరుక పరమ యోగాము తెరగు
భోగియే మెరుగాడు ఆ పురుషాని మరుగు ॥ప॥

1. వాగువంకల దొడ్డవానివలె తిరిగియు
యోగిననుచు భూతి నొడలెల్ల బూసుక
మూగివానివలె ముక్కుబట్టుక గుళ్ళ
యాగిపంచలజేరి వివరాముదెలియాక ॥యోగి॥

2. లాగులేయుచు కొండరాళ్ళ వెంబడి తిరిగి
నాగభూషణుడున్న జాడ తెలియగ లేక
జోగివలె తిరుగు జూదరే మెరుగును ॥యోగి॥

3. లింగాము మెడగట్టి అంగాములో ప్రాణ
లింగామున్న అంతరంగాము దెలియక
భంగ రుద్రాక్షలు పూసలు మెడ గట్టి

లింగరాళ్ళ పూజ బిరుసు మీర జేసి
గంగ యమునల మధ్య రంగాములోపల
అంగాముతోడ ప్రసంగాము జేసేటి
లింగాము సంగతి ఏ జంగా మేమెరుగు ॥యోగి॥

4. అష్టాక్షరమంత్రము మదిలోన దెలియాక
అష్టవిధంబుల భ్రష్టుడయ్యేటివేళ
కష్టపడుచు మాయ చేష్టాలలోబడి
యోగి దృష్టియందు చిద్రూపాము దెలియాక
జ్యేష్ఠుయై తిరుగు ఆ వైష్ణవుడే మెరుగు ॥యోగి॥

5. జడలు గట్టిగ గట్టి జపమాల చేబూని
కుడి యడమల దండకోల చెంబును బట్టి
అడవులందు కొండలాకులలములు ముట్టి
సుడిబడి తిరుగుచు సూత్రము దెలియాక
ఎడలేక గరుడాచాలేశుని గానని
చేడు సన్యాసి సద్గురు సేవ ఏ మెరుగు ॥యోగి॥

ఈ కీర్తనలో కామ్యకర్మనాచరిస్తూ, యోగివలె వేషాన్ని ధరించి జ్ఞాన శూన్యులై, జ్ఞానులవలె నటిస్తూ లోకాన్ని మోసగింప జూచే దొంగసన్యాసుల గుట్టును ఒకటి, రెండు చరణాలలో బట్టబయలు చేశారు నరసింహయోగి. మూడవ చరణంలో లింగం మెడకు కట్టుకుని సర్వవ్యాపియైన పరమేశ్వరుని జాడ తెలుసు కోక అజ్ఞానంతో అవైదిక మార్గాన పూజాదికాలు నిర్వహిస్తూ, మతమౌఢ్యనికి అంకితమై గానుగెద్దువలె తిరుగుతూ అవైదిక ప్రసంగాలు చేస్తూ, ప్రజలను మోసగించే శైవులను (జంగాలు) "భోగియేమెరుగాడు ఆ పురుషూని మరుగు" అంటూ అపహాస్యం చేశారు. ఓం నమోనారాయణాయ'' అనేది అష్టాక్షరి మంత్రం. సకల జీవులలో వ్యాపించి యున్నవాడు అని నారాయణ పదానికి అర్థం. (స. ప్ర. 23 పే) 'ఓమ్' అనేది పరమేశ్వరనామము. కాగా అంతట వ్యాపించి యున్నవాడు పరమేశ్వరుడే అని అష్టాక్షరీ మంత్ర భావం. ఈ వైదిక భావాన్ని గ్రహించక వేళ్ళు లెక్కపెడుతూ అష్టాక్షరీమంత్ర జపమంటూ అవిద్యతో కుష్కప్రయత్నం చేసి భ్రష్టులౌతున్న వైష్ణవులను హెచ్చరించారు. ఉపాసనాయోగానుష్ఠానధ్యానం లేకుండా ఆనంద స్వరూపుని పొందలేరని సత్యజ్ఞానాన్ని తెలియజెప్పారు. ఐదవచరణంలో

గురుసేవ యెరుగక జడలు గట్టి జపమాల చేతపట్టుకొని తిరిగే కపట భ్రష్టసన్యాసి పరమాత్మను తెలియలేడు. సద్గురుసేవచేసి యోగదృష్టికలిగిన యోగి మాత్రమే చిద్రూపాన్ని తెలిసికొనగలడని జ్ఞానమార్గాన్ని ప్రతిపాదించాడు. అయితే మిగిలిన కీర్తనలలోవలె ఈ కీర్తనలో నృసింహయోగి పేరు ప్రస్తావింపబడలేదు. అందుచేత ఈ కీర్త ... నృసింహయోగేనా అని అనుమానించేందుకు అవకాశం కలుగుతున్నది. క్రీర్తనలోని నాలుగవ చరణంలో "జ్యేష్ఠయై తిరుగు వైష్ణవుడే మెరుగు" అన్న అంశం ఒక్కటి మాత్రమే అనుమాన నివృత్తికి తోడ్పడుచున్నది ఎట్లాగంటే వీరి ప్రత్యర్థియైనదాసుగారు వైష్ణవుడు. గనుక ఆయనను ఉద్దేశించి నృసింహయోగి ఈ కీర్తన వ్రాసి యుండవచ్చు అని సరిపెట్టుకోవలసిఉంది. అంతకు మించి ఈ కీర్తన నృసింహయోగి విరచితమని చెప్పేందుకు ఆధారమేమీ ఇందులేదు.

ఈ కీర్తనకు సమాధానంగా వేంకటదాసుగారు ఈ క్రింది భక్తి మార్గ కీర్తనను పంపారట.

"పావనమై యున్నదయ్యా రామనామం
భక్త జీవనముగదుర సీతారామనామం. ॥ప॥

1. ఏ వేళసిరులిచ్చునయ్యా రామనామం
ముక్తిత్రోవ గలుగజేయునయ్యా రామనామం. ॥పా॥

2. సంచితాము దొలుగ జేయునయ్యా రామనామం
భవసాగరము దాట జేయునయ్యా రామనామం. ॥పా॥

3. పంచభూతామయమైనది రామనామం
ప్రస్తుతించగ నన్నేలునయ్యా రామనామం. ॥పా॥

4. సురులు మునులు నుదులుకొన్న రామనామం
ముందుగిరిజకు సమ్మతమైన రామనామం. ॥పా॥

5. హరిహర బ్రహ్మాంతరాము రామనామం
శోభాస్కరమునై చెలువందు చున్నది రామనామం. ॥పా॥

6. పరతత్త్వ కారణమైన రామనామం
దివ్యచరితమై యున్నది శ్రీరామనామం ॥పా॥

7. స్థిరముగ నన్నేలునట్టి రామనామం
రాకామచర్ల వాసూని పేరే సీతారామనామం. ॥పా॥

ఈ కీర్తనలో పూర్తిగా అవైదికాలైన పురాణవచన ప్రభావం కనబడుతుంది. ఈ ప్రకరణంలో వివరించిన విధంగా భిన్నమత ప్రభావాల ఫలితంగా నిర్గుణ, నిరాకార పరమాత్మను సగుణుడు, విగ్రహరూపునిగా తయారు చేశారు. ఈ విగ్రహాలు అవైదిక పురాణ కథలను సూచిస్తుంటాయి. అందులో భాగంగానే రాముడు, కృష్ణుడు మొదలగు వారు మానవాకృతులతో నున్న దేవుళ్ళుగా గుర్తించ బడ్డారు. "న తస్య ప్రతిమా అస్తి" అనే యజుర్వేద మంత్రం (32-3) మహాయశస్వి యైన పరమాత్మకొక మూర్తిలేదు 'అని తెలుపుతుంటే అవిద్యావంతులు కొయ్యల్లోన రాళ్ళల్లో పరమాత్మను చూస్తున్నామని భ్రమిస్తున్నారు. అట్లాగే "రామనామం ముక్తిని కలుగజేస్తుంది, పరతత్త్వకారణమై యున్నదని దాసుగారు చెప్పటం సత్యజ్ఞానానికి దూరంగా వుంది. 'పంచభూతామయమైంది రామనామం" అనే మాటకు దాసుగారి అజ్ఞానమే కారణం. పంచభూతాత్మకమైంది శరీరం. పరమాత్మకు శరీరాదులు లేవని సర్వవ్యాపకుడని వేదం తెలుపుతున్నది. సంచితాలు తొలగజేసే రామనామం, భవసాగరం దాటించే రామనామం, ముక్తికలుగజేసే రామనామం, అంటూ రామనామ స్మరణ చేస్తూ వైష్ణవ పద్ధతిలో దాసుగారుతమ 'భక్తి' మార్గాన్ని వివరించారు. రాకమచర్ల క్షేత్రంలో ఉన్న దేవుడు యోగలక్ష్మి నరసింహుడు. కీర్తనలో దాసుగారు "రాకమచర్లవాసుని పేరే సీతారామనామం" అనటంలోని అంతర్యం అంతుపట్టని విషయం. ఎందుకంటే రాముడు రాముడే, కృష్ణుడు కృష్ణుడే కదా! కాని రాముడు కృష్ణుడే అని చెప్పటం ఎట్లా పొసగుతుంది?

దాసుగారి కీర్తనకు సమాధానంగా రెండవరోజున శ్రీ నృసింహయోగి ఈ క్రింది కీర్తనను పంపారట.

"కన్నుల జూడరాదా-మంచిఘననాదమును వినరాదా ॥ప॥

1. సాధుల సేవించరాదా-సంసారపాశాము లీదరాదా
ఆధారములు ఆరు-భేదించి పశ్చిమ వీధిలోపల జగన్నాథుని
పదములు ॥కన్నుల॥

2. యోగాము సాధించరాదా-అంతర్యాగాము గావించరాదా
భోగీంద్ర ఫణిలేపి నాగస్వరము నూది
లోగ నిలిచిన ఫాలభాగమందున హరిని
॥కన్నుల॥

3. మూడారు వాకిండ్లు మూసి-నడినాడి లోపాలకు జూడదెలసి
వాడలో బారేటి మూడు యేరులు దాటి
యేడు అంతస్థుల మ్యాడలో రాముని ॥కన్నుల॥

4. స్థిరమానసము నాను నిలచి-నీవు అరిషడ్వర్గములాను గెలచి
పరశురాముని నరసింహ యోగికి
ఇరవు జేసుకున్న పరమాత్ముని ॥కన్నుల॥

ఇందు ముక్తి పొందేందుకు యోగవిధిని, నియమాలను వివరించారు. మొదటి చరణంలో నియమాలను తెలిపారు. మిగిలిన పాదాలలో బ్రహ్మప్రాప్తికై తంత్ర మార్గంలో సాధకుడు చేయవలసిన కుండలినీ యోగక్రమాన్ని తెలిపారు. రెండవ చరణంలో "భోగీంద్ర ఫణిలేపి నాగస్వరము నూది" అంటూ కుండలినీ యోగాన్ని సూచించారు. తంత్రమంటే శాస్త్రం. జ్ఞానాన్ని విస్తరింపజేసేదని భావం. మూడారు వాకిండ్లు అంటే చెవ్వు, ముక్కు మొదలగు నవరంధ్రాలను, బంధించి నడినాడిలో అంటే సుషుమ్నా నాడి లేక బ్రహ్మనాడి ద్వారా ఏడంతస్తుల మేడలో అంటే మూలాధారాదిగా సహస్రారం వరకున్న సప్త కమలాల్ని కలిగియున్న శరీరంలో వ్యాప్తమై యున్న పరమాత్మను కనుగొనేందుకు యోగసిద్ధి అవసరం. దానికి అరిషడ్వర్గాలను

గెలవాలి. స్థిరమాసనం కావాలి అని తెలిపారు. అట్లా యోగసిద్ధిని పొందితే "ఫాలభాగమందున" అంటే కనుబొమ్మల నడుమ ప్రదేశంలో పరమాత్మను గాంచ వచ్చు అని తెలిపారు. ఇట్లా చెప్పటం చూస్తే నరసింహ యోగి యోగసిద్ధి పొందా డని చెప్పవలసి ఉంది. ఈ కీర్తనలో "పరశురాముని నరసింహ యోగికి" అని ఉండటం చేత నృసింహయోగి ఇంటిపేరు పరశురాముని అని చెప్ప వీలగుచున్నది. ఇట్లే ఏడవరోజు కీర్తనలో కూడా ప్రయోగింపబడి ఉంది.

ఇట్లా గురువాక్యం మననం చేసి యోగాభ్యాసంతో జ్ఞానాన్ని పొంది పర మాత్మను కన్నుల జూడరాదా అన్న యోగికి దాసుగారు ఈ క్రింది కీర్తనను సమా ధానంగా పంపారట.

"మదిలోన సేవింపరాదా - స్వామి
పదములు భజియించరాదా ॥ప॥

1, ముదము తోడుత భక్తి వదలకనీ మీద
సదయుడై వెలసిన సరసిజనయనుని ॥మది॥

2. చంచలమును మానరాదా పూర్వసంచితముల దోలరాదా
పంచభూతేంద్రియ భ్రమలెల్ల దిగనాడి
మంచి వైరాగ్యము మమత రంజిలగ ॥మది॥

3. పరమానందము నొందరాదా
దేహపరవశమును జెందరాద
కరమొప్పు వైకుంఠపురమందు శేషుని
పర్యంకమున నుండు పద్మ దళాక్షుని ॥మది॥

4. పరమార్గమును జెందబోక
మోహపర తంత్రము పెరుగాక

స్థిరముగా రాకమచర్ల నివాసుని
పరసుందరము జూచి ముదని వేడుకతోడ ॥మది॥

సేవక భావంతో అనే నవవిధ, ఏకాదశవిధ భక్తులలో చెప్పబడ్డ దాస్యభక్తితో అవైదికంగా ఏర్పాటు చేయబడ్డ విగ్రహాన్ని ఆరాధించి ఫలితాన్ని పొందమని సలహా నిచ్చారు. చాంచల్యాన్ని వదలిపెట్టి మతితో భక్తిని ఏర్పర్చుకోమంటారు. వైరాగ్య బుద్ధితో సరసిజనయనుడు రాకమచర్లవాసుని భజించమంటారు. దానివల్ల - పూర్వ సంచితాలు పోయి మోహం తొలగిపోతుంది. మైమరపుతో ఆనందం కలుగుతుంది, అని తెలిపారు. నృసింహ యోగి తెలిపిన యోగమార్గాన్ని గుడ్డిగా త్రోసిపుచ్చి "పరమార్గమును జెందబోక - మోహ పరతంత్రముల పేరుగాక" భక్తిమార్గముతోనే రాకమచర్లవాసుని జూడమని ప్రతిపాదించారు.

మూడవ రోజున గూడా దాసుగారి భక్తిమార్గాన్ని పెడచెవిన బెట్టి తన జ్ఞాన మార్గాన్ని వివరిస్తూ ఈ క్రింది కీర్తనను నృసింహయోగి పంపారట.

ఇదిగో గురుకీలకం వినర-అదుగోర యోగసాధనం ॥ప॥
ఇదుగోర శ్రీగురు పద పద్మములు-నీదు హృదయము
లోపల వదులాక నిలిపితె ॥ఇది॥

1. ధాత్రి లోపల ఒక్క గాత్రమున్నదిరా
గాత్రమునకు చిన్మయ నేత్రమున్నదిరా
నేత్రమందున గురు సూత్రాము లోపాల
పాత్రమెరిగి తేను బ్రహ్మమేయౌరా ॥ఇదుగో॥

2. కొండమీదను పెద్దగుండు యున్నదిరా
గుండు నడుమను రెండు గుండ్లు యున్నవిరా
గుండ్ల నడుమన సన్నగండి లోపల నున్న
పండనుభవించితే ప్రజ్ఞాన బ్రహ్మమురా ॥ఇదుగో॥

3. చూపులోపల నీలరూపమున్నదిరా
రూపములో ఒక్క దీపమున్నదిరా
దీపములో వున్న తేజస్సు దెలిశితె
తాపాములన్నణగి తత్త్వమశితాయగురా ॥ఇదుగో॥

4. అయిదయిదులై ఇరువదియైదై యున్నదిరా
అయిదుటి మీదను ఆత్మ యున్నదిరా
ఆత్మను శోధించి అమృతాము మధియించి
అనుభమెరిగితే అయమాత్మ బ్రహ్మమురా ॥ఇదుగో॥

5. గురువాక్యములు నాల్గు గురువై యున్నవిరా
గురుతెరిగితెనంతట పరముతానగురా
పరశురాముని వర సరసింహయోగికి
పరమ పదము బట్టబయలై యున్నదిరా ॥ఇదుగో॥

భక్తి మార్గంలో రాకమచర్లవాసుని కొలువుమన్న దాసుగారి మాటకు సమాధానంగా ఈ కీర్తనలో ఇట్లా తెలిపారు.

చైతన్య రహితమైన జడ విగ్రహారాధనం నిష్ఫలమైంది. సద్గురు పాద పద్మములు సేవించి పొందే గురూపదేశమే యోగసాధనం; అని కీర్తన పల్లవిలో తెలిపారు. మొదటి చరణం నుండి నాల్గవ చరణం వరకు బ్రహ్మజ్ఞానియైన గురువు వల్ల తాను ఉపదేశాన్ని పొంది, ఆ గురువు ఉపదేశించిన మహా వాక్యాలను మననం చేసి, పొందిన జ్ఞానాన్ని వివరించారు.

మొదటి చరణంలో 'అహంబ్రహ్మాస్మి' అనే మహా వాక్యాన్ని 'బ్రహ్మమహమేరా' అని తెలిపారు. ఇది బృహదారణ్యక వాక్యం (1-4-10).

రెండవ చరణంలో 'ప్రజ్ఞానం బ్రహ్మ' అ మహావాక్యాన్ని తెలిపారు. నే ఇది ఐతరేయబ్రాహ్మణం (6.3) లోనిది. ప్రకృష్టజ్ఞాన. స్వరూపంగా గలది

బ్రహ్మం అని యర్థము. "శరీరరూపమైన బ్రహ్మపురంలో హృదయస్థానం దానికి క్రింద ఉదరానికి పై భాగంలో అంటే రెండింటి మధ్యస్థానంలో ఒకరిక్త స్థానముంది దానినే "దహరపుండరీక" మంటారు. ఆ స్థానంలో చిత్తాన్ని స్థిరపరచి అంటే ధారణ చేసి ధ్యానం, సంయమనాన్ని ప్రయోగిస్తే సత్యజ్ఞానం కలుగుతుంది." అని తెలిపిన పాతంజల యోగదర్శనము (3-34) (3,35) సూత్ర సారాంశాన్ని తెలియజేశారు. మూడవ చరణంలో "తత్త్వమసి" అనే ఛాందోగ్యోపనిషద్వాక్యాన్ని (6-8-7) తెలిపారు. పరమేశ్వరుడు నీలో అంతర్యామియై ఉన్నాడు. అతడు నీ కధిష్ఠానం. ఆధారం అనిదాని యర్థం అట్టి పరమాత్మ జ్యోతి స్వరూపుడని, వేదం తెలిపింది. దానినే స్పష్టీకరించారు. నాల్గవచరణంలో "అయమాత్మా బ్రహ్మ" అనే మాండూక్యోపనిషద్వాక్యాన్ని (-) తెలిపారు నాయందు అంతర్యామియై ఉన్న ఆత్మయే బ్రహ్మము అని అర్థం. ఈ విషయాన్ని స్పష్టంచేశారు. ఈ విధంగా గురువాక్యమననం చేత మోక్షమార్గం జ్ఞానం వల్లనే లభిస్తుందని తెలుసుకున్నాను. ఆనంద స్వరూపుణ్ణి చేరేందుకు "జ్ఞానమే వైదిక మార్గమని స్పష్టీకరించారు.

జ్ఞాన మార్గంతోనే పరమాత్మను చేరి ఆనందం అనుభవించే వీలుకలుగుతుందన్న యోగి గారిని ఖండిస్తూ దాసుగారీ కీర్తనను పంపారట.

"హరిధ్యానంబే పరమపదము
సద్గురుని భజించుటే సుఖతరము ।ప।

1, సరసోక్తుల హరిస్మరణ స్వానుభవం
పరవశ మతులకు బ్రహ్మానందం ॥హరి॥

2, సంగ విరక్తే ముక్తి పదంగుణ
సంగతి విడచుటే విరక్తిపదం ।హరి।

3, అంగీకారముగా హరి పాదాబ్జము
పొంగితలచుటే మోక్షపదం ।హరి।

4. మోహమొదలుటే పరయోగం సం
దేహము పదలుటే మదిత్యాగం- ।హరి।

5. దాసత్త్వంబే తత్త్వార్థం తనను
తాదెలియుటే పరమార్థం ॥హరి॥

6. వాసిగ భక్తుల డాసిచాలదయ
చేసేటి రాకమచర్ల నిలయుడుగు

గురూపదేశ ప్రాముఖ్యాన్ని, తద్వారా తాను పొందిన జ్ఞాన దీప్తిని వివరించిన యోగిగారికి దాసుగారు ఈ కీర్తన ద్వారా తను గూడా యోగము నెరుగుదునని "హరి ధ్యానంబే పరమపదం" "సంగ విరక్తే ముక్తిపదం" "మోహమొదలుటే పరయోగం" అని వైష్ణవమత సాంప్రదాయానుసారంగా తెలిపి భక్తులను చాల దయచేసేటి రాకమచర్ల నిలయుడైన హరిని (విగ్రహారాధనం) ధ్యానం చేయటం, సరసోక్తులతో స్మరణచేసి మేనుమరచి బ్రహ్మానందాన్ని అనుభవించటం తన స్వానుభవమని స్పష్ట పరచారు. యోగ పరమార్థం తత్త్వాన్ని తెలియటమే గదా। అట్లాగే దాసత్వమే తత్త్వార్థమని వైదికపరంగా కాక వైష్ణవపరంగా తెలిపి తన భక్తిమార్గమే మేలైందని సమాధానం పంపారు.

నాల్గవ రోజున దాసుగారికి నృసింహ యోగి ఈ కీర్తనను పంపారట.

"ఏమనరానిదదీ-అది యేమోకాని
యెవరికి దోచనిదీ ॥ప॥
ఏమనరానిది-ఏకమై యున్నది
నామరూపు క్రియనటన మీరినది ॥ఏమన॥

1. ఖండముగానిదదీ-నిండియంతటా ఖండమైయున్నదీ
కుండలినడుమన గూఢమై యున్నది
దండినాద బిందుతారకమైనది ॥ఏమన॥

2. తానన రానిదదీ—తన్నుతా దెలసీ తానుతానై యున్నదదీ
 జ్ఞానాంజన మూల పూనికయున్నది
 నేను నేననే భ్రాంతిని రసమైనదది ॥ఏమన॥

3. మతముల మీరినదీ—సర్వసమ్మత సాక్షియైనదదీ
 శ్రుతులను మీరియు సిద్ధమై యున్నది
 సతతము శివరామ సమ్మతమైనాది ॥ఏమన॥

"ఒకమచర్ల నిలయుడగు హరి ధ్యానంబే పరమపదం" అనిన దాసుగారికి సమాధానంగా "అదియే మోకాని యేమనరానిదదీ యెవరికి దోచనిదీ" అంటూ నామ రూపు క్రియ నటన మీరినది అని విగ్రహారాధనను నిరసించటమే కాకుండా కేవల నామ జపంవల్ల మోక్షం సిద్ధించదని తెలియపరుస్తూ నిర్గుణతత్త్వాన్ని పల్లవిలో స్పష్ట పరిచారు. మిగిలిన చరణాలలో బ్రహ్మం ఒకటే, అది నాశం లేనిది, అంతట వ్యాపించి యుంది, అది సత్తు, చిత్తు, ఆనంద స్వరూపం గలది. అని వేదశాస్త్రాలు తెలిపిన పరమేశ్వర విషయ ప్రతిపాదనలను సూచించారు. అట్టి నిర్గుణ పరబ్రహ్మం సర్వ సమ్మితమై జగత్తుకు సాక్షిభూతమై ఉంది. అట్టి పరమాత్మ యోగధ్యానంతో జ్ఞానాన్ని పొందే తెలుసుకోవాలి; మత వాదనలతో కాదని స్పష్టంచేశారు. "సతతాము శివరామకృష్ణ సమ్మతమైనాది" అనే వాక్యంతో తన గురువు శివరామకృష్ణ యని సూచించారు.

దీనికి ప్రతిగా దాసుగారు యోగము యెడ విముఖత చూపిస్తూ, భక్తిమార్గమే మేలని నృసింహ యోగులకి కీర్తనను పంపారట

"మాటలాడిన ముక్తిరాదు బుద్ధి-పాటిదప్పిన భక్తి
 పథమేమిగాదు

1. బూటకములనేమి లేదు చూడనెట్టైన చిత్తంబు నిలువాక వార్థు ॥మాట॥

రాకమచర్ల వేంకటదాసు కీర్తనలు;

ముద్రాలు బట్టేది వారు యోగనిద్రలోనే నాని సేవించువారు
చిద్రూపనుచు జెప్పేవారు రామభద్రూని మదిలోన భావించలేరు
॥మాట॥

3. పరతత్త్వమును వదలించి దేహప్రారబ్ధమని నొటబలుక వహించి
గురుని కటాక్షమెంచి ఆశకారనై నరులాను మరిగి శోధించి
॥మాట॥

4. పరమసంతోషాముగాదు-ధరణిలో వేంకటదాసుని తీరు
కరమొప్ప జూచిన నవ్వేరు మెచ్చిసరస రాకమచర్ల హరినైన
గనరూ ॥మాట॥

వాద ప్రతివాదాలతో ముక్తిరాదు. ఎవరేమన్నా భక్తి పదానికి వచ్చిన లోటు లేదని భక్తి విషయంలో తమకు గల అభిమానాన్ని వ్యక్తంచేశారు దాసుగారు. యోగమని, చిద్రూపమని అర్థంకాని భాషతో జనులకు ఆశజూపి గురువులనే పేరుతో మానవులను ఆశ్రయించి 'దేహప్రారబ్దం తీరాలి, పరతత్త్వాన్ని చూడాలి' అనే వ్యర్థపు మాటలతో ముక్తి రాదనే సమాధానంతో యోగాన్ని, గురువుల యెడ వైముఖ్యాన్ని ప్రదర్శించారు,

దాసుగారు చూపిన ఈ వైముఖ్యానికి బదులుగా సాక్షిభూతంగా తాను యోగ ధ్యానంతో పరతత్త్వాన్ని చూచానని ఈ కీర్తనను ఐదవరోజు పంపారట నృసింహ యోగి.

"నేజూచినానే - అహోజ్యోతిని నే జూచినానే ॥ప॥

1, నేజూచినానమ్మ నెలతరో
తారక రాజయోగి యున్న రమ్యమైనాచోటు ॥నే॥

2. చూపు మధ్యమునందు పాపలనడుమాను
రూపించి చెలిగేటి ఆ పరంజ్యోతిని ||నే||

3. చక్షురాగ్రము నందు దక్షిణ వీధిలో
నిక్షేపమైయున్న సాక్షిభూతుని నేడు ||నే||

4. చందమామకు నడుమ-కుందా నా కృతి హేమ
బందుపీఠమునందు పొంది వెలిసిన గురుని ||నే||

5. ఫాలభాగమునందు నీలజ్యోతుల నందు
వాలాలాడుచున్న హరలింగమూర్తిని ||నే||

6. స్థిరమానసము గలుగ పరమభక్తులకెల్ల
వరములిచ్చుచున్న వర పరమాత్ముని ||నే||

అని దాసుగారికి యోగము, రోగియెడల సమ్మకం కలిగించే విధంగా తాను దర్శించిన పరమేశ్వర యునికిని పూసగుచ్చినట్లు తెలియజేశారు. తరువాతి కాలంలో ఈ కీర్తనకు ఛాయగా కనిపించే "నే జూచినానే అంతర్లక్ష్యం నే జూచినానే" అనే కీర్తన దాసుగారి నోట వెలువడ్డది. ఈ కీర్తన అచ్చయింది. ఈ సంవాదంలోని 4, 5 రోజుల కీర్తనలను బట్టి ఈ సంవాదం జరిగేనాటికి దాసుగారికి గురు సాక్షాత్కారం గాని, గురూపదేశంగాని జరిగినట్లు లేదు. పైగా దాసుగారి ధోరణి అంతా వైష్ణవమత సాంప్రదాయాలకను కూలంగానే వుంది. ముందు భక్తి విషయం చెప్పేటప్పుడు భక్తిని వైష్ణవులు వింగడించిన విధానాన్ని తెలుపుతాను.

దీనికి సమాధానంగా భక్తసులభుడు భగవంతుడని తెలియజేస్తూ ఈ కీర్తనను పంపారట.

"ఎంతో చక్కని దేవుడమ్మ లక్ష్మీకాంతుని కనుగొనిరమ్మా"
||ప||

1. సంతతమును సర్వ సమ్మతమునవాడు
మంతానమున చాలమమత గలిగినవాడు
వింతాగ శ్రీదేవి కాంతుడయినా వాడు
శాంత మానసమున జగములేలేటివాడు ||ఎంత||

2. రంజితమ్మృదు తరమంజీరముల వాడు
కంజాతముల రీతి కన్నులు గలవాడు
మంజూల మృదుతర మధురాధిరమువాడు
సంజీవముగ భక్తసంఘమేలేటివాడు ||ఎంత||

3. గండ భాగములందు కుండలంబులవాడు
దండి కిరీటముతల మీద గలవాడు
అంద బాయక మోమునందునుండేటివాడు
నిండు వేంకటదాసునేలిన దయవాడు ||ఎంత||

అంటూ భక్తిమార్గం ద్వారా తాను చూచిన దేవుని వర్ణించారు. ఇది పూర్తిగా వైష్ణవమత సాంప్రదాయాలను పుణికి పుచ్చుకుని ఉంది.

ఆ వరోజున యోగిగారు దాసుగారికి కీర్తనను పంపారట.

"చూడు చూడు హరిని గూడునేడూ మనసున
చూడు చూడు నీ చూపు మనసు నొడగూడ జేసి
కడువేడుకతో మరి ||ప||

1. తిన్నగాను సరసులెన్నగాను
మనసునొడగూడ జేసి కడువేడుక తోమరి
సన్నుతించి నాసాగ్ర దృష్టిచే
కన్నులనడుమను పున్నమి చంద్రుని ||చూ||

2. చూపునిలిపి సాక్షిజూపదలచి
మనసునొన గూడజేసి కడువేడుకతో మరి

రేపు మాపుల వ్యాపకమేచి
ద్రూపు దెలిసి మది ఆపోజ్యోతిని ||చూ||

3. మేలుగాను గురుని కీలుతోను
మనసూనొనగూడ జేసి కడువేడుకతో మరి
వాలాయంబున నీలజ్యోతులను
ఫాల్గభాగమైన ప్రత్యక్షంబున ||చూ||

4. మురయుచూనుమంచి యిరవుదోను
మనసునొనగూడ జేసికడువేడుకతో
స్థిరముగ రాగమచర్ల వాసుని
కరుణతోడ స్థిరమతి నొందుచు ||చూ||

ఈ కీర్తన ద్వారా దాసుగారి అజ్ఞానానికి నృసింహయోగి కొంత జాలిపడినట్లు విదితమౌతుంది. అందుకే తొందరపాటును వీడి నీవు ఆరాధించే రాకమచర్లవాసుని కరుణతో స్థిరచిత్తుడవై గురుని సహాయంతో మనసునొనగూడ జేసికొమ్మని సలహా నిచ్చారు. అట్లాచేస్తే చూపునిలిచి సాక్షిభూతుడైన పరమాత్మ సాక్షాత్కారం లభిస్తుందని పరమార్థం తెలిపారు.

అందుకు సమాధానంగా దాసుగారీ కీర్తనను యోగికి పంపారట.

"నారాయణుని పేరే తారకమౌరా
తారకమౌ భవతారకమౌరా
మేరమీర పరులజేరనేందుకురా ||ప||

1. ముందు బ్రహ్మను చిత్తమ్మందు జెందేనురా
పొందూగ సరలాను పోషించినదిరా
యిందు ధరుడు చిత్తమందు మెచ్చేనురా |నారా|

2. పరమ యోగులకెల్ల భాగ్యమైనదిరా
గురుజనులకెల్ల బుద్ధి గూడియున్నదిరా
విప్రులకెల్ల ధనమై యున్నదిరా
పరమ భక్తుల యందు ప్రబలియున్నదిరా ||నారా||

3. గొప్పకొంచమని చెప్పరానిదిరా
యెప్పుడెన్నినగాని ముప్పుతేనిదిరా
తప్పుగతిగియున్న తగనెలుగదరా
గొప్పవారినెల్ల గూడియున్నదిరా ||నారా||

4. పరమానందము నొందిభజించవలెరా
ధరణిలో వేంకటదాసు ఉన్నదిరా
సరస రాకమచర్ల స్వామికున్నదిరా
మరిగినవారికి మనసుకొచ్చునురా ||నా||

"బ్రహ్మతత్తం తెలుసుకొనగోరువారు శాస్త్రవిధిననుసరించి గురువుల కడకేగి, వినయపూర్వకంగ నమస్కరించి, పరిపరి విధాల ప్రశ్నించి జ్ఞానాన్ని తెలియాలి" అని ముండకోపనిషత్తు తెలుపుతున్నది. (ముం. కో.ష 1.I.8). దాసుగారు కేవలం నారాయణ నామ జపమే తారకం, ఆదే యోగులు, గురుజనులాధిగా గల అందరికీ మూలమైంది, అట్టినారాయణ నామ జపాన్ని వదిలి పరులను జేరటం ఎందుకురా ? అని యోగిగారిని ప్రశ్నించటం దాసుగారి అవైదిక జ్ఞానానికి నిదర్శనం, నారాయణ శబ్దం వైదికమేగాని భక్తుల భావాల్లో వైదికార్థం లోపించింది.

ఏదవరోజున శ్రీ నృసింహయోగి ఈ కీర్తనను దాసుగారికి పంపారట.

"దొరవలె గూరుచున్నాడు ||ప||

1. సరసిజభవు విష్ణుహరులకు మూలమై
సురసిద్ధ సాధ్య కిన్నరులు గొలువగాను ||దొర||

2, పదహారు పన్నెండు పదియారు నాల్గుపై
కుదురు చేసుక తద్వితకళమధ్యమునందు ||దొర||

3, రక్తశ్వేతకృష్ణరమ్యముగా నీల
ముక్తపీఠములోన ముక్తి కాంతను గూడి ||దొర||

4, పాతాళమున కగ్ని వాతాంబరులకెల్ల
ఖ్యాతి గ గురుపరం జ్యోతి స్వరూపుడై ||దొర||

5. స్థూల సూక్ష్మ కారణాల కతీతమై
నీలతోయద మధ్య నిగమాంత వేద్యమై ||దొర||

6. పరమానందముగాను పరశురాముని
నరసింహయోగి హృత్సరసీరుహమునందు ||దొర||

యోగం ద్వారా తాను దర్శించిన నిర్గుణ పరబ్రహ్మను వైదికంగా స్పష్ట పరిచారు.

"సృష్టికి పూర్వం పరమేశ్వరుడు ఒక్కడే ఉన్నాడు. భూమి మొదలు సూర్యుని వరకున్న సమస్త జగత్తునతడే రచించాడు." అని (8,-1-3-1) ఋగ్వేదం తెలుపుతున్నది. "సమస్త, సృష్టి పరమేశ్వరుని వల్లనే జరిగింది" (11, 4-7-27) అని అథర్వవేదం తెలుపుతున్నది. ఇట్టివేద విషయాన్ని యోగిగారు దాసుగారికి ఈ కీర్తనద్వారా గుర్తుచేశారు. అంతేగాక నీవు నమ్ముకున్న విష్ణ్వాది దేవతా విగ్రహాలకు మూలమైన దొర (పరతత్త్వం) షోడశ కళాపూర్ణుడై యున్నాడు. దానిని యోగాభ్యాసంతో తెలుసుకోమని హెచ్చరించారు. నిదానంగా తాను యోగ సిద్ధిని పొంది తెలుసుకున్నానని చివరి చరణంలో తెలిపారు.

అందుకు సమాధానంగా దాసుగారు యోగిగారికి కీర్తనను పంపారట.

"దొరలకెల్లను దొరగదనమ్మా మా రామచంద్రుడు |ప|
సరసిజభవసురనాయక వినుము, కరశశిధరనరవరులాదిగా గల |దొర|

1. ఇతరూలు సాటిరారు యమ్మ సకలాత్ములాను
సతతాము బ్రోచు చుండునమ్మ
క్రతుశతములు సువ్రతములు ధార్మిక
పితలై బుధ సమ్మతముగడే సేటి ॥దొర॥

2, కోటిభాను ప్రకాశుడమ్మా
సుషుమ్నా బిందుత్రి కూట మధ్య ప్రదేశుడమ్మ
హాటక వర్ణ సహాయనుషీరహృత్కట
మార్గ దీక్షిత యోగాస్పద ॥దొర॥

3. పరమ సుందరా రూపుడమ్మా మహిత వైకుంఠ
పురమందు వెలయు చుండునమ్మా
హరిపదసరసిజ పరమ మరంద
స్ఫురిత ర సామృత పరవశనుతులగు ॥దొర॥

4, దాసాభిమానరతోదయుడమ్మా నిగమాగమేతి
హాతస పౌరాణవర్తనుడమ్మా
హసిగ భక్తులడానిచాలదయ
చేసీ రాకమచర్ల గిరీశుడమ్మా ॥దొర॥

దాసుగారు కేవలం వైష్ణవపురాణాల జ్ఞానమేనంట పట్టించుకున్నారనటానికి ఈ కీర్తనే నిదర్శనం. దాసాభిమానం పూర్తిగా హరి మతాసక్తిని, తెలియ జేస్తున్నది.

పట్టువీడని యోగిగారు ఎనిమిదవ రోజున కూడా నిర్గుణ బ్రహ్మను గూర్చి దాసు గారికి కీర్తన ద్వారా ఇట్లా తెలిపారట.

"బయలు దెలియవలెరా కేవల బ్రహ్మముగనవలెరా"
బయలు దెలియవలె బయలు గలియవలె
బయలు లోన నిర్భయుడై యుండవలె ॥బయ॥

1. బిందునిలుపవలెరా బ్రహ్మానందము గనవలెరా
సందుగొందులను ఎందుజూచినను
సందులేక అటుహొంది యున్నది ॥బయలు॥

2. సూక్ష్మ శరీరమురా దీనికి శిక్ష జేయవలెరా
సాక్షాత్ శ్రీశివరామ దీక్షితులనపేక్ష చేత
కటాక్షము గనవలెరా ॥బయలు॥

పరమాత్మ సర్వవ్యాపి అని, సూక్ష్మాతిసూక్ష్మమని, వేదం తెలిపిన తత్త్వాన్ని, గురూపదేశంతో సూక్ష్మం గ్రహించాలని దాసుగారికి పరమాత్మని ఎరుకను నచ్చ జెప్పే ప్రయత్నం చేశారు; నరసింహయోగి. ఇందులో తన గురువు శివరామ దీక్షితులని మరోమారు తెలియ పరచారు.

ఇట్లా యోగికి దాసుగారీ కీర్తనను సమాధానంగా పంపారట.

"సీతారామదాసులను జేరినారము
భజన జేసేటి పుణ్యాత్ములను గోరినారము ॥ప॥

1. గుట్టుదెలసి గుణములన్ని గోశినారము
చేతపట్టి విడువరాని మనసు బాసినారము
రట్టులేని భజన చేత బట్టినారము
మేము గట్టిగా వైకుంఠపురము ముట్టినారము ॥సీతా॥

2. చెప్పినట్టి గురుని యాజ్ఞ కొప్పినారము
మరి తప్పులు బట్టేటి వారి దరికి జేరము
గొప్పెనకోపాము వెళ్ళగొట్టినారము
తెల్వితప్పక భవసాగరము దాటెవారము ॥సీతా॥

3. నారాయణ స్మరణ మదిలో నమ్మినారము
లెస్సపేరు జెప్పి వాసుదేవుని జేరెవారము

రాకమచర్ల వాసుని కరుణనూకి నారము
మేము జోకతో వెంకటదాసుని శ్రోవవారవ

ఈ కీర్తన పరిశీలిస్తే ఇది వేంకటదాసుది కాదని తో
దాసుని శ్రోవవారము'' అనే వాక్యం; ఇది దాసుగారు చెప్పి
చేస్తున్నది. ఇది బహుశ : అతని శిష్యులు వారి పేరుతో పం
భక్తి మార్గాన్ని ఖండింపబూనిన నరసింహయోగి చర్యను
శిష్యులు పంపిన సమాధానమీకీర్తన. "రాకమచర్ల వాసు
వంటి పదప్రయోగం అనాగరికంగా ఉంది. "మేము జోక
ఆవేశంతో అయివుండ వచ్చును. ఏమైనా ఇందలి వి
అవైదికమని స్పష్టమౌతున్నది.

తొమ్మిదవ రోజున దాసుగారికి నృసింహయోగి ఈ

"ఉన్నదేమో ఉన్నదీ గురురాయుడాజ్ఞ"

1. తిన్నాగ నాసాగ్రమున దృష్టి నిలిపి సాధ
కన్నవారికన్న తెల్వకున్న నిర్గుణ భావము

2. వేడుకన కాదది ఏడుమేడలనుదాటి
జోడుగాను చిత్కళతో గూడక తానైన

3. పామూనెత్తిమీదనక్కలో వాలితో గూడుక
నామరూపు లేక బ్రహ్మనాశమావలైనచో

4. నీలతోయద మధ్యమున లీల విద్యుల్లేఖ
స్థూల సూక్ష్మ కారణాదుల గెలుసేయునట్టి

5. ఎన్నాగ వేంకటదాసుకున్నచోటు దెలిపివ
చెన్ను మీరగను చక్కని శేషగురుని మహి

ఈ కీర్తన వల్ల నరసింహయోగి కుండలినీ యోగం అభ్యసించినట్లు తెలుస్తున్నది. అంతేగాక "హఠయోగ సాధనతో మూలాధారాది ఏడు చక్రాలను అధిగమించిన తరువాత అనాహతంలో జ్యోతిస్స్వరూపుడు, ప్రకాశవంతుడు, జ్ఞానిస్వరూపి అయిన పరమాత్మ ఉంటాడు.'' అని తనకు గురువాజ్ఞ యైనట్లుగానే దాసుగారికి కూడా జ్ఞానియైన (చక్కని) శేషగురుని మహిమచేత నిర్గుణ పరబ్రహ్మం బోధపడాలని ఆశీర్వదించారు. హఠయోగం పాతంజల యోగదర్శన విరుద్ధమని వెనుక మనవి చేశాను. వీరి ఆశీర్వచనానికి అనుగుణంగా ఉత్తరకాలంలో దాసుగారు నీలంగిరి వీరయ్యప్పగారి ద్వారా గురూపదేశం పొందినట్లు వారి జీవిత చరిత్ర చెప్తున్నది. యోగిగారికి సమాధానంగా దాసుగారు ఈ క్రింది కీర్తనను పంపారట.

"కనుగొందునయ్యా మీ పదసేవ శ్రీవాసుదేవ" ॥ప॥

కనుగొందునయ్యా కలిదీరగ
మనసు సంతసంబును జెందగనిన్ను ॥కను॥

1. అంగుగ మిమ్ము ధ్యానించి-మోహ మెడలించి
ఆనందమున భక్తి వహించి-ఇంగితమతి నుప్పొంగుచు
వేడుక తొంగలింపమీ సంగతి మనమున ॥కను॥

2. అనురాగమున మిమ్ము జేరి-కృపజూడు మనుచును
చనుదెంచిమీ చెంగట నొక్కసారి వినుతి జేసితి
రఘువీర హరేయని ఘనముగ
పొగడుచు తనువు మరచి నిన్ను ॥కను॥

3. కంటిచూపున మనసు నిలిపి అలజ్యోతిర్మణిమయ
మంటపమున నమ్మిక దలచి
జంట మండలములంట నివ్వకను
మింటితుదను వైకుంఠమున కన్నుల ॥కను॥

4. పరమ వైరాగ్యమున నిలిచి రాకామచర్ల
దురమ్మని బిలచి స్థిరమతి సంబరమున
పొరయాచు పరమ
పురుషమీ పదసుందరమును

శ్రీవాసుదేవుని ధ్యానంతో మోహం తొలగిపోయి
తద్వారా భక్తి యొక్క సాంగత్యం మనకు లభిస్తుంది.
జ్ఞానం (ఇంగితమతి)తో భక్తుని మనస్సు ఉప్పొంగి మై
తెలిపారు. యోగంలో సమాధి సిద్ధి కలిగినప్పటి స్థితికి
భక్తుని మైమరపు అనిపిస్తుంది. "కంటిచూపున మనసు ని
పంలో రాకమచర్లేశుని వైకుంఠంలో చూడటం" పూర్తిగా

"పరమ వైరాగ్యమున నిలచి రాకమచర్ల హరి
చెప్పిన దాసుగారికి పదవ రోజున నరసింహ యోగి
పంపారట.

"విక్రయించే పండు గాదమ్మా
ఈ విశ్వమందు తెల్వరాదమ్మా

1. ముక్కుతుదను ఉండుమూలమైన పండు
దృక్కుల లోపల దృశ్యమైన పండు.
ఎక్కడ జూచినటైనదా పండు
అక్కర గల వారిక బల్ తియ్యనిపండు

2. ఆకుపువ్వులు పిందె లేకయుండిన పండు
రాకపోకడ లేని రమ్యమైన పండు
ఏకాలమేకాల మేకమైన పండు
ఆకాశాతీతమై అంది అందనిపండు

3. ఆలుమొగని పండు అనుకూలమా పండు
కాలువలును రెండు కలిసియుండిన పండు
ఫాలభాగమునందు ప్రత్యక్షమా పండు
కాలూని దూతల కడకు జిమ్మినపండు ॥విక్ర॥

4. గురుశిష్యుల కనుకూలమైన పండు
గురుతుజేసుకొని కోన రుద్రాక్షపండు
పరశురాముల వీరికి రుజువై సదా పండు
నరసింహయోగికి నమ్మికైన పండు

ఇందులో పరమాత్మ ఆద్యంతాలు లేనివాడు, జనన మరణాలు లేనివాడు, అయిన నిర్గుణతత్త్వం ఒకటియేయై ఉన్నదని వేదం తెలిపిన పరమేశ్వర తత్త్వాన్ని చెప్తూ అది యోగసాధనవల్ల సిద్ధిస్తుందని, దానికి గురూపదేశం అవసరమని యోగి గారు దాసుగారికి స్పష్టంచేశారు.

ఇందుకు సమాధానంగా వేంకటదాసు ఈ కీర్తనను యోగికి పంపారట.

"ఎరిగి నందుకు గరుతు యెరుకయే సాక్షి
ధరకల్ల నిజములకు దైవమే సాక్షి ॥ప॥

1, పరతత్త్వ జ్ఞాన పరుడైన యందులకు
మరిలోక భ్రమలెల్ల మానుటే సాక్షి
గురుపాద భక్తుడవైన యందులకు
విరివియైన విషయములు విసుచుటే సాక్షి ॥ఎరిగి॥

2, వేదబోధానంది విమలుడై నందులకు
వాద భేదములెల్ల వదలుటే సాక్షి
తనువులో తత్త్వంబు తాదెలిసి నందులకు
తనువుపై మోహంబు దగులనిదే సాక్షి ॥ఎరిగి॥

3. అనయంబు నే గంటి హరినెరిగి నందు
మనసులో కుహకమును మానుటే సాక్షి ॥ఎరిగి॥

గురూపదేశం ద్వారా పరతత్త్వాన్ని దెలుసుకున్నా సంటావు. అట్టి నీవు వాద భేదాలు వదిలితే కదా జ్ఞానవంతుడవైనట్లు? మోహంతో వాదానికి దిగటం జ్ఞాని లక్షణం కాదు. మనసులో మర్మం లేకుండా తానిమాట చెప్పటమే తాను హరిని కనినట్లు సాక్ష్యం అని దాసుగారు యోగికి తెలిపారు.

దరకల్ల నిజములకు దైవమే సాక్షి, వాద ప్రతివాదాలేలా అను దాసుగారి మాటలకు సమన్వయ ధోరణి అవలంబించిన నరసింహ యోగి ఈకీర్తనను పంపారట

"మనము సందేహించనేలా హరిని ॥ప
కనుగొందుమయ్యా అవలీలా
అనుమానమును మానరయ్యా
సదానందంబుమది బూనరయ్యా ॥మనము:

1. అందరము సంతోషమొంది
మేలు జెందుట అందమైయుంది
ముందుగా సుజ్ఞాన మొందీ
చూడబొందితా బ్రహ్మానందమై యుందీ ॥మనమ:

2. చిత్తంబు హరి వశము గాను
మనసు హత్తించి రావేడ్కతోను
మత్తేభ వరదుడీమాట
మనలను మన్నించి తెల్పనిచ్చోట ॥మన:

3. సరస రాకమచర్ల శౌరి
మనల సమ్మతి బించును వద్దజేరి

పరభక్తి, జ్ఞానంబు విన్న
జనులు పావనులు గదరన్నా ॥మనము॥

ఇదే కీర్తనను దాసుగారు మరల నృసింహ యోగిగారికి పంపారట. ఇందులో "వరభక్తి, జ్ఞానంబు విన్న, జనులు పావనులు గదరన్నా" అనే వాక్యాలు ఇరువురి సామరస్యాన్ని తెలుపుతున్నాయి, ఎవరి మార్గం వారికి గొప్పే. ఈ భక్తి, జ్ఞానా. లనే రెండు మార్గాల ద్వారా హరిని కనుగొనవచ్చు. మనమున సందేహం వదలుమనే ఒప్పందంవల్ల నృసింహ యోగి సంపూర్ణ యోగసిద్ధిని పొంది యుండలేదనిపిస్తుంది. ఈ సమన్వయ ధోరణే దాసుగారి శిష్యులు అతని భక్తిమార్గమే గొప్పదని యోగి అంగీకరించారని చెప్పుకొనేందుకు అవకాశాన్నిచ్చింది. మొత్తం మీద ఈ సంవాద కీర్తనల వల్ల వేంకటదాసు అనుసరించినది వైష్ణవమత సంబంధమైన "భక్తి" మార్గమే అని తేలింది.

అచ్చుకానివని చెప్తున్న ఈ సంవాద కీర్తనలలో చాలవరకు అచ్చులో ఉన్నవే ఉన్నాయి. "రాకమచర్ల కీర్తనలు" అనే గ్రంథం 1930, 1977, 1980 సంవత్సరపు ప్రచురణలను పరిశీలించాను. ఫలితంగా ఈ సంవాదానికి సంబంధించిన కీర్తనలలో ఈ క్రింద తెలుపబడిన కీర్తనలు అచ్చులో ఉన్నవే అని తేలింది. ఆ కీర్తనలు ఇవి :-

1. పావనమై యునన్నదయ్యా రామనామం —
(రా. కీ. 1930 ప్ర 97 పే, 1977-94 పే, 1980-86 పే).

2. మదిలోన సేవించరాదా —
(రా. కీ. 1930-30 పే, 1977-34 పే, 1980-26 పే).

3. హరి ధ్యానంబె పరమ పదము—
(1930-100 పే, 1977-97 పే, 1980-89 పే).

4. మాటలాడిన ముక్తిరాదు—
(రా. కీ. 1930-30 పే, 1977-35 పే. 1980-27 పే)

5 ఎంతో చక్కని దేవుడమ్మ -
(రా.కీ. 1930.46 పే. 1977.48 పే, 1980.40 పే).

6. నారాయణుని పేరె -
(రా. కీ. 1930.30 పే, 1977 35 పే, 1980.27 పే).

7. దొరలకెల్లాను దొరగదమ్మా -
(రా. కీ. 1930.46 పే, 1977.49 పే, 1980.41 పే).

8. సీతారామదాసూలాను -
(రా. కీ. 1930.81 పే 1977.81 పే, 1980.73 పే)

9. కనుగొందునయ్యా మీపదసేవా -
(రా. కీ. 1930.7 పే, 1977.13 పే, 1980.5 పే),

ఈ సంవాదంతో నృసింహ యోగి కీర్తనలుగా చెప్పబడుతున్న ''నేజూచినానే- అపోజ్యోతిని" అనే కీర్తన ''నేజూచినానే - అంతర్లక్ష్యమును" అనే కొద్ది మార్పుతో ''రాకమచర్ల కీర్తనలు" అనే పుస్తకంలో రాకమచర్ల కీర్తనగా (1930_7 పే, 1977_14 పే, 1980_6 పే) అచ్చయింది. అట్లాగే ''చూడుచూడు హరిని గూడు నేడు మనసున" అనే కీర్తన కూడా (1930_31 పే, 1977_35 పే, 1980_27 పే) రాకమచర్ల కీర్తనగా అచ్చయింది. "ఉన్నదేమో ఉన్నదీ గురురాయుడాజ్ఞ"- అనే కీర్తన కూడా (1930_26 పే, 1977_31 పే, 1980_23 పే) రాకమచర్ల కీర్తనగా అచ్చయింది. పై కీర్తనలన్నీ చరణాలు వెనుక ముందులుగా స్వల్ప మార్పులతో, చేర్పులతో రాకమచర్ల వేంకటదాసు కీర్తనలుగా అచ్చయినవే.

ఈ భక్తి జ్ఞాన సంవాద కీర్తనలలో వేంకటదాసు పేరో, తత్సంబంధ దైవము పేరో, అట్లే శ్రీ నృసింహ యోగి పేరో లేదా వారి గురువు పేరో ప్రస్తా వించబడి వుంది. అట్లా ఉన్న కీర్తనలు ఎవరివో నిర్ధారించి చెప్పే వీలు కలుగు తున్నది. కాని ఇందే గల కొన్ని కీర్తనలలో ఎవరి ప్రస్తావనా లేకపోవటంచేత ఆ కీర్తనలు ఎవరివో నిర్ధారింప వీలుకాకున్నది. అట్టి కీర్తనలివి. పదోరోజుదిగా చెప్ప

బడిన "ఎరిగినందుకు గురుతు యేరుకయే సాక్షి—" అనే భక్తిమార్గ కీర్తన, పద కొండవ రోజున "మనమున సందేహించనేలా—" అనే భక్తి, జ్ఞాన మార్గాలకు సంబంధించిన కీర్తన, "యోగికేయెరుక పరమయోగామృతెరగూ—" అనే జ్ఞాన మార్గ కీర్తనలు అట్టివి. "ఎరిగినందుకు గురుతు—" అని భక్తి మార్గంలో చెప్పబడిన కీర్తనలో చివరి చరణంలో "అనయంబుయేగంటి హరి నెరిగినందులకు" అని ఉన్నది. కాబట్టి ఇది యేగంటి కీర్తనై యుండవచ్చునని యూహింప వీలు ఉన్నది.

"రాకమచర్ల కీర్తనలు" అనే పుస్తకంలో సంవాద కీర్తనలనే విభజన లేక పోవటంచేత, నృసింహ యోగి జ్ఞానమార్గ కీర్తనలని చెప్పబడ్డ వాటిలో రాకమచర్ల కీర్తనలు, పైన వివరించినట్లు పేరు, ఊరు లేని కీర్తనలు ఉండటంచేతను ఈ సంవాద కీర్తనలను వేంకటదాసుగారి అభిమానులు కూర్చియుంటారని మాత్రం చెప్ప వీలు లుగుతున్నది. ఒకవేళ నిజంగా వేంకటదాసుకు నృసింహయోగికి సంవాదమే జరిగివుంటే ఆ కీర్తనలు సమగ్రంగా లేవని కూడా చెప్పవచ్చు. పుస్తకంలో ఉన్న మానసపూజ మొదలైన విధంగా "సంవాద కీర్తనలు" అనే విభజన లేక పోవటం చేత ఈ కీర్తనలు అచ్చుకాలేదనే అపోహతోనే సామాన్య జనులు ఉన్నారు.

## వేంకటదాసు కీర్తనల్లో భక్తి

పైన తెలిపిన విషయ వివేచన వల్ల వేంకటదాసు అనుసరించింది అద్వైతికమైన వైష్ణవభక్తి మార్గమని తేలింది. ఇక వీరి కీర్తనలలోని భక్తిని పరిశీలించేందుకు ముందుగా "భక్తి" అంటే ఏమిటి ? కీర్తనాస్వరూపమెట్టిది ? అనే విషయాలను గూర్చి కొంత తెలుసుకుందాం.

### భక్తి అంటే ఏమిటి ?

ఈ ప్రశ్నకు వైదిక సమాధాన మిట్టిది. వేదోక్తమైన కర్మ ఉపాసనాల స్థానంలో భక్తిమార్గ విధానం ఈ మధ్యకాలంలో చోటుచేసుకుంది. సామవేదంలో ఈశ్వర భక్తి, స్తుతి మొదలైన విషయాలు చెప్పబడ్డాయి. (ఈ. ర. సా. 22 పే) ఇచటి భక్తి శ్రద్ధాపూర్వకమైన సేవ అని అర్థం.

"అగ్నేనయ సుపథారాయే2స్మాన్ విశ్వానిదేవ వయునాని విద్వాన్
యుయోధ్యస్మ జుహురాణమేనో భూయిష్ఠాంతే నమఉక్తిం విధేమ
స్వాహా"

"అగ్నే, నయ, సుపదేతి, సు+పథా, రాయే, అస్మాన్, విశ్వాని, దేవ, వయునాని విద్వాన్, యుయోధి, అస్మత్, జుహురాణమ్, ఏనః భూయిష్ఠామ్, తే, నమ, ఉక్తిమితినమః, ఉక్తిమ్, విధేయః" (య. 7.43) అనే యజుర్వేద మంత్ర భావమిది. ఏ పురుషుడూ పరమాత్మ యొక్క ప్రియమైన భక్తిలేనిదే యోగసిద్ధిని పొందలేడు. ఎవడు ప్రేమతో భక్తి యుక్తుడై యోగబలంతో పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తాడో అతనికి దయాళువైన పరమాత్మ శీఘ్రంగా యోగసిద్ధిని కలుగజేస్తాడు. (య. భా. 7 అ. 478 పే).

దీన్ని బట్టి వేదం తెలిపిన ఉపాసనాది యోగాలను శ్రద్ధతో ఆచరించటమే 'భక్తి' అనే భావం గమ్యమౌతుంది. భిన్న వ్యక్తుల స్వార్థం నుండి ఏర్పడ్డ ఇట్టి మతాలు ఇట్టి వైదికార్థాన్ని వక్రీకరించి కరచరణాద్యవయవాలతో రూపుదిద్దుకున్న జడ స్వరూప విగ్రహాన్ని సేవించటమే 'భక్తి' అన్నాయి.

పరమేశ్వరుడు ఇంద్రియ విషయాలకంటే వేరై శరీర సంబంధం లేకపోవటం చేత నిర్గుణుడు, సృష్టికర్తృత్వ, వ్యాపకత్వాది గుణాలతో కూడి ఉండటం చేత సగుణుడు అనబడుతున్నాడు. గుణాలతో కూడింది సగుణం. గుణరహితమైంది నిర్గుణం తమతమ స్వాభావిక గుణాలతో కూడి ఇతర విరోధి పదార్థాల గుణాలనుండి రహితమవటం చేత అన్ని పదార్థాలతో సగుణ, నిర్గుణ భేదాలుంటాయి. కేవలం సగుణంగా, కేవల నిర్గుణంగా ఏ పదార్థమూ ఉండదు. ఒకే పదార్థంలో సగుణ, నిర్గుణాలు ఉంటాయని భావం. అట్లాగే 'పరమేశ్వరుడు తన అనంత జ్ఞానబలాది గుణ సహితుడవటం వల్ల సగుణుడని, రూపాది జడగుణాలు, ద్వేషాది జీవలక్షణాలు లేకపోవటం చేత నిర్గుణుడు అనబడతాడు". (స. ప్ర. 257 పే)

ఇట్టి పరమేశ్వర ఉపాసన కూడ సగుణ, నిర్గుణ భేదాలతో రెండు విధాలుగా ఉంటుంది. "జగత్తును రచించే శక్తి కలవాడు, శుద్ధుడు, కవి, మనీషి, పరిభువు, స్వయంభువు, మొదలైన పదాలతో పరమేశ్వరుడు వర్ణింపబడియున్నాడు. వీర్యం,

శుద్ధి మొదలైన గుణాలు కలిగి ఉండటంచేత సగుణుడని చెప్పబడుతున్నాడు. ఇట్టి ఈశ్వరుని సర్వజ్ఞత్వం, సర్వశక్తిమత్వం, సర్వవ్యాపకత్వం, సర్వస్వామిత్వం మొదలైన గుణాలను తెలుసుకుని ఉపాసించటమే సగుణోపాసన" (ఋ.భా.భూ. 324 పే).

అకాయ, అవ్రణ, అస్నావిరాది పదాలతో పరమేశ్వరుడు వర్ణింపబడియున్నాడు. కాయసహిత్వాది గుణాలు లేనందున నిర్గుణుడని చెప్పబడుచున్నాడు. పరమేశ్వరునికి జన్మలేదు. అతడు నిరాకారుడు. శరీరధారణ చేయడు. వ్రణ రహితుడు. శబ్ద, స్పర్శరూప రసగంధాది గుణాలు లేనివాడు. ద్విత్వాది సంఖ్యలు అతనిలో వర్తింపవు. పొడవు, వెడల్పు మొదలైన శబ్దాలతో చెప్పబడే పరిమాణం లేనివాడు; అని స్మరించటం నిర్గుణోపాసన. ఈ నిర్గుణోపాసనే ముక్తికి మార్గమని శ్వేతాశ్వతరోపనిషత్తు (6-11, 12) తెలుపుతున్నది.

ఇట్లా వేదశాస్త్రాలు తెలుపుతుంటే అవైదికంగా ఏర్పడ్డమతాలు, వాటి ప్రవక్తలు ఈశ్వరుడు దేహధారణ చేస్తాడని, అట్లా చేసినప్పుడు ఈశ్వరుడు సగుణుడని దేహాన్ని త్యజించినపుడు నిర్గుణుడౌతాడని వేద విరుద్ధ వ్యాఖ్యానాలతో ప్రజలను నమ్మించి మౌఢ్యాన్ని పెంచారు. పరమాత్మకు చరణాద్యవయవాలు లేవు. రూప రహితుడు. నిర్గుణుడు, ఈశ్వర నామం 'ఓం' కారము, ఇంద్రియాలకు అగోచరుడని వేదశాస్త్రాలు తెలుపుతుంటే తద్విరుద్ధంగా మతప్రోక్త పురాణాలు ఈశ్వరుడు స్వరూపుడని అనేక నామాలు కలిగినవాడని, కరచరణాద్యవయవాలను ఏర్పరచి గుణాలను అంటగట్టి విగ్రహారాధనకు పునాదులు వేశాయి. ఈ విగ్రహారాధన జైనుల కాలంనుంచి ప్రారంభమైనది. తరువాత వచ్చిన శైవ, వైష్ణవ మతాలు అర్చనాది రూపక ప్రక్రియల భక్తిమతాన్ని ప్రచారంలోకి తెచ్చి విచిత్ర విగ్రహభక్తిని నిలుపుకొన్నాయి.

"కార్యరూప జడ వస్తువులను ఉపాసించటంవల్ల కలిగే ఫలం వేరు, కారణ రూప పదార్థాన్ని ఉపాసించటంవల్ల కలిగే ఫలం వేరు అని విద్వాంసులు, ధీరులైన వారు "(ఈ. ఉ. 10 మం.) జగత్కారణ రూప పదార్థాన్ని తెలుసుకోవటం కోసం వేదం తెలిపిన ఉపాసనాది ప్రక్రియలను వక్రీకరించి భగవంతుడికి బదులు ఒక విగ్రహాన్ని కల్పించుకొని దానిని ఆవాహనాది ఉపసర్జన పర్యంతంగల షోడశోప

చరాది ప్రక్రియలతో పూజించటమే ఉపాసన అని, అదియే భగవంతుని సగుణో పాసనమని అవైదిక పౌరాణికులు తమ అనుయాయులైన ప్రజలకు ఉద్బోధిస్తున్నారు. కాని వేద విరుద్ధంగా విగ్రహాలనో, చిత్రపటాలనో పూజించటం భగవదుపాసన ఎన్నటికీ కాజాలదు ఇట్టి దానిని సాకార జడోపాసన అనవలసి వుంది. ఇట్టి జడోపాస వల్ల ముక్తి వస్తుందని, వాదనలు, చెయ్యటం - ఆచరించట, ఆత్మహత్యా సదృశమే గాని అన్యం కానేరదు.

"నిర్గుణం పరబ్రహ్మకే అనేక నామాలున్నాయి. అగ్ని (భస్మీకరణ శక్తి) కలవాడు, ఆదితుడు, సూర్యుడు (సమస్త భావ పదార్థాలను పరిణమింప జేసేవాడు) వాయువు(సమస్త ప్రాణులకు జీవ హేతువు) శుక్రుడు (వరతిశయ సామర్థ్యం కలవాడు) ప్రజాపతి (సృష్టిని పాలించేవాడు). (శ్వే. ఉ .1.) ఈశ్వరుడు (సత్యవిరచాశీల జ్ఞానం అనంత ఐశ్వర్యం కలవాడు) విష్ణువు (చరాచర జగత్తుకు వ్యాపకుడు) బ్రహ్మ అన్నింటిని మించి విరాజమానుడు. (పరమేశ్వరుడు) తనతో సమానుడెవడూ లేనివాడు రుద్రుడు. (దుష్టకర్మలు జేయువారి నేడ్పించువాడు) శంకరుడు (సుఖమును కలుగ జేయువాడు) శివుడు (కళ్యాణరూపుడు) శేష (ఉత్పత్తి ప్రళయమునకు మిగిలి యుండేవాడు). "(స.ప్ర. 16 నుండి 22 పే) ఇట్లా వేదం పరమేశ్వరుని వివిధ శక్తులను, గుణాలను బోధించేందుకు అగ్ని మొదలైన అనంత నామాలను పరమేశ్వర వాచకాలుగా ప్రయోగించింది. ఇట్టి వైదికార్థాలను విస్మరించిన పోరాటకులైన మతప్రవక్తలు శివ, విష్ణు నామాలతో జడ పదార్థాలను విగ్రహరూపంగా రూపించి పూజింప జేసినారు.

విగ్రహారాధకులు 'భజసేవాయాం' అనే ధాతువును ఆధారంగా చేసుకుని జడరూపక విగ్రహాలను సేవించటమే 'భక్తి' అని, మోక్షసాధన సామాగ్రిలో సేవారూపమైన ఈ భక్తి మతమే గొప్పదని ప్రచారం చేశారు. వైష్ణవ మతం ఈ భక్తి మార్గంలోనే జీవం పోసుకుంది.

## వైష్ణవ భక్తి స్వరూపం

"తిరునామములు సమగ్ర పరిశీలనము "(48 నుండి 52 పే) అనే గ్రంథంలో వైష్ణవ భక్తి స్వరూపం ఇట్లా చెప్పబడింది. కర్మరూపకమైన ఈ భక్తికి ఏడు అంగాలు చెప్పబడ్డాయి.

1. వివేకం : అంటే ఆహార శుద్ధిని పాటించటం. సత్త్వగుణాభివర్ధక మైన ఆహారన్ని భుజించటం అని భావం.

2. విమోకం : అంటే భోగాల ఎడ అనురాగం వ్యసన రూపకంగా లేకుండటం.

3. అభ్యాసం : భక్త్యాలంబనమైన భగవద్విగ్రహా్ని మాటిమాటికి పరిశీలించుకొనటం.

4. అనవసాదం : అమి వేళలా ఉత్సాహం ప్రదర్శించటం.

5. అనుద్ధర్షం : అతి సంతోషం లేకుండుట,

6. క్రియ : యథాశక్తి పంచమహాయజ్ఞాచరణం. దేవయజ్ఞం, బ్రహ్మ యజ్ఞం, పితృయజ్ఞం, మనష్య యజ్ఞం, భూతయజ్ఞం అనేవి వీరి మతంలో పంచ మహాయజ్ఞాలు.

7. లోకల్యాణం : సత్యం, ఆర్జవం, దయ, దానం, అహింస, పరద్రవ్య అనభిలాష కలిగి ఉండటం.

ఇందులో క్రియ అంటే యజ్ఞం అంటే దేవపూజ అని అర్థం చెప్పారు. ఈ దేవపూజను అయిదు విధాలుగా వింగడించారు.

1. అర్చామూర్తిని దైవంగా భావించటం (దేవయజ్ఞం)

2 భగవద్రూపాన్ని ప్రతి పాదించే వేదాధ్యయనం (బ్రహ్మయజ్ఞం)

3. ఉన్నత శక్తిని ప్రర్తించేట్లుగా చేసిన పితృదేవుల పూజ (పితృయజ్ఞం)

4. తోటి ప్రాణులను గౌరవించగలిగే మనోవికాసం ఏర్పరుచుకోవటం అంటే మానవునిలో మాధవుని చూడగలిగే భావం (మనుష్య యజ్ఞం)

5. ప్రాణికోటి ఆరాధన (భూత యజ్ఞం). భక్తులనుకూడ నాలుగు విధాలుగా విభజించారు.

1. అర్తుడు 2. జిజ్ఞాసువు.
3. అర్థార్థి 4. జ్ఞాని

ఇందు అర్తుడు, అర్థార్థి ఇరువురు ఐహిక ఐశ్వర్యకాముకులు. ఆత్మస్వరూపం తెలుసుకునే కాంక్ష కలవాడు జిజ్ఞాసువు భగవంతుని పొందదలచిన వాడు జ్ఞాని. జ్ఞాని ఉత్తమ భక్తుడని, కర్మ జ్ఞానాలనుండి ఉద్భవించిందే 'భక్తి' అని వైష్ణవుల అభిప్రాయం. ఈ భక్తి సిద్ధాంతంలోని సమంజస, అసమంజసాలను పరిశీలిద్దాం.

"యజ్ఞోవై విష్ణు: (1.2.13) అనే శతపథ బ్రాహ్మణమంత్రాన్ని బట్టి విష్ణువునకు యజ్ఞమని నామమున్నది. సమస్త జగత్తుకు వ్యాపకుడై యుండటం చేత పరతత్త్వం విష్ణువనబడతాడు. "ఆయర్ యజ్ఞేన కల్పతాం" (18.29) అనే యజుర్వేద మంత్రం మనుషులు తమ ఆయువునంతటిని ఈశ్వరుని సేవించటానికి, ఆతని ఆజ్ఞలు పాలించటానికి సమర్పించాలి. అట్లా ప్రాణాన్ని, నేత్రం, శ్రోత్రం, వాక్కు మనము, సర్వ క్రియలకు సంబంధించినవి ద్య, స్తుతిస్తోత్రాదులన్ని పరమేశ్వర నిర్మితాలే ; కనుక ఇట్టి సర్వంపరమేశ్వరునికే అర్పించాలి. "యజ్ఞేన యజ్ఞమయజన్త దేవా ;" (31.6) అనే యజుర్వేద మంత్రం, విద్వాంసులను దేవతలంటారు. వారు స్తుతి, ప్రార్థన, ఉపాసనలచే పూజనము మూలమున ఆ పూజనీయుడైన పరమేశ్వరుని పూజిస్తారు. (ఋ. భా. భూ. 228పే) అని చెప్పుచున్నది. ఇచట, నిర్గుణ తత్త్వాన్ని స్తుతి, ప్రార్థన, ఉపాసనలద్వారా తెలుసుకుంటారు అనే అర్థం, అంతే గాని యజ్ఞంద్వారా షోడశోపచార పూజావిధానంతో విగ్రహారాధనమని అర్థం కాదు. "యజ్ఞము మానవ సముదాయానికి సుఖం కలిగించేందుకు చేయబడుతుంది. సంస్కరింపబడిన ద్రవ్యములను అగ్నియందుహోమమొనర్చు విద్వాంసుడైన మానవుడు స్వయంగా ఆనందిస్తాడు (తే. 2బ్రా. అ2.మం).

వేదాహమేతం (31.18) అనే యజుర్వేద మంత్రంలో "నాన్య: పంథావిద్య తేయనాయ" అనేభాగం "వ్యావహారిక, పారమార్థిక సుఖాలనొసంగేమార్గం పరమేశ్వర ఉపాసన అతని జ్ఞానం తప్పమరియొకటిలేదు. అన్య పదార్థాలను ఉపాసించిన మనుజునికి దుఃఖమే లభిస్తుంది. (ఋ. భా, భూ. 282 పే) అని తెలుపుతుంటే కర్మ, జ్ఞానాలనుండి ఉద్భవించింది భక్తి అ భక్తిద్వారా జడపదార్థమైన విగ్రహ పూజతో

ముక్తి వస్తుందని చెప్పటం సత్యజ్ఞానం యెడల అవగాహనలోపించగా చేసిన విపరీత వ్యాఖ్యానాల ఫలితమే అని చెప్పవచ్చును.

యజ్ఞం ఎట్లా జగదానందదాయకమో, పరోపకారమో ఋగ్వేదాది భాష్య భూమిక ఇట్లా వివరించింది. (ఋ. భా. భూ. 82 టు 100పే) సకామ కర్మవల్ల సర్వజనసౌఖ్యమున్నను కర్తకే అధిక సుఖం కలుగుతుంది. సర్వ మానవ సౌఖ్యం కోరి యజ్ఞం జరుగుతుంది. సంస్కరింపబడిన ద్రవ్యాలను అగ్ని యందు హోమం చేసి విద్వాంసుడైన మానవుడు స్వయంగా ఆనందిస్తాడు. యజ్ఞం అంటే అగ్ని అని నిరుక్తం (అ 8.207) అర్థం చెప్పింది. యజ్ఞాగ్ని మనుషుల చేత ప్రశంసింప బడుతుంది. కాబట్టి అగ్నియే యజ్ఞమని తన భావాన్ని చెప్పింది. అగ్నిహోత్రం నుండి అశ్వమేధం వరకున్న కర్మలతో కస్తూరి కుంకుమ పువ్వు మొదలైన సుగంధ ద్రవ్యాలు, బెల్లం, తేనె మొదలైన తీపి వసువులు, పాలునెయ్యి వెన్న వంటి బలవర్ధక వస్తువులు, సోమలతాది రోగ నిరోధక ఓషధులు శుద్ధిచేసిన తరువాత హోమద్రవ్యాలుగా వాడబడతాయి. హోమంచేయదలచిన వ్యక్తి హోమవిద్యబాగా నేర్చుకొని ఉండాలి. ద్రవ్యం, సంస్కారం, ఉపయోగం అనే మూడు యజ్ఞకర్తకు ముఖ్యమైన క్రత ధర్మాలు. మనం నిత్యం తినే శాక, పాకాదులలో నెయ్యి సుగంధాదిద్రవ్యాలతో తిరగబోత పెట్టుకుంటాము కదా! దానివల్ల కూరలు సుగంధితాలై ఎట్లారుచి కలిగిస్తున్నాయో అట్లాగే యజ్ఞంలో అగ్నిలో హోమం చేయబడిన హోమద్రవ్యాలు కూడా సుగందితాలై వాయువుతో చేరతాయి. ఆవాయువు వర్షపు జలాన్ని నిర్దోషంగా చేయటం సంభవిస్తుంది.

అగ్నిలో వ్రేల్చబడ్డ హోమ ద్రవ్యం నుండి ధూమ, బాష్పాలు, ఉత్పన్నాలై తాయి. వృక్షాలు, ఓషధులు వనస్పతులు, జలము మొదలైన పదార్థాలలో అగ్ని ప్రవేశించి వాని యందలి రసాన్ని వేరు చేస్తుంది. ఆకాశమునందున్న జలాశయం "భాష్పం" అనబడుతుంది. శుష్కాంశమును 'పార్థివ' మంటారు. ఈ రెంటి సమ్మేళనము ధూమమౌతుంది, ఈ ధూమం, వాయువు ఆధారంగా ఆకాశంలో ఒక దానిలో నొకటి కలిసి మేఘాలవల్ల వర్షం సంభవిస్తుంది. కాబట్టి అగ్నివల్లనే వృష్టి తన్మూలాన ఓషధులు అన్నం, వీర్యం, శరీరం దానివల్ల కర్మలు క్రమంగా ఏర్పడతాయి.

మంత్రం :-

మననం చేయబడేది మంత్రం. యాస్కాచార్యుల వారు నిరుక్తంతో (7-12) మంత్రాన్ని గూర్చి ఇటా తెలిపారు "మననము వల్ల మంత్రం, ఆచ్ఛాదనం వల్ల ఛందస్సు లనబడుతున్నాయి. మత్రి, ధాతువుకు షుష్ ప్రత్యయం చేరి మంత్రశబ్ద మేర్పడింది. మత్రి ధాతువుకు గుప్త పరిభాషణమని అర్థం. గూఢ పదార్థాల జ్ఞానం దేనివల్ల కలుగుతుందో అట్టి వేదం మంత్రం అనబడుతుంది. జ్ఞానార్థకమైన మన ధాతువుపై ష్ట్రన్ ప్రత్యయం చేరి మంత్ర శబ్దం ఉత్పన్నమవుతున్నది. దేనివల్ల దేనియందు మానవులు సత్య పదార్థాన్ని తెలుసుకుంటారో ఆ వేదం 'మంత్రమ'ని భావం. (ఋ. భా. భూ 142 పే) మంత్రాలు పరోక్షాలు, ప్రత్యక్షాలు, ఆధ్యాత్మికాలని మూడు విధాలు "ఈ విశ్లేషణవల్ల మంత్రాలు భూత భవిష్యత్ వర్తమాన కాలము లందలి పదార్థాలను, విధులను గురించి తెలుపుతున్నాయి కాబట్టి మంత్రాలు దేవతలు" (ఋ. భా. భూ, 108 పే).

ఇప్పుడు దేవుడు - దేవతా శబ్దాలను గూర్చి వేదశాస్త్రాలు ఏమి చెప్పాయో తెలుసుకుందాం. వీటికి సంబంధించిన కొంత వివరణ మొదటి ప్రకరణంలో ఉంది. సృష్టి స్థితిలయాల కెవడు మూలకారకుడో ఆ పరమాత్మ దేవుడు "ఋచో అక్షరే పరమేవ్యోమన్" (మం. 1 సూ. 164 మం. 39) అనే ఋగ్వేద మంత్రం ఇందుకు ప్రమాణము. శతపథ బ్రాహ్మణం పదునాల్గవ కాండంలో (14 కాం. 5 ప్ర పా. 7 బ్రా 4 మం) ముప్పదిమూడు దేవతలను వర్ణించి, అన్నిటికి స్వామియైన ముప్పది నాల్గవ పరమాత్మయే ఉపాస్య దేవుడు." అని తెలిపింది.

దివ్య గుణాలతో కూడియున్న పదార్థాలు దేవతలు. కాగా గాయత్రాది ఛందస్సులు వాటితో కూడిన మంత్రాలు దేవతలని శతపథ బ్రాహ్మణం (8-2,3) తెలుపుతున్నది. సర్వార్థాలను ప్రకాశింప జేస్తున్నాయి కాబట్టి అవి దేవతలని భావం.

ఏ వేదమంత్రం వల్ల కర్మ సంపత్తి, మోక్ష లాభం, పరమేశ్వర ప్రాప్తి కలుగుతుందో ఆ వేదమంత్రాలను, వాటి యర్థాలకు 'దేవత' అని పేరు. వేని గుణాలు వర్ణింపబడతాయో వాటిని దైవత మంటారు. మంత్రాలలో ఏయే అర్థాలకు ఏవే సంజ్ఞలు మంత్రోక్తాలున్నాయో అవి అన్ని దేవతా లింగాలు. (ఋ. భా. భూ.

107) ఉదాహరణకు "అగ్నిం దూతంపురోదధే హవ్యవాహముపబ్రువే" (22.17) అనే యజుర్వేద మంత్రం అగ్ని గుణాలు వర్ణించి ఉన్నందున అగ్ని శబ్దం దేవతకు చిహ్నంగా గ్రహింపబడింది. దేవతా శబ్దంచేత ఏఏ గుణంతో, ఏఏ అర్థం గ్రహింప బడుతుందో అనే విషయాన్ని నిరుక్త బ్రాహ్మణాది గ్రంథాలు విపులంగా వర్ణించాయి.

"మనుష్యార్థ ప్రతిపాదకములైన మంత్రాలకు మనుష్యులే దేవతలు. మానవేచ్ఛ, కామన, ప్రార్థన గల మంత్రాలలో కామనయే దేవత అని సకాములైన లౌకిక జనాభిప్రాయం. ఒకయెడ పూజలు ఉపకారులైన విద్వాంసులు, అతిథి, ఆచార్యులు అట్లాగే వ్యవహారయోగిత్వం, పరమార్థ ప్రకాశత్వం మొదలైన దివ్యగుణాలు కలిగి యుండటం చేత తల్లి, తండ్రి కూడా దేవతలనబడుచున్నారు." అని నిరుక్తకారుల మతం. (ఋ. భా భూ. 110).

ఈ దేవతావిషయాన్ని ఋగ్వేదాదిభాష్య భూమిక ఇట్లా తెలిపింది (ఋ.భా. భూ. 126) దేవతలు మూర్తిమంతాలు, అమూర్తి మంతాలని రెండు విధాలు. అగ్ని ఆదిత్యుడు, పృథివి, చంద్రుడు, నక్షత్రాలు, తల్లి, తండ్రి, అతిథి, ఆచార్యుడు, మూర్తి మంతాలైన దేవతలు. ఏకాదశరుద్రులు, ద్వాదశ ఆదిత్యులు, మనస్సు పంచేంద్రియాలు అంతరిక్షం, వాయువు మొదలైనవి అమూర్తి మంతాలైన దేవతలు. వీటన్నిటికన్న వేరై అమూర్తిమంతమైన పరబ్రహ్మ మానవులకు ఉపాసింప తగినవాడై యున్నాడు. వేదంలో ఈతడు తప్ప మరెవ్వరు ఉపాస్యులనికాని, పూజ్యులనికాని చెప్పబడి యుండలేదు.

ఇట్లా అక్షర బ్రహ్మవల్ల వేదం. వేదంవల్ల సత్కర్మ, సత్కర్మవల్ల యజ్ఞం కలుగుతున్నాయి. నిష్కామబుద్ధితో చేయబడేయజ్ఞకర్మవల్ల చిత్తశుద్ధి, ఆత్మజ్ఞానం కలుగుతుంది. తద్వారా మోక్షం లభించును; అనే వైదిక జ్ఞానాన్ని విస్మరించి పంచ మహాయజ్ఞాల పేరుతో రూపమే లేని భగవంతుని అర్చామూర్తిగా సృష్టిజేసి దానినే దైవంగా భావించటం దేవయజ్ఞమని, గుణవర్ణన ద్వారా నిరాకార పరబ్రహ్మను తెలిపే వేద మంత్రార్థాలకు విపరీతార్థాలను చెప్పి భగవద్రూపాన్ని ప్రతిపాదించే వేదాధ్యయనం బ్రహ్మయజ్ఞమని, జ్ఞానార్జనకు ఉపయోగపడే పితృయజ్ఞాన్ని ఉన్నత శక్తిని గుర్తించేట్లుగా చేసిన పితృదేవులనే పూజ చేయుటం పితృయజ్ఞమని

చెప్పటం, వైశ్వదేవాన్ని సంకుచిత పరచి విభజించి మనుష్య యజ్ఞం. భూతయజ్ఞం అని చెప్పటం వైష్ణవ అవైదిక జ్ఞానానికి నిదర్శనం.

వేదం జీవేశ్వరులు అనాదులని చెప్తూంటే వైష్ణవ పరిభాషలో అచిత్తు అనబడే ప్రకృతి కూడా అనాదే అని చెప్పటం, నిర్గుణుడు, నిరాకారుడు, సర్వవ్యాప్త 'ఓం' కార నామకుడైన పరబ్రహ్మను ఉపాసించాలని వేదం తెలుపు తుంటే నారాయణాది నామాలతో జడ స్వరూప సేవనమే ఉపాస్యమని చెప్పటం వేదం, జ్ఞాన సంపాదన వల్ల మోక్షం ప్రాప్తిస్తుందని చెప్తుంటే రామ, నారాయణ, కృష్ణ, శ్రీనివాసాది నామ స్మరణమే మోక్షదాయక మనటం, వేదం వివేచించిన పరమేశ్వర సగుణ, నిర్గుణ స్వరూపము లందలి సత్య విషయాన్ని అజ్ఞానంతో వ్యాఖ్యానించి పరబ్రహ్మ సగుణుడే అంటారు. అతనికి కరచరణాద్యవయవాలను కల్పించటం, ఈశ్వరుడు అజన్ముడు అనంతుడు సర్వవ్యాప్తి సర్వనియతుడు, అని చెప్పిన వైదిక పరమేశ్వర విషయానికి విరుద్ధంగా ఈశ్వరుడు జన్మమెత్తు తాడాని అవతారవాదాన్ని ప్రచారం చేయటం, పాపఫలితాన్ని జీవుడు తప్పక అనుభవించాలనే వేదవాణికి విరుద్ధంగా భగవద్భక్తి సర్వపాపాలను పోగొట్టి భగవత్సాన్నిధ్యాన్ని కలిగిస్తుందని చెప్పటం చేత వైష్ణవము, వైష్ణవ ప్రతిపాదక భక్తి అవైదికము, అసత్యభాషణము. స్వార్థపూరితము అని అది సర్వసమ్మతము కాక ప్రజలను కష్టముల పాల్జేసేదిగా ఉందని గ్రహించాల్సి ఉంది.

'మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసీ' అనేసినాదాల ద్వారా—వేదం తెలిపిన మోక్ష మార్గసాధనాలను వదిలి - భక్తియే మోక్షదాయకమని అసత్య ప్రచారాలు జరిగాయి. 'లౌకిక విషయాలలో కలిగే ప్రీతి, ఆసక్తిరతి అనబడే చిత్తవృత్తిని భగవత్పరంగా మరల్చి, అతని యందేనెక్కొన జేసినచో అది భక్తిగా పరిణమిస్తుంది. ఈ భక్తి తైలధారవలె ఎడతెగనిదై సాగాలి. సర్వేశ్వరుణ్ణి అఖిలహేతు ప్రత్యనీక కళ్యాణ గుణాలను కీర్తించటం, తల్లీలాదులను స్మరించటం, తన్మంగళమూర్తిని దర్శించటం. దానినర్చించటం భక్తి వెలయించే కృత్యాలు" (శ్రీ మ.భా.శాం ప. 6వ సం. పీఠిక) ఇట్టి కృత్యాలు కలిగిన భక్తిలో అవైదిక కర్మలే తప్ప జ్ఞానాన్ని కలిగించే వైదిక కర్మలే లేనందున ఇది ముక్తికి సాధనం కానేరదు.

ఇట్టి భక్తిని భాగవతం తొమ్మిది విధాలుగా విభజించింది. (భా.గ.స్కం. 5స.-శ్లో) వీటినే నారదుడు హెచ్చుతగ్గులుగా జేసి పదకొండు విధాలుగా చెప్పాడు. (నా. భ. సూ. '2 సూ.)

1. శ్రవణం : భగవద్గుణ మహిమలు వినటం.
2. కీర్తనం : భగవంతుని గుణాలు గానంచేయటం.
3. స్మరణం : భగవంతుని సర్వవ్యాపకత్వాదులు స్మరించటం.
4. పాద సేవనం : భగవంతుని పాదాలను సేవించటం.
5. వందనం : భగవంతునికి నమస్కారం చేయటం.
6. అర్చనం : భగవంతుని పూజ చేయటం.
7. దాస్యం : భగవంతుని ఆజ్ఞను పాలించటం
8. సఖ్యం : నిస్వార్థ స్నేహం.
9. ఆత్మ నివేదనం : భగవంతుని శరణు వేడటం

నారదుడు తెలిపిన ఏకాదశ విధ భక్తులివి

1. గుణమాహాత్మ్యాసక్తి 2. స్మరణాసక్తి
3 రూపాసక్తి 4. పూజాసక్తి
5. దాస్యాసక్తి 6. సఖ్యాసక్తి.
7. ఆత్మనివేదనా సక్తి 8 వాత్సల్యాసక్తి
9 కాంతాసక్తి 10. పరమ విరహాసక్తి 11. తన్మయతాసక్తి.

భాగవతం తెలిపిన శ్రవణ, కీర్తనలను గుణమాహాత్మ్యాసక్తి గాను, పాదసేవా నాన్ని రూపాసక్తిగా, ఆత్మనివేదనాన్ని ఆత్మనివేదనాసక్తి, వాత్సల్య, కాంత, పరమ విరహ, తన్మయతాసక్తులుగా విభజించటం జరిగింది. ఈ భక్తుల వివరణ కీర్తనలతో సమన్వయం చేసేప్పుడు తెలుపుతాను.

ఆలంకారికులు రసదృష్టితో చెప్పిన ఐదు భక్తి భేదాలివి.

1. దాస్య రస భక్తి 2. సఖ్యంస భక్తి
3. వాత్సల్యరస భక్తి 4. మధురభక్తి 5. శాంత భక్తి.

## భక్తి నిర్వచనాలు

భక్తి భేదాలు ఆధారంగా నిర్వచనాలు చేసి ఉండటమో లేక భక్తిని నిర్వచించి తదనుకూలంగా విభజించటమో జరిగి ఉంటుంది. ఏది ఏమైనా ఈ భక్తిని గూర్చి "నారద భక్తి సూత్రాలు" అనే గ్రంథం విపులంగా విస్తరించింది.

"భగవంతుని యెడ పరమ ప్రేమ; భక్తి" అని నారదుడు భక్తిని నిర్వచించాడు. (నా. భ. సూ. 1-2) అనన్య భక్తితో యదార్థంగా నన్ను తెలిసి కోవటం, చూడటం, ప్రవేశించటం జీవుడికి శక్యమని గీత తెలిపింది. (భగవద్గీత 11-54). సర్వాచరణాలు భగవదర్పితం చేయటం, ఒక వేళ ఈశ్వరుడు మరపునకు వస్తే వికలుడవటం భక్తి అని నారదుని మతం (నా. భ. సూ. 1-19) అంటే సమస్తం భగవదర్పితం చేసి, ఆతని వియోగాన్ని సహింప లేకుండటం భక్తి అని భావం. దీన్నే అనన్య భక్తి అన్నారు.

"భగవత్పాదములందు ప్రీతి కలిగి ఉండటం భక్తి" అని వ్యాసుని అభిప్రాయం (నా. భ. సూ. 1-16) కాయిక, వాచిక, మానసి కాలని భక్తిని మూడు విధాలుగా విభజిస్తే ఈ నిర్వచనం కాయిక భక్తికి చెందుతుంది. ఇది భగవంతుని చేరేందుకు మొదటి సోపానమని వైష్ణవ పెద్దల అభిప్రాయం "భగవంతుని కథాదులు వినటం భక్తి" అని గర్గుని మతం (నా. భ. సూ. 1-17) ఈ నిర్వచనం వాచిక భక్తికి చెందుతుంది. భగవంతుని నామజపం సంకీర్తనం, పూరాణపఠనం, హరికథా గానం, స్తోత్రాదులచే అర్చించటం వంటి క్రియలు వాచిక భక్తికి చెందుతాయి.

"ఆత్మరతికి భంగం కలిగించనిదే భక్తి" (నా. భ. సూ. 18సూ) అంటే కప్పవలె బెకబెకలాడటం చాలదు. నామంతో పాటు రూపం కూడా స్మరించాలి. అప్పుడే ఆత్మానందం కలుగుతుందని శాండిల్యుని భావం. పరమేశ్వరునికి రూపం లేదు. ఆతని యునికిని తపించి, ఉపాసనా యోగం ద్వారా తెలుసుకోవాలని వేదం తెలుపుతున్నది. అంతేగాని రూప స్మరణవల్ల ఆత్మానందం కలుగదు.

మొత్తం మీద లౌకిక విషయాలలో కలిగే ప్రీతి, ఆసక్తి, రతి మొదలైన చిత్త వృత్తులను భగవత్పరంగా మరల్చి, రామ, కృష్ణ, నారాయణాది నామాలతో, కరచరణాద్యవయవాలతో రూపుదిద్దుకున్న పరమాత్మయందే మనసు నిలిపి ఆత్మను

అట్టి పరమాత్మతో అనుసంధించు బడుచుండే అనుభవమే "భక్తి" అనే సారాంశం తెలిపింది.

"యుజేవాం బ్రహ్మ పూర్వం నమోభిర్విశ్లోక" (యు. 11.5) సత్యమైన ప్రేమ భావంతో నీ ఆత్మను అర్పణ చేసుకుని నమస్కారాది రీతులలో ఉపాసించి నపుడు నేను నిన్ను ఆశీర్వదింతును. విద్వాంసునకు ధర్మ మార్గము ప్రాప్తించునట్లు మీకును సత్యాన్ని సేవించటం వల్ల సత్కీర్తి లభిస్తుంది. "యునక్తు సీ రాః యుగా" (య. 12.68) పరమాత్మని యోగమువల్ల నాడులలో ధ్యానము నర్చి పరమానందంతో ముక్తులు కండు. వేదవాణి ద్వారమున పరమాత్మని యోగమువల్ల యిందు యుక్తులై అతని స్తుతి, ప్రార్థనోపాసనల యందు ప్రవృత్తులుకండు" (ఋ. భా. భూ. 276, 278) మొదలైన వేద మంత్రాలు ఉపాసనావిషయాన్ని తెలుపు తున్నాయి. ఈ మంత్రాలలో ఆయా సందర్భాలలో ప్రయోగింపబడిన ప్రేమ, ప్రార్థన, సేవనం మొదలైన పదాలకు గల సత్యార్థాన్ని గ్రహించలేక, వేదవిరుద్ధంగా తమతమ మతానికి అనుకూలమైన అర్థాలను చెప్పుకొనటం చేతనే 'భక్తి' అనే మార్గం ఏర్పరచారని పైన తెలిపిన భక్తి విభజనను బట్టి చెప్పవచ్చు. ఉదాహరణకు నవవిధ భక్తులలో ఒకటైన 'అర్చనం' అనే మార్గాన్ని గమనిద్దాం "అర్చిరాదినాతత్ ప్రథతేః" (య. 4.3.1) శరీరం నుండి మూర్ధన్య నాడిద్వారాన బయటపడి యుపాసకుడు దేవయాన మార్గంగు అర్చిరాది మార్గాన బ్రహ్మలోకాన్ని పొందుతాడు. ఇచట అర్చి పదం కిరణవాచకం అంటేరశ్మి" అని వేదాంత దర్శనం తెలిపింది. (వే. దర్శనం. 700పే) బహుశః ఈ అర్చిమార్గమే భక్తి మార్గంలో అర్చనం అయివుంటుంది.

## భక్తి లక్షణం

శాండిల్య, నారద భక్తి సూత్రాలను వివరించిన "భక్తి తత్త్వ దర్శనము", "రత్నయుగళి" గ్రంథాల ఆధారంగా భక్తి లక్షణాన్ని ఇట్లా చెప్పవచ్చు. భక్తి స్వరూపాన్ని వివరించటం చేతగానిపని. మూగవాడు రుచి గ్రహించి ఎట్లా చెప్పలేడో అట్లాగే ప్రేమ రూపకమైన భక్తి స్వరూపం కూడా అనిర్వచనీయమైయుంది. భక్తి, గుణ శూన్యం, కామనా విరహితమునే లక్షణంగా వృద్ధి చెందుతుంది. ఈవృద్ధి

అతి సూక్ష్మమై ఉండి, అనుభవమే రూపముగా కలిగి యోగ్యుని విషయం మాత్రమే ప్రకాశిస్తుంది. భక్తి పరాకాష్ట నందుకొన్నవాడు అన్నిట భగవంతు చూస్తాడు. సమస్తం ఆ పరమాత్మ దివ్యకళామయమని తలంచుతాడు. శాం ఆనందం అట్టి భక్తి రూపాలు. దుఃఖాన్ని గూర్చి చింత చేయడు భక్తి సిద్ధిం టానికి ముందుగాని తర్వాతగాని భక్తుడు లోక వ్యవహార విముఖుడు కానక్కరలేద ఫల క్రర్మాచరణ చేస్తూ ఆ ఫలితాన్ని భగవదర్పణ చేస్తే చాలు. "తల్లక్షణా వాచ్యం తేనానామత భేదాత్" (నా. భ. సూ. 15) అనే నారదుని వచనాన్ని బట్టి భక్తి లక్షణం ఎవరి మతికి అనుకూలంగా వారు చెప్పబడిందే కాని సత్యమైనది కా అనే భావం బోధపడుతున్నది. అసత్య ధోరణులు కలిగిన ఈ భక్తి అవైదికమ వేదం ప్రతిపాదించిన యోగ ఉపాసనాది రూపకమైన భక్తే (శ్రద్ధా) సత్యమైన బోధపడుతున్నది.

## వేంకటదాసు కీర్తనల్లో అవైదిక భక్తి సమన్వయం

రాకమచర్ల వేంకటదాసుగారి కీర్తనల్లో పైన వివరించిన అవైదిక భ సమన్వయం చేసేందుకు ముందుగా కీర్తన అంటే ఏమిటో సంక్షిప్తంగా చూద్దాం.

వేదం సమస్త విద్యలకు మూలము. అట్టి వేద మంత్రాలన్నీ అనుదా ఉదాత్త, స్వరిత స్వర సహితాలు వేదభాగమైన సామవేదంలోని మంత్రాలు యోగ్యాలై ఉన్నాయి. కీర్తన కూడా రాగ, తాళాలనాశ్రయించి సంగీ ప్రక్రియగా వాసి కెక్కింది. అకార ఉకారమకారాలనే మూడక్షరాలవల్లనే సం పుట్టిందని "క్రొత్త సంగీత విద్యాదర్పణం" తెలిపింది. (క్రొ. సం. ద. 1 పే) అ ఉకారమకారల కలయికే 'ఓం' కారమని, అది ఈశ్వరుని నామమని వేదం తె తున్నది. ఇట్లా కీర్తన ప్రక్రియకు వేదమే ఆధారం.

తెలుగు సాహిత్యంలో కవిత్వం మార్గ, దేశిభేదాలతో రెండు విధాలుగా వ అందులో ఉదాహరణలు, పదాలు దేశీయ భేదానికి చెందిన ప్రక్రియలు. స్వ సుండి మానవుడు తన సుఖ దుఃఖాది అనుభూతులకు అనుగుణంగా ఆడిపాడు ధంలో పదకవిత పుట్టింది. దీనికే "పాట", "సంకీర్తనం" అని వ్యవహారము

అయితే ఈ సంకీర్తనా ప్రక్రియ వేదాలలో సూక్తాల రూపంలో వుంది. అవి పరమేశ్వరుని స్తుతి, ప్రార్థన, ఉపాసన, ధర్మాది విషయాలను వర్ణిస్తున్నాయి. సత్యార్థ ప్రతిపాదకాలైన ఈ సూక్తాలు పరమేశ్వర జ్ఞానాన్ని కలుగజేసి అతని యెడ భక్తి ధర్మనిష్ఠ, మనోహర సిద్ధిని పెంపొందించేవిగా ఉన్నాయి. "ఓం అగ్నిమీళేపురోహితం" (1-1-1-1) అనే ఋగ్వేద మంత్రం "ఓ మానవులారా! మీరు నా స్తుతి ప్రార్థన ఉపాసాదులను ఈ విధముగా చేయుడు. తండ్రి తన కుమారులకు తన విషయములో గురువుల విషయంలో ఇట్లా స్తుతి ప్రార్థనలు చేయుడని చెప్పినట్లు, గురువు తన షృలకు తనయెడ, తల్లిదండ్రుల యెడ ఇట్లా ప్రార్థనాదులను చేయుడు ఇట్లా వ్యవహరింపుడని" బోధించిన ఇట్టి ఉపదేశం, బోధవల్ల మానవులకు సర్వ వ్యవహార జ్ఞానం, సర్వ పదార్థాల జ్ఞానం కలిగి సుఖాన్ని, ఆనందాన్ని పొందుతారు. అలా స్తుతి, ప్రార్థనల స్వరూపం ఎట్లా వుంటుందో మచ్చునకొకటి ఉదాహరిస్తాను. "ఓంయాంమేధాం దేవగణా" (32-14) అని యజుర్వేద మంత్రంలో పరమేశ్వర స్తుతి ఇట్లా చేయబడి ఉంది. (ఆ. వి. 160 పే) "ఓ సర్వజ్ఞ పరమేశ్వర! అగ్నీ! విజ్ఞాన వంతమై ధారణా శక్తి కలిగినయే బుద్ధిని విద్వాంసులు కలిగి ఉంటారో అట్లానే యదార్థంగా పదార్థాలను తెలుసుకొను, పితరులు, జ్ఞానులు ఏ బుద్ధిని కలిగి యుంటారో అట్టి ఉత్తమ బుద్ధిని నాకు ఇప్పుడే ప్రసాదించి బుద్ధిమంతుని చేయవల సింది నీవు కృపతో నాయీ ప్రార్థనను అంగీకరించి ఫలప్రదం చేయుదువుగాక! "ఈ స్తుతి మంత్రంలో సర్వజ్ఞుడైన పరమేశ్వరునికే "అగ్ని" నామమున్నదనే సత్యజ్ఞానం వెల్లడి అయింది. ఓం మేతన్న ఇంద్రో వరుణో మిత్రో" (5-3-27-25) (ఆ. వి. 43 పే) అనే ఋగ్వేద మంత్రంలో పరమేశ్వర ప్రార్థనము ఇట్లా వుంది "హే భగవాన్! సూర్య చంద్రులు, వాయువు, జలము, అగ్ని, ఓషధులు, నీ ఆజ్ఞవల్లనే సుఖరూపములై మమ్ము సేవించుగాక, ఓ రక్షక! ప్రాణాదుల కత్యంత సమీపమున నుండు మేము నీ కృపవల్ల, సుఖయుక్తు మగుదుము గాక,"

రక్షణతో నీవు మమ్ము సదారక్షింపుము. ఇట్టి ప్రార్థనాస్తుతుల వల్ల సర్వలోక హితము, పరమేశ్వర యథార్థ జ్ఞానం, అతని యెడభక్తి కలుగుతుంది. అవైదిక భక్తిరూపాలు, మత ప్రాతిపదికగా నిర్మితాలైన కీర్తనలు పై ప్రయోజనాలను సాధింపలేవు. ప్రజలకు హితాన్ని అందించలేవు. ఇట్టి కీర్తనలను ఆధారంచేసుకొనే

లక్షణకారులు సంకీర్తనకు లక్షణాన్ని కూర్చారు. సంకీర్తన లక్షణాన్ని పరిశీలిస్తే ఈ విషయం గమనింపవచ్చు.

## సంకీర్తన లక్షణం

సంకీర్తనన్నా కీర్తనన్నా ఒకటే ఈ విషయంలో సుబ్బరామదీక్షితుల గారి మాటలను రజనిగారు ఇట్లా వివరించారు (క్షే.ప.సా. 84 పే). "తాలిరోజులో" పదం, సంకీర్తనలు పర్యాయ పదాలుగా ఒకే అర్థంలో ఉన్నాయి. అవి శృంగార సంకీర్తనలనీ, ఆధ్యాత్మ సంకీర్తనలనీ రెండు విధాలయి దాసురాను క్షేత్రయ్య నాటికి శృంగార సంకీర్తనలను పదాలని, త్యాగరాజునాటికి అధ్యాత్మ సంకీర్తనలు కీర్తనలని వ్యవహారం రూఢమైంది. ఇదంతా ఇటీవలి కాలంలోని అభిప్రాయాలు

సంకీర్తనా లక్షణాన్ని అన్నమాచార్యుని "సంకీర్తనాలక్షణ"మనే సంస్కృత గ్రంథాన్ని అతని మనుమడైన చిన తిరుమలాచార్యులు తెలుగులో రచించారు. ఆ లక్షణ వివరణలో "పదాలు" శృంగార, వైరాగ్యపదాలని రెండు విధాలు. శృంగార పదాలు గ్రామోక్తులతో ఉండవచ్చు. వైరాగ్య పదాలు అగ్రామ్యరమ్మయి విష్ణుచరితో దారమై ఉండటం అవసరం (క్షే.ప.సా.82 పే) అని చెప్పటం వీరి తాతగారైన అన్నమాచార్యుల వారు రచించిన సంకీర్త ప్రభావమే అని తోచుచున్నది.

సుబ్బరామ దీక్షితుల వారు తమ సంగీత సంప్రదాయ ప్రదర్శనిలో చెప్పిన కీర్తనల లక్షణాన్ని బాలాంత్రపు రజనీ కాంతరావు గారు తమ వాగ్గేయ కారచరిత్ర (75 పే)లో ఇట్లా తెలిపియున్నారు. మాతువు దేవతాస్తుతిగాను, పల్లవి, అనుపల్లవి, చరణాలతోను మొదటి చరణపు కడపటి భాగం అను పల్లవి యొక్క ధాతువు ననుసరించి ఉంటాయి. పల్లవి ఒక ఖండమైతె అనుపల్లవి రెండు ఖండాలు, యతి ప్రాసలు, అంకితమైన దేవతానామముంటుంది. సంకీర్తనపై రాగం పేరు మాత్రము ఉంటుంది. ఈ వాక్యాలు కూడా కీర్తన కారులు రచించిన కీర్తనలను అనుసరించే లక్షణం వ్రాయబడ్డవని చెప్పేందుకు సాక్ష్యాలు అవుతున్నాయి. ఈ లక్షణాలన్నీ శ్రీ వేంకటదాసుగారి కీర్తనలలో ఉన్నాయి. కీర్తనపై రాగంవ్రాయుటం కీర్తనలో మతపరమైన దేవతాస్తుతి, అంకితమైన దేవతానామం రాకమచర్ల వేంకటదాసు కీర్తనలలో చూడవచ్చు.

పదం అంటే కేవలం సంకీర్తన, పాట అనే గాక పదపద్యాలపది సంకేత మౌతుంది (షే ప. సం. 86పే) దేశీయ కవితా భేదానికి చెందిన ఉదాహరణ. పద ప్రక్రియలలో ఉదాహరణ కవితా ప్రక్రియనుండి కీర్తనల చివర పద్యరచన చేయటం లేక పద్యాలను పొందు పరటం అనే పద్ధతి వచ్చి వుంటుంది. వేంకట దాసుగారి కీర్తనలలో ఈ పద్ధతి అనుసరింపబడింది. కాల్క్రమంలో ఉదాహరణ ప్రక్రియ శైవమత ప్రచారానికి వాడుకలో వచ్చింది. సంకీర్తనా ప్రక్రియ వైష్ణవ మత ప్రచారంలో బలం పుంజుకుంది. తెలుగులో ఇట్టి మతపరమైన సంకీర్తన వాఙ్మయం 12వ శతాబ్దికి చెందిన శ్రీకృష్ణమాచార్యులతో ఆరంభమైందని పరిశోధకుల అభిప్రాయం. అనంతరం అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య, రామదాసు, సారంగపాణి వంటి సంకీర్తనకారులు ఈ సంకీర్తనను బహుళ ప్రచారం చేశారు. అదే వరుసలో 18వ శతాబ్దానికి చెందినవాడైన శ్రీ రాకమచర్ల వేంకటదాసు ఈ సంకీర్తనతోనే అద్వైతిక భక్తి మార్గాన్ని ప్రచారం చేశారు. వీరి కీర్తనలు నేటికి పాలమూరు, రంగారెడ్డి జిల్లాలలో జనుల నోళ్లలో నానుతున్నాయి.

ముఖ్యంగా రాకమచర్ల వేంకటదాసుగారి కీర్తనలను రెండు విధాలుగా విభజింపవచ్చు. మొదటి విభాగం గురూపదేశానికి ముందు చెప్పబడ్డవి. రెండవ విభాగంలో గూరూపదేశం తరువాత చెప్పబడ్డ కీర్తనలు మొదటి విభాగంలోని కీర్తనలలో కేవలం మతపరమైన విగ్రహారాధనకు చెందిన భక్తి ఉండటం గమనింప వచ్చు. రెండవ విభాగానికి చెందిన కీర్తనలలో గురూపదేశ ప్రభావం కనబడుతుంది. ఆ కీర్తనలు కొంత జ్ఞాన మార్గ సూచకాలుగా ఉన్నాయి. సంవాద కీర్తనలలో పదకొండవ కీర్తనలో చివరి చరణమైన

"సరస రాకమచర్ల శౌరి
మనల సమ్మతించును శ్రద్ధజేరి
వరభక్తి జ్ఞానంబులు విన్న జనులు
పరమపావనులు గదరన్న" అనే అంతర్యమిట్టిదే।

## శ్రీ వేంకటదాసు కీర్తనల్లో ఏకాదశవిధ భక్తి మార్గాలు

భాగవతం తెలిపిన నవవిధ భక్తులకు వివరణగా చెప్పబడ్డ ఏకాదశ విధ భక్తి

మార్గాలు కీర్తనలలో ఎట్లా ఇమిడి ఉన్నాయో గమనిద్దాం ఈ కీర్తనలన్ని గూరూప గ్రానికి ముందు వేంకటదాసు గారిచేత చెప్పబడ్డవిగా భావింపబడుతున్నాయి. అవి అపైదిక భక్తి మార్గంలో ఉండటమే ప్రమాణం.

1. గుణమహాత్మ్యాసక్తి :-

భగవంతుని కళ్యాణగుణ కీర్తనయెడ ఆసక్తి కలిగి ఉండటం. ఈ క్రింది కీర్తన వేంకటదాసుగారి గుణమహాత్మ్యాసక్తికి ఒక ఉదాహరణం.

"రామరామ రాజలలామ-సోమవదనసునామ
మునిజనకామ-సద్గుణ ధామనరవర
శ్రీపునుజేశ్వర సీతామణిహృత్కమలకైరవసోమరఘోత్తమ
॥రామ॥

1. దేవదేవాదివ్య ప్రభావా-పావనాంగసు
భావ, బుధ సంజీవ నవరాజీవలోచన
భావజ సుందర పరమదయకర
కోవిద సన్నుత కువలయ పోషణ ॥రామ॥

2. చారుకరుణా-సారవితరణా
నీరదాభ శరీరవరశృంగార శరధి గంభీర నరవర
కారణవేదోద్ధారక వీర సుకుమార
భవాంబుధితారక జగదభి ॥రామ॥

3. దీనపోషదివ్య విశేష-మానవేంద్ర సమానవర్ణిత
దానవాంతక తాపసావన
వానరవల్లభవరదాయక సుజ్ఞాన ప్రద రాకమచర్లాధిప ॥రామ॥
(రా. వేం. కీ. 1990 ప్ర 7పే)

ఇందులో రాజలలామ, సోమవదన నునామ, మునిజన కామ, సద్గుణధామ, దివ్య ప్రభావ, బుధ సంజీవ పరమదయాకర, కోవిద సన్నుత, సార వితరణా, దీన పోషక దివ్య విశేష, దానవాంతక, తాపసావన, సుజ్ఞాన ప్రద మొదలైన విశేషణాలతో రాకమచర్లాధిపుని కల్యాణగుణాలు కీర్తింపబడ్డయి.

పరమేశ్వర గుణాలేమిటో, ఎట్లా కీర్తించాలో "ఉదుత్యంజాతవేదసం" (7-41) యజుర్వేద మంత్రం ఇట్లా తెలుపుతున్నది (య. భా. పే. 476). ఈశ్వర గుణాలు సూర్యునితో ఉపమించి ఇట్లా చెప్పబడ్డాయి. "ఎట్లా కిరణాలు సమస్త జగత్తుయొక్క ప్రయోజనాన్ని చూడటానికి, గ్రహించటానికి, ఉత్పన్నమైన సకల పదార్థాలను తెలుసుకొనువాడు, మూర్తిమంతాలైన పదార్థాలను పొందుపరచు వాడు, దివ్యగుణసంపన్నుడైన ఆ సూర్యుని నిశ్చయంగా ప్రాప్త మొనరిస్తున్నాయో. అట్లానే విద్వాంసుల యొక్క ప్రకృష్టజ్ఞానం, సత్యోపదేశాలు మానవుడికి పరబ్రహ్మ ప్రాప్తి కలిగిస్తున్నాయి. ప్రాణులకోసం సూర్య కిరణాలు సూర్యుని ప్రకాశ పరుస్తున్నాయో అట్లానే మనుష్యుని జ్ఞానం కూడా పరమాత్మను ప్రకాశపరుస్తున్న దనే" భావాన్ని సూచిస్తూ ఆ పరమేశ్వర గుణాలు వర్ణించుట జరిగింది. దీనినిబట్టి వైదిక సత్యార్థ అవగాహన లేకనే ఇట్టి భక్తి ప్రతిపాదన జరిగిందని చెప్పవచ్చు.

"నీకన్న ఘనులెవ్వరయ్యా—(రా. వే కీ. 1930 ప్ర. 12 పే)
"రాజభూపతే మహరజశ్రీపతే—(రా. వేం. కీ. 1930 ప్ర 18 పే)
"వాసుదేవ శౌరీబుధజన వర్ణితదుపరిశౌరీ—(రా. వేం. కీ. 1930 ప్ర. 71 పే)
"నారాయణకేశవ శ్రీజగన్నాథమహానుభావ—(రా. వేం. కీ. 1930 ప్ర. 71 పే)
"రామదశరథరామపావననామ శ్రీరామ—(రా. వేం. కీ. 1930-78 పే)

## 2. రూపాసక్తి

భగవంతుని దివ్య మంగళ విగ్రహ స్వరూపం మీద ఆసక్తి కలిగి ఉండటం. ఉదాహరణకు ఈ రాకమచర్లకీర్తనలో—

ననుచేరగదే—కృష్ణకృష్ణనెనరింతలేదే (ప)

1. వనజాక్ష సర్వేశ వైకుంఠ సంచార
మనమున నిన్నెంతో వినుతించి వేడితి ॥నను॥

2. నల్లని స్వామి నావుల్లాము రంజిల్ల
ఘల్లు ఘల్లున పదముల గజ్జెలందెలు మ్రోయ ॥నను॥

3. బంగారు చేలామురంగు వహించగ
శృంగారరూపము చంగలింపుచునుండ ॥నను॥

4. దీటయిన రత్నకిరీటము మెరయగ
మేటిభూషణముల కోటినీ దయతోడ ॥నను॥

5. శరచాపధర శోభస్కర ధర్మపాలన
పరయోగి పరిపాల వైకుంఠ సంచార ॥నను॥

(రా. వేం. కీ. 1930 ప్ర. 147 పే)

ఇట్లా కృష్ణుని తనను చేరమని కోరుతూ దాసుగారు ఈ కీర్తనలో అతని రూపవర్ణన చేసి రూపాసక్తి భక్తి మార్గాన్ని ప్రదర్శించారు.

పరమేశ్వరుడు ఓం పదవాచ్యుడని పాతంజల యోగ దర్శనం (1-27) తెలిపింది. బ్రహ్మకు హస్త పాదావయవాలు లేవు. అతడు నిత్యుడు, వ్యాపకుడు, దోషరహితుడు. సూక్ష్మము. సంపూర్ణ జగత్తుకు కారణమైన ఈ బ్రహ్మానుధ్యానం ద్వారా సాక్షాత్కారం చేసుకోవాలని ముండకోపనిషత్తు (1-1-6) తెలిపింది. ఈతడు షోడశ కళాపరిపూర్ణుడని ప్రశ్నోపనిషత్తు (6-4) తెలిపింది. ఆ షోడశ కళలివి

1. ప్రాణం
2. శ్రద్ధ
3. ఆకాశం
4. వాయువు
5. అగ్ని
6. నీరు
7. భూమి
8. శ్రోత్రాది ఇంద్రియాలు
9. మనస్సు మొదలైన అంతరింద్రియాలు
10. అన్నం

11. వీర్యం 12. తపస్సు
13. మంత్రాలు 14. కర్మ
15. జనులు 16. లోకము

అందుకే పరమేశ్వరుణ్ణి "షోడశ" అంటారని తెలిపింది. పరమేశ్వరుని సాకార, నిరాకారులను గూర్చి ఇంతకు ముందే చర్చించటమయింది. పరమేశ్వరునికి సంబంధించిన ఈ విషయాలపై సత్యమైన అవగాహన లేక పోవటం చేతనే ఈ రూపాసక్తి అనే భక్తి మార్గాన్ని మతస్థులు ఏర్పాటు చేశారు. ఇట్లా అద్వైతిక రూపాసక్తికి చెందిన మరికొన్ని వేంకటదాసుగారి కీర్తనలను ఈ క్రింద సూచిస్తున్నాను.

"చన్న కృష్ణా నా చిన్నికృష్ణ-చన్నాకృష్ణా (రా. వే. కీ. 1930 ప్ర 146 పే)
"నందకుమార నవనీతచోర (రా. వే. కీ. 1930 ప్ర 186 పే)
"రామమణిద్రణి (మహరాజ దరణి) ధణి (రా.వే.కీ. 1930-132 పే)
"ముద్దుల క్రిష్ణనావద్దకిరార (రా. వే. కీ. 1930-82 పే)
"ఇటురారసన్నూ తిజేసీదా (రా. వే. కీ. 1930-75 పే)

3. పూ జా స క్తి :-

భగవంతుని మనసావాచా కర్మణా పూజించటంలో ఆసక్తి కలిగి ఉండటం పూజాసక్తి.

"మనసా శ్రీహరినీ బిలువవమ్మ-మనవిచేకోమ్మా ॥ప॥

1. హరితోడ నాదుమనవిదెల్పు-నామాట నిలుపు
కరిరాజ వరదు నన్ను గలుపు
స్థిర చిత్తంబున బొరయుచు నగున
నరహరినిప్పుడు దరిశనమిమ్మని ॥మన॥

2. ఇతర సంకల్పములు లేక-నీవెందుబోక
హితవుచే నాతోవేరుగాక

క్షితిలోపల సద్గతి జెందుటకై
పతితపావనుని మదిలోనమ్మిక ।మన।

(రా. వేం. కీ. 1930 ప్ర. 3 పే)

అంటూ మానసిక పూజాసక్తిని ప్రదర్శించారు.

కనుగొందునయ్యా మీపదసేవా
శ్రీనివాసుదేవకనుగొందు ॥ప॥

1. కనుగొందును ఆకలి దీరగ నామనసు
సంతసమును జెందగ నిను ॥కను॥

2. అంగూగమిమ్ము మది ధ్యానించి-మోహమెడలించి
ఆనందమున భక్తి వహించి ఇంగితమతి
నుపుంగుచు వేడుక తొంగలింపమీ సంగతి మనమున ॥కను॥
(రా. వే. కీ. 1930 ప్ర 7పే)

అంటూ వాక్కుతో పూజాసక్తి వ్యక్తంజేశారు. మనసు సలతసము చెందేట్లుగా, ధ్యానించి, మోహమేడలించి, భక్తి వహించి కనుగొందునయ్యా అనే వాక్కుతో మాత్రమే, పూజాసక్తిని వెల్లడిస్తున్నాయి. కర్మణాకాదు।

"ఇదిగో అర్ఘ్యము లిత్తునయ్యా
చాలముదమదిగై కొనరయ్యా ॥ఇది॥

(రా.వేం.కి. 1930-40 పే)

"మజ్జన మోనరింపవే రామయ్య
నామనవి చిత్తగించవె ॥ప॥

(రా.వేం.కి. 1930-40 పే)

కరుణతో జూడరా ఆభరణముల్ధరించరా హరి ।ప॥
(రా.వేం.కీ. 1930,42 పే)

మొదలైన కీర్తనలు పూజాసక్తి వివరిస్తున్నాయి.

"వేదవిద్యతో, పరమేశ్వర జ్ఞానంతో మానవులు తమ జ్ఞానాన్ని పెంచుకోవాలి. బ్రహ్మము, పురుషార్థం, సత్యవిద్యధర్మాచరణం అనే ఇట్టి శుభగుణాలను మానవులంతా సేవించాలి" అని అథర్వణ వేదం తెల్పింది. (ఋ. భా. భూ. 180) "ఆనంద స్వరూపుడైన పరమేశ్వరుని తపః సామర్థ్యంతో సరిగ్గా తెలుసుకున్న జీవుడే పరమాత్మను పొందుతాడు. (ఋ. భా. భూ. 162) ఉపాసన, జ్ఞానములు, నిష్కామ కర్మద్వారా పరమేశ్వరుని తెలుసుకోవాలి. స్తుతి, ప్రార్థన, ఉపాసనలు ఆతని కోసమే చేయాలని వేదం తెలుపుతుంటే ఈ పూజాసక్తి ద్వారా పరమాత్మను పొందుతాడని లేక పొందాలను కోవటం అజ్ఞానమే!

పూజ అంటే ఋ. భా. భూ. ఇట్లా తెలిపింది. (ఋ.భా.భూ 126) ఇతరులను సత్కరించటం, ఇతరులకు ప్రియం చేకూర్చటం, ఇతరులకు అనుకూలంగా వర్తించటం. ఈ అనుకూలాచరణమనే పూజ నేత్రానికి కూడా చేయవచ్చు. అంటే దానిని చక్కగా చూచుట కుపయోగించటమని భావం. ఇట్లా చేయుటమని భావం. ఇట్లా చేయటం మనుష్యుల కందరికి ఉచితం కూడా అవుతుంది.

వేంకటదాసుగారు "పూజలాయరే మానస పూజలాయరే" ॥ప॥ (రా వేం. కీ. 1930.28 పే) అనే కీర్తనలో "స్నాన సంధ్య జలప్రదాన ధర్మ క్రతుష్ట వ్రతము పూనినలుపు సుకృతమేమిగా నగను దీని వలన" అని ఈ పూజవల్ల ఫలమేంటి? అని ప్రశ్న వేసుకుని సమాధానమిట్లా కీర్తనలోనే తెలిపారు. "చదువు మంత్రయంత్ర తంత్ర జ్వర పిశాచరుల బాధ-బదుగురోగ చోరశత్రుబంధనముల దొలగజేయు" బలుధనంబు భాగ్యమాయువు చలగు కీర్తి పరసుఖ వేడుకొనొసగి రాకమచర్ల నిలయుడెపుడు బ్రోచుచుండు" ఈ సమాధానాన్ని బట్టి 'పూజ అంటే పై నిర్వచనార్థమే తేటపడుతున్నది. అలైన ఈ పూజ అంతా భౌతికానికి సంబంధించిందే. ఈ పూజా చరణవల్ల కలిగే ఫలితము భౌతికమైందే. వేదోక్త ఉపాసనం, జ్ఞాన,

కర్మల వల్ల లభించేమోక్షం ఈ పూజా చరణ వల్ల లభించదు. అనుకూలాచరణ పూజ నందుకునే రాకమచర్లేశుడు వేద ప్రతిపాదిత పరతత్త్వము కాదు, అనే ఫలితార్థం తెలుపుతున్నది. రాకమచర్లేశుడు దేవుడే అని జనులను నమ్మించటం జరిగింది.

### 4. స్మ ర ణా స క్తి :-

నిరంతరం భగవంతుని స్మరించటంలో ఆసక్తి కలిగి ఉండటం. ఉదాహరణకు వేంకటదాసుగారి ఈ కీర్తన గమనించండి.

"నంద నందునూని పాదావులు
బ్రహ్మానందమింపొందీన పాదములు ॥ప॥

1. నందముగా మోదమింది యేవేళలో
ఇందీర సేవించు పాదాములూ ॥నంద॥

2. సరసులెన్నిననీవే పాదములు
సర్వ సమ్మతమయ్యున్న పాదామూలుమా ॥నంద॥

3. సదయ హృదయమైన పాదాములు
లోక సమ్మతమయ్యున్న పాదామూలు ॥నంద॥

(రా. వేం. కీ. 1930-58 పే)

ఇట్లా కీర్తనలో భగవంతుని పాదస్మరణముంది.

యజుర్వేదం ఇట్లా తెలుపుతున్నది. (ఋ. భా. భూ. 220పే) "వేదోక్తాలయిన పరమేశ్వరుని ఉపదేశాలవల్లనే విద్వాంసులు జ్ఞానులు, వేదమంత్రార్థాలను తెలిసిన ఋషులు, ఇతర మనుష్యులు పరమేశ్వర సాక్షాత్కార పూర్వకంగా ఎల్లప్పుడు. ఉత్తమకార్యాలను ఒనర్చు వారై సుఖంగా ఉంటారు. కాబట్టి శ్రేష్ఠ కార్యాలను చేయుటకు ముందే పరమేశ్వరుని ప్రార్థన, స్మరణము, ఉపాసనాదులను చేయాలి."

అంటే సర్వ శక్తిమంతుడైన పరమేశ్వరునే ప్రార్థన చేయాలి. స్మరణ చేయాలి. ఉపాసన చేయాలని భావం. ఇట్టి వైదిక భావ వ్యతిరేకంగా ఉన్న పై కీర్తనతో ప్రదర్శించిన స్మరణాసక్తి అవైదికమై ఉంది. ఇట్టికీర్తనలను మరికొన్ని ఈ క్రింద సూచిస్తున్నాను.

1. "తలచుచున్నయ్యా నిను దాశారదేయనితలచేతి—(రా. వేం. కీ. 1930-62 పే)

2. "రామనారాయణ రామనారాయణ—(రా. వేం. కీ. 1930-52 పే)

3. "శ్రీరామ శ్రీరామసీతామనోహరా—(రా. వేం. కీ. 1930-112 పే)

4. "నారాయణ కేశవ శ్రీజగన్నాథ మహానుభావ—(రా. వేం. కీ. 1930-71 పే)

5. "శ్రీరామమనోహరా—శావకమందార—(రా. వేం. కీ. 1930- 23 పే)

## 5. దాస్య భక్తి –

భగవత్సేవే కర్తవ్యం, పరమావధిగా భావించి శ్రద్ధతో భగవంతుని సేవించటంలో ఆసక్తి కలిగి ఉండటం. ఈ దాస్య భక్తిలో భక్తుడు భగవత్సేవకై తపించటం, సేవ్య సేవకభావకర్చనా విధానం గోచరిస్తుంది.

"బహుదినములాయెనిను ప్రస్తుతింపుచునున్న పాలించినన్నేల
రావే అహహయంతని వేడుకున్న దాసునియందు
సాహసంజూపడాయయామాయా ||ప||

1. మహిలోన నాకన్నమనుజాధములు లేరు
మహిత ధర్మము దప్పకూవరామ
మ్రొక్కివేసారితిని మోహనాకార
నీమోమైన జూపవేమి స్వామి ||బహు||

2. పెక్కుమారుల నన్నుజిక్కిశాయకు
నీతె దక్కితిని బ్రోవలేవా – దేవా

యక్కు వేమిదలంచహితవు నీ
దన్నుకున్న నిక్కముగ దయ జూడవే ||బహు||

(రా. వేం. కీ. 1930 - 63 పే)

ఇట్లా ఈ రాకమచర్ల కీర్తనలో బహుదినములాయే నిను ప్రస్తుతింపుచు కనుక నన్నేలుమంటూ ఆ భగవంతుని కరుణార్ద్ర దృష్టికై దాసుగారుపడిన తహతహ వ్యక్త మౌతున్నది. అందువల్ల ఈ కీర్తన దాస్యభక్తికి ఉదాహరణగా చెప్పవచ్చు.

"స్వామి నిన్ను ప్రేమించదలచితె నామొర వినవేమీ ।ప।

1. సామాన్యుని నాకేమి దోచదిక
సీమనసనినీ నామమ్మై నమ్మితి
సామజ వరపాలనజన సమ్మత మునిలోల
నిరుపమ కోమలాంగబుధ కోటివినుత
నవతామర సాక్షసుధామార్చిత శ్రీ ||స్వామి||

(రా. వేం. కీ. 1930-84పే)

వేద ప్రతిపాదిత ధర్మ విరుద్ధంగా ఈ దాస్యాసక్తి ప్రతిపాదన అసమంజసం. ఇట్టివి మరికొన్ని కీర్తనలను ఈ క్రింద తెలుపుతున్నాను.

1. తాళజాలకున్ననే తనువు శ్రీహదన్న-(రా. వేం. కీ. 1930-143పే)

2. అయ్యయ్యో నేనోపజాల కరుణాకర శ్రీప్రాణలోల—(రా. వేం. కీ 158పే)

3. ఎందుకుదయరాదు రామనాకేమితోచదు—(రా. వేం. కీ. 1930-151పే)

4. చలమేల స్వామి బ్రోవరాజగ దోపకారస్వామి—(రా. వేం. కీ. 1930-166పే)

5. రామయ్య నీవాడను-దాసునినన్ను రక్షించు—(రా. వేం. కీ. 1930-170పే)

6. స ఖ్యా స క్తి :-

సర్వావస్థలలో భగవంతుడే తనకు నెచ్చెలి, చుట్టము, హితుడు అని భావించుట. ఇందులో భక్తునికి భగవంతుని యెడ చెలిమి ప్రధానం.

"అన్నీటనీవె భారము ఇకయెన్నకు రానానేరము
మన్ననదేసిన మాటనిల్పనాకన్న తండ్రిపయికరుణజూచిన ||ప||

1. నీవె జపులా బ్రోతువు బహునెనరుతోడ జూతువు
పావనమూర్తి భక్తలోలుడవు భావజాంగనీప్రాణనాథుడవు
||అన్ని||

2, మరులుజెంది యున్నరా-నీదుమతముకదె విన్నరా
యరుగనయితి నీవింతవాడవని నరులకు హితుడవు భోగ్య
మాయగద ||అన్ని||

3, నీకు కీర్తిగల్గురా-ఇకనీఖిలభయంబుదొలగురా
రాకమచర్ల పదా స్వామినని ప్రాటముగనీబంటునయితిగదే
||అన్ని||

ఇందు భగవంతుని హితుడని తలచి అన్నిటనీదె భారము ఎన్నకురానా నేరమని సఖ్యాసక్తిని వెల్లడించారు. దాసుగారు. ఇంకా సఖ్యాసక్తికి చెందిన కొన్ని కీర్తనలు.

1. ఎప్పటికొక రీతి తప్పులెన్నక (రా. వేం. కీ. 1930 - 119 పే)

2. అబ్బబ్బనీకింతధర్మమ - నిన్ననుసరించితె (రా. వేం. కీ. 1930.122 పే)

3. ఏరీతి జేసిన నీవే (రా. వేం. కీ. 1930 - 140 పే)

4. నిన్నువిడచి ఎన్నాడైన యున్నానరామ (రా. వేం. కీ 1930 .. 152పే)

5. మంచిదిరాంమాటాడర (రా. వేం కీ. 1930 - 153 పే).

7. వాత్సల్యాసక్తి :-

భగవంతుని పుత్రభావంతో ఆరాధించటం.

"ముద్దిచ్చిపోరా నాయన్నా
ఎంతో ప్రొద్దాయెపనిమాలియున్నా ||ప||

1. పద్దు చెల్లించుకో-వద్దు చేతికివెన్నా
ముద్దాలందింతునా వద్దకి చనుదెంచి ||ముద్ది||

2. మూల మూలలు దిరుగనేలా
మేయాకిలాల దోసెదరా ఈ వేళ ||ముద్ది||

3. పాలుమీగడ పెరుగూ మేలిమితోడాను
లాలిపుచ్చెదనసుపాలు బుక్కెడుద్రాది ||ముద్ది||

4. గొప్పకెంపులరానిరేఖ నీకుదెప్పించురారయిందాక
అప్పామాణిక్యాలకుప్పా బంగరుపూల
దుప్పాటి కొంగూనవప్పులుగట్టెద ||ముద్ది||

5. రాకమచర్లేశుని వాసా
పాకశాసనసుత చిద్విలాసా
శ్రీకరాభక్తవశీకరా మానస
ప్రాకటము శ్రీవేంకటదాసూడు బిలువగ ||ముద్ది||

(అచ్చుకానిది, నేనుసేకరించిన రా. వేం. కీ.

ఈ కీర్తనలో బిడ్డయెడల తల్లిప్రేమ కన్నులకు కట్టినట్లు చెప్పబడింది.

"నందనందన కృష్ణ నన్నుగన్నతండ్రి—(రా. వేం. కీ. 1930.73 పే)
నాయన్నరార ననుగన్నవాడరార—(రా. వేం. కీ. 1930.111 పే)
నాయన్నానాచిన్ని కృష్ణ—(రా. వేం. కీ. 1930.132)
నిదురించవే రాఘవా—(రా. వేం. కీ. 1930.47 పే)
నాచిన్న కృష్ణమ్మ నవమన్మధాకార—(రా. వేం. కీ. 1930.48 పే)
వంటి కీర్తనలు గ్రహింప తగును.

8. కాంతాసక్తి :—

భగవంతుని భర్తగా భావించి, సంభావించటం. దీనికే మధుర భక్తి అని వైష్ణవ పరిభాష.

"అదేమోయి కృష్ణా మాయింటికి
నేడైనరావు నిద్దూర రాదునా కంటికి ||ప||

1, ముదమున నీమృదులపదపద్మంబులు
మదిలోన నమ్మ్నక వగలు చిలుకే ||అదే||

2, నేనైతె నినేవలచి యుంటీ నీరాకడలకు
నిజమైన శకున మడిగియుంటి ||అదే||

3, మానజాల యిక ప్రాణనాధ నీదాన
దయ మరువకు యిక ||అదే||

4, రంగైన రవికే దిమ్మంటినీ—నీ మెడలోనున్న
రత్నాలహారమిమ్మంటి నీ—అంగూరనీదేలుంగరంబులొసంగు
మంటినీ
అంగజజనకా ||అదే||

5. దేవాధి దేవుడవనుచు వింటినీదాసురాలని

భావమెందుకు నాస్వామి
భావజ జనకుడవని నిను వేడితి
కావవేమిరాకామచర్లాధిప ||అదే||
(అచ్చు కానిది నేను సేకరించింది. రా.వేం.కీ.)

పవిత్రగా వేంకటదాసు భగవంతుని భర్తగా భావించి, కీర్తించటం జరిగింది.
"చెలియరో పోవే - శ్రీహరిని మరియే లీలనైనదేవే - (రా.వేం.కీ. 1930-4 పే)
"హరిని - ఒదేవమ్మ మనసా" - (రా.వేం.కీ. 1930 - 22 పే)

రా: లేను పోవే శ్రీహరిని మరియే లీలన్నెదేవే-(రా. వేం. కి. 1930-66పే)
చలియూ వేగమే పోవే శ్రీహరిని దేవే-(రా. వే. కీ. 1930-72పే)
మనసా హరిని జూరబోయి, మన వి చేంతోడితేగదే-(రా. వేం. కీ. 1930-82పే)
మొదలైన కీర్తనలు ఈకాంతాసక్తిని తెలుపుతున్నాయి.

9. ఆత్మనివేదనాసక్తి :-

సర్వం భగవదర్పణం గావించి కొలవటం. దీనినే వైష్ణవ పరిభాషలో పరాభక్తి అంటారు.

"తనువు నీదని కున్నరావే-నమ్మిదయజూడగదనే ||ప||

1. వినవన్ను వినవేమొన్న నీ తనయుడన్న మాట
సనకాదిసురేశ పరమసదయ విలాస ||తను||

2. నిన్ను నే నమ్మియున్నాను మనసులో
అరవుంచబోకు యింతమందమనీకు ||తను||
(రా. వేం. కీ. 1930-72పే)

ఇంట తనువు నీదనుకున్నను, అనే సమర్పణ భావాన్ని తెలిపి భగవంతుని కీర్తించటం జరిగింది. "సర్వభావాలను భగవంతుని అర్పణం చేసే ఈశ్వర ప్రణిధానంలో యోగికి సమాధిసిద్ధికలుగుతుంది (పా. యో. ద. 2-45) ఉపాసనాయోగాని

కున్న యమనియమాది ఏడంగాలకు ఫలం సమాధి తన శరీరాన్ని కూడా మరచిన వాని వైదిక ధర్మాచరణవల్ల, సర్వాభావాలు భగవంతునికి అర్పణ చేసే జ్ఞానం సిద్ధింస్తుంది. వేద విరుద్ధంగా సమస్తాన్ని కరచరణాదయవయానాలతో రూపు దిద్దుకున్న జడస్వరూపానికి సమర్పిస్తే సిద్ధిని పొందలేరు.

10. తన్మయతాసక్తి :—

భగవంతుని ధ్యానంతో మేను మరవటం, పరవశత్వాన్ని పొందటం.

"తారంగం తారంగం–నతసారంగం శ్రీరంగం ||ప||

1. సారబ్రహ్మవిచార భూసురోంకార
జనితఘనసరిగమపదనిస ||తా||

2. ప్రకటతాళ సంభవ శబ్దాదిక
తకిటదెయ్యతోందదిగిణకితక ||తా||

3. మంగళ శ్రీకర శ్రీమధ్యదవర సారంగ
రాగరు సంగీత ప్రభ ||తా||

4. పటుపరతాండవ నటనఘటన
వేంకటదాసోత్సవ కలితపదాంబుజ ||తా||

ఈ కీర్తన నడకలోనే తన్మయత్వం ద్యోతకమౌతున్నది.

సమాధి సిద్ధించిన లక్షణం ఋగ్వేదాది భాష్యభూమిక (319) ఇట్లా తెలిపింది. "అగ్నిలో బాగాతపించబడిన లోహ ఖండం అగ్ని రూపాన్ని పొందునట్లు యోగి, ఉపాసకుడు పరమేశ్వర జ్ఞానంతో ప్రకాశ వంతుడై తన శరీరాన్ని కూడా ప్రకాశ స్వరూపమైన ఆనందంతో, జ్ఞానంతో పరిపూర్ణమొనర్చు కుంటాడు. అదే సమాధి సిద్ధి" ఇట్లా వేదంతెలుపుతుంటే కేవలం నామజపంతో లేద చైతన్యరహిత స్వరూపం యెడ కలిగే మూఢపారవశ్యం సత్యమైంది కాదు. ఇట్లె మరికొన్ని కీర్తనలు గమనింపదగును.

1. "రారమురారె రారాశౌరే—(రా. వేం కీ. 1930-146 పే)
2 "నర్తానజేసెదచూడు—(రా. వేం. కీ. 19 0-186 పే)
3 "పూలవసంతములాడుదమా—(రా. వే కీ. 1930.21 పే)
4. "బాలంముకుందం పరమానందం—(రా. వేం. కీ. 1930.52 పే)
5. "రామనారాయణరాఘునారాయణ—(రా. వేం. కీ. 1930.52 పే)

## 11. పరమ విరహాసక్తి :-

భగవంతుని వదలియుండలేక పోవటం. అతనిపట్ల విరహతప్తం కావటం.

"ఎన్ని దినములాయెనయ్య నిన్ను కన్నుల జూడక
సన్నుతించిపొగడమంచి సమయమువన గూడక

1. ఎదురుచూచి ఎదురుచూచి యెటలదోచుకున్నదిరా
నిదురకంటికి రాకయున్నది నిన్నే నమ్మియున్నారా ॥ఎ॥

2. చిత్తమొప్పగించి నీదుశేవజేయుచున్నారా
తత్తరంబుజెంది మదిలో తాళజాలకున్నారా ॥ఎ॥

3, ఘడియలేవత్సరములాయెకానవే నన్నుబ్రోవవే
విడువజాలనిన్నుమదిలో వేడుకున్నగావవే ॥ఎ॥

4, సరసరాకమచర్లభవన స్వామినీవాడ రా
ధరణి వెంకటదాసవరదదీతదయిదయజూడరా ॥ఎ॥

(రా.వేం. కీ. 1930 – 20 పే)

"మూడు దినములాయే ముద్దుల కృష్ణ - (రా.వే.కీ. 1930-19 పే)
"తడవైన నిన్నుజూడక తాళలేనయ్య" - (రా.వే కీ. 1930.65 పే)
"ఎన్నడైన నినుకన్నుల జూడకయున్నానా" — (రా.వేం.కీ. 1930.76 పే)
"ముద్దుల కృష్ణ నావద్దకు రారస్వామి" - (రా.వేం.కీ. 1930-115 పే)
"నిన్నుజూడక మనసొప్పద్దా - (రా.వేం.కీ. 1930-116 పే)

ఇట్లా దాసుగారి కీర్తనలలో వైష్ణవమతపరమైన ఏకాదశవిధ భక్తిమార్గాలు ఇమిడి ఉన్నాయి. అవైదికంగా అవి ఆచారాలైనాయి.

## వేంకటదాసు కీర్తనలలో మానసపూజ

వేంకటదాసు కీర్తనలలో మానవ పూజను గురించి తెలుసుకునే ముందు వేదంలో చెప్పబడిన విషయమేమిటో తెలుసుకోవటం అవసరం. దీనివల్ల పూజా స్వరూపం, మతాలలో ఏ రూపాన్ని తాల్చిందో గ్రహింపవీలౌతుంది.

### పూజ

వేదంలో పూజ మూడు విధాలుగా విభజింపబడింది. (1) స్తుతి (2) ప్రార్థన (3) ఉపాసన. దీనినే "యజ్ఞేన యజ్ఞమయ జన్తదేవాస్తానిధర్మాణి ప్రథమాన్యాసన్, తేహనాకం మహిమానః సచంతయత్ర పూర్వేసాధ్యాః స న్తిదేవాః" (య. 31-16) అనే యజుర్వేద మంత్రం ప్రమాణం విద్వాంసులను దేవతలంటారు. వారుస్తుతి, ప్రార్థన, ఉపాసన అనే రీతితో పూజనము మూలాన ఆ పూజనీయుడైన పరమేశ్వరుని పూజిస్తారు" (ఋ.భా.భూ 228) అని పై మంత్ర భావం.

ధార్మిక జీవనంతో పూజ, సంబద్ధమై ఉంది. ఒకవిధంగా జీవనమే పూజ అని చెప్పవచ్చు. "జీవనమంటే ఆత్మిక శక్తులను వికసింపజేయటం. ఉన్నత జీవనానికి యోగ్యతను సంపాదించటమే నిజమైన పూజ" (పూజ.అ. 3 పే. 21) ఇతరులను సత్కరించటం, ప్రియము చేయటం, ఇతరులకు అనుకూలగా వర్తించటం 'పూజ' అనబడుతుంది. అని ఋగ్వేదాది భాష్యభూమిక (125 పే) తెలిపింది. పూజకు అర్చన, సపర్య అనే అర్థాలను శబ్దరత్నాకరం (506 పేజి) తెలిపింది.

స్తుతి :-

ఈశ్వరుని గుణాలను మనసున విచారించటం "స్తుతి" దీనికే ధ్యానము అని వ్యవహారముంది. "పరమేశ్వరుని మూలముననే గుణాలు ఏ పదార్థమున ఉంచబడ్డాయో, వాటిని అట్లాగే వర్ణించటం, వ్రాయటం, వినిపించటం, తెలియజేయటం

'స్తుతి' అనబడుతుంది. అట్లాగే మానవ సృష్టిలో గుణదోషాలను ఉన్నవి ఉన్నట్లు చెప్పటం, వ్రాయటం కూడా "స్తుతే" (ఋ.భా.భూ. 113 పే) కర్మసాక్షి అయిన సూర్యుని నిత్యం మనం చూస్తున్నాం. ఆ సూర్యుని సామాన్య దృష్టితో కాక విశేష దృష్టితో చూచినపుడు విచిత్ర శక్తివంతం, జ్ఞానవంతం, దయావంతమైన వ్యక్తి దర్శనమౌతాడు. అట్టి వ్యక్తి గుణాలను మనం ఎంతగా ధ్యానిస్తే అంతగా అతని వైపు ఆకర్షింపబడతాం. ఆ ధ్యానప్రధానం చేతనే అతని గుణాలను బాగా తెలుసుకుంటాం. అట్లాగే హృదయంలో ఈశ్వర ధ్యానంతో అతని గుణాలు వికసింపజేసుకోవాలి. క్రమంగా ఈశ్వర గుణధ్యానమే ఈశ్వర గుణగానంగా పరిణమిస్తుంది. ధ్యాన, గానాదులు రెండూ క్రమబద్ధమై ఒకదానికొకటి బలాన్నివ్వటమే స్తుతి. దీనినే ధ్యానమంటారు. (పూజ 24 పే) ఈ స్తుతే మానవ జీవనంలో జ్ఞానం అనబడుతుంది. ఈ స్తుతి విషయంలో న్యాయదర్శనం (2-1-64) భావాన్ని ఋ.భా.భూ. ఇట్లా వివరించింది (152 పే). ఫలాన్ని చెప్పిన పదార్థాల గుణాలను వర్ణించటం స్తుతి. దీనివల్ల మానవులకు ఉత్తమ కర్మలు చేయటంలోను, మంచి గుణాలను గ్రహించటంలోను శ్రద్ధ కలుగుతుంది.

## 2. ప్రార్థన :-

"ఈశ్వరుని సహాయ మర్థించటం ప్రార్థన" (ఋ.భా.భూ. 83 పే). ప్రార్థన అంటే అడుగుట. వేడుట (శ.ర. 548 పే) అనే అర్థాలున్నాయి. సృష్టికర్తయైన పరమేశ్వరుని గుణధ్యానంవల్ల ప్రేమ కలుగుతుంది. తద్వారా ఈశ్వరుని సృష్టికర్తృత్వాన్ని ధ్యానించే పూజకుడు కర్తవ్యోన్ముఖుడౌతాడు. తన జీవితంలో ఉన్న లోటును పోగొట్టుకొని పరిపూర్ణత్వాన్ని పొందేందుకు కావలసిన శక్తుల నిమ్మని భగవంతుని వేడుకొంటాడు.

## 3. ఉపాసన :-

ధ్యానస్తుతులు ప్రతిఫలకాలై ఈశ్వర మహత్వం చింతనచేసే కొలది క్రమంగా జీవేశ్వరుల ఏకీకరణభావం ఏర్పడుతుంది. ఆ భావమే "ఉపాసన" దీనివల్ల పూజకునికి ఆనందం చేకూరుతుంది. అదే బ్రహ్మానందం (పూజ. 24 పే) ఉపాసనను గూర్చి ఇంతకు ముందు ఈ ప్రకరణలోనే వివరించటం జరిగింది.

## పూ జా ఫ లం

వేదోక్త విధానాన్ని అనుసరించి పూజను ఆచరించిన మానవుడు స్వార్థం, భీరుత్వాలను వదలి ఐహికాముష్మికార్థ కార్యనిర్వహణలో సమర్థుడౌతాడు. జీవన సాఫల్యాన్ని పొందుతాడు. ఉదారభావం, పరార్థబుద్ధి కలిగి పరప్రయోజనాన్వేషి ఔతాడు. పరమేశ్వరుని విశ్వాసియై, పరమాత్మ సమీపాన్ని పొందుతాడు. (పూజ. 20 పే).

## మా న స పూ జ

ఈ మానస పూజా విషయంలో వేద శాస్త్ర ప్రతిపాదిత విషయాన్ని ముందుగా తెలుసుకుందాం.

"ప్రకృతి నుండి ఏర్పడే మొదటి కార్యం మనస్సు. మనస్సు మననాన్ని తెలుపుతుంది. మననమంటే నిశ్చయ జ్ఞానం (సాం.ద 1 అ 71 సూ) "వేదోక్త జ్ఞానియాపయజ్ఞం, ఆత్మాది ద్రవ్యాలను పరమేశ్వరునికి దక్షిణగా సమర్పించే ముక్త జీవులు మోక్షమున ప్రసన్నులుగా ఉంటారు". (ఋ.భా.భూ 341పే) అనే భావాన్ని "యేయజ్ఞేన దక్షిణయా సమక్తాః" (ఋ. 3-2-1-1) అనే ఋగ్వేద మంత్రంలో తెలిపింది.

ఛాందోగ్యోపనిషత్తు (3-18-1 నుండి 6 సూ) మానసిక విద్యోపాసనను తెలిపింది. దాని సారాంశమిది. "మనస్సు గొప్పది అని గుర్తించాలి ఈ మనస్సు ఆత్మ విషయక విజ్ఞానం. దేవతా విషయక దర్శనంకూడా అయివుంది. మనస్సు నాలుగు పాదాలు కలిగి ఉంది. అవి 1. వాక్పాదం, 2. ప్రాణపాదం, 3. చక్షుఃపాదం, 4. శ్రోత్రపాదం. అధిదైవతానికి మొదటి పాదం అగ్ని. రెండవ పాదం దిశ. మనోరూపమైన బ్రహ్మకు వాణియే నాల్గవపాదం. అగ్ని, అగ్నిరూపక జ్యోతిచేత భాసిస్తూ ఉంటుంది.

అట్లా ప్రకాశితమైన బ్రహ్మమును తెలుసుకున్న విద్వాంసుడు లోకంలో కీర్తిని పొందుతాడు. బ్రహ్మవర్చస్సుతో ప్రకాశిస్తాడు. మనోరూపక బ్రహ్మకు ప్రాణంకూడా

నాల్గవ పాద మః అది వాయురూపక జ్యోతిచేత ప్రకాశిస్తుంది. మనోరూపక బ్రహ్మకు నేత్రమే నాల్గవ పాదం. అది అదిత్యుని జ్యోతితో ప్రకాశిస్తుంది. మనోరూపమైన బ్రహ్మకు శ్రోత్రమే నాల్గవ పాదం. అది దిశారూప జ్యోతితో ప్రకాశిస్తుంది. వీనిని ఇట్లా తెలుసుకున్న విద్వాంసుడు కీర్తి, బ్రహ్మవర్చస్సులతో ప్రకాశిస్తాడు" (చాం.ఉ. 175 నుండి 177 పే).

యోగం చిత్తవృత్తులను నిరోధిస్తుంది. "సుఖులపైన సుహృద్భావం కలిగి ఉండటం, దుఃఖితులయిన వారి యెడ కృప కలిగి ఉండటం, పుణ్యులయెడ సంతోషాన్ని కలిగి ఉండటం, పాపులయెడ ఉపేక్షాభావం కలిగి ఉండటంవల్ల చిత్తం ప్రసన్నమై, మాలిన్య దూరమౌతుంది" (యో.ద. 1.33). తద్వారా మనస్సు లేక బుద్ధి ఈశ్వర ప్రణిధానం వైపుకు పయనిస్తుంది. ఈశ్వర ప్రణిధానమంటే ఈశ్వరుని యెడ చూపే భక్తి విశేషాలు (యో.ద. 1.23). పరమ గురువైన ఈశ్వరుని యందే సమస్త కర్మలు అర్పించి, కర్మఫలాన్ని త్యజించటం ఈశ్వర ప్రణిధానం యో.ద. 2.32)

ఇంకా చిత్తం నిగ్రహించేందుకు ప్రాణాయామాది మార్గాలను యోగ శాస్త్రం తెలిపింది. అందులో పంచయమాలను గురించి తెలియచేసింది. అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం అనే ఈ అయిదు యమాలను పాటిస్తే మనస్సుతో పాటు ఇంద్రియాలను విషయాల నుండి యమింపజేసి ఉపరమింప చేస్తాయి (యో.ద. 2.30). అహింస అంటే సర్వకాలాలలో మనసా, వాచా, కర్మణా సమస్త భూతాలయెడ అపకార చింతన లేకుండటం. యదార్థమైన వాణి సత్యం. అది సర్వభూతాలకు ఉపకారం కలిగించేది. భూత అహితం కలిగించే వాణి సత్యం అనిపించుకోదు. ధర్మ విరుద్ధంగా ప్రవర్తించకుండా ఉండటం అస్తేయం. గుప్తేంద్రియాన్ని సంయమించటం బ్రహ్మచర్యం. విషయాలను స్వీకరించకపోవటం అపరిగ్రహం. ఇట్లా చిత్తం నిగ్రహించి పరమేశ్వర ప్రణిధానానికి అవసరమైన మార్గం చూపింది యోగదర్శనం. ''తపము, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానమనే మూడు యోగ సాధనకు మూడు క్రియలు. వీటి సాధనవల్ల సమాధిపొందే యోగ్యత కలుగుతుంది. అవిద్యాక్లేశం నశించి చిత్తం సమాహితమౌతుంది" (యోగదర్శనం 2.1, 2 సూ)

ఇట్లా తెలుపబడ్డ వైదిక విషయాన్ని మతపురాణాలు తమతమ అభీష్టాలకు అనుకూలంగా మలచుకొని 'మానసపూజ' అనే పేరుతో తెలిపాయి. ఈ మానసపూజ మత నిర్మిత పురాణాలలో వర్ణించిన విగ్రహారాధనకు మాత్రమే పరిమితమైంది. ఈ పూజాచరణం వేదం తెలిపిన కైవల్యప్రాప్తిని ప్రాప్తింప చేయలేదు. అయినా మతాల మాయలో పడ్డ ప్రజలకు మతాచార్యులు ఈ మానసపూజనే అభ్యాసం గావించి అంధ కారంలో ఉంచినారు. ఇప్పుడు పురాణోక్త మానసపూజ యొక్క స్వరూప స్వభా వాదులను తెలుసుకుందాం.

## పురాణోక్త మానసపూజా స్వరూపం

మనసునే సమస్తంగా జేసి ఏకాగ్రతతో పరమాత్మ యందు దృష్టి నిలిపి సమర్పించటం మానస పూజ. ఈ పూజాచరణం వల్ల బలప్రత్తరమైన ఇంద్రియా లన్నింటిని చక్కగా వశపరచుకోవచ్చు. ఇట్లా మనస్సమాధిని పొందిన సాధకుడు నాయందే అంటే ఆత్మయందే అసక్తమనస్సు కలిగియుండాలి. ఎందుకంటే ఎవని ఇంద్రియాలు స్వాధీనంలో ఉంటాయో ఆతని జ్ఞానమే సుస్థితము అని భగవద్గీత తెలి పింది (భగవద్గీత-2.61 శ్లో). ఇట్టి యోగ విషయాన్నే మతసంబంధియైన పురాణాలు మానసపూజగా మార్చుకున్నాయి. ఈ పూజా విధానానికి బాహ్య వస్తువులతో సం బంధం లేదనే భావాన్ని వెల్లడించాయి. ఇంతకు ముందు పూజా విషయంలో తెలుప బడ్డ బాహ్యాభ్యంతర పూజా విధానాలలో, అభ్యంతర పూజా విధానానికి ఈ మానస పూజ ఏర్పడింది. ఈ పూజాచరణం వల్ల దివ్యమంగళ మూర్తిపై మనస్సు లగ్నమౌ తుందని తెలిపాయి. బ్రహ్మాండ పురాణంలో శ్రీరామబ్రహ్మ మానస పూజా విధానం చెప్పబడింది. (ప్రచురణ :- చెన్నపురి వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ 1917) ఆ సందర్భమిది. శ్రీరామబ్రహ్మ మానసపూజా విషయాన్నిగూర్చి సుతీక్ష్ణుడు అగస్త్యుల వారిని ప్రశ్నించాడు. హృదయంలో రఘునందనుని అర్చన చేయవలసిన విధానమెట్టిది? ఏఏ ఉపచారాలతో పూజించాలి? ఈ ప్రశ్నలకు సమాధానంగా అగస్త్యుల వారిట్లా చెప్పారు. ఏ ఇతర చింతలు లేకుండా సుఖాసీనుడైన నిర్మల చిత్తంతో, వైరాగ్యబుద్ధితో భవబద్ధ విముక్తి కోసం రాముని ధ్యానంచేయాలి. ప్రాతః కాలమున ఏకాంత ప్రదేశంలో ధ్యానపూజను ప్రారంభించాలి. అని చెప్పి పూజా విధానాన్ని ఇట్లా వివరించారు.

నాభికంఠ సముద్భూతుడు, కదళీకుడమోపము డైన పరమ పురుషుని హృదయ పంకజ మందు ధ్యానం చేయాలి. రామనామధ్యానంతో వికసించిన హృదయ కుసుమాన్ని తేజోవంతమైన సోమాగ్నిగా భావించాలి. తపో వహ్నమధ్యలో కోటి సూర్యతేజస్సును కలిగిన పరమాత్మను ఆవాహనం చేయాలి. రత్న సింహాస నాన్ని ఇస్తున్నాను స్వీకరించు ప్రభూ। ఇందు జానకీ సహితంగా వచ్చి స్థిరంగా ఉండుమని వేడాలి. పూజ పరిసమాప్తి పర్యంతం సన్నిహితమై నాకభిముఖుడవై ఉండుమని అర్థించాలి. త్రైలోక్యవ్యాపకా నీకు నమస్కారము. నాకు ప్రసన్నుడ వగుము. ఈ పాద్యమును గ్రహింపుము తత్త్వజ్ఞాన స్వరూపా। ఈ మధుపర్కాన్ని తీసుకొనుము. జ్ఞానరూపా। ఈ సర్వలోకైక నాయకా। శ్రీరామా। ఆచమనము గ్రహింపుము. బ్రహ్మాండోదర మధ్యనున్న తీర్థంతో స్నానం చేయిస్తున్నాను. అనుగ్రహింపుము. ఓ హరీ ఇదే పీతాంబరం. ఓ విశ్వేశా। కుంకుమాగరు కస్తూరీ కర్పూర మిశ్రిత చందనాన్ని స్వీకరించండి. ఓ మహేశ్వరా। తులసీకుందమందా రాది పుష్పమాలలచేత భక్తితో పూజ చేస్తున్నాను. స్వీకరించు. తేజోమయమూర్తీ। ఈ ధూపాన్ని సమర్పిస్తున్నాను. త్రైలోక్యతిమిరాపహమైన దీపాన్ని గ్రహించు। షడ్రసోపేతమయిన ఈ సిద్ధమైన అన్న అమృత నైవేద్యం నీచేత గ్రహింపబడుగాక. కర్పూర సువాసితం, నాగవల్లీదళైరూపమైన తాంబూలాన్ని స్వీకరించు. ఈ నృత్య గీతాది వాయిద్యాలు, పురాణపఠనలచే సంతుష్టుడవగుము. పూర్ణానంద స్వరూపా। ఈ అర్ఘ్యాన్ని గ్రహింప నమస్కారం చేస్తున్నాను. ఇదే మంగళార్థం నీరాజనాన్ని గ్రహించు. సర్వభూతాంతరస్థ సీతాసమేత పరమాత్మా। ఇదే నా నమస్కారం. అంతఃకరణ సంసిద్ధి నాకు ప్రసాదించు అని కోరుతూ నమస్కారంతో పూజ ముగించాలి.

ఇట్లా పురాణోక్త మానసపూజా విషయాన్ని, వైదిక మానసిక విద్యోపాసనా విషయాన్ని పరిశీలించిన మీదట తెలిసే సారాంశమిది వేదం వర్ణించిన తత్త్వసంబంధ శబ్దాలను కొన్నింటిని గ్రహించి వైష్ణవాది మతాలకు అనుకూలమైన పురాణగ్రంథాలు ఈమానస పూజను తయారుచేశాయి. వేదం తెలిపిన పరమాత్మ జ్ఞానాన్ని విశేషాలను ఈ పౌరాణికులు తాము సృష్టించుకున్నరామ, విష్ణ్వాది నామక విగ్రహాలకు ఆపాదించుకుంటూ తాము మతపరంగా వ్రాసుకున్న అవైదిక భక్తిమార్గ పూజా

విధానాలను మిళితంజేసి ఈ పూజా విధానాన్ని ఏర్పరచారు. అది ప్రచారంచేసి ప్రజలకు ఆశలు కల్పించి వారిని వైదిక జ్ఞాన శూన్యులుగా జేశారు. కాబట్టే వైదిక ధర్మాన్ని విస్మరించి భిన్నసాంప్రదాయాలను ఏర్పరచుకున్న మతస్థులు ఒకరికొకరు శత్రువులైనారు. భిన్నమతాల వారేకాక ఒకమతంలోని వారే పరస్పరం వైరుధ్యం కలిగినవారైనారు వైష్ణవానికి చెందిన ఈ మానస పూజా విషయంలోనే ఒక అద్వైత్వ వాది నిరసనన్ప్రకటిస్తే, మరొక వైష్ణవుడే తన అసమ్మతిని తెలియచేశాడు.

మానసపూజా విషయంలో అద్వైత వాదియైన శ్రీశంకరాచార్యులు తెలిపిన నిరసనను (శ్రీశంకరాచార్యవర్యుల 17, 18 భాగాలు) నిర్గుణ మానసపూజ అనే గ్రంథం ఇట్లా తెలిపింది. "పూర్ణుడైన పరమేశ్వరునికి ఆవాహన మెక్కడిది ? నిర్మలునకు అర్ఘ్య పాద్యాలెందుకు ? విశ్వోదరునికి వస్త్రమేల ? నిర్లిప్తునకు గంధ మేల ? నిరంజనునికి ధూపమెందుకు ? సర్వసాక్షికి దీపంతో ప్రయోజనమేముంది ? సూర్యాదులను భాసింపజేసే పరమేశ్వరుడికి నీరాజనమెందుకు ? నిత్యతృప్తునకు నైవేద్యం, తాంబూలాలెందుకు ? బాహ్యాభ్యంతరాలలో నిండి ఉండే పరమాత్మకు ఉద్వాసన విధిఎట్లా వర్తిస్తుంది" (పూజ 92పే) అనే ప్రశ్నల పరంపరతో ఈ మానసపూజయెడ నిరసనను వ్యక్తంచేశారు. వైష్ణవ మతస్థుడే అయిన శ్రీమధ్వాచార్యులు తమ ఛాందోగ్యోపనిషత్తు భాష్యంలో "అచేతనవస్తువెన్నడు ఫలమియ్యదు. కాబట్టి అచేతనాన్ని ఉపాసించకూడదు. ఒకదానిని మరొకదానిగా ధ్యానించిన అది పురుషార్థం కలిగించదు. రాజునకు ఈయవలసిన గౌరవం భృత్యునకిచ్చిన రాజువానిని దండిస్తాడు. అందువల్ల అనర్థం వాటిల్లుతుంది. కాబట్టి పరమాత్మ స్థానంలో ఇతరులను పూజిస్తే అంధకారంలో పడిపోతారు. అందువల్ల యదార్థ స్వరూపాన్ని తెలుసుకొని ధ్యానించాలి. అది పురుషార్థ సాధనం అవుతుంది" (పూజ. 94పే)

ఈ అభిప్రాయాల వల్ల వైష్ణవాది మతస్థులు వేదవిషయాలకు తప్పుడు అర్థాలను చెప్తూ వ్రాసిన పురాణ గాథలవల్లే ఇట్టి అవైదిక, నిష్ప్రయోజన విషయాలు ప్రచారంలోకి వచ్చాయి. ఉదాహరణకు 'దేశిసారస్వతముగా (స్త్రీలరామాయణపు పాటలు 252, 253 పే) అనే పుస్తంలో ఉన్న శ్రీరామ మానస పూజ" అనే ఈపాటను గమనిద్దాం.

నాభికంఠ సముద్భూతుడు, కదళీకుడ మోపముడైన పరమ పురుషుని హృదయ పంకజ మందు ధ్యానం చేయాలి. రామనామధ్యానంతో వికసించిన హృదయ కుసుమాన్ని తేజోవంతమైన సోమాగ్నిగా భావించాలి. తపో పరవృత్యలో కోటి సూర్యతేజస్సును కలిగిన పరమాత్మను ఆవాహనం చేయాలి. రత్న సింహాస నాన్ని ఇస్తున్నాను స్వీకరించు ప్రభూ। ఇందు జానకీ సహితంగా వచ్చి స్థిరంగా ఉండుమని వేడాలి. పూజ పరిసమాప్తి పర్యంతం సన్నిహితవై నాకభిముఖుడవై ఉండుమని అర్థించాలి. త్రైలోకవ్యాపకా నీకునమస్కారము. నాకు ప్రసన్నుడ వగుము. ఈపాద్యమును గ్రహింపుము తత్త్వజ్ఞాన స్వరూపా। ఈ మధుపర్కాన్ని తీసుకొన్నము. జ్ఞానరూపా। ఈ సర్వలోకైక నాయకా। శ్రీరామా। ఆచమనము గ్రహింపుము. బ్రహ్మాండోదర మధ్యనున్న తీర్థంతో స్నానం చేయిస్తున్నాను. అనుగ్రహింపుము. ఓ హరీ ఇదే పీతాంబరం. ఓ విశ్వేశా। కుంకుమాగరు కస్తూరీ కర్పూర మిశ్రిత చందనాన్ని స్వీకరించండి. ఓ మహేశ్వరా। తులసీకుందమందా రాది పుష్పమాలలచేత భక్తితో పూజ చేస్తున్నాను. స్వీకరించు. తేజోమయమూర్తీ। ఈ ధూపాన్ని సమర్పిస్తున్నాను. త్రైలోక్యతిమిరాపహమైన దీపాన్ని గ్రహించు। షడ్రసోపేతమయిన ఈ సిద్ధమైన అన్న అమృతనైవేద్యం నీచేతగ్రహింపబడుగాక. కర్పూర సువాసితం, నాగవల్లీదళైరూప్యమైన తాంబూలాన్ని స్వీకరించు. ఈ నృత్య గీతాది వాయిద్యాలు, పురాణపఠనలచే సంతుష్టుడవగుము. పూర్ణానంద స్వరూపా। ఈ అర్ఘ్యాన్ని గ్రహింప నమస్కారం చేస్తున్నాను. ఇదే మంగళార్థం నీరాజనాన్ని గ్రహించు. సర్వభూతాన్తరస్థ సీతాసమేత పరమాత్మా। ఇదే నా నమస్కారం. అంతఃకరణ సంసిద్ధి నాకు ప్రసాదించు అని కోరుతూ నమస్కారంతో పూజ ముగించాలి.

ఇట్లా పురాణోక్త మానసపూజా విషయాన్ని, వైదిక మానసిక విద్యోపాసనా విషయాన్ని పరిశీలించిన మీదట తేలిన సారాంశమిది వేదం వర్ణించిన తత్త్వసంబంధ శబ్దాలను కొన్నింటిని గ్రహించి వైష్ణవాది మతాలకు అనుకూలమైన పురాణగ్రంథాలు ఈమానస పూజను తయారుచేశాయి. వేదం తెలిపిన పరమాత్మ జ్ఞానాన్ని విశేషాలను ఈ పౌరాణికులు తాము సృష్టించుకున్నరామ, విష్ణ్వాది నామక విగ్రహాలకు ఆపాదించుకుంటూ తాము మతపరంగా వ్రాసుకున్న అవైదిక భక్తిమార్గ పూజా

విధానాలను మిళితంజేసి ఈ పూజా విధానాన్ని ఏర్పరచారు. అది ప్రచారంచేసి ప్రజలకు ఆశలు కల్పించి వారిని వైదిక జ్ఞాన శూన్యులుగా జేశారు. కాబట్టే వైదిక ధర్మాన్ని విస్మరించి భిన్నసాంప్రదాయాలను ఏర్పరచుకున్న మతస్థులు ఒకరికొకరు శత్రువులైనారు. భిన్నమతాల వారేకాక ఒకమతంలోని వారే పరస్పరం వైరుధ్యం కలిగినవారైనారు వైష్ణవానికి చెందిన ఈ మానస పూజా విషయంలోనే ఒక అద్వైత్వ వాది నిరసనను ప్రకటిస్తే, మరొక వైష్ణవుడే తన అసమ్మతిని తెలియచేశాడు.

మానసపూజా విషయంలో అద్వైత వాదియైన శ్రీశంకరాచార్యులు తెలిపిన నిరసనను (శ్రీశంకరాచార్యవర్యుల 17, 18 భాగాలు) నిర్గుణ మానసపూజ అనే గ్రంథం ఇట్లా తెలిపింది. "పూర్ణుడైన పరమేశ్వరునికి ఆవాహన మెక్కడిది ? నిర్మలునకు అర్ఘ్య పాద్యాలెందుకు ? విశ్వోదరునికి వస్త్రమేల ? నిర్లిప్తునకు గంధ మేల ? నిరంజనునికి ధూపమెందుకు ? సర్వసాక్షికి దీపంతో ప్రయోజనమేముంది ? సూర్యాదులను భాసింపజేసే పరమేశ్వరుడికి నీరాజనమెందుకు ? నిత్యతృప్తునకు నైవేద్యం, తాంబూలాలెందుకు ? బాహ్యాభ్యంతరాలలో నిండి ఉండే పరమాత్మకు ఉద్వాసన విధిఎట్లా వర్తిస్తుంది" (పూజ 92పే) అనే ప్రశ్నల పరంపరతో ఈ మానసపూజయెడ నిరసనను వ్యక్తంచేశారు. వైష్ణవ మతస్థుడే అయిన శ్రీమధ్వాచార్యులు తమ ఛాందోగ్యోపనిషత్తు భాష్యంలో "అచేతనవస్తువెన్నడు ఫలమియ్యదు. కాబట్టి అచేతనాన్ని ఉపాసించకూడదు. ఒకదానిని మరొకదానిగా ధ్యానించిన అది పురుషార్థం కలిగించదు. రాజునకు ఈయవలసిన గౌరవం భృత్యునకిచ్చిన రాజువానిని దండిస్తాడు. అందువల్ల అనర్థం వాటిల్లుతుంది. కాబట్టి పరమాత్మ స్థానంలో ఇతరులను పూజిస్తే అంధకారంలో పడిపోతారు. అందువల్ల యదార్థ స్వరూపాన్ని తెలుసుకొని ధ్యానించాలి. అది పురుషార్థ సాధనం అవుతుంది" (పూజ. 94పే)

ఈ అభిప్రాయాల వల్ల వైష్ణవాది మతస్థులు వేదవిషయాలకు తప్పుడు అర్థాలను చెప్తూ వ్రాసిన పురాణ గాథలవల్లే ఇట్టి అవైదిక, నిష్ప్రయోజన విషయాలు ప్రచారంలోకి వచ్చాయి. ఉదాహరణకు 'దేశిసారస్వతముగా (స్త్రీలరామాయణపు పాటలు 252, 253 పే) అనే పుస్తకంలో ఉన్న శ్రీరామ మానస పూజ" అనే ఈపాటను గమనిద్దాం.

"రాగద్వేషాములుమాని రాముని గొలువారే
బాగుమీరవైకుంఠపదవి పొందేరు,
కామక్రోధలోభమోహములు కడకు జిమ్మారె
శ్యామ సుందరమైన రాముని ప్రేమాదలువారె
చతుర్మధ్యమున జిక్కచింతాశయాకే మనసా
పరమాత్ములైన రాముని దలచముక్తి బొందేరు
మరువకుమీయెప్పుడు రామనామా మంత్రము
స్థిరముగా నీపూజేయ పొదవి పొందెదవూ
అందమయిన హృదయకమలమందున రాముని
సుందరమైన నీలమేఘ శ్యామల రామునీ
మీగళ్లనీలంపు తామరలు మించుమణులూ
రంగుమీరిన దొంతిచక్రాలే రాముని జఘనాలు
.... .... .... .......
తుంబురుడు నారదుడూ గానము సేయంగ
రంభ ఊర్వశి .మేనకాదులు నాత్యమాడంగ
అక్షయమైన దీపారాధన పక్షివాహనుడు
లక్ష్మిదేవి వచ్చి అర్ఘ్య ఉదకమీయంగ
పంచపాత్రతోను పంచామృతమూలు
బ్రహ్మవచ్చి శ్రీరామునకభిషేకం చేయ్యగా
క్షీరదధిమధుఘృత శర్కర అభిషేకం సేయుదురు
గంధ కస్తూరి కర్పూర పన్నీటజలకం సేయుదురు
.... ........ .... ......
నవరత్నహేమసింహాసనము మీద కూర్చుండిరి
దశదిక్కులను దైవదుందుభులు మ్రోయ
సీతారాములపైనికురిసె పుష్పవర్షాము

పారుజాతమ్ముల రాముని పాదంబు పూజింత్రు
మల్లెపూవుల నారాయణుని నఖములు పూజింతురి
పొన్నపూవుల యాదవ రాముని వూర్వులు పూజింతురి
గన్నేరు పూల విష్ణురాముని పిరుదలు పూజింత్రు
రామమానస పూజ భువిలో రమణులుపాడిన
కామి తార్థము లిచ్చి బోరిచుకౌసల్య తనయుాడు"

ఈ పాటలో సంపూర్ణంగా అవైదిక పురాణ ప్రభావం కనబడుతున్నది. పైన తెలిపి పురాణ పద్ధతిలోని షోడశోపచార యుక్తమైన మానస పూజా విధానమే గాక పాదాలతో పాటు పిరుదులు, నఖములను కూడా పూజిస్తారనటం "పిచ్చిముదిరి రోకలి తలకు చుట్టమన్నట్లు" అన్న సామెతను గుర్తుచేయటమే అయింది. ఇట్లా ప్రయోజన రహిత విషయాలు ప్రజలకు దుఃఖహేతువులే కాని వేదవిషయాలవలె సర్వజన సౌఖ్యావహాలు కావు అనే విషయం స్పష్టపడుతున్నది

అవైదికం, పురాణోక్తం, వైష్ణవ సంబంధి అయిన మానసపూజా విధానాన్నే వేంకటదాసు తన కీర్తనల ద్వారా తెలిపారు. అది ఇట పరిశీలించదగును.
"పూజశాయరే-మానసపూజశాయరే" (శ్రీ రా. వే. కీ. 1930-29పే) అనే కీర్తనలో

స్నానసంధ్య శీతజలము దానధర్మ క్రతువు వ్రతము
పూనిసలుపు సుకృతమేమిగాననగును దీనివలన ॥పూజ॥

చెడుగు మంత్రతంత్రయంత్రజ్వర పిశాచపరుల బాధా
బడుగురోగఘోరశత్రుబంధనముల దొలగజేయు ॥పూజ॥

బలుధనంబు భాగ్యమాయువు చెలగుకీర్తి పరమ సుఖము
వెలయనొసగి రాకమచర్ల నిలయుడెపుడు బోరిచుచుండు ॥పూజ॥

అంటూ శ్రీరామచంద్రునికి మానసపూజ చేస్తే దాని ఫలమేమిటో వివరించారు. అంతేగాక "వెరపు మరపు లేక మనస్సుహరికి పరవశముగ జేసి-గురునికృపను

వెంకటదాసుడరసి మీకు సేవజేయ ఈ పూజ చేయమని చెప్పారు. దీనివల్ల వేంకట దాసు గారికి పురాణజ్ఞానమేగాని వైదికజ్ఞానంలేదని తమజ్ఞానంవైపుకు ప్రజలను ప్రోత్సహించటం వల్లవారికి చేటు చేశారని చెప్పక తప్పదు.

రాకమచర్ల వేంకటదాసు మానసపూజ కీర్తనలు ఇరువది మూడు చెప్పారు. అవి పూరాణోక్త మానసపూజతో సంబంధాన్ని కలిగి ఉన్నాయి.

మానసపూజా ప్రారంభంలో వేంకటదాసు రెండు శ్లోకాల ద్వారా నారాయణుని ప్రార్థించారు. సమస్తశాస్త్రిలను సమగ్రంగా విచారించిన అనంతర, నారాయణుడొక్కడే అని తెల్సుకుని అతనిని ధ్యానిస్తాను. అట్టి నారాయణుని భజిస్తాను సదా నారాయణ పూజను చేస్తాను. ఈ ప్రార్థనలో స్మరణాసక్తి, దాస్యా సక్తి, పూజాసక్తి, వంటి పై వైష్ణవ భక్తి మార్గాలు ఇమిడి ఉన్నాయి. అయితే "పరతత్త్వమైన నారాయణుని భజిస్తాను అని చెప్పిన అతడు నారాయణపాదానికి నమస్కరిస్తానని చెప్పటం అసమంజసం. అవ్యయమైన నారాయణ తత్త్వం దాసుగారు తెలుసుకున్నట్లు కనపడదు.

అవ్యయమైన నారాయణ నామానికి వైదికార్థం ఇట్లా ఉంది "నారాయణ పదంలోని 'నారా' అనే భాగానికి జలము, జీవులు అని అర్థం. అవి అతనికి "అయనము" అనగా నివాస స్థానమని అర్థం. కాగా సమస్తజీవులయందు వ్యాపకుడైన పరమాత్మనామం నారాయణుడు (స. ప్ర. 1 స. 23 పే). ఈ నారాయణుడు నిర్గుణుడు, నిరాకారుడు, ఇట్టి వైదికార్థం చింతనచేయకుండా మతబద్ధమైన పురాణ వచన ప్రమాణంతో పరతత్త్వమైన నారాయణుని పాదాలకు నమస్కారం చేయుటం వైష్ణవ మతాను సారమే! ఇట్టి ప్రచారం ప్రజలను పెడత్రోవ పట్టించటమే అవుతుంది ఈ విచారాన్ని బట్టి దాసుగారు తెలిపిన మానసపూజ కీర్తనలన్నీ వైష్ణవ మతానుసార పురాణప్రోక్త మానస పూజకు చెందినవనే విషయం స్పష్ట మౌతున్నది.

మానసపూజ ప్రారంభానికి ముందుగా మనస్సు నిలిపేందుకు సుఖాసీనుడై రాముని చిన్తచేయాలని బ్రహ్మాండ పురాణంతర్గత శ్రీరామబ్రహ్మమానసపూజలో

తెలుపబడింది. (శ్రీ.రా.బ్ర. మా.పూ. శ్లో|| 2) తదనుగుణంగానే వేంకటదాసు మానసపూజ ప్రారంభంలో "చూడబోదమురావే చిత్తమా వేడుక హరిని దర్శించి వత్తమా" (రా. వేం.కీ. 1930. 38 పే) అనే మనోబోధకీర్తనను చెప్పారు.

"ఇరవంద హరిపేరుదత్తమా - వానిచరణయుగంబులు గొత్తమ
కరమొప్పమదిలోన మురిపెము రంజిల్ల సరసిజనయుని నందరము
నేడు ||చూడ||

నిక్షేప మని నమ్మకుందమా - మమ్మురక్షింపు మనివేడుచుందమా
అక్షయ సద్ధర్మలక్షలణుడయినట్టిపక్షివాహననామభజనచేసినేడు||చూడ||

ఇట్లా సాగిన ఈ కీర్తనలో పూర్తిగా వైష్ణవ భక్తి మార్గాన్ని అనుసరించాడు అనేది స్పష్టమౌతున్నది. ఈ కీర్తనలోని "చూడబోదమురావే చూడ్కులకింపుగ జోడు బాయక లక్ష్మితోడ వెలుగునట్టి" హరిని చూడబోదమురావే అనే చరణంలో వైష్ణవ పరమైన లక్ష్మినారాయణ స్వరూపాన్ని సూచించారు,

కాని 'లక్ష్మి' అనేది నిర్గుణ పరమాత్మకు నామమని, 'లక్ష్మి' పదానికున్న వైదికార్థాన్ని దాసుగారు తెలుసుకున్నట్లు లేదు. లక్ష్మి పదానికి వేదం సూచించిన అర్థమిది. "లక్షదర్శ నాఙ్కనయోః" అనే ధాతువు నుంచి లక్ష్మి శబ్దం ఏర్పడింది. దానికి చరాచర జగత్తును చూచేవాడు, దృశ్యంగా చేసేవాడు, శరీరమందు కన్ను ముక్కు మొదలైన వాటిని, వృక్షములందు పత్రపుష్ప ఫలాదులను, భూజలముల ఎరుపు, నలుపు, తెలుపులను, మృత్తికాపాషాణ చంద్ర సూర్యాది దృశ్యాలను చేసే వాడు, అన్నింటిని చూచేవాడు, వేదశాస్త్రిలకు ధార్మికులకు విద్వాంసులకు యోగులకు లక్ష్యం (స. ప్ర. 1స. 28 పే). ఈ వైదికార్థాన్ని ఎరుంగని దాసుగారు వైష్ణవ మత పురాణాలు తెలిపిన విధంగా 'లక్ష్మి' పదాన్ని స్త్రీవాచకంగా గ్రహించి 'లక్ష్మినారాయణ స్వరూపాన్ని తెలిపారు.

రామ చింతనానంతరం భవబన్ధ విముక్తిని కోరి రామధ్యానం చేయాలని మానసపూజ తెలిపింది. (శ్రీ. రా. బ్ర. మా .పూ. 3శ్లో) దానిననుసరించిన దాసుగారు

"ధ్యానపారీణ నారాయణ మాంపాహినిత్య-ధ్యాన పారీణ నారాయణ (రా.వేం.కీ. 1930 38 పే) అనే ధ్యాన కీర్తన చెప్పబడింది.

దీనజనావన మానిత సుందర జ్ఞానయోగ సంధాననిదాన
చక్షుశ్రవణాధ్యక్ష శయనకనకాక్షిశిక్షవరపక్షి వాహన ॥ధ్యాన॥

అమలకమలదక్షవిమలనయభవశమధి భక్తహృత్కమలనివాసు
తీరహీరనీహారకుందమందారకీర్తివిస్తార రమేశా
లోకపాలసురలోరజేలనఘన శ్రీకరరాకమచర్ల విహార ॥ధ్యాన॥

అనేవి ఈ కీర్తనలోని చరణాలు. శ్రీ రాకమచర్ల నారాయణునే ధ్యానించారు దాసుగారు. ఇందున్న జ్ఞానయోగ సంధాన విధానం మొదలైన విశేషణాలతో రాకమచర్లేశుని ధ్యానించటం జరిగింది.

కాని జ్ఞానయోగ సంధాన నిధీనుడు నిరాకార, నిర్గుణ పరబ్రహ్మమని వేదం తెలుపుతున్నది. తద్విరుద్ధంగా ఈ విశేషణం జడస్వరూప రాకమచర్లేశునికి వాడటం అవైదిక పూరాణ ప్రభావ ఫలితమే అని స్పష్టపడుతున్నది.

ధ్యానానంతరం దివ్య పీఠం సమర్పించి సేవించాలని పురాణోక్త మానస పూజా విధానం (శ్రీ.దా.బ్ర.మా.పూ. 7 శ్లో॥) తదనుగుణంగా దాసుగారు కూడా "రారగోపాలబాల రార" (రా.వే.కీ. 1930 - 39 పే) అనే కీర్తన ద్వారా రత్నసింహాసనాన్ని సమర్పించారు. రాకమచర్లేశుని

అచ్చుపు భక్తిని అనుసరించితిని
పచ్చలపీఠము బాగుగ బెట్టిద ॥రార॥

ధరణిలో వెంకటదాసుడు బిలువగ
శిరిగల రాకమచర్లస్వామియిటు ॥రార॥

అని పురాణోక్త

విధితో పీఠముపైకి ఆహ్వానించారు.

సమస్తజగానికి సృష్టికర్త, స్వామి, పరమాత్ముడని వేదంతెలుపుతుంటే పై కీర్తనలో

ముజ్జగములుగల బొజ్జ గదులగను
గజ్జల పదములు ఘల్లనిమ్రోయగ

రారా గోపాలబాల అని సాకార విగ్రహ స్వరూపునిముజ్జగములకు మూలమైన వాడుగా చెప్పి ఆహ్వానించటం వైష్ణవ మతపద్ధతిలోని పురాణ ప్రతిపాదననే దాసు గారు అనుసరించారు.

అనంతరం పాద్యం ఇవ్వటం పురాణోక్త మానస పూజా పద్ధతి. (శ్రీ.రా. బ్ర. మా. పూ 25 శ్లో) ఈ పద్ధతిలోనే ఈతడు కూడా "పాద్యం బిచ్చెదరామా నను పాలించవె గుణధామా (రా.వేం. కీ. 1930. 89పే) అనే కీర్తనద్వారా రాకమచర్లస్వామికి పాద్యం సమర్పించారు. ఈ కీర్తనలో చివరి పాదం ఇట్లా చెప్పబడింది.

"బలు వైరాగ్యము తోసు
మరిసలలితమగు జలములను
చలగు రాకమచర్ల స్వామివని
పలుమరు మీ మృదుపద పద్మములకు"

పాద్యం బిచ్చెదను ననుపాలింపు మని వేడుకున్నాడు. ఈ పాదంలో జలములచనుచలగు' అనే విశేషణం ద్వారా వైష్ణవ పరమైన మత్స్యాది అవతార విశేషాలను గుర్తుచేశారు.

పరమాత్ముడు అనాది అని వేదం తెలుపుతున్నది. 'జలఘాతనే' అనే ధాతువు నుంచి జలశబ్దం సిద్ధించింది. దీనికి దుష్టులను తాడించేవాడు, పరమాణువుల అన్యోన్య సంయోగ వియోగములను చేసేవాడగుటవల్ల పరమాత్మ జల సంజ్ఞకుడు' అనే వైదికార్థాన్ని సత్యార్థ ప్రకాశిక తెలిపింది (స.ప్ర. 22 పే). ఇట్టి వైదికార్థంపై సత్యమైన అవగాహన లేక అవతారవాదం చెప్పిన పురాణోక్త జ్ఞానంతోనే దాసుగారు తృప్తి పడటం శోచనీయం.

పాద్యం తరువాత అర్ఘ్యం ఇవ్వటం పురాణ ప్రతిపాదనానుసరణమే. ఈ పద్ధతిలోనే దాసుగారు 'ఇదిగో అర్ఘ్యము లిత్తునయ్యా-చాలముదమంది గైకొనరయ్యా' అనే కీర్తన ద్వారా రాకమచర్ల విహారునికి అర్ఘ్యం సమర్పించారు. ఈ కీర్తనలో

"సరసిజనయనా సురేశా
భక్తవరద చిద్విలాసా
నిరతిశయనాలోని భరితదయకర
పరమపావన పరద్విరదరక్షక దేవ ॥ఇదిగో॥

పండిత హృదయా వాసా
మణికుండలా ప్రకాశా
దండిగా నేను నీఅండ జేరగగోరుచుండెదా
నీవు నాదండ బాయకుమని ॥ఇదిగో॥

అనే చరణాలలో రాకమచర్లేశుని చిద్విలాస అని, పండిత హృదయవాసా అని సంబోధించటం వైష్ణవ సాహిత్య ప్రభావమే.

"చితీ సంజ్ఞానే" అనే ధాతువునుండి చిత్ శబ్దమేర్పడింది. దీనికి చైతన్య స్వరూపుడై సమస్త జీవులను తెల్వితో గూర్చి సత్యాసత్యములను తెలుపు పరమేశ్వరుడికి 'చిత్తు' అని పేరు (స.ప్ర. 26పే). అని వేదం పరమేశ్వర నామాన్ని సూచిస్తుంటే జడస్వరూపుడైన రాకమచర్లేశుని పై విధంగా సంబోధించారు.

అర్ఘ్యం తరువాత స్నానం సమర్పించటం పౌరాణిక మానస పూజా విధానం (శ్రీ రా.బ్ర.మా.పూ. 28 శ్లో) అట్లాగే ఈతడు కూడా 'మజ్జన మొనరింపవే రామయ్య నామనవి చిత్తగించవె' (రా. వేం. కీ. 1930-40పే) అనే కీర్తన ద్వారా స్నానాన్ని రాకమచర్లవాసునికి సమర్పించారు. ఈ కీర్తనల్లో

"ఇంకువతోడు తనూ
నామదిలో కళంకము దీరాగనూ

పొంకాముతో మీకు వెంకటదాసుడు
శంఖముతో నభిషేకము శాయగ"

అనే చరణం అసమంజసంగా తోస్తుంది. మానసపూజ అంటే కేవలం మనసునే అన్నిటిగా జేసి సమర్పించటం గదా! అట్టియెడ దానిని మరచి దాసుగారు శంఖముతో అభిషేకం చేయిస్తాననటం అసమంజస విషయం. మానసపూజకు సంబంధించని క్రియ. నామదిలో కళంకందీరగ నామది అనే శంఖంతో అభిషేకం చేయిస్తానని అన్వయం చేసుకుంటే సరిపోతుంది. అయితే ఈ చరణంవల్ల వైష్ణవ మతపరమైన విగ్రహారాధనకు సంబంధించినదే ఈ మానసపూజ అనే విషయం పైన వివరించిన విధంగా స్పష్టపడుతున్నది.

"మజ్జన మొనరించు మది సంతసించాగ
ముజ్జగములకెల్ల మూలమైన తండ్రి ॥మజ్జన॥

అనే చరణంలో రామచర్ణేశుని 'ముజ్జగములకు మూలమైన తండ్రి' అని చెప్పటం వారి వైష్ణవ జ్ఞానానికి నిదర్శనం.

సమస్త జగత్తునకు మూలమైంది అనాది పరమేశ్వరుడు. అతడే సర్వజగత్తుకు స్వామి అని వేదాలు తెలుపుతున్నాయి. తద్విరుద్ధంగా రామచర్ణేశుడైన హరి ముజ్జగాలకు తండ్రి అన్నారు.

ఆచమనం ఇవ్వటం పురాణోక్త మానసపూజా విధానం. ఈతడు కూడా 'ఆచమానములిత్తునయ్యా – నన్నాదరించవె ముద్దులయ్యా' అనే కీర్తన ద్వారా (రా.వేం కీ. 1930-40 పే) ఆచమనాన్ని రామచర్లవాసునికి సమర్పించారు. ఈ కీర్తనలోని

"దాసభావమునొంది నేను
నిన్నుదలతు నెమ్మది
వాసిగానను కరుణచేసి బోవుమటంచు
భాసురముగాను శ్రీకేశవా యని మీకు ।ఆచ॥

అనే చరణంవల్ల ఈ మానసపూజ పూర్తిగా వైష్ణవమత తత్త్వమే అని తేట పడుతున్నది.

మానసపూజ యందు అభివస్త్రములివ్వటం పౌరాణికమే! ఆ మార్గంలోనే వేంకటదాసుగారు "అభివస్త్రములనిచ్చెనయ్య రామయ్య - మీరురంగూడ ధరించరయ్య రామయ్య" (రా.వేం.కీ. 1930-41 పే) అనే కీర్తన ద్వారా రాకమచర్లనివాసునికి అభి వస్త్రాలను సమర్పించారు. ఈ కీర్తనలోని "శ్రీకరరూపక రామయ్యా వరరాకమచర్ల నివాస రామయ్య" అనేది చివరి చరణం రాకమచర్లలో ఉన్నది యోగ నరసింహుడు, దాసగురు రాకమచర్ల నివాసివి ( మయ్యా" అనటం పరమవైష్ణవం. నారాయణుని అవతారాలే రాముడు, నృసింహుడు మొదలైనవన్నీ అని వైష్ణవమతం చెప్తున్నవి. కనుకనే రాముడికి నృసింహుడికి తేడా లేదనే వైష్ణవ భావాన్ని వ్యక్తం చేశారు.

"శ్రీఞ్ సేవాయాం" అనే ధాతువు నుంచి 'శ్రీ' శబ్దం ఏర్పడుతున్నది. దీనికి అతని సేవ సమస్త జగత్తు, విద్వాంసులు, యోగులు చేస్తున్నారు కనుక పరమేశ్వరుడి నామం శ్రీ (స.ప. 28 పే) ఇట్టి వైదికార్థం విస్మరించి అట్లా చెప్పటం పురాణను సారమే.

కుంకుమాగరు కస్తూరీ కర్పూర మిశ్ర చందనం సమర్పించటం పౌరాణిక మానసపూజా విధానం. అట్లే వేంకటదాసుగారు 'కర్పూరగంధంబుం పూనెద - శ్రీకాంతా మిమ్ము లనుతిచేసెదా" (రా. వేం. కీ. 193-41 పే) అనే కీర్తన ద్వారా రాకమచర్లవాసునికి గంధం, కర్పూర తిలకం, సమర్పించారు. ఇప్పటున

"అనురాగ పునుగుజవ్వాజి కస్తూరి చాత
ఘుమఘుమ తాపులు గుమ్మరింపగమేన ॥కర్పూ॥

పొందుగ మీ సేవసలిపెదా చూడముందాట ముకరంబునిలిపెదా
సుందరమగు మోమునందు కస్తూరిబొట్టు పొందుపరచి మోద
మొందుచుమీకునే ॥కర్పూ॥

వాసిగమిమ్ము దలంచేదా నాదువాంఛలెల్లను విన్నవించెదా
శ్రీరాకమచర్లవాసుడవనినుతిజేసి నే వేంకటదాసుడని మ్రొక్కి
||కరూ||

అనే చరణాలలో తన బిడ్డకు ఏకాగ్రతతో బొట్టును దిద్ది తన కుమారుని
దానికి మురిసిపోయే తల్లి వాత్సల్యంగోచరమవుతుంది. ఇట్లా వైష్ణవమైన వాత్స
సక్తి అనే భక్తి మార్గాన్ని దాసుగారు అనుసరించారు.

అనంతరం పురాణప్రబోధితంగానే 'కరుణతోడ జూడురా ఆభరణముల
స్కించరా హరి' (రా వేం.కీ. 1930. 42 పే) అనే కీర్తనద్వారా రాకమచర్లహరికి
రణాలు సమర్పించారు "పూజా ప్రియుడు శివుడు, అలంకారప్రియుడు విష్ణువు"
నే మతపరమైన నానుడిలోకంలో ప్రసిద్ధమైనదే। వైష్ణవ పద్ధతిలోనే స్వామికి
వ్వలు, మొలత్రాడు, ఉంగరం, కిరీటం మొదలైన అలంకారాలను సమర్పించారు
తన బిడ్డకు ఇట్టి ఆభరణధారణ చేసి తన బిడ్డను చిన్నికృష్ణుని పోలికతో
మరచే సంఘటనను గుర్తుకు తెస్తున్నదీ కీర్తన. తల్లి తన బిడ్డను అలంకారాలతో
పుదిద్ది గద ఉన్న భీముడు, ధనుష్న్న దాశరథి, శంఖమున్న శౌరి అంటూ
వ్యుల పోలిక తన మనమున భావించుకుని తాదాత్మ్యం చెందటం నిత్యం చూచే
షయమే। అట్లాగే దాసుగారు కూడా రాకమచర్లేశునికి సర్వాలంకారాలు సమర్పించి

"చెలిగిమర్త్యల్గొగములు వెలయుకే మోదకియును
కలితశంఖచక్రనందకకార్ముకంబు తెలిమిబూని ||కరు||

సరసమైన రాకమచర్లవారి పటుసుచు మిమ్ము దలచి
పరగవేంకటదాసుడిపుడు మురసి మీకు శరణుశాయ ||కరు||

అనే చరణాలలోని వాత్సల్యాసక్తి, శరణాగతి వైష్ణవమే। పుష్పపూజ
మర్పణం పౌరాణిక మార్గాను సరణమే. దాసుగారు రాకమచర్లస్వామికి ఆభరణ
మర్పణానంతరం "పూజసేతునయ్యరాఘవా - మహానుభావ" (రా.వేం.కీ. 1930.
3 పే) అనే కీర్తనతో పుష్పపూజను సమర్పించారు. ఈ సందర్భంలో కీర్తనలో

మల్లెలు, విరజాజులు, మొల్లలు, తులసీదళం, పొగడలు, మొగలి, పారిజాతం మొదలైన తెలుగు పుష్పజాతుల నెన్నింటినో తెలిపారు. ఈ కీర్తనలోని

"మెచ్చులలరు చంపకంబుతా
సారాజములు మంచుకాంతిపొగడపువ్వులూ
పచ్చచామంతివలులుబాగుమీర కాంచనములు
అచ్చమైన భక్తి చేత మశ్చకూర్మసీమములను ॥పూజ॥

చన్నుమిగుల వకుళజాజులూ వరపారుజాత
మెన్నగలుగుచున్న పొన్నలూ వున్నతంబుగాను
మీమనోత్సవంబుగానొనర్చి సన్నుతంబుల
యిన విరులసహస్రనామములుదలంచి ॥పూజ॥

కోరికలర మొగలిరేకులు కరవీరములు
నీరుగన్నేరు బిల్వదళములూసారసాక్ష
రాకమచర్లస్వామినన్నుగావు మనుచు
సారెసారెకు ఓంకారమునుచ్చరించి మిము ॥పూజ॥

చరణాలలో సహస్ర విరులనామములంటూ వైష్ణవ పరమైన విష్ణుసహస్ర నామాలను గుర్తుచేశారు పూజాసక్తి, స్మరణాసక్తి భక్తి మార్గాలను అనుసరించారు.

వేదశాస్త్రిలు పరమేశ్వరుని ప్రధాననామం "ఓం" అని తెల్పుతున్నాయి. "ఓం ఎవని నామమో, ఎవడెన్నటికీ నశించడో అతనిని ఉపాసించటం యోగ్య మనీ తెలుపుతున్నాయి (స.ప్ర. 12 పే) ఇట్టి వైదిక విషయాన్ని గ్రహింపలేక "ఓంకారము నుచ్చరించి మిము" పూజసేతునయ్యా రాఘవా అనటం పూర్తిగా అవైదికమైన వైష్ణవ పురాణాలు తెలిపిన జడపూజా విధానమే.

ధూప, దీప, నైవేద్య సమర్పణం కూడా పురాణ ప్రతిపాదిత విషయమే. వేంకటదాసు "ధూపమాఘ్రాపయామి శ్రీనామనామదీపం దరిశయామి" (రా. వేం. కీ

1930-43 పే) అనే కీర్తన ద్వారా రాకమచర్లవాసుడికి ధూపదీపాలను సమర్పించారు.

"శాయవయ్య భోజనంబు జానకి తోడను - చాయదేరురుచుల
తోడ చలగిబంగరుపళ్లెరమున" (రా.వేం.కీ, 1930-43పే)

అనే కీర్తన ద్వారా రాకమచర్లవాసుడికి నైవేద్యం సమర్పించారు. ఈ కీర్తనలో బూరెలు, పూర్ణాలు, కుడుములు మొదలై పిండివంటలు, పచ్చిపప్పు, కూర గాయలు, చిత్రాన్నం, పనస, మామిడి మొదలైన తెలుగు ఫలసంతతిని తెలిపారు.

సర్వవ్యాపియైన పరమాత్మ సమస్తానికి సృష్టికర్త. అతనికి ఆకలి దప్పులు, జరామరణాలు లేవు. అనంతుడు నిత్యుడు అని పరమేశ్వరతత్వాన్ని వేదశాస్త్రాలు వర్ణిస్తున్నాయి. అట్టి వైదిక విషయ జ్ఞానం స్పృగ్యమైన ఈతడు రుచులతో భోజ నాన్ని సమర్పించిన రాకమచర్లేశుడు వైష్ణవ మత పరిమితి గల్గిన. పురాణాలు వర్ణించిన అవైదిక మూర్తి అని, అట్టి అవైదిక మూర్తిపూజ ఈ మానసపూజ అని గ్రహింపతగి ఉంది.

నైవేద్య సమర్పణానంతరం తాంబూల సమర్పణం, నృత్యగీతాది వాద్య సమర్పణం, పురాణ పఠనం, రాజోపచారాలతో సంతృప్తి పరచటం, మంగళార్థం నీరాజన సమర్పణం, పురాణం తెలిపిన పూజా విధానం. దాసుగారు కూడా ఆ పద్ధతినే అనుసరించారు. (రా. వే. కీ. 1930-44 పే) గల ఈ కీర్తన ద్వారా "విడెము లర్పించెదనయ్య రామ - భవతారకనామ" రాకమచర్లాధిపునికి తాంబూలం సమర్పించారు. ఈ కీర్తనలో తడవులేని వైరాగ్యమెసగి నామనసులోన యడలేని దక్షిణ మీకొసగిబడి నన్నిక యడబాయకుమని వేడుచు రాకమచర్లాధిప" అనేది చివరి చరణం. వైరాగ్యాన్ని పొంది నామనసును నీకు దక్షిణగా సమర్పిస్తున్నాను. నన్ను ఎడబాయకుండుమని రాకమచర్లేశుని వేడికోలు వైష్ణవమైనదాసాసక్తి భక్తి మార్గాన్ని సూచిస్తున్నది

"పరమేశ్వరుని జ్ఞానరూప యజ్ఞాన్ని, ఆత్మాది ద్రవ్యాలను దక్షిణగా సమ ర్పించి ముక్త జీవులు మోక్షమున ప్రసన్నులుగా వుంటారు అనే విషయాన్ని ఈ ప్రకరణంలోనే తెలిపారు. పరమాత్మకు దక్షిణ ఏది సమర్పించాలో ఋగ్వేదం

అట్లా తెలుపుతుంటే వేంకటదాసుగారు అంగుగజాజికాయ జాపత్రి మొదలైన సుగంధ ద్రవ్యాలతో తాంబూలాన్ని రాకమచర్లేశునికి సమర్పించి వైరాగ్యాన్ని పొందాననటం, అసత్య విషయం. అట్టి వైరాగ్యమనమును దక్షిణగా సమర్పించటం అవైదిక విషయం. ఇట్లా లౌకికాచరిత కర్మలవల్ల ముక్తి రాదు అనేది స్పష్టమైన విషయం. కర్పూర హారతి అనే పౌరాణిక కలాపానికి "హారతులిచ్చెద నూడవే రామయ్య మంగళహారతులిచ్చెద చూడవె" (రా. వేం. కీ. 1930-44 పే) అనే మంగళహారతి కీర్తనను చెప్పారు. ఇందులో

"హారతులిచ్చెద చూడు నీరదాభశరీరదిగి బం
గారు పళ్లెరంబున శృంగారమౌ నీరాజనముల ।హార॥

దండినామములు మ్రోయగా
పరివారమొప్పుచుండి మీకు సేవజేయగా
పండితులెల్లాను జూచుచుండగా
అఖండమైన మండితకర్పూర కాంతి నిండి
మీరుచుండ మంగళ ॥హార॥

కోరికలెల్లాను దీరగా బ్రహ్మాది సురలు
జేరి మిమ్ముదేరి చూడగా
శారదాభ్రపటీరవర మందారహీర దుషారమౌక్తిక
సారసాఘనీసారసన్ని సారకీర్తి విశారదాయని ॥హార॥

అంచితగానాము సేయుచు
తాంబూరచే వాయించి మీపాటాలు బాడుచు
కాంచచేలము గొప్పకన్నులు
మీ సుందరాము గాంచి ఆనందించి సంతోషించుచు
మీచెంత నిలచి ॥హార॥

అనే చరణాలలో ఈ లౌకికాడంబరాలన్నీ భౌతికమైన నేత్రానందానికి మాత్రమే అనే విషయం స్పష్టమౌతున్నది. ఇట్టి క్రియలన్నీ ప్రజలను మతాల మత్తులో పడేసేటందుకు ఏర్పరచిన ప్రక్రియలే. గుణమాహాత్మ్యాసక్తి, పూజాసక్తి, దాసాసక్తి, మొదలైన వైష్ణవ భక్తి మార్గాలు సూచింపబడ్డాయి. వేదవిరుద్ధమైన ఈ జడపూజ పూర్తిగా వైష్ణవం

"మొక్కేదనయ్యా రాఘవా నీకు దక్కేదనయ్యా" (రా.వేం.కీ. 1930-44 పే) అనే కీర్తన ద్వారా వైష్ణవ మూర్తియైన రాకమచర్లని పాదయుగళానికి వేలు లక్షలు కోటులుగా ప్రదక్షిణాలను సమర్పించి వైష్ణవ భక్తిమార్గమైన సేవాసక్తిని వెల్లడించారు.

తరువాత రాజోపచారములొనరించెదనూ శ్రీరామచంద్రా - రాజోపచారములొనరించెదనూ" (రా.వేం.కీ. 1930.45 పే) అనే కీర్తనతో పౌరాణిక పద్ధతిననుసరించి నృత్య గీతోపవాద్యాలతో రామునికి రాజోపచారాలను సమర్పించారు. "ఎంతచక్కని దేవుడమ్మ శ్రీకాంతుని కనుగొనరమ్మా (రా.వేం.కీ. 1930.46 పే) అనే కీర్తనలోను, "దొరకెల్లానుదొరగదమ్మ - మా రామచంద్రులు" (రా. వేం. కీ. 1930.46 పే) అనే కీర్తనలోను వైష్ణవమైన గుణమాహాత్మ్యాసక్తిని వెల్లడించారు. నీరాజనాది కర్మను నిర్వర్తించిన తరువాత గుణకీర్తనం చేశారు.

అనంతరం "పవళించవెరాఘవా - సుహాసుభావ - నిదురించవే రాఘవా" (రా.వేం.కీ. 1930.47 పే) అనే సుషుప్తి కీర్తన వైష్ణమతప్రతి పాదిత పవళింపు సేవ అనే పేరుతో వేంకటదాసుగారు దాస్యాసక్తిని ప్రకటిస్తూ చెప్పిందే. "నాచిన్ని కృష్ణమ్మ నవమన్మథాకార లాలి" (రా.వేం.కీ. 1930.48 పే) "రామకృష్ణ జోజో - రామచంద్ర జోజో" (రా.వేం.కీ. 1930,49 పే) అనే కీర్తనలు పూర్తిగా వైష్ణవ ప్రతిపాదిత అవైదిక పూజా విధానానికి సంబంధించినవే. ఈ లాలి, జోలపాటలు తల్లి తన చిన్నిపాపకు బువ్వతినిపించి లాలించి తొట్టెలో నిదురబుచ్చు సంఘటనను గుర్తుకు తెస్తున్నాయి. ఈ మానసపూజలో వేంకటదాసుగారు చెప్పిన మంగళ హారతి, లాలి జోలపాటల వల్ల దాసుగారికి జానపదరీతులమీద ఉన్న ఆసక్తి వెల్లడి అవుతున్నది.

ఇట్లా ఈ మానసపూజ వేదవిషయాలను వక్రీకరించిన మత - సాహిత్యంగా

వెలసిన పురాణ విధానాన్ని పుణికి పుచ్చుకొని వైష్ణవమత ఆచారాలను పొందుపరచు కుని వేంకటదాసుగారు చెప్పారనటంలో సందేహం లేదు.

## వైష్ణవ భక్తికి చెందిన మరికొన్ని కీర్తనలు

వేంకటదాసు కీర్తనలలో నామం ఆవాహనం - అపరాధికీర్తనలు అనే పేరుతో కొన్ని కీర్తనలు ఉన్నాయి. ఈ కీర్తనలు పూర్తిగా వైష్ణవ భక్తిని పుణికి పుచ్చుకొని ఉన్నవి. ఇవి కూడా గురూపదేశానికి ముందే చెప్పి యుండవచ్చు.

నామం :

నామం కంటే వాక్కు గొప్పది అని నామం తెలిపింది. (7-2 1) వాక్కు మూలాన జ్ఞానం ఇతరులకు నేర్పగలం. నామంవల్ల అదిసాధ్యపడదు కనుకనే నామం కంటే వాక్కుగొప్పది. నామం అనే పేరుతో ఈతడు ఇరువది యారు కీర్తనలు చెప్పారు. నామం అంటే ఎరిగింపతగినది అనే అర్థమున్నది (అ.కో. 859 పు) వైష్ణవులు తమమతాధి దేవతకు ఏర్పరచుకున్న రామ, కృష్ణ, విష్ణువు మొదలైనవి నామాలు భక్తికి నామ కీర్తనతో అన్వయం సంభవించటం వల్ల పరమ భక్తి కలుగుతుందని జైమిని మహర్షి తెలిపారు. అని శాండిల్యవచనం (భ.త ద 621)

"అనురాగానికి, గుణమాహాత్మ్య కీర్తనం హేతువైయైనట్లు ఆ కీర్తనతో సాహచర్యాన్ని బట్టి నామ శ్రవణ పూజ వందనాదులును పరమ భక్తికి కారణాలే" అని (57) శాండిల్యవచనము తెలుపుతున్నది. (భ.త.ద. 41 పే) పరమభక్తి అంటే వామన, రామాద్యవతారములందు గల భక్తి అని భావము (భ.త.ద. 40, శాం. 55) ఈ వివరణను బట్టి ఈ నామము భక్తికి అంగభూతమైనదని, అవతార విశేష కీర్తనానికి చెందినదవటం వల్ల అవైదికమని స్పష్టము. వేంకటదాసుగారి నామ కీర్తనలను పరిశీలిద్దాం.

నామ ప్రభావదశకం అనే పేరుతో అతడు చెప్పిన పద్యాలలో నామ ప్రభావాన్ని వివరించారు. అంతకు ముందుగా అవతారదశకం అనే పేరుతో పది పద్యాలు చెప్పారు. ఆ పద్యాలను ఈ క్రింద సూచిస్తున్నాను.

1. మగమీనాకృతివార్ధిజూచ్చి యసురున్శకించియావేదముల్
(రా.వేం.కి. 1930.101 పే)
2. అమరుల్ రాక్షసనాయకుల్ కరుణతో నత్యంతసామర్థ్యవై
(రా.వేం.కి. 1930.101 పే)
3. భీమకార వరాహమై భువనముల్ భీతిల్లకంపింపను
(రా.వేం.కి. 1930.101 పే)
4. స్తంభంబందు నృసింహమై వెడలియుగ్రుండొట్ట హాసధ్వనుల్
(రా.వేం.కి. 1930 102 పే)
5. మహియున్నాకసము నృదద్వయపరీమాణంబుగా బెట్టియు
(రా.వేం.కి. 1930.102 పే)
6. ధరణీశ్వరక్తమహాహ్రదంబులెలమిన్ త్రైలోక్యనిద్భష్టమై
(రా.వేం.కి. 1930 104 పే)
7. వరుసస్ తాటకిజంపి కౌసికుఖిస్వాంతంబుగావించిశం
(రా.వేం.కి. 1930 104 పే)
8. యదువంశంబున కృష్ణకగ్రజుడవై యాభీలశౌర్యోన్నతిన్
(రా.వేం.కి. 1930.104 పే)
9. పురముత్కాడునునెల్ల లోకములనే క్రోద్దున్విదారింపుత
(రా.వేం.కి. 1930.105 పే)
10. కలికాలంబున పాపసంకలితులై గర్వాంధులై తుచ్ఛులై
(రా.వేం.కి. 1930.106 పే)

ఈ పది పద్యాలలో వరుసగా మత్స్యావతారం, కూర్మావతారం, వరాహావతారం, నృసింహావతారం, వామనావతారం, పరశురామావతారం, రామావతారం బలరామావతారం, బుద్ధావతారం, కల్క్యవతారం అనే పది అవతారాల గూర్చి తెలిపారు. ఈ అవతార వాదం వైష్ణవ పురాణ కల్పితమే.

ఈ పది యవతారనామాలను స్మరించి తరించటమే ఈ దాసుకీర్తనల లక్ష్యం. ఈ అవతార రామకీర్తనలవల్ల కలిగే ఫలితాలను నామ ప్రభావదశకం అనే పేరుతో ఉన్న పద్యాలలో తెలుపబడింది. ఒకొక్క పద్యానికి ముందు ఒక్కొక కీర్తన కూడా చెప్పబడింది. ఈ పద్యాలలో చెప్పబడిన నామప్రభావాన్ని తెలుపుతాను.

"శ్రీరామ శ్రీరామ సీతామనోహరా" (రా.వేం.కీ. 1930-112 పే) అనే కీర్తన క్రింద "అలరారన్ వదీయనామ కథనం బే మర్త్యుచిత్తంబులో" అనే పద్యం ఉంది. ఇది నామప్రభావదశకంలోని మొదటిది. ఇందులో నామ ప్రభావం ఇట్లా చెప్పబడింది. ఏ మానవుడు నీ నామం (పరమాత్మ) కీర్తన చేస్తాడో అట్టి మానవుడు పాపాలను పొందడు. ఎట్లాగంటే అగ్నితో కూడియున్న కట్టెను కీటకాలు ఎట్లా పొందలేవో అట్లా పాపాలు నీ నామస్మరణ చేసిన మానవుని దరికి జేరవు.

"అప్పారామప్ప కరుణగుప్పవేమయ్యా" (రా. వేం. కీ. 1930-112 పే) అనే కీర్తన క్రింద "కలయన్దిక్కులు నిండి చందతరమై కప్పారుమేఘముల్" అనే పద్యంలో కారుమేఘాలనే పాపాలు గాలియనే స్ఫురణచేత ఎట్లా తొలగిపోతాయో అట్లాగే నీనామ పఠన ప్రభావంచేత మానవులకు దొంగతనము మొదలైన పాపాలు తొలగిపోతాయి.

"నీవైనా శ్రీదేవూడవనించు సేవించి కొలుతూరు మీరూరు" (రా.వేం.కీ. 1930-103 పే) అనే కీర్తన క్రింద కలుషవ్రాత వినాశకారియగుచున్ కైవల్య సంధాయియై" అనే పద్యం చెప్పబడింది. దాని సారాంశమిట్టిది. ఓ వేదాత్మ నారాయణా! నీనామ ప్రభావంచేత కలుషాలు నశించి కైవల్యం ప్రాప్తిస్తుంది. నీ నామాన్ని ప్రేమతో ఎవనినోరు ఉచ్చరించదో అట్టి నీచుని నోరు చెట్టు తొఱ్ఱవంటిది.

"కృష్ణరావోయి - నినుకోరినానోయి" (రా. వేం కీ. 1930-113) అనే కీర్తన క్రింద "అధికాఘతమో దివాకరములై అందింద్రియా జిహ్వకున్" అనే పద్యం చెప్పబడింది. దీని భావమిది. ఓ నిత్యనారాయణ! నీనామ మానవుల పాప సమూహమనే చీకటికి సూర్యోదయం వంటిది. వేదం నోదరత్నాల కూర్పుడకు సూత్రం వంటిది. భూదేవతాకోటికి నీ బహునామాల వెలుగు సంపద వంటిది.

"రంగమాంపాహి పాండురంగా" (రా. వేం. కీ. 1930-114 పే) అనే కీర్తన క్రింద "పరమంబై పరతత్త్వమై సకల సంపత్కారమై భవ్యమై" అనే పద్యం ప్రయోగించబడింది. దీని సారాంశమిది. ఓ సర్వజ్ఞ నారాయణ! నీవే పరమపదం, పరతత్త్వం, సుర, సిద్ధ, ఉరగ, యక్ష, పక్షి, ముని, దేవతల హృదయము నీకు నివాసస్థానం. జ్ఞానంతో నీవెప్పుడు ప్రకాశిస్తుంటావు. వేదాలు నిన్నే చెప్తాయి. సత్యం నీవే. అట్టి నీనామ స్మరణమెప్పుడు సాగిరేనిదే!

"ఎంతమాత్రము సహిరుదయిన శ్రీహరి మంతనమున దెల్పరాదా" (రా వేం.కీ. 1930.114 పే) అనే కీర్తనక్రింద "వరుసన్ ముక్తికి త్రోవపుణ్యంబులకున్ పుట్టినిల్లు మోదంబుకున్" అనే పద్యం చెప్పబడింది. దాని సారాంశమిది. "ఓ విశ్వేశ్వర నారాయణా మీ పాదసేవ క్రమంగా పుణ్యాత్ములకు ముక్తిమార్గం. సంతోషానికి పుట్టినిల్లు ఇష్టభోగాలకు నిలయం. కాలానికి ఉత్పత్తి స్థానం. ఘోరపాపాలకు స్థానమైన నా శత్రువులకు అవసానకాలమై ఉన్నది.

"నీసాటి దాతలెవ్వరయ్యా శ్రీనీలకంఠా' (రా.వేం.కి. 1930-114 పే) అనే కీర్తన క్రింద "భవరోగంబులమందు పాతకమా బాలార్కబింబంబుక' అనే పద్యం ఉంది. దీని భావమిది. ఓ పుణ్యాత్మ నారాయణా! నీ దివ్యగుణ నామము బాలార్కబింబం ఎట్లా మంచు బిందువులను హరిస్తుందో అట్లా నా భవరోగ పాపాన్ని హరిస్తుంది. కైవల్యం పొందగోరేవారికి శ్రేష్ఠమైన దివ్యాంజనం.

"ముద్దులకృష్ణ నావద్దకి రారా స్వామికద్దిగ నినుగంకోరి సేవించెదను" (రా. వేం.కి. 1930-115 పే) అనే కీర్తన క్రింద "వరుసన్కర్మ పిపీలికా వ్రాతతనూదల్మీక నాళంబులో" అనే పద్యం చెప్పబడింది. అందులోని సారాంశమిది. ఓ దివ్యాత్మ నారాయణ! పిపీలికాది శరీరమనే పుట్టలోని నాళాలలో జీర్ణించుకొని ఉన్న పురుషాకార పాపాలను పారద్రోలేందుకు నీనామమే తిరుమంత్రమనే మంత్రరాజం.

ఇక్కడ వైష్ణవ మతపరమైన తిరునామాన్నే తిరుమంత్రం అని ఉండవచ్చు. వైష్ణవ మతపరమైన తిరునామానికి తిరు అంటే శ్రీప్రదం (శ.ర. 347 పే) అని నామ శబ్దానికి ఎరిగింపదగినది (ఆ. కో. 859 పే). అంటే భగవంతుని పాదాలు లేదా

భగవంతుడు. సేవకభావంతో తెలుసుకోదగినవాడు అని అర్థం. వైష్ణవులు ఈ తిరు నామాన్నే దివ్యనామం అంటారు. కనుక ఈ తిరునామమే ఇచట తిరుమంత్రమని తెలిపియుండవచ్చు.

"ఘనులెందరైతేమి మనసందు మీరూపు మనుజాచినట్లుండదు" (రా.వేం.కీ. 1930.115 పే) అనే కీర్తన క్రింద "హరునిన్న ద్రిజునాంజనేయుగు హున్నయ్యంబ రీషన్నృపున్" అనే పద్యం ఉంది. దీనిలోని భావమిది. ఓ నారాయణ! నీనామము హరుని, అంజనేయుని, గుహుని, అంబరీషుని, ధ్రువుణ్ణి, కరిని, ప్రహ్లాదుని, బలిని, నారదుని, విదురుని, పరాశరుని, భీష్ముని, ద్రౌపదిని, అక్రూరుని, రక్షించినట్లు నన్ను రక్షిస్తుంది.

"పుండరీక వరదా విఠల పుండరీకవరదా" (రా.వేం.కీ 1930-116 పే) అనే కీర్తన క్రింద శ్రీకిన్మందిరమైన పక్షమసుర జ్యేష్ఠోద్భవ స్థాపనా" అనే పద్యం ఉంది. దీనిలో చెప్పబడ్డ సారాంశమిది. "ఓ నారాయణ! లోకారాధ్యుడవైన నిన్నెపుడు నేను ఆశ్రోచిస్తాను.

ఈ సమాచారంవల్ల నామం అనే కీర్తనలు పూర్తిగా వైష్ణవ మతసంబంధ కీర్తనలేనని, అవి వేదవిరుద్ధంగా సగుణజడతత్త్వ ప్రతిపాదకాలని తెలుస్తున్నవి. ఈశ్వరుడు దేహధారణ చేసినపుడు సగుణుడని, దేహము త్యజించినపుడు నిర్గుణుడని వేదవిరుద్ధ కల్పన చేశాయి వైష్ణవ సంబంధ పురాణాలు. ఇట్టి సగుణార్చన దుఃఖ హేతువేకాని ముక్తిదాయకం కానేరదు. ఈ అవతారదశకం, నామ ప్రభావదశకం వల్ల తేలిన సారాంశమిది.

| అవతారం | నామప్రభావదశకంలో ప్రత్యేకించిన నామం | నామోచ్చారణ ఫలం |
|---|---|---|
| 1. మత్స్యావతారం | నిత్యాత్మ నారాయణుడు | దురితదూర మొనర్చటం |
| 2. కూర్మావతారం | దోషఘ్న నారాయణుడు | కోటిక మొ॥ దోషాలను పోగొట్టటం |
| వరాహావతారం | వేదాత్మ నారాయణుడు | కలుషాలు పోగొట్టి కైవల్య ప్రాప్తి కలిగించటం |

| | | |
|---|---|---|
| 4. నృసింహావతారం | సత్యాత్మ నారాయణుడు | ఇంద్రియ నియమం పొందటం |
| 5. వామనావతారం | సర్వజ్ఞ నారాయణుడు | సుజ్ఞాన ప్రాప్తి |
| 6. పరశురామావతారం | విశ్వేశ నారాయణుడు | పాపహరణం; పుణ్యప్రాప్తి |
| 7. రామావతారం | పుణ్యాత్మ నారాయణుడు | భవరోగ నివారణం కైవల్య ప్రాప్తి |
| 8. బలరామావతారం | దివ్యాత్మ నారాయణుడు | పాపాలను పారద్రోలటం |
| 9. బుద్ధావతారం | నారాయణుడు | రక్షణ పొందటం |
| 10. కల్క్యవతారం | నారాయణుడు | భగవదాలోకనం. |

దీనివల్ల వైష్ణవమత మూలపురుషుడు నారాయణుడని ఆయా సమయాలలో అతడు ధరించిన దేహధారణ, కలిగిన గుణాలను బట్టి పైవిధంగా నామ వ్యవహారం జరిగిందని తెలుస్తున్నది. ప్రతి పద్యం చివర 'నారాయణ' అనే పదం రావటంచేత ఇట్టివి మరికొన్ని పద్యాలు వేంకటదాసుగారి కీర్తనలలో చోటుచేసుకొని ఉండటంచేత ఈ పద్యాలు నారాయణ శతకం నుంచి సంగ్రహించి కూర్చబడి ఉండవచ్చని చెప్పే అవకాశం కలుగుతున్నది వైష్ణవ భక్తిని ప్రతిపాదిస్తున్న ఈ నారాయణ శతకాన్ని పోతన రచించాడని ప్రతీతి (అం.శ.పా వి. 89 పే).

ఈ సందర్భంలో ఒక విషయం తెలుసుకోవటం సముచితం. అది వైష్ణవ ప్రతిపాదిత అవతారవాదం అవైదికమయినది అని.

"అజఏకపాత్" "సపర్యగాచ్ఛుక్రమకాయం" అనే యజుర్వేద మంత్రాలు పరమాత్మ అజన్ముడు; అమరుడు. అతనికి జన్మాదులు లేవు; అవతారం లేదు. "పరోపకారాయ సతాంవిభూతయః" సూక్తి ననుసరించి సత్పురుషుల జన్మము పరోపకారానికి ఉపయోగపడుతుంది. కృష్ణుడు పరోపకార బుద్ధి కలవాడు, తదనుగుణంగా తన పరాక్రమంచేత దుష్టశిక్షణ చేశాడు. అంత మాత్రంచేత కృష్ణుడు పరమాత్ముడు కానేరడు. వేదార్థం తెలియనివారు వక్ర భాష్యాలతో పరోపకార పురుషులందరినీ ఈశ్వర అవతారమని నమ్మటం, నమ్మించటం జరిగింది.

వేంకటదాసుగారు నామం పేరుతో చెప్పిన ఇరువదిమూరు కీర్తనలను ఈ క్రింద గమనించవచ్చు.

ఈ కీర్తనలలో ఆయా సందర్భాలలో రూపాసక్తి, స్మరణాసక్తి, గుణ మహాత్మ్యాసక్తి, దాస్యాసక్తి అదిగాగల వైష్ణవ భక్తిమార్గాలు చెప్పబడ్డాయి. ఉదాహరణకు

సదానంద గోవిందారిపు మిదాపహార మునికందా ॥ప॥

సదానంద నిజపదాశ్రితాచ్యుత ముదప్రదాయక
మోహనరూపక ॥ప॥

విరించిమునివర సురేంద్ర సేవిత నరేంద్రవల్లభ
నారాయణశ్రీ ॥ప॥

నగాత్మజ ప్రియనందిత సద్గుణ ఖగరాడ్వాహన
కలుషవిదూర ॥స॥

అనంగ సుందర ఘనంగ శ్యామల సనందార్చిత
సారసనయనా ॥స॥

జనాధార భాస్కరాకార శ్రీకరాకలిత రాకమచర్లాధిప ॥స॥

ఇందు స్మరణాసక్తి అనే వైష్ణవ భక్తిమార్గం వెల్లడించబడింది.

## ఆవాహన కీర్తనలు

అవాహనం అంటే ఆహ్వానం, పిలుపు అని అర్థం. పురాణోక్త షోడశోపచార పూజావిధానంలో ఆవాహనం అనేది ఒక కలాపం. దీనికే ప్రాణప్రతిష్ఠ అంటారు. అంటే జడమైన విగ్రహం లేక మరో వస్తువులోకి మంత్రతోనో శ్లోకాలో లేక కీర్తనలతోనో భగవంతుని ఆహ్వానించి అందులో భగవంతుడు ప్రవేశించాడన్నే మౌఢ్యాన్ని పెంచే ఒక తంత్రం. ఆవాహనం అనే పేరుతో వేంకటదాసుదారు చెప్పినవి నాలుగు కీర్తనలున్నాయి. అందులో మూడు అచ్చుకాలేదు. ఒకటి అచ్చయింది. ఆ కీర్తన లివి.

1. రామప్పరారా - మాయప్పరారా— (రా వేం.కీ. 1930-50పే)
2. పాయజాలాను మాయయ్యారారా— (అచ్చులో లేనిది నేను సేకరించినది)
3. ముద్దిచ్చిపోరా నాయన్నా... ( ,, ,, )
4. ముద్దూ ముద్దుగ ముచ్చటాడు నావద్దకురార ( ,, ,, )

ఈ కీర్తనలలో భగవంతుని ఆర్తితో కూడిన పిలుపుతోపాటు స్మరణాసక్తి, దాస్యాసక్తి, వాత్సల్యాసక్తి వంటి వైష్ణవ భక్తిమార్గాలకు ఉదాహరణలుగా ఉన్నాయి.

## అపరాధి కీర్తనలు

అపరాధి అంటే తప్పు గలవాడు. ఈ కీర్తనలు ఆర్తితో సేవక భావంతో కూడి దాస్యాసక్తి, స్మరణాసక్తి, మొదలైన వైష్ణవ భక్తిమార్గ సూచకాలై వున్నాయి. వేంకటదాసు మూడు అపరాధి కీర్తనలను చెప్పారు. ఇవి అచ్చులో లేవు. నేను సేకరించిన ఆ మూడు కీర్తనలివి.

1. సమయమేమి దలచవలదయ్యా
   నిన్ను బ్రోవ మంచి సమయమేమి దలచవలదయ్యా ॥ప॥

2. ననుబోచేటి నందానందను డితడే
   తన్ను నమ్మువారాల దయజూయగలడు ॥ప॥

3. సమయ మిప్పుడు వచ్చెను
   కన్నా జూచే సమయమిప్పుడె వచ్చెను ॥ప॥

ఉదాహరణకు ఈ కీర్తన పరికించండి.

సమయమేమి దలచవలదయ్యా-నన్ను బ్రోవ
మంచి సమయమేమి దలచవలదయ్యా ॥ప॥

సమయమేమీ దలచవలదూ - సదయి నిన్నూ మరువలేను
కమలనయనా నిన్నుగాంచి - కడు భజింపుచుండగాన ॥సమ॥

భేదమింతా శాయకూడాదు - దాసునియందు
భేదమింతా శాయకూడాదు
నామను చాల ప్రేమజెంది నిన్నువిడాదు
మోదామునందీ నీదు కృపాకుముందె
మరులు జేందియున్న నాడు
ప్రాప్త మనవలదు నమ్మిక నీయందు గలదు ॥సమ॥

దేవయిందువేగ రావయ్యా
నీవాడనయ్యా దేవయిందు వేగరావయ్యా
రాకమచర్ల దివ్యమందీర మేలుకోవయ్యా
నీవే ప్రోవ కర్తవనుచు
నినే నమ్ముకున్న స్వామి
కావవయ్యా కరుణతోడ
కలిత వేంకటదాసపాలా ॥సమ॥

## గురుభక్తి కీర్తనలు

"సపర్యగాచ్ఛుక్రమకాయం" అనేయజుర్వేద మంత్రం పరమేశ్వరుడు స్వాష్ట్యారంభంలో స్వసామర్థ్యంతో తన ప్రజలకు నిత్యమైన సత్యార్థాలను వారి సౌఖ్యాన్ని కోరి ఉపదేశించాడు. ప్రతిసృష్టికి ఆరంభంలో ప్రజల హితాన్ని కోరి సర్వ విద్యాయుక్తములైన వేదాలను ఉపదేశిస్తాడు అని తెలుపుతున్నది. దీనిని బట్టి గురువులకు గురువై పరమగురుడు పరమేశ్వరుడని స్పష్టమౌతున్నది. ఇట్టి పరమేశ్వరునికి చెందిన సత్యజ్ఞానాన్ని తెలిపేందుకు ఆ తెలిసే మానవుడు కూడా అంత సమర్థత కలిగి ఉండాలి, ఆ సామర్థ్యం వేదం వల్ల లభిస్తుంది. వేదాధ్యయనం వల్ల సత్యజ్ఞానం ఎరుకపడుతుంది. బ్రహ్మజ్ఞానియైన మానవుడు గురు శబ్దానికి అర్హుడు. అట్టి గురువునే బ్రహ్మజ్ఞానోపదేశానికి ఏర్పర్చుకోవాలి. అట్టి గురువుకే బ్రహ్మ మోక్షాన్ని కలిగింప సామర్థ్యం కలిగి ఉంటుంది.

తైత్తిరీయ అరణ్యకం పై విషయాన్నే ఇట్లా తెలిపింది. (ఋ.భా భూ.198 పే) విద్వాంసులు, జ్ఞానుల యొక్క సాంగత్యం, సేవజేసి విద్యలను గ్రహించటంలో ఆలస్యం చేయకూడదు. తల్లి, తండ్రి, ఆచార్యుడు విద్యాదాత అతిథి సత్యోపదేష్టయైన విద్వాంసుని సేవించటంలో అలసభావం వహించ కూడదు విద్వాంసులు, బ్రహ్మ జ్ఞానులు, ధర్మాత్ములైన వారి మాటలే విశ్వసింపుము. మీకేదేని విషయంలో సంశయం కలిగినపుడు పరిపూర్ణ విద్వాంసులు, పక్షపాతరహితులు, ధర్మాత్ముల నడిగి సంశయ నివారణ చేసికొనుడు. అవిద్యను తొలగించి దాని స్థానంలో విద్యను, అధర్మాన్ని తొలగించి దాని స్థానంలో ధర్మాన్ని స్థాపించటమే శిక్షణ. అదే ఉప దేశం అనబడుతున్నది. దీనిని బట్టి ఉపదేశకుడైన గురువు విద్వాంసుడు, ధర్మాత్ముడై, వేదధర్మాన్ని తెలిసికొన్న బ్రహ్మజ్ఞానియై ఉండాలి అనటం స్పష్టం ఇట్టి గురువు జిజ్ఞాసువులైన శిష్యులకు నిత్యం యోగమును, విద్యాదానాన్ని చేస్తూ వారిని శారీరక, ఆత్మిక బల సంపన్నులుగా చేయాలి అని "అచ్ఛిన్నస్యతే దేవసోవసు వీర్యస్య" (7-14) యజుర్వేద మంత్రం వేదార్థం తెలిసికొన్నవాడు బ్రహ్మప్రాప్తియే అంతిమధ్యేయంగా కలవాడే అనితెలిపింది. శిష్యుడెట్లా ఉండాలి? అనే ప్రశ్నను శ్వేతాశ్వతరోపనిషత్తు ఇట్లా సమాధానం తెలిపింది. (శ్వే.ఉ.అ 6.23 శ్లో) "పరమేశ్వరునియందు ఎంతటి పరమభక్తి కలిగియుంటామో అంతటి పరమభక్తి గురువు నందు కలిగియున్న శిష్యునికి గురువుబోధించిన తత్త్వార్థం ప్రకాశిస్తుంది." కాబట్టి గురువు యెడ భక్తి శ్రద్ధలు, వినయ విధేయతలు కనేగియున్నవాడే శిష్యుడు.

గురుశిష్య సంబంధం ఎట్టది? అనే ప్రశ్నకు స్వామి సేవక సంబంధం అని సమాధానం చెప్పాలి. స్వామియెడ వినయ విధేయతలు చూపినపుడే అతని అనుగ్రహ పాత్రుడౌతాడు అట్లాగే భక్తి పూర్వక వినయవిధేయతలు కలిగి బ్రహ్మజ్ఞానియైన గురువును సేవించినపుడే అతని కరుణా కటాక్ష వీక్షణాలు శిష్యునిపై ప్రసరిస్తాయి. తద్వారా శిష్యుని జడత్వం, మాయావరణం తొలగిపోయి గురువువలె బ్రహ్మజ్ఞాని ఔతాడు. గ్రుడ్లను పెట్టిన చేప తన దృష్టిని ఆ గ్రుడ్లపై నిలిసినపుడే ఆ గ్రుడ్లు పిల్లలుగా మారిచేపలెట్లా అవుతాయో అట్లాగే గురుని కరుణదృక్కులు ప్రసరించి శిష్యుడు గురువువలె బ్రహ్మజ్ఞాని ఔతాడు. శిష్యుడు గురూప దేశాన్ని మననం

చేయటం, ధ్యానం చేయటం వల్ల భ్రమరకీటకన్యాయంగా, గురువులాగ బ్రహ్మత్వాన్ని పొందుతాడు. రైతుకష్టపడిదున్నినప్పటికీ బీజంమంచిదై భూమి సారవంతం కాక పోయినా, లేక భూమి సారవంతమై బీజం మంచిది కాకపోయినా, బీజం మొలకెత్తకుండా ఎట్లా ఫలవంతంకాలేదో అట్లాగే గురూపదేశం సిద్ధించినా హృదయశుద్ధి, నియమపాలనా లేని అనుష్టానం శిష్యునికి ఆ ఉపదేశం పరిపూర్ణఫలాన్నీయజాలదు, భక్తి శ్రద్ధలతో శుశ్రూషాభావాన్ని వెల్లడిస్తూ తన సమీపానికి వచ్చిన సుకేశాదులతో పిప్పిలాదఋషి ఇంకను మీరెల్లరు ఒక సంవత్సరం బ్రహ్మచర్యం పాలించి శ్రద్ధతో తపస్సు నాచరించి తదుపరి మీ ఇష్టం వచ్చిన ప్రశ్నల నడుగు. నేను నాకు తెలిసినదంతా చెప్తాను (ప్ర. ఉ 1.2) అనిన మాటలతీరులో గురువు ఎట్లా ఉండాలో, శిష్యుడు ఎట్లా మెలగాలో వారి సంబంధంలో పావిత్ర్యంఎటువంటిదో ధ్వనిస్తున్నది. ఇట్లా వేదతత్త్వం తెలిసిన బ్రహ్మజ్ఞానే గురుశబ్దానికి అర్హుడు. కనుకనే గురుడు పరమాత్ముడే అనే భావంతో "ఆచార్యదేవోభవ" (తై.అ. 7-11) అని శాస్త్రాలు తెలిపాయి.

కాని వైష్ణవులు శ్రీమన్నారాయణునే ప్రథమ గురువుగా భావిస్తారు. "లక్ష్మీనాథాసమారంభం నాథ యామునమధ్యమాం అస్మదాచార్యపర్యంతాంవందేసగురుపరంపరాం" వైష్ణవ గురుపరంపరను తెలిపే ఈ శ్లోకం, పై విషయాన్ని తెలుపుతున్నది. కాని రాముడిగా, కృష్ణుడగా అవతారమెత్తిన శ్రీవిష్ణువు, వశిష్ఠుని సాందీపుని గురువులుగా ఎంచి శుశ్రూషజేసి ఉపదేశంపొందారనటం ఇచట గుర్తుచేసుకోవాలి. దీని స్వయంగా గురుత్వం విష్ణుమూర్తికి లేదని తెలుస్తున్నది. కాగా నిర్గుణ పరబ్రహ్మమే లోకానికి పరమగురువనే విషయందృఢపడింది.

కాలానుగుణ్యంగా కలంపట్టిన వాడు కవి అన్నినామెతగా లోకంలో కాషాయంకట్టినవాడల్లా గురువైనాడు. మాటలు నేర్చినవారల్లా బోధచేయటం ప్రారంభించారు, ఈ దృష్టితో లౌకిక గురువులను మూడు విధాలుగా చెప్పవచ్చు 1. బోధ గురువు, 2. బాధగురువు, 3. బోధకబాధగురువు. బోధగురువంటే అవైదిక విషయాలను కంఠపోతలాకురింపించేవాడు, బాధగురువు అంటే వాక్చాతుర్యం లేకుండా కేవలం వేషంతో సుంకం వసూలు చేసేవాడు. బోధక బాధగురువు సత్య

మంటూ అవైదిక అసత్యాన్ని బోధించిలంచాలు ప్రోగుచేసుకునేవారు. వీరు వారు అనటమెందుకు బైరాగుల దగ్గరనుండి మఠగురుపులుగా చెలామణి అవుతున్నవారి దాకా ఇదే తంతునడుస్తున్నది. దీనివల్ల ప్రజలకు సుఖంలేకపోగా అజ్ఞానం చీకటి ఆవరణలో దిక్కుతోచని పసరాలై పరుగులు తీస్తున్నారు. పరస్పరం కొట్లాడు కుంటున్నారు. ఇట్లా దుఃఖాన్ని పంచే గురుపులు గురుపులూ కాదు. వారి బోధలవల్ల బాధలేకాని సత్యజ్ఞాన సుఖమెన్నటికి కలుగదు. ఎవడైతే వేదోక్త తత్త్వం తెలుసుకుని, కల్మషరహితుడు, ధర్మయుక్తుడై ఉపదేశంచేస్తాడో అట్టి ఉపదేశకర్తే నిజమైన సద్గురుడని, అతని ఉపదేశమే సుఖహేతుపులని తెలుసుకోవాలి. అట్టి గురుపును సేవించటమే గురుభక్తి.

వేంకటదాసుగారు కీర్తనలయందు గురుభక్తికి సంబంధించినవి నాలుగు కీర్తనలున్నాయి. కొంత జ్ఞానమార్గంలో నడిచిన ఈ కీర్తనలు గురూపదేశానంతరం వేంకటదాసుగారి చేత గానంచేయబడినవిగా గ్రహిస్తున్నాను. ఇందులో "గురుమహరాజ్ గురుమహరాజ్" అనే కీర్తన గురుపు అనుగ్రహం పొందిన పిదప గుర్వాజ్ఞచేత గానంచేయబడ్డ మొదటి కీర్తనట. గురుభక్తికి చెందిన నాలుగు కీర్తనలివి. ఉదా॥

"గురుమహరాజ గురుమహరాజ పరబ్రహ్మ సద్గురు మహరాజ"
(రా.వేం.కీ 1930_1పే)

"హరిచరణం భవశరణం సద్గురుచరణం భవహరణం"
(రా.వేం.కీ. 1930_2పే)

"గురుదేవతానంద మూర్తీ భక్తకోటి మానసచక్రవర్తీ"
(రా.వేం.కీ. 1930_49పే)

"గురువీరాయుతే నమోనమో" (రా.వేం.కీ. 1930_50పే)

ఈ కీర్తనలను పరిశీలిద్దాం. మొదటి కీర్తన ఇది.

గురుమహరాజ గురుమహరాజ పరబ్రహ్మ సద్గురు మహరాజ ॥ప॥
పరతత్త్వాశ్రిత సరసిజసంభవ హరిహర రూపక గురుమహంజంగం
తారకసాంఖ్య విచార త్రికూట విహారకారణా గురుమహరాజ ॥గు॥
మహావాక్యార్థ సమన్విమానస సహితయోగ సద్గురుమహరాజ
మండల త్రయాఖండతేజ హృత్పుండరీక సద్గురుమహరాజ ॥గు॥
అంతర్లక్ష్య నిరంతర నిశ్చలస్వాంత మహోన్నత గురుమహరాజ
ద్వైతాద్వైత దానవిశిష్టాద్వైత విచక్షణ గురుమహరాజ ॥గు॥
రంజిత పరమనిరంజనదోష విభంజనరూపక గురుమహరాజ ॥గు॥
భేదవివర్జితబిందు కళాంచిత నాదాతీత గురుమహారాజ ॥గు॥
హంసాక్షర బ్రహ్మైక్య తత్వానిస్సంశయకారణ గురుమహరాజ ॥గు॥
రాజిత నిర్గుణ రాజయోగి జనపూజిత మృదుపద గురుమహరాజ ॥గు॥
భక్తఫలప్రద పరమదయాకర ముక్తిదాయకా గురుమహరాజ ॥గు॥
నిజపాదాంబుజ రజవిభ్రాజిత త్రిజగత్పావన గురుమహరాజ ॥గు॥
లింగదేహ భంగాంగ మహాముని పుంగవసన్నుతి గురుమహరాజ ॥గు॥
ధ్యానాజ్ఞాన విధానసమాహిత శ్రీవరీనాయక గురుమహరాజ ॥గు॥
సతతానంద వ్రతసంయుతషత్మిత సమ్మత సద్గురుమహరాజ ॥గు॥
అంగ సంగ ప్రత్యంగ సుఖాస్పద మంగళకర సద్గురుమహరాజ ॥గు॥
సాకారాత్మచిదా కాశాంతర, శ్రీకరనిర్గుణ గురుమహరాజ ॥గు॥
రాకమచర్ల ధరాధరమందిర ప్రాకట వైభవ గురుమహరాజ ॥గు॥
ధారుని వేంకటదాసహృదయ సంచార పీఠసద్గురు మహరాజ ॥గు॥

ఈ గురుస్తవ కీర్తనలోని "రాకమచర్ల ధరాధరమందిర ప్రాకట వైభవ గురుమహారాజ", "ధారుణి వేంకటదాసహృదయ సంచారపీఠ సద్గురు మహారాజ" అనె చరణాలవల్ల వేంకటదాసుగారు తమ గురువైన వీరయ్యగారివల్ల రాకమచర్లేశుని తత్త్వార్థం తెలుసుకున్నట్లు తెలుస్తున్నది. తన గురువును రాకమచర్లేశుని స్వరూపంగా చూడగలగటం ఇంతకు మునుపు వివరించిన శ్వేతాశ్వతరోపనిషత్తు (6.23) వాక్యాన్ని గుర్తుచేస్తున్నది.

"తారకసాంఖ్య విచార" "మహావాక్యార్థ సమన్విత" "మండలత్రయాఖండ తేజ" "అంతర్లక్ష్య నిరంతర" "హంసాక్షర బ్రహ్మైక్య తత్త్వనిస్సంశయ" "రాజిత సగుణ" "భక్త ఫలప్రద" "లింగాంగదేహ" "ధ్యానజ్ఞాన విధాన" అనే చరణాలు వేద ప్రతిపాదితము, యోగ సమాధి సిద్ధము జన సత్యజ్ఞాన ప్రతిపాదకాలుగా ఉన్నాయి. యోగసిద్ధి కలిగినప్పుడు మాత్రమే ఆత్మ పరమాత్మయందు నిలుస్తుంది. యోగ సిద్ధిని పొందిన యోగి చిత్తం లౌకిక వ్యవహారాలలోకూడా సమాహితవృత్తిలోనే ఉంటుంది. విచలితం కాకుండా స్థిరంగా ఉంటుంది. "సమాధి స్థితిలో ఏవిధంగా చిత్తం శాంతంగా ఉంటుందో అదే విధంగా పారిక్రపాపంచిక విషయాలలో కూడా శాంతంగా ఉంటుంది (సం పా యో.ది 1.3,4సూ). గురూపదేశంవల్ల వేంకటదాసు గారు సత్యజ్ఞాన కారణమైన యోగాన్ని కొంత తెలుసుకున్నారని చెప్పవచ్చు. కాబట్టి

> "ఎక్కడి సంసార మెడబాయుజాలదు రామచంద్రా
> మరిచిక్కాకములో బడ్డ జింక విధంబాయె రామచంద్రా
> ఎంచగరాని ప్రపంచ మార్గమునందు రామచంద్రా
> మేలుకొంచమైన లేదు కుజనసమ్మతెకాని రామచంద్రా"
>
> (రా.వేం.కీ. 1930-5 పే

అంటూ తన కీర్తనలలో ప్రపంచ విషయాలలో అనాసక్తిని కనపరచారు ఈ విష యం పై అంశాన్ని స్పష్టపరుస్తున్నది.

కాని ఇక్కడ ఒక విషయం విచారించాల్సివుంది. వేంకటదాసుగారు ఆశ్ర యించిన సద్గురువు వేదంలో ఇంతకు ముందు తెలిపిన విధంగా పరిపూర్ణుడేనా? ఒక

వేః గురుడు పరిపూర్ణుడైపుంటే ఆతని ఉపదేశాన్ని వేంకటదాసుగారు మననం చేయటంలో లోపంవుందా? అనే సంశయాలకు ఈ కీర్తనలోని "ద్వైతాద్వైతదాన విశిష్టాద్వైత విచక్షణ" "పరతత్త్వాశ్రిత సరసిజ సంభవ హరిహర రూపక" అనే చరణాలు అవకాశం కల్పిస్తున్నాయి.

"ఈశ్వరుడు సర్వశక్తిమంతుడు. ప్రాణముఖాది సాధనాలు లేకయే కార్యాలు నిర్వర్తించటంలో అనంత సామర్థ్యం కలిగి ఉన్నాడు. సృష్టి సమయంలో నిరాకారుడైన ఈశ్వరుడు సాకార సంపూర్ణజగత్తును నిర్మించాడు (ఋ.బా.భూ. 18 పే) అనే వైదిక విషయ విరుద్ధంగా "సరసిజ సంభవ హరిహరరూపక" అని మూర్తిత్రయ సామీప్యాన్ని చెప్పటం పై సంశయానికి అవకాశం కల్పించింది. ఇంతకు ముందు వివరించినట్లు బీజమున్నా సారభూతంకానిదై ఉండాలి లేక భూమున్నా సారభూతం కానిదై ఉండాలి. ఈ రెంటిలో ఎక్కడ లోపమున్నా పరిపూర్ణ ఫలప్రాప్తి చేకూరదు గదా! అట్లాగే అవైదిక మతాతీతుడు పరమాత్మ అట్టియెడ "ద్వైతాద్వైత వాసవిశిష్టాద్వైత విచక్షణ" అని చెప్పటం కూడ పై సంశయాలకు తావు కల్పిస్తున్నది. మొత్తం మీద వైష్ణవుడైన వేంకటదాసుగారిని ఇంగువ కట్టిన గుడ్డకు వాసనవలె అవైదిక ప్రభావం విడువలేదని చెప్పాల్సి ఉంది.

రెండవ కీర్తన "హరి చరణం భవచరణం సద్గురు శరణం భవహరణం", అనే కీర్తనలోని పల్లవి పరమేశ్వరుని యందు వలె గురుని యందుకూడా పరమ భక్తి కలిగి తత్వార్థాన్ని తెలుసుకోవాలి అనే శ్వేతాశ్వతరోపనిషత్తు (6 23) వాక్యం యొక్కయు, "భక్తి మాత్రం మహాపురుషుల దయచేత లేదా భవత్కృపాలేశం చేత గాని సిద్ధించును (నా.భ.సూ. 3.38) అని తెల్పిన వేద విదుడు శాండిల్య వచనభావ సామ్యాన్ని కలిగి ఉంది. ఈ విధంగా దాసుగారు గురూపదేశానంతరం కేవల భక్తి మార్గగామిగాక జ్ఞాన, భక్తిమార్గ సంయుతంగా భక్తిమార్గం ప్రధానంగా కీర్తనలను గానం చేశారని తెలుపవచ్చు. దీనికి ప్రమాణంగా ఈ ప్రకరణంలో వివరించిన సంవాద కీర్తనలో పదకొండవ రోజున దాసుగారు చెప్పిన "మనము సందేహించనేలా హరిని" అనే కీర్తనలో "సరసరాకమచర్లశౌరి మనల సమ్మతించును వద్దజేరి, వర భక్తి జ్ఞానంబులిన్న జనులు పరమపావనులు గదరన్నా" అనే సమన్వయ ధోరణిని గ్రహించాల్సి ఉంది.

మిగిలిన "గురుదేవతానంద మూర్తీ, భక్తకోటి మానసచక్రవర్తి" "గురుపీరా యతె నమోనమో - శ్రీగురు పీరాయతె నమోనమో" అనే గురుస్తవ కీర్తనలలో కూడా తన గురువు పీరయ్యగారని, అతదు నీలాంగ పట్టణ వాసులని స్పష్టంచేశారు. తన గురువును రాకమచర్ల హరిగనే భావన చేసి కీర్తించారు. గురువు హరిహర బ్రహ్మాది రూపుడని, అతడు ఆగమతత్త్వ విచారత్రికూట విహార సమస్తాధార కృపాకరలని, సంతోషభరిత నిరంతర వైభవ చింతిత ఫలధా సేవక జీవనులని అవైదికకంగానే తెలిపారు. దీనివల్ల యోగం తెలుసుకున్నారు గాని, అందు పరిపూర్ణత్వాన్ని సాధించలేదని చెప్పవచ్చు. ఇట్టి జ్ఞాన సూచకంగా ఉన్నవి ఆయా సందర్భాలలో వివరించబడిన

"నేజూచినానే - అంతర్లక్ష్యం నే జూచినానే ॥ప॥
"కంటిరె మీలోన కమలాక్షుడున్నాడు కాంతలార"
"తలచగసుజ్ఞాన మొుక్క"
"యోగానందమనోజ్ఞ భావమున"
"వింటిరేమిదెలియా గురురాయునాజ్ఞ"
"గురుడమానవుడుగాంచుడని"

మొదలైన కీర్తనలు కూడా ఈతడు గురూపదేశానంతరం గానం చేసినవిగా భావించవచ్చు.

## మనోబోధ కీర్తనలు

మనోబోధ అంటే మనస్సు ఇతర ప్రాపంచిక విషయ సంగంకాకుండా పరమాత్మయందు ఏకాగ్రతతో నిలిపే ప్రయత్నం. ఇట్టి ప్రయత్నాన్నే అభ్యాసం అంటారు. "వృత్తిరహిత స్థితి ప్రాప్తికై ప్రయత్నించటం అభ్యాసం" (సం. పాం. యో.ద. 1.13సూ) నిరంతరాభ్యాసం వల్ల వివేకం కలుగుతుంది. ఆ వివేకంవల్ల ఉపాసకుని సాంసారిక చిత్తవృత్తిని క్షీణపజేసి వైరాగ్యబుద్ధి కలిగేందుకు బాట ఏర్పడుతుంది. "నిరంతరం అవిచ్ఛిన్నంగా ఈ అభ్యాసాన్ని కొనసాగిస్తే, దీని సంస్కారం

చిత్తంమీద పడుతుంది. అప్పుడు చిత్తముయొక్క స్వాభావికవృత్తి దృఢపడుతుంది. చిత్తం దృఢపడ్డ ఉపాసకుడు ప్రాపంచిక వ్యవహార సంస్కారాలను విడచి వశీకార వైరాగ్యబుద్ధిని పొందుతాడు. దర్శించిన, చదివిన, విన్న విషయాలు అన్నింటినుండి వితృష్ణ పొందటం, ఇచ్ఛ లేకపోవటం వశీకార వైరాగ్యం" (సం. పా. యో. ద. 1–14, 15సూ) అని పాంతంజలయోగ దర్శనం తెలిపింది.

ఈ వశీకార వైరాగ్యం పొందిన తరువాత క్రమంగా ఆత్మపరమాత్మల సాక్షాత్కారం, సత్త్వ, రజస్తమో గుణాల తృష్ణారాహిత్యం కలిగి ఉపాసకుడు పరవైరాగ్యాన్ని పొందుతాడు (సం.పా.యో. 1.16 సూ) వైరాగ్యం విషయాభిరతిని శిథిలమొనర్చి వివేకాన్ని కలిగిస్తుంది (యో.ద. 11పే) వైరాగ్యంవల్ల ఉపాసకునికి రాజస, తామస చిత్తవృత్తులు నిరోధింపబడి సంప్రజ్ఞాత సమాధి యేర్పడుతుంది. దీనినే సమాధి బీజం అంటారు (యో.ద. 42పే) సర్వభావాలను భగవంతునికి అర్పణజేసే ఈశ్వర ప్రణిధానంతో యోగికి సమాధిసిద్ధి కలుగుతుంది (పా.యో.ద. 2-25) ఈ సమాధిసిద్ధి వల్ల కైవల్యం ప్రాప్తిస్తుంది.

"ప్రణవం మాటిమాటికి మనస్సున స్మరిస్తూ సర్వజ్ఞమైన ఈశ్వర తత్త్వాన్ని భావించటంచేత యోగికి చిత్తమేకాగ్రమౌతుంది"(యో.ద.24పే)"అంతర్బాహ్య కుంభకముల ద్వారా ప్రాణాయామం నిత్యం అభ్యాసం చేసినందువల్ల కూడా చిత్తం సమాహితమౌతుంది (యో.ద. 31పే) ఇట్లా చిత్తం ఏకాగ్రతలో నిలిపేందుకు యోగ శాస్త్రం మార్గాలను తెలిపింది. యోగమంటేనే చిత్తాన్ని నిరోధించటం. యోగ, ప్రాణాయామాల ద్వారా మనస్సు నిరోధించి ఏకాగ్రతను పొంది తద్వారా పరమాత్మ ప్రాప్తిని పొందవచ్చని వేదశాస్త్రాలు తెలుపుతుంటే మత ప్రాబల్యానికి వశుడైన ఈతడు అవైదికంగా మతం అంగీకరించిన సగుణ స్వరూపాన్ని కీర్తించి ముక్తి పొందాలనుకున్నాడు. మనోబోధ కీర్తనలను పేర వేంకటదాసు పదకొండు కీర్తనలున్నాయి. అందులో పది అచ్చయినవి. ఒకటి అచ్చులో లేనిది (నేను సేకరించినది) ఆ కీర్తనలను ఇచ్చట గమనింపవచ్చు.

"మనసా శ్రీహరినీ బిలువమ్మా – (రా.వేం.కీ. 1930.3పే)

"భామినీ పిలువమ్మ - నాస్వామినీ - (రా.వేం.కీ. 1930-3పే)

"చెలియరో పోవే శ్రీహరినిందుబిలుచుకరావే - (రా.వేం.కీ. 1930-4 పే)
"ఎక్కాడి సంసార మెడబాయజాలదు రామచంద్రా - (రా.వేం.కీ. 1930-5 పే)

"పాహి శ్రీమణినాయకా - వాసుదేవ పరమసౌఖ్యదాయకా -
(రా.వేం.కీ. 1930-5 పే)

"మురళీధరా - దామోదరా - (రా.వేం.కీ. 1930-13 పే)
"చూడబోదమురావే చిత్తమా - హరిని వేడుక దర్శించివత్తము —
(రా.వేం.కీ. 1930-34 పే)

"ఇవ్వాళ్ల నాప్రాణ జీవనమగు వాసుదేవుని రమ్మనవే -
(రా.వేం.కీ. 1930-50 పే)

"వనజాక్షినేడు మీదలిళాసమిమ్మని - (రా.వేం.కీ. 1930-92)
"శ్రీపాండురంగ నీచిత్తమందున దయజూపర నీవాడను -
(రా.వేం.కీ. 1930-145 పే)

"కృష్ణా యనరాదటె ఎప్పటికి శ్రీకృష్ణా యనరాదటే -
(రా.వేం.కీ అచ్చులో లేనిది, నేను సేకరించినది)

ఈ కీర్తనలన్నీ వైష్ణవ భక్తి ప్రతిపాదకాలే। అందులోను అన్ని కీర్తనలలో పరమ విరహాసక్తి పూసలలో దారంలోగా చెప్పబడింది. వైష్ణవ పరిభాషలో కాంతాసక్తి, పరమవిరహాసక్తి, మధురభక్తి అంటారు. ఈ మధురభక్తే ఆధునిక భారతీయ సాహిత్యంలో 'వైష్ణవ కవిత' అనే పేరుతో చలామణి ఔతున్నది. ఈ మధుర భక్తితో పాటు స్మరణ, దాస్యాది భక్తి మార్గాలు ఆయా సందర్భాలలో చూడవచ్చు. ఉదాహరణకు ఒకటి, రెండు మనోబోధ కీర్తనలు పరిశీలింతాం.

"భామినీ పిలువమ్మా నాస్వామినీ పిలువవమ్మ" ॥ప॥

1. భామనీ నీకొక్క పని విన్నవించెద
నామనోహరుడైన నారాయణుదీవే ॥భా॥

2. మందయానరో వానిమరులొందియున్నాను
కందర్పజనకూని కన్నూలజూపావే ॥భా॥

3. మనసువానిదాయె మాయదెలియదాయె
వనజాక్షి మున్బ్రహ్మ వ్రాసీన వలమేమో ॥భా॥

4. సరసరాకమచర్ల హరి నన్ను మరిపించి
ధరణీలో వేంకటదాసుని మరిగెనే ॥భా॥

(రా.వేం.కి. 1930-3పే)

ఈ కీర్తనలో వేంకటదాసు తనను కాంతగా భావించుకొని తన ప్రియుడైన రాకమచర్ల హరిపై విరహాన్ని పొందటం, కాంతాసక్తి. తన మనస్సున చెలికత్తెగా భావించి తన ప్రియుని పిలువమని చెప్పటం అందుకు కారణాలు వివరించటం మనోబోధ.

"కృష్ణాయనరాదటే ఎప్పటికి
శ్రీకృష్ణా యనరాదటే" ॥ప॥

1. కృష్ణాయనరాద కేవలభక్తితో
రాతీరివేళాలో రమ్యాముతోడూత ॥శ్రీకృ॥

2. ఆకాలి గొనువేళ అన్నమిచ్చిన వేళ
ప్రాకాటముగ మీరు పనులు జేసేవేళ ॥శ్రీకృ॥

3. ఏవేళ ఏత్రోవాను బ్రోవుచుండిన గాని
భావాములోన యేపనులుజేసిన గాని ॥శ్రీకృ॥

4. బడలికైన వేళ పవళించువేళాలో
యెడలేక పలుమారు విడువాక మదిలోన ॥శ్రీకృ॥

5. తిరిగేటి పనులందు పరుపుబెట్లుటయందు
సరసంబులాడేటి సంతోషములయందు ॥శ్రీకృ॥

6. విచ్చాలవిడిగాను విహరించువేళాలో
మచ్చికతో మీరు ముచ్చాటాడీనవేళ ॥శ్రీకృ॥

7. మరచియుండినవేళ – మాయదెలియని వేళ
సరసరాకమచర్ల హరినిదలచేటి వేళ్ల ॥శ్రీకృ॥
(అచ్చులోలేదు, నేను సేకరించినది)

"చూడబోదమురావె చిత్తమా
హరిని వేడూక దర్శించి వత్తమా ॥ప॥

1. చూడబోదమురావె చూడ్కుల కింపుగ
జోడు బాయక లక్ష్మితోడ వెలగుచున్నట్టి ॥చూ॥

2. ఇరవంద హరిపేరు దత్తమా
వానిచరణయుగ్మంబులు గొత్తమా ॥చూ॥

3. కరమొప్ప మదిలోన మురిపేము రంజిల్ల
సరసిజనయనూని పరసుందరమునేడు ॥చూ॥

4. నిక్షేపమని నమ్ముకుందమా
అనైయసద్ధర్మ లక్షణుడయినట్టి
పక్షివాహననామ భజన చేసినేడు ॥చూ॥

5. తలపూన వానివేడుకుందమా
హరిదాసులమని చాటుచుందమా

వలనొప్ప శ్రీహరి మదిన
నెమ్మదిగోరి కలిత రాకమచర్లనియుని మదినేడు ||చూ||

పై కీర్తనలో స్మరణాసక్తితో పాటు "హరిదాసుల మనిచాటు చుందమా" అని చెప్పటంలో వేంకటదాసు గారికి వైష్ణవ మతంపై ఉన్న అభిమానం వెల్లడియౌతున్నది.

వేంకటదాసుగారు మంగళహారతులు, లాలి, జోల పాటలను కూడా చెప్పారు. నేటి సమాజంలో మంగళహారతులు స్త్రీల పాటలుగా నిల్చిఉన్నాయి. మంగళం అంటే పార్వతీ, శుభం, క్షేమం అని అర్థాలు. (శ.ర. 592 పే) హారతి అనే సంస్కృత పదానికి వికృతి రూపం అరటి. అరటి అంటే విరతి (శ.ర. 60 పే) విరతి అంటే విశ్రామము, విరామము (శ.ర. 719 పే) కాబట్టి మంగళ హారతి అంటే శుభకరమైన కర్మయొక్క అవసానం. మంగళహారతి పుట్టుకకూడా మతపరమైందే పురాణాలు కర్పూర హారతిని షోడశోపచారాలలో ఒక భాగంగా చెప్పాయి. ఆ పురాణాలను అనుసరించిన భక్తులుషోడశోపచారాల అంతాన్ని తెలియజేస్తూ, మంగళ హారతి అనే తంతును ఏర్పాటు చేశారు, పౌరాణిక భక్తుల పరిభాషలో తాము అర్చించినదేవుణ్ణి తమకు శుభంచేకూర్చమని అడగటం, సహజంగా ఈ మంగళ హారతులు స్మరణాసక్తి గుణమహాత్మ్య సక్తివంటి వైష్ణవభక్తి మార్గ ప్రతిపాదకంగా ఉంటాయి. ఇట్టి మంగళహారతులు రెండు అచ్చులో ఉన్నాయి.

"హారతులిచ్చెద చూడవే - రామయ్యా మంగళహారతులిచ్చెద"
(రా.వేం.కీ. 1930-44 పే)

మంగళ పాండు రంగతె జయమంగళం పాండురంగతె
(రా.వేం.కీ. 1930-82)

మంగళం పాండురంగ తెజయమంగళం పాండురంగతె
శుభ మంగళ కరుణాంతరంగా జయజయ ||ప||

అంగజోపమసుందరా నీలాంగవినుతపురందరా
దివ్యశృంగార తరకనగాంగదభూషణా ||మ||

నంద యశోదబాలక – మిళిందశతరుచిరాలక
గోవింద విరాజిత వేణుగోపాలక ॥మం॥

కంసచాణూరమర్దన యదువంశపరిజనవర్ధన
ప్రశంసధారణ వాహిత గోవర్ధన ॥మం॥

ప్రాకటభవతారక బుధలోక మానసచోరక
శ్రీకర రాకమచర్ల విహారక ॥మం॥

ఈ మంగళ హారతికీర్తనలో స్మరణాసక్తి అనే వైష్ణవ భక్తి మార్గం వ్యక్తీకరింపబడింది. సుప్రసిద్ధుడు వాగ్గేయకారుడు అయిన తాళ్ళపాక అన్నమయ్య కీర్తనలు జానపదవాఙ్మయానికి చెందకపోయినా అతని జోలపాట మాత్రం జానపదగేయంగా వాడుకలో ఉంది. అదే వరుసలో లాలిపాట జోలపాటను కూడా వేంకటదాసు రచించారు. ఇవి అన్నమయ్య కీర్తనవలె అంతటి ప్రాచుర్యాన్ని పొందలేదు. ఈ కీర్తనలు స్మరణ, నామాసక్తులనే వైష్ణవ భక్తి మార్గాలను తెలుపుతున్నాయి.

నాచిన్ని కృష్ణమ్మ నవమన్మధాకార లాలి
వో చక్రధర పద్మలోచన సర్వేశా లాలి ॥ప॥

చిన్నారిపొన్నారి నసుగన్న స్వామి లాలి
వన్నెగుల్కుస్వామి దయ్యారిరంగయ్యా లాలి
నగుమోముగల స్వామి నారాయణాచ్యుత లాలి
నిగమసన్నుత పాదనీరాజలోచన లాలిలాలి

(రా.వేం.కీ. 1930–48పి)

ఇట్లా సాగిన లాలిపాట స్మరణాసక్తికి చెందినది.

"రామకృష్ణ జోజో – రామచంద్ర జోజో

స్వామి మాధవ గోవింద జానకీశ జోజో
సుప్రసాద జోజో - ఇందునిభా జోజో
భవ్యమందహాస జోజో
పరమపురుష జోజో - భక్తవరద జోజో
శ్రీమన్నారాయణ జోజో (రా.వేం.కీ, 1930-48పే)

వేంకటదాసుగారు తమకీర్తనంలో భక్తి ప్రతిపాదనా విషయంలో పోతన గారిని పూర్తిగా అనుసరించారు. అట్లాగే ప్రముఖ వాగ్గేయ కారులు అన్నమయ్య భక్తరామదాసులను కూడా అనుసరించారనే విషయం కీర్తనలను పరిశీలిస్తే తెలుస్తుంది.

మొదటి ప్రకరణంలో వివరించినట్లుగా ఆర్యులు రెండుగా చీలి ఒకరు వైదిక ధర్మం, మరొకరు అవైదిక మతాలను అవలంబించిన తరువాత అవైదికులైన ఆర్యులు తమ పురాణాది మత సాహిత్యంతో, సిద్ధాంతాలతో వేదంలోని శబ్దాలకు, పదాలకు, ధర్మప్రతిపాదనకు వారి వారి బుద్ధ్యనుసారంగా విపరీత అర్థాలను ప్రతి, పాదించి స్వకపోలకల్పనలతో అవైదిక యుగాన్ని తయారుచేశారు. సహవాసదోషంతో గుణాలు సంభవిస్తాయన్నట్లుగా అవైదిక యుగ సంపర్కమున్న వేంకటదాసు కూడా తమకీర్తనలలో వైదిక సంబంధ శబ్దాలను, పదాలను వాడుకుంటూ చివరకు వాటిని అవైదికంగా మతపరమైన దేవతకు విశేషణాలుగా చేయటం పై విషయాన్ని స్పష్టం చేస్తున్నది. సంవాద కీర్తనలద్వారా జ్ఞాన, భక్తి మార్గాలు రెంటియందు సామరస్య ధోరణి ప్రదర్శించి, తన కీర్తనల యందు దర్శింపచేసినా చూపరులకు మాత్రం తనది భక్తి మార్గమేనని వ్యక్తీకరించిన ఈ కీర్తనను పరిశీలించ దగును.

నను మన్నించిన నాధుని నామము మనసుకరుగజేసె
తనువు మరచి హరి ధ్యానము సేయగ ధారణగా
జేసె తెలసె ॥ప॥

ఘన సంసారంబును నమ్మక కనుగొని లక్ష్మీకాంతుని పొగడగ
॥నన్ను॥

ఆర్తితోడ శ్రీహరిని దలుప పరివర్తన తెలివాయా
మూర్తి త్రయ సమ్మోహన వైష్ణవ పూర్తికి మొదలాయా
శాయా

నేర్తువ నెటిదుర్నిరుపు జీవుని కీర్తి బాపి
సంకీర్తన బలమున ॥నన్ను॥

ముందుగ హరిదయనందగ బ్రహ్మానందము గనుపించె
పొలదుగ హంసను జందని యోగమునందే ప్రబలించె
కందుర ఇల సంగ్రహలను మాటలు కందువనుచును
కల్లలదోచేను ॥నన్ను॥

పొంగేటి షోడశలింగ దేహమును భంగమేనిజ ననగా
రంగుగాను శ్రీరంగని సత్కృప కంగీకరముగా భాగా
మంగళ కరమగు మతములెల్ల కనకాంగములగు
రాకమచర్లేశుడు ॥నన్ను॥

(రా.వేం.కీ, 1930-71 పే)

ఈ కీర్తనలో యోగ నిరసన, ఇతరమత నిరాకరణ భావం సూచిస్తూ వైష్ణవమత భక్తిమార్గమే గొప్పదని తెలిపియున్నారు. ఇట్లా వేంకటదాసు తనకీర్తనలలో అవైదిక భక్తి మార్గాన్ని అనుసరించారు.

రాక పల్లీయులపై, సమకాలీన కీర్తనకారులపై ఈ కీర్తనల ప్రభావం ఎట్టిదో తెలుపుతాను.



మూడవ ప్రకరణం

# పల్లీయుల జీవనంపై కీర్తనల ప్రభావం

పల్లీయుల జీవనంపై రాకమచర్ల కీర్తనల ప్రభావం ఏమిటో తెలుసుకునే ముందు పతనమైన వారి జీవనవిధాన మెట్టిదో కొంత తెలుసుకోవటం అవసరం.

## పతనమైన పల్లీయ జీవనం

పల్లీయులు సాధారణంగా వ్యవసాయ జీవనులు. ఇతర వృత్తులు దీనికి అనుబంధాలు. వీరికి దయ్యాలు, దేవతలు, తంత్రాలపై విశ్వాసం మెండు. ఇది వారి అమాయకతకు, మానసిక బలహీనతకు నిదర్శనం. అమాయకం, అజ్ఞానం, నిరాడంబరం వారి మౌలిక గుణాలు. ఇట్టి వీరు కాలక్రమేణ శైవ, వైష్ణవాది మతాల ప్రభావంలో మునిగారు. తత్సంబంధ ఆచారాలను అనుసరించారు. అహితమైన మత సాహిత్య ధోరణుల మైకంలో పడ్డారు. తత్సంబంధ కపులను అనుసరించారు.

ఒకనాడు పల్లీయుల పదాలు వైదిక భావాలతో కూడి ఉండేవి. ఉదాహరణకు ఈ క్రింది పల్లె పదాలను గమనించండి.

"చిల్లర రాళ్లకు మ్రొక్కుచునుంటే
చిత్తము చెడునుర ఒరే ఒరే
చిత్తమునందున చిన్మయరూపుని
చూచుచునుండుట సరే సరే
ఒక్క బ్రొద్దులని యెండుచునుంటె

ఒనరుగ చెడుదువు ఒరే ఒరే
ఏకమైన యా వైభవమూర్తిని
చూచుచునుండుట సరే సరే
నీళ్లలో మునిగి గొణుగుచు యుంటె
నిలకడ చెడునుర ఒరే ఒరే
నీళ్లలో వుండే నిర్మల జ్యోతిని
చూచుచునుండుట సరే సరే,

ఇట్లా చిల్లర రాళ్ళకు మ్రొక్కటం, ఒక్కప్రొద్దు లుండటం నీళ్ళలో మునిగి గొణగటం (పురాణోక్త జపం) మొదలైన అవైదిక కర్మలు నిష్ప్రయోజనాలనీ, చిత్తమందు చిన్మయరూపుని చూడటం, ఏకమైన ఆ వైభవ మూర్తిని చూడటం, నీళ్ళలో ఉండే నిర్మల జ్యోతిని చూడటం వంటి వైదికభావాలు కూడా ఆయా కవుల ద్వారా గ్రహించటం జరిగింది అట్లాగే

"దేముడయా దేముడూ - మాయదారి దేముడూ
నల్లని మేకాలపాలు - తెల్లచేసే దేముడూ
తెల్లని పాలల్ల నీళ్లు - తెల్లచేసే దేముడూ"

అంటూ శుద్ధ బ్రహ్మం యొక్క సృష్టి వైచిత్ర్యాన్ని మథించిన పదాలూ ఉన్నాయి.

కాని కాలక్రమేణ అవైదిక తత్త్వాలు చెప్పిన కవులు ఎక్కువగా ఉండటంవల్ల ఈ ప్రభావమే వారి మస్తిష్కంలోను, అందుండి వెలువడే పదాలలోను అధికంగా కనిపిస్తున్నది. ఉదాహరణ ఈ క్రింది కీర్తనలను గమనించండి.

"రామ రామ రామయనుమా - సుభముగ తారకనామమిది
మోక్షమును గనుమ ఓమనసా ॥రా॥
(రాపాక కవుల కీర్తన)

"తక్కువేమి మనకు రాముండొక్కరుండువరకు

ప్రక్కతోడుగా భగవంతుడు మునుచక్రధారియై చెంతనే
యుండగ (రామదాసు కీర్తన)

"పూల వసంతములాడుదమా గో
పాలుని లీలలు పాడుదమా" (రాకమచర్ల కీర్తన)

ఇట్టి అవైదిక కీర్తన కారుల కవిత్వాలే పల్లీయుల మనసులలో మనగడలో నిలబడి పోయాయి. ఇట్టి అదనుగమనించిన అవైదిక కవులు విజృంభించారు.

"నరసింహ నిన్నేనమ్మితీ
ఏనాటికైన మీపాదమే గతి
ఓరి నీరు స్థంభాన
వచ్చి ప్రహ్లాదుగాచి
కోర మీసమ్మె దువ్వి
గుండె చల్లన చేసినోడ ॥బేౖా॥

..........................
..........................
"వేదాలూ నమ్మరాదయా
ఆ శాస్త్రాలూ బోధాలూ
బాగులేవయా
వేదాలు చదువుకొంటు
సుద్దూలు చెప్పుకొంటు
నాదా వినోదుడవైన
నల్లనయ్య నీవెగదర ॥బేౖా॥
..........................
..........................

"పుల్లంగంటి పురమునాకు
చిన్నాగోపాలుడవై
పిల్లంగోరు చేతబట్టీ
పేటపేట తిరిగినోడ ॥బేట్రా॥

వడ్డె కులమునందు బుట్టితీ
నీవిచ్చినట్టి మట్టి బుట్ట
చేతనేబట్టితీ బుట్ట
(ఎల్లోర - జానపద సాహిత్యం నుండి పు. 617 నుండి 619)

ఇట్లా అవైదిక అవతార వాద ప్రచారాలతో పాటు వేదశాస్త్ర వైముఖ్యాన్ని వారిలో పెంపొందించారు. అంతేగాక కులమత వాదాలను అంట గట్టి భేదభావాలను ఈ అవైదిక కవులు కల్పించారు. పల్లీయులలో అనైక్యతను పెంచారు.

ఇట్టి అవైదిక కవుల కల్పనా వైచిత్ర్యముతో పల్లీయులలో మూఢభక్తి, మూఢ ఆచారాలు ఎక్కువైనాయి. వేంకటదాసు అవతారవాదం ఇట్లా ఉద్భవించిందే, ఉదాహరణకు ఈ వాక్యాలు గమనించండి. "వేంకటదాసుగారిని తలవకుండా ఏపని చేసినా విఘ్నమౌతుంది" "వేంకటదాసుగారి కీర్తనలలో అచ్చు తప్పులు గమనించినా సవరిస్తే ఏం జరుగుతుందో అనే భయంతో ఆ కీర్తనలలోని తప్పులు దిద్దం"వంటి విశ్వాసాలు కల్గిన వేంకటదాసు భక్తులున్నారు. దీనికి కారణం పైన వివరించిన విషయ ప్రభావమే.

## ప్ర భా వ ం

ఒకడి ప్రభావం ఇంకొకడిపై పడింది అంటే వాడిని వీడు అనుసరించాడు అని సామాజిక అర్థం. ఇట్లా అనుసరించాలంటే బోధకుడు చెప్పే మాటలు లేక చేసే కార్యాలు సామాజికుల ఆచార వ్యవహారాలకు, అలవాట్లకు, నమ్మకాలకు సమీప వర్తియై ఉండాలి. ఇట్లా ఉంటే జనులు తొందరగా ప్రభావితులు ఔతారు.

పల్లీయులకు ఉత్సవాలు, జాతరలు, నోములు, వ్రతాలు అంటే మక్కువ ఎక్కువ. ఈ సందర్భాలలో వారంత ఒకచోట చేరి ఆటపాటలతో, సంఘీభావంతో పరస్పరం ఆనందానుభూతుల్ని ఇచ్చి పుచ్చుకుంటారు. ఇది గమనించిన వెంకట దాసు తనకు పెద్ద ఉమ్మెంతాలలో ఆశ్వయుజ శుక్ల పౌర్ణమినాడు లభించిన సాల గ్రామానికి ఉత్సవాన్ని ఏర్పాటుచేశారు. ఈ ఉత్సవం ఏర్పాటు చేయటానికి ముందు ఆ సాలగ్రామం తనయింట నాట్యంచేసిందనీ, బాలకృష్ణుని రూపంలో దర్శనమిచ్చిం దని (శ్రీ.రా.మా.వేం.జీ.వి.భ.చ. 10పే) ఇట్లనేక వదంతుల సృష్టిలో పల్లీయులకు మానవాతీత శక్తులమీద ఉన్న నమ్మకాన్ని అధికం చేశారు. ఉత్సవం ప్రారంభిం చారు. అందు సాలగ్రామాన్ని (విగ్రహాన్ని) ఊరేగించేందుకు చొప్పకట్టలతో రథాన్ని నిర్మించారు. ఇది పల్లీయులను ఆకట్టుకునేందుకు పన్నిన ఎత్తుగడే అనిపిస్తుంది. సహజంగా తమ నిత్యజీవితంలోని వస్తుసామిప్యాన్ని జూచి పేనుపొంగి గంతు వస్తుంటారు పల్లీయులు. ఇట్టి వారి స్వభావాన్ని ఆకళింపు చేసుకున్న వేంకటదాసు అట్లా రథాన్ని నిర్మించి వారిని ఉత్సాహపరచి ఉత్సవ నిర్వహణకు వాడుకుని ఉంటారని చెప్పాల్సిఉంది. వర్తమానంలో అట్టి రథమూలేదు. ఉత్సవంలో పల్లీయు లకు ఆ ఊపూలేదు. ఈ పరిణామం పై విషయాన్నే స్పష్టం చేస్తున్నది.

## ఉమ్మెంతాల ఉత్సవ స్వరూపం

ఉమ్మెంతాల ఉత్సవంలోని ఎదురుకోళ్ళు, రథోత్సవం, వసంతోత్సవం వంటి ప్రక్రియలు పల్లీయులకు అత్యంత సన్నిహితంగా ఉన్నాయి. పల్లీయుల వివాహ ప్రక్రియలో ఈ ఎదురుకోళ్ళు తంతు ఒకటి. పెండ్లి కుమారుణ్ణి పెండ్లికూతురు ఇంటికి తెచ్చేప్పుడు ముందుగా ఊరిబైట మఱ్ఱివృక్షం క్రిందనో లేక గుడిలోనో కొంతవడి విశ్రమింపచేస్తారు. అనంతరం పెండ్లికూతురు వైపువారు మేళతాళాలతో అచటికి వస్తారు. ముఖంపై తిలకం దిద్ది ఆకుపోకలతో పెండ్లి కొడుకుకు తమను పరిచయం చేసుకుంటారు. అనంతరం ఇరు పక్షాలవారు బుక్కాగులాలును పిడికిళ్ళ నిండా తీసు కుని ఒకరిపై మరియొకరు చల్లుకుంటారు. ఇట్టి ఎదురుకోళ్ళ తంతునే ఈ ఉత్స వంలో జొప్పించి అమిత ఉత్సాహంతో పల్లీయులను ఆకర్షించారు. రథోత్సవం కూడా మేళ తాళాలు, డప్పుల చప్పుళ్ళతో వారికి హృదయాహ్లాదాన్ని. కలిగించేదిగా ఉంది. ప్రొద్దంతా పనిచేసి అలసి సొలసిన హృదయాలకు ఇవే శ్రమాపనోద సాధ

నాలు. లయబద్ధంగా గంతులవంటి అడుగులు వేసి పల్లెకు పులకరింత కలిగించే ఈ పల్లీయ నృత్యాన్ని కూడా ఈ రథోత్సవంలో రథం ముందు వేంకటదాసు ఏర్పాటు చేశారు. సాధారణంగా రథోత్సవం సాయంవేళ మొదలై రాత్రి పొద్దుపోయే వరకు కొనసాగుతుంది. పల్లీయుల కోలాట పాటలవలె రథం ముందు నృత్యంచేస్తూ వేంకట దాసుగారు గానంచేసిన కీర్తనగా చెప్పబడుతు న్న ఈ కీర్తనను గమనించండి.

నర్తాన జేసెదచూడూ - నేకార్తానదేకొందునేడు ॥ప॥

నర్తన జేసెదనయ్య నినునమ్మి ఆర్తితో విస్ఫూర్తి రంజిల్లగా ॥న॥

సకల దేవతలెల్ల గొలిచీ
నిన్ను సన్నుతింపంగ నిందుబిలిచీ
అకలంక భరత శాస్త్రార్థ యుక్తముగ
తకధీమి కిటతోంగిణ తకధెయ్యని ॥న॥

ఘన వైభవమున మీరుండా
సజ్జనములు సేవింపుచుండా
అనువుగ స్వరయుక్త మరిరాగాలచే
వనజసంభవుడాది మునులు సంతసమంద ॥న॥

సరసరాకమచర్ల వాసాభక్త
వరద వేంకాటదాస పోషా
నరసింహ గోవిందనను గన్న తండ్రి
స్థిర చిత్తమూన నినుశేవించి మురయూచు ॥న॥

(రా.వేం.కీ. 1930_186పే)

ఈ కీర్తనలోని పల్లవి, చరణాల మధ్యలో వరుసలు వేయటం కోలాట కీర్తనల పద్ధతినే తలపిస్తున్నది. వేంకటదాసు తన తంబూరను మీటుతూ చిటికెలను

వాయిస్తూ కీర్తన పాడుతూ మధ్యలో నర్తిస్తూంటే చుట్టు వృత్తాకారంలో భక్తులుకూడా నిలబడి నాట్యం చేసేవారట. జనులు గుంపులుగా చూస్తూ ఆనందించేవారట. ఈ ఉత్సవంలో ఈ పద్ధతి నేటికీ కొనసాగుతున్నది. వేంకటదాసుగారిది భక్తి మార్గంలో భజన పద్ధతి కాబట్టి చాల కీర్తనలు ఇట్టె కోలాట, చెక్క భజన లేక బృందావన భజనలకు అనుకూలంగా ఉంటాయి. వారు ఉమ్మెంతాల చేరకముందు కొందుర్గ గ్రామంలో కొన్నినాళ్లు కోలాటం నేర్చి కోలాటం పాటలు కూడా వ్రాశారు, అనే విషయం ఈ సమయంలో గమనింపతగింది. ఉత్సవంలో మరోభాగం వసంతోత్సవం. "కాముని పున్నమ" అనే పేరుతో పల్లీయులు ఫాల్గున పౌర్ణమినాడు ఈ పండుగ జరుపుకుంటారు. ప్రతి ఇంటి నుండి కట్టెలు, పిడకలు పోగుచేసి పల్లె మధ్యలో ఒక చోట వేసి వాటికి నిప్పంటించి ఆ మంటల దగ్గర చిన్న పెద్ద తేడా లేకుండా అందరూ చేరి ఆనందంతో కేరింతలు కొడుతుంటారు. దీనినే "కాముని దహనం" అంటారు. ఇది పూర్తిగా పురాణ ప్రభావం కలిగి ఉన్న పండుగ. ఈ కామదహనానికి రెండు మూడు రోజుల ముందునుండి వసంతమాడుతారు. వసంత ఋతువు ప్రారంభమయ్యే రోజులివి. ఈ వసంత ఋతువుతో ప్రకృతి సూక్ష్మశోభను, చైతన్యాన్ని పొందుతుంది. నిర్మల ప్రకృతులైన పల్లీయులు కూడా వివిధమైన రంగులతో వేషధారణలతో ఈ ఉత్సవాన్ని జరుపుకుంటారు.

ఈ పండుగలో భాగంగానే డోలికోత్సవాన్ని జరుపుతారు. నేటికీ ఈ పండుగ నాడు శ్రీకృష్ణ విగ్రహాన్ని ఊయలలో ఊపటం బెంగాలులో ఉంది.

అవైదిక వచనాలతో అమాయకులైన పల్లీయులను ఆకర్షించి, పౌరాణికులు వాటిని పోషించే భారం పల్లీయుల భుజాలపై వేశారు. గురి తప్పినా మాట తప్ప దన్నట్లు ఆడితప్పని పల్లీయులు నేటికీ అవైదిక వచన పద్ధతులను పాటిస్తూనే ఉన్నారు. ఇట్లా పల్లీయుల నాడిని పట్టుకున్న వేంకటదాసుగారు కూడా తాము ఏర్పర చిన ఉమ్మెంతాల ఉత్సవంలో ఈ వసంతోత్సవం, డోలికోత్సవాలను చేర్చారు. ఈ డోలికోత్సవాన్నే వైష్ణవులు తమ పరిభాషలో "పవళింపు సేవ" అంటారు. ఈ వసంతోత్సవానికి సంబంధించిన వేంకటదాసుగారు గానంచేసిన ఈ కీర్తనను గమనిద్దాం.

పూలవసంతము లాడుదమా గోపాలుని లీలలు బాడుదమా ॥ప॥
నీలవర్ణముని జాల సుజన హృత్తీల మహిత కరుణావాల హరి
॥పూ॥

1. నందాత్మజ రమ్మందాము ముచుకుంద వరదునిటుగందాము
కుంద రదన రాకేందు వదనను బృందగోవిందా యనుచును
॥పూ॥

2. మాధవ రమ్మని పిలుతాము మారాధ మనోమరు గొలుతాము
శ్రీధర హరిదామోదరయనుచును సాధు సజ్జనుల
సంగతిజేసుక ॥పూ॥

3. రంగాయని మది దలుతాము సుప్పొంగుచు గంతులు వేతామూ
రింగు రింగుమని పుంగిలి పూయుచు సంగడికాంద్రతో
సరసత్వంబున ॥పూ॥

4. హరిదాసులను కొనియాడుదమా పరమానందంబున గూడుదమా
స్థిరముగ రాకమచర్ల నివాసుని, ధరణిలో వేంకటదాసుని
పొగడగ ॥పూ॥

(రా.వేం.కీ, 1930_21పి)

గోపాలుని లీలలు అత్యంత ఉత్సాహంతో పాడుతారు. తదను కూలంగా వసంతోత్సవం ఏర్పాటు చేయబడింది. కనుక పైన తెలిపినట్లు జనాకర్షణ కోసమే జనులలో ఉన్న కొన్ని ఆటపాటలతో కూడిన ఉత్సవాల సందడిని ఇందుకు దండిగా వాడుకునట్లు తేటపడుతున్నది. అంతేగాక ఈ కీర్తన చివరి పాదంలో ఇట్టి ఆట పాటలతో హరిదాసులను కొనియాడటం, రాకమచర్లవాసుని, ధరణిలో వేంకట దాసుని పొగడటం వీటి లక్ష్యంగా కనిపిస్తున్నది. అంటే జానాకర్షణతో తమ తమ ప్రచారానికి వాడుకున్నారని విదితమౌతున్నది. ఇక ఈ కలాపమంతా వారిదే అని

చెప్పి ఒప్పించేందుకు రింగురింగుమని పుంగిలి (రంగు) పూయుచు, సంగడి కాండ్రితో (స్నేహితులు) సరసత్వంబున ఉప్పొంగుచు గంతులు వేతామూ అనే అంశం మాత్రం పల్లియుల వసంత క్రీడలోని భాగం చెప్పబడింది. ఒకటి, రెండు పాదాలలో స్మరణాసక్తి, సేవాసక్తి అనే భక్తి మార్గాలు చూపించి వేంకటదాసుగారు గ్రామ కోర్కెను నెరవేర్చుకున్నారు. ఇప్పటికి ఈ కీర్తనలను పాడుతూ తరాలు మారినా తలపులను వీడని పల్లియులు ఈ ఉత్సవాన్ని అట్లాగే కొనసాగిస్తున్నారు. నేను సేకరించిన ఈ ఉత్సవ స్వరూపాన్ని గమనించుడు.

పెద్ద ఉమ్మెంతాలలో ఆశ్వీజ బహుళ సప్తమి నుండి ఏకాదశి వరకు అంటే అయిదురోజుల పాటు ఉత్సవం నిర్వహింపబడుతుంది. దీనిని మొదట వేంకటదాసు గారు ప్రారంభించారు. మొదటి రోజు ధ్వజారోహణం, రెండవరోజు ఎదురుకోళ్ళు, మూడవ రోజు రథోత్సవం, నాల్గవ రోజు వసంతోత్సవం, ఐదవ రోజు మానసపూజ సాగిస్తారు. ఉత్సవ విధానమంతా దాసుగారు ఏర్పరిచిందే! అదేనేటికి కొన సాగింపబడుతున్నది.

మొదటి రోజు ధ్వజారోహణం జరుగుతుంది. పురాణోక్తము వైష్ణవ మత సంబధమైన తంతు. రెండవ రోజున జరిగే ఎదురుకోళ్ళతో నృసింహయోగి వేంకటదాసుల వారి మధ్య జ్ఞాన, భక్తి మార్గాల సంవాద కీర్తనలు పాడతారు. నరసింహయోగి పక్షానకొందరు దాసుగారి పక్షాన మరికొందరు ఎదురెదురుగా నిలబడి జ్ఞాన, భక్తి కీర్తనలు పాడతారు. ముందు యోగి పక్షంవారు జ్ఞాన మార్గకీర్తనను పాడతారు. వెంటనే దానికి సమాధానంగా దాసుగారి పక్షంవారు భక్తిమార్గ కీర్తనను పాడతారు. చివరకు ఇరువురు సమన్వయ పూర్వకంగా కలిసి పోతారు. ఈ సంవాదానికి సంబంధించిన కీర్తనలను రెండవ ప్రకరణంలోవివ రించాను.

మూడవ రోజున రథోత్సవం జరుగుతుంది. సాయం సమయంలో వేంకట దాసుగారి మఠం దగ్గర నుండి రథంబయలు దేరతుంది. రథం ఊళ్ళోనిలిపినపుడు ఈ క్రింది కీర్తనలు పాడతారు.

1. రారమురారే రారా శౌరె - తారకనామ దైత్యవిరామ
(రా.వేం.కి. 1930. ప్ర. 146 పే)

2. బిరానరార కరివరదదృష్ట
(రా.వేం.కి. 1930, 32 పే)

3. రార రార రఘువీర దయానిధేచారు మకుటమణిహార ఖరాంతక
(రా.వేం,కి. 1930.10 పే)

4. అలసించనేల - నే బిలచితె అలసించనేలా
(రా.వేం.కి. 1939.23 పే)

5. ఏలరా గోపాల ఈచలమూ - నీకదెకదబలమూ ఏలరా
(రా.వేం.కి. 1930.70 పే)

6. శ్రీ రఘునందన రార ఆశ్రిత సముదయమందారా
(రా.వేం.కి. 1930.78 పే)

ఈ కీర్తనలు పూర్తి అయిన తరువాత దాసుగారి సమాధికి కొలది దూరంలో ఉన్న హనుమాన్ల దగ్గరికి రథాన్ని తీసుకపోయినిలుపుతారు. అక్కడ కొన్ని పదికట్టు పద్యాలు చదివిన తరువాత క్రింది కీర్తనలు గానం చేస్తారు.

"జయ జయ రామ జగదభిరామ భయ విరహిత వర పావననామా
(రా.వేం.కి. 1930-139 పే)

''గురు వీరాయతె నమోనమో శ్రీగురు వీరాయతె నమోనమో
(రా.వేం.కి. 1930-50 పే)

''హరి చరణం భజశరణం సద్గురు చరణం భవహరణం (రా.వేం.కి. 2 పే)
''మనసా శ్రీహరినీ బిలువ వమ్మ మనవి చేకోమ్మా (రా.వేం.కి. 2 పే)
''రార ఓరామకృష్ణ రార (రా.వేం.కి. 1930.3 పే)
''శివదేవ మహానుభావ-భవాభువదేశ్వర పాప భయంకర
(రా.వేం.కి. 1930-178 పే)

''ఆర్తరణ నిన్ను నమ్మిక మీనామికీర్తన జేసెదనోరామ

(రా.వేం.కీ. 1930.54 పే)

''తరమానిను మదినలచి పొగడగను దశరథ్రాము ధరణి

(రా.వేం.కీ. 1030.51 పే)

"రామయ్య నీవాడనయ్యా ఇంకా సామాన్యసురులానే సన్నుతిజేయ

(రా.వేం.కీ. 1930.73 పే)

''ఏదయ్యా రామనీదయ కోదండపాణి షేదయా

(రా.వేం.కీ. 1930 133 పే)

"రామ తారకనామా దినరాజ కులాంబుధి సోమా

(రా.వేం.కీ. 1930.85 పే)

''నిన్ను మానలేవమా రామయ్యనే నిన్ను మానలేను

(రా.వేం కీ. 1930.129 పే)

"కృప కల్గితే బ్రోవయ్యా సేరెపు వముగల్గితె దెలుపవయ్యా

(రా.వేం.కీ. 1930.28 పే)

''పుండరీక వరదా విఠల పుండరీక వరదా

(రా వేం.కీ. 1930 116 పే)

''కృష్ణా రాంరాం గోవింద హరిహరి

(రా.వేం కీ. 1030.118 పే)

''బాలముకుందం పాహిగోవిందం పాలిత సుశీలముని జాలనానందం

(రా.వేం.కీ. 1930 35 పే)

''గోవిందములిపిగో రామా భవఖండనతారకనామ

(రా.వేం.కీ. 1930.68 పే)

"నిర్వికార బ్రహ్మ (హరతి కీర్తన)

ఈ కీర్తనలు పాడిన అనంతరం రథం తిరిగి దాసుగారి మఠం చేరుతుంది. హనుమాన్ల దగ్గర రథం నిలిచిన చోటనే దాసుగారికి ఈ ఉత్సవానికి మూలమైన సాలగ్రామం దొరికిందట.

నాల్గవ రోజున వసంతోత్సవం. ఇది కూడా సాయం సమయంలోనే మొద లౌతుంది. తాంబూర, చిటికెలు ధరించి మఠాధిపతి ముందునడుస్తుంటాడు. ఆయన వెంట భక్తులంతా కరతాళాలు, భజన చెక్కలు, కోలాటంపుల్లలు చేబూని అమి తోత్సాహంతో ఊరేగింపు బయలుదేరుతారు. అది గ్రామ వీధులగుండా ఉమ్మెంతాల ఊరి బయలునున్న "మందబాగుడ" అనే ప్రదేశాన్ని చేరుతుంది. అక్కడ మఠాధి పతి తాంబూరను మీటుతూ చిటికెలు లయబద్ధం చేసి కీర్తనలు పాడుతూ అమితోత్సా హంతో అడుగులు వేస్తుంటాడు. భక్తులు కూడా ఆయనను వృత్తాకారంలో పరివేష్టించి ఉప్పొంగే ఆనందపు ఊపులో అడుగులతో అడుగులు కలిపి గళాన్ని సవరించు కుంటారు. ఇట్టి సమయంలో వారు పాడే కీర్తనలివి.

"గురుదేవతానంద మూర్తిభక్తకోటి మానస చక్రవర్తి

(రా.వేం.కీ. 1930.49 పే)

"హరి చరణం భజశరణం సద్గురు శరణం భవ హరణం

(రా.వేం.కీ. 1930.2 పే)

"తాళలేనుపోవే శ్రీహరిని మరియేలీలనైనదేవే

(రా.వేం.కీ. 1930.71 పే)

"ఇందీవ రేక్షణ రావోయి మానందకుమారక రావోయి

(రా.వేం.కీ. 1930.71 పే)

"నంద నందన కృష్ణ ననుగన్నతండ్రి నాయన్న నాస్వామి రావోయి
కృష్ణాకృష్ణ నాయన్న నాస్వామి రావోయి

(రా.వేం.కీ. 1930.73 పే

"నన్నుగన్నవాడావు నీవే నాగభూషణ నన్నేలుకోవే

(రా.వేం.కీ. 1930.175 పే)

"శివదేవమహానుభావ భువనేశ్వర పాపభయకంర

రా.వెం.కీ. 1930. 178 పే)

"గోపాల మాధవ గోవింద శ్రీకృష్ణనాపాలగలిగున్న నారాయణా

(రా.వేం.కీ. 1930.16 పే)

"గోపాలక నాపాపములెన్నక చూపనేసికరుణా

(రా.వేం.కీ. 1030.53 పే)

"నగుమొగమిగ జూపు రామనీనగుమొగమగ జూపు

(రా.వేం కీ. 1930.97 పే)

"పలుకరా చయజిల్కరా నాయన్ననాతో పల్కరా

(రా. వే. కీ. 1930.59 పే)

"గిరిధరగోపాలకా నీ కృపమవిటలాలక

(రా. వేం. కీ. 1930.127పే)

"సీ వాడను దేవకీనందనా నన్ను బ్రోవవె దేవకినందనా

(రా. వేం. కీ. 91 పే)

"సీవాడను దేవకీనందనా నను భ్రోవవెదేవకినందనా

(రా.వేం.కీ. 91 పే

"రాధామనోహర రావేమి బోధ విచార విరోధ జనాంతర దాసు జనావనరావేమీ

(రా.వేం.కీ. 1930.78 పే)

"మురలీధరా దామోదరా

(రా.వేం.కీ. 1930.13 పే)

"వెంటరార కృష్ణ నీ బంటనయితి కృష్ణ
(రా.వేం.కీ. 1930.163 పే)

"ఆర్త రక్షణ నిన్ను నమ్మిక మీ నామకీర్తనజేకొందు నేడూ
(రా.వేం.కీ. 1930.54 పే)

"నర్తానజేసేదచూడూ నీ కీర్తానజేకొందునేడూ
(రా.వేం.కీ. 1930.166 పే)

"తారంగం తారంగం నతసారంగం శ్రీరంగం
(రా.వేం.కీ. 1930.74 పే)

"పూలవసంతములాడుదమూ గోపాలుని లీలలు పాడుదమూ
(రా.వేం కీ. 1930.21 పే)

"వందనమొనరింతునయ్యా నందతనయ
దేవచందన చర్చితరూప శ్రీముకుందా
(రా.వేం.కి. 1930.22 పే)

"మంగళం నందతనయతె వాసుదేవయం గళాలయాను మోదతే
(రా.వే.కి. 1930.35 పే)

ఈ కీర్తనలు పాడిన అనంతరం అనాటి కార్యక్రమం ముగిస్తారు. ఉత్సాహం, ఐక్యత సామాజిక ప్రయోజనాలతో పాటు మతపరమైన భగవత్సం కీర్తనాను భూతికి ఏకాగ్రత కలిగించే ప్రయత్నమే ఈ ఉత్సవంలోని ఆంతర్యం.

ఐదవ రోజు సాయంత్రం మానసపూజ, డోలారోహణం నిర్వహింపబడతాయి. అవైదిక పురాణోక్త షోడశోపచారాలతో మానసపూజ నిర్వహింపబడుతుంది. మానస పూజను గురించి రెండవ ప్రకరణంలో విపులంగా తెలిపారు. ఈ పూజ గర్భగుడి ద్వారం ముందు ఊయలలో విగ్రహాన్ని ఉంచి మానస పూజను

శ్లో ॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిమ్
భావాతీతం త్రిగుణరహితం తత్త్వమ స్యాదిలక్ష్యమే

ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షి భూతమ్
ద్వంద్వాతీతం గగనసదృశం సద్గురుంతం నమామి

అనే శ్లోకంతో ప్రారంభిస్తారు. అనంతరం వేంకటదాసు గానంచేసిన ఈ క్రింది మానసపూజ కీర్తనలను క్రమం తప్పకుండా పాడుతారు.

"గురుపేరాయతె నమోనమో (రా.వేం.కీ. 1930-50పే)
"హరిచరణం భజ శరణం (రా.వేం.కీ. 1930-2పే

అనే కీర్తనగానంచేసి అనంతరం మానసపూజ కీర్తనలను పాడతారు. ఈ కీర్తనలు పూర్తికాగానే ''పూజకాయరే మానసపూజకాయరే - అనే కీర్తన "అనంత మందావె మనసా'' అనే కీర్తనలనుచదివి ముగిస్తారు.

బీదరికాన్ని అనుభవిస్తున్న వేంకటదాసు భగవంతుని పూజకు అవసరమైన సామగ్రినికూడా సమకూర్చలేక పోయేవారు. అట్లని భగవదర్చన చేయకుండా ఉండే వారు కాదు. భగవంతుని అర్చన సలక్షణంగా చేయలేక పోయానే అనే బాధ వారి మనసును క్రుంగదీసేది. అందువల్ల భగవదర్చన సలక్షణంగా చేశాననే తృప్తిని పొందేందుకు వేంకటదాసు చేసిన ప్రయత్నమే ఈ మానసపూజ'' అనే భావాన్ని ప్రస్తుత మఠాధిపతి అయిన గోవిందయ్య గారు వెలిబుచ్చారు. కాని ఈ మానసపూజ వేంకటదాసుల వారి సృష్టికాదు అవైదిక పురాణాలు మానసపూజను ఎప్పుడో తెలిపాయి. ఈ విషయాన్ని సప్రమాణంగా రెండవ ప్రకరణంలో తెలిపాను. అయితే ఈ మానసపూజను వేంకటదాసులవారు అనుష్ఠించటంలోని అర్థం అట్లా ఉండి ఉండవచ్చు. తనవంటి పేదలు ఎందరో లోకంలో ఉన్నారు. వారంతా తన లె భగవదర్చనకు కావలసిన సామాగ్రి సమకూర్చలేక పోవచ్చు. అభ్యాసానికేవ కావలసిన మానసిక శక్తిని వారికి దండిగా భగవంతుడిచ్చాడు. అందువల్ల మనసునే సమస్త వస్తువులుగా పూజాదికంలో సమర్పించటం అనే పద్ధతిని పేదలకు దాసుగారు సూచించేందుకే పూజను చేసి ఉండవచ్చు. కాని ఇట్టి పూజా విధానం ద్వారా పల్లీయులను ఆకర్షించి వైదికమైన ఉపాసన, యోగాభ్యాసాన్ని జ్ఞానాన్ని వారికి

అందకుండా చేసి వారి ప్రాణాన్ని పెంచారనేది సత్యమైన విషయం. ఈ ఉత్సవం పల్లియులపై పడిసిన ప్రభావమెట్టిదో తెలుసుకొంటే ఈ విషయం స్పష్టపడుతుంది.

వేంకటదాసు గారు ప్రవేశ పెట్టిన ఉత్సవంలోని పద్ధతులను అనుసరించిన పల్లియుల మస్తిష్కంలో ఏర్పరచుకున్న అభిప్రాయాలివి.

1. "రథోత్సవం నాడు రథం ఏఏ గ్రామాల మీదుగా తిరుగుతుందో ఆ గ్రామాలు సుభిక్షంగా ఉంటాయి. అయాగ్రామాలలోని ప్రజలు ఎటువంటి కష్టనష్టాలకూ అనారోగ్యాలకు గురికారు''.

2. 'ఈ సమయంలోనే వేంకటదాసు గారు రాకమచర్లలోని ముచుకుందా నదిలో తెల్లవారు ఝాముననే స్నానం చేసి ఆ నదిలోని నీళ్ళను పల్లె పొలిమేరచుట్టూ తిరిగి చల్లేవారట. వేం టదాసులవారు అట్లాచేస్తేనే పల్లెలోని పశువులు రోగాదికాలు లేకుండా క్షీరవర్ధకాలుగా ఉంటాయి. అట్లాగే వారి చేత నీళ్ళు చల్లిస్తే ఎలుకలు, పందికొక్కులు, వంటివి లేకుండా నిర్మూలింపబడతాయి''.

మొన్న మొన్నటి వరకు సాగిన ఈ పద్ధతి ప్రస్తుతం నిలిపి వేయబడింది. దానికి కూడా వేంకటదాసుల వారు మరణ సమయంలో తనతో ముగ్గురు మఠాధిపతుల వరకే ఈ పద్ధతి ప్రతిష్ఠాకరంగా వెలుగొందుతుంది. తరువాత అంటే నాల్గవ మఠాధిపతి కాలంలో ఇది సామాన్యంగా ఉంటుంది. అని చెప్పిన మాటలే కారణం అని నమ్ముతున్నారు. అంతేగాని ఇందలి సత్యాసత్యములను తెలుసుకోలేకపోతున్నారు ప్రస్తుతం వేంకటదాసుగారి మఠం నాల్గవ మఠాధిపతి ఆధిపత్యంలో ఉంది,

## వేంకటదాసుపై పల్లియుల నమ్మకాలు

పల్లియులకు వేంకటదాసుపై నమ్మకం కుదిరింది. "కుడుమిస్తే పండుగ''ని సంతోషించే ఆ అమాయకపు జీవులు వేంకటదాసుగారి అవతారవాదాన్ని నమ్మారు. ఆ నమ్మకాన్నే నేటికి హృదయంలో పదిలపరచుకున్నారు. వారి కీర్తనల ప్రభావం నేటికి పాలమూరు, రంగారెడ్డి జిల్లాలలోని పల్లియులపై అధికంగా ఉంది. వారి కీర్తనలపై ఏర్పరచుకున్న నమ్మకాల మూలంగా ఆ కీర్తనలు పాడేందుకు కొన్ని

పద్ధతులు పడికట్లు, కట్టుబాట్లను కూడా పాటిస్తున్నారు. వాటి స్వరూపాన్ని తెలుసు కుంటే పల్లియజీవనం మీద ఈ కీర్తనలు ఎంతగా ప్రభావాన్ని చూపుతున్నాయో తెలుసుకోవచ్చు.

విశ్వసనీయులైన పల్లియులు తమ పెద్దలు చెప్పగ వినియో, లేక తమ అను భావాన్ని నెమరువేసుకుంటూనో కొన్ని విషయాలపై స్థిర విశ్వాసాన్ని కలిగి ఉంటారు. విభిన్న తత్వాలుగల పల్లియులనుండి నేను సేకరించిన వారి అనుభావాలను ఈ సందర్భంలో తెలియజేస్తాను. నేను రంగారెడ్డి జిల్లాలోని మాదిరెడ్డి పల్లెకు వెళ్ళి అచట వేంకటదాసు భక్తులైన కొందరు పల్లియులను కదిపినప్పుడు తెలిసిన విష యాలివి.

వేంకటదాసుగారే వారికి సాక్షాత్తు భగవంతుడు. అట్టి భగవంతుణ్ణి వారు గురు స్థానంలో నిలుపుకున్నారు. గురూపదేశం ప్రకారం రాకమచర్ల కీర్తనలను మరువ కుండా భజనచేస్తారు. కష్టం చేయందే కనికెడు ముద్ద దొరకని వీరి జీవనానికి అనుగుణంగా వారంలో ఒక్కరోజన్నా తప్పక భజన చేయాలనే నియమాన్ని ఏర్పరచుకున్నారు. ప్రతి సోమవారం భజన చేస్తారు. భజనలో కీర్తనలు గానంచేసేప్పుడు హార్మోనియం, తాళాలు, తబల మొదలైన వాద్యపరికరాలను కూడా వాడతారు. అందరూ ఒకచోట చేరేందుకు అవకాశం తక్కువ కాబట్టి కొన్ని జట్లుగా విడిపోయి నిర్ణయించుకున్న గృహంలో కాని గుడిలో కాని భజన చేస్తారు. భజన చేసే విషయంలో కులమతాల పట్టింపులు వీరికిలేవు. నియమితమైన సోమవారం రోజున అన్నం తినటమైనా మరుస్తారేమో గాని భజనమాత్రం మరువరట. పగలంతా పనిపాటలు చేసికునే వీరు రాత్రివేళలోనే భజన కార్యక్రమాన్ని నిర్వహిస్తారు.

భజనచేసే భక్తులలో ఒకరైన "శ్రీ తమ్మళి రామలింగం" తన అనుభవాన్ని తద్వారా తనకు ఏర్పడ్డ నమ్మకాన్ని ఇట్లా తెలిపారు. రెండు సంవత్సరాల క్రితం (నేను ఈ విషయం సేకరించేనాటికి) అంటే 1980 సంవత్సరంలో రామలింగం బర్రె కనపడకుండా పోయింది. అది దొరికితే నీ భజన చేస్తానని వేంకటదాసుగారి పటానికి మ్రొక్కాడు. తరువాత కొంతకాలానికి బర్రె దొరికింది. ఈ సంఘటనతో అతనికి దాసుగారి పైన, వారి కీర్తనలు భజనచేయటం విషయంలో నమ్మకం కుదిరింది.

దానితో వేంకటదాసును నమ్మి వారి కీర్తనలు భజన చేసినట్లైతే తనకు ఎటువంటి కష్టాలు రావని, వచ్చినా వెంటనే తొలగిపోతాయని గట్టి నమ్మకాన్ని కుదుర్చుకున్నాడు. ఆతడు 1978 ప్రాంతంలో భక్తులంతా రాకమచర్లలో జరిగే రథోత్సవానికి వెళ్లారు. రామలింగం కూడా వారిని అనుసరించారు. ఉత్సవం ముగిసింది. భక్తులంత తిరుగు ప్రయాణానికి సిద్ధమైనారు. వారితో తాను కూడా బయలుదేరాడు. అంతలో వేంకటదాసుగారి మఠాన్ని ప్రస్తుతం అధిపతిగా ఉంటున్న గోవిందయ్యగారు వారినుద్దేశించి ఈరోజు ఇచటనే ఉండి రేపు పొండి అన్నారట. అయినా వినకుండా భక్తులు బయలుదేరారు. మార్గమధ్యంలోనే పెద్ద వాన వచ్చి వారి ప్రయాణాన్ని ఆటంకపరచింది. వారంతా మరునాడే ఇళ్ళకు చేరవలసివచ్చింది. అయ్యగారి మాట పెడచెవిన పెట్టినందువల్లే ఇబ్బందికి గురికావలసి వచ్చిందనీ, వారు చెప్పిన వేళకే ఇళ్ళు చేరుకోవటం సంభవించింది కనుక వారి ఆజ్ఞను పాటింపకపోతే ఇబ్బందులు వస్తాయని ఈ సంఘటనవల్ల ఏర్పడిన నమ్మకం.

వారుచేసే రాకమచర్ల కీర్తనల భజన స్వరూపాన్ని శ్రీ పరమయ్యగారు ఇట్లా తెలిపారు. పూర్వం ఈ భజన సమయంలో ముందుగా భక్తులను మెడలో పూల మాలను వేసి సత్కరించేవారు. ప్రతి సోమవారం ఒక్కొక్క భక్తుని ఇంట్లో భజన చేస్తారు. భజన పూర్తికాగానే ప్రసాదం పంచుతారు. ఎవరి ఇంట్లో భజనచేస్తే వారే ఆ ప్రసాదం భరిస్తారు. భజనకు ముందు దీపాన్ని (దీపారాధన) వెలిగిస్తారు. భజన పెట్టిన ఇంటివారు కడు బీదస్థితిలో ఉంటే దీపానికి బదులుగా కట్టెపుల్లలతో మంట చేసి దాని ఎదురుగా కూర్చొని భజనచేస్తారు. ఇట్టి నియమ నిబంధనలతో పూర్వీకులు ఒక పత్రంకూడా వ్రాసి పెట్టుకున్నారు. ఆ పత్రం వ్రాసుకుని సుమారు నలుబది సంవత్సరాలు కావస్తున్నది. ఈ నియమ పత్రం మీద "యూవాపురం వీరప్ప" సేటు "వడ్ల లక్ష్మయ్య, "కమ్మరి సాయన్న" మొదలైన పల్లె ప్రముఖుల స్వంతకాలున్నాయి. వీరప్ప సేటు కుమారుడు పరమయ్యగారి ద్వారా నేను నియమ పత్రాన్ని సేకరించాను. ఒక్క శ్రావణ మాసంలో మాత్రం ప్రతిరోజు రాత్రి 9 గంటల నుండి 12 గంటల వరకు భజన చేస్తుంటారు.

భజన సమయంలో పిన్న పెద్ద తారతమ్యాన్ని పాటించరు. అందరు ఐక్యంగా

సమభావంతో ఉంటారు. ఆ పల్లెలో చదువుకునే పిల్లలంతా కూడా పై నియమం తప్పకుండా చేస్తుండటం గమనింప తగిన విషయం. ఆభరణాలు వేరయినా బంగారము ఒక్కటే అయినట్లు ఈ పల్లెలోని భక్తులంతా వేంకటదాసుగారే దేవతగా తమకు భావిస్తున్నారు."మమ్మల్ని తుపాకితో కాలుస్తున్నా మేము మాత్రం వేంకటదాసు గార్ని ప్రార్థించటం కాని, వారి కీర్తనలను మననం చేయటం కాని మానం. ఆయనే అన్ని ఆపదలనుండి మమ్ము దాటిస్తాడు." అనే స్థిరమైన నమ్మకాన్ని ఆ పల్లెవాసులు తమ హృదయాలలో పదిలపరచుకున్నారు.

"మాదిరెడ్డిపల్లి" భజన సమాజంలో "ప్రతిదుర్గయ్య" ఒకరు. వీరు రాకమచర్ల కీర్తనలు పాడటంలో సిద్ధహస్తుడు. ఈయన మూడు దినాలు ఉపవాసం చేయటాని కైనా అంగీకరిస్తాడు కాని నియమవిరుద్ధంగా భజనను మాత్రం వదలడు. ఈయనది గౌండ్ల వృత్తి. ఈ దుర్గయ్య రాకమచర్ల కీర్తనలపై తమ అభిప్రాయాన్ని అనుభవాన్ని వెల్లడించిన విధమిట్లున్నది.

ఎన్ని ఆటంకాలు వచ్చినా, పని ఉన్నా అయినా భజన సమయంలో భజనే చేయాలి అనేది దుర్గయ్య మానసిక నిశ్చయం. ఎవరైనా మరో ఊరికి రాకమచర్ల కీర్తనల భజనకు రమ్మని పిలిస్తే ఎన్ని పనులున్నా మానుకుని పోతారు. భజన సమయంలో మనో నిగ్రహం ఏకాగ్రత పాటించటం ఈయన మతం. ఒకమారు దుర్గయ్యంటే గిట్టనివారు అయనపై అసత్యమైన నేరారోపణ చేశారట. ఆ సమ యంలో వేంకటదాసుని మనసులో తలచుకోవటం తప్ప మరేమీ చేయలేని స్థితిలో ఉన్నాడట. ఫలితంగా తనపై మోపిన నేరాన్ని రక్షక భటులు నమ్మలేదట. అట్లా నమ్మకపోవటానికి వేంకటదాసుని స్మరణయే కారణమంటారు దుర్గయ్యగారు. కాబట్టి వేంకటదాసు కంటే వేరైన దైవం మరియొకటి లేదనేది దుర్గయ్యగారి నమ్మకం. యువకులకు కూడా తాము తలచుకున్న కార్యక్రమాలు నిరాటంకంగా సాగిపోవటం చేత భజనపై ఆసక్తి పెరుగుతున్నదట. భజన చేస్తున్నంత సేపు, కీర్తనలు పాడు తున్నంత సేపూ ఆనందానుభూతిని వీరు ఈ క్రింద తెలుపబడిన క్రమంలో కీర్తనలు గానంచేసి భజన ముగిస్తారు.

"గురుపీఠాయతె నమోనమో శ్రీగురుపీఠాస్థితె నమోనమో
"హరిచరణం అజ చరణం సద్గురుచరణం భవహరణం
"కరుణించినను బ్రోవ్రదెన్నడో నన్ను గారవమున జూచుటున్నడో
"మదిలోన సేవింపరాదా స్వామి పదములు భజియింపరాదా
"ఏరీతి జేసిన నీవే నేడు యుందాక నన్నుబ్రోవరావే.
"ననుగన్న వాడవు నీవె నాగభూషణ నన్నుచేకొనవె
"నమామి వెంకటరమణా సురనారదవందిత చరణా
"రారనందబాల బుధ జనరంజిత వరశీలా
మోహనరూపక రావోయి నాముద్దుల రంగయ్య రావోయి
"రావయ్య శ్రీవాసుదేవా నన్నురక్షించు మహానుభావా
"శరణార్తిని మీ దరిశన మొసగితె మురిసినుతించేదెన్నటికో
"అలసించనేలా నేబిలిచితె అలసించనేలా
"రామయ్య నీవాడనయ్యా ఇంకా సామాన్య వరులానె నన్నాతి సేయ
"ననుబ్రోవ మనసైతెరారా కృష్ణవనజాక్ష లోకోపకారా
"హరిధ్యానంబె పరమపదను సద్గురుని భజించుటె సుఖతరము
"ఏలరాదునీదయా దాసునిమాటయాది రాదేమయా
"గురవ్రిమెక్కడబోయెనయ్యా రారుగుణ మొల్లగంటినయ్యా
"రారనందకుమారనాకోరిక దీరగ
"నీవైన దయజూడవమ్మాలోక పావనీ ననుబ్రోవవమ్మా
"నమ్మితి కృష్ణారామ
"రావయ్యా నాదశరథ నందనా నన్ను రక్షించు సమ్మనబృందా
"ఇంతటలవంతమా ఏమినాతో పంతమో
"కృష్ణారావోయి నినుకోరినానోయి
"దండములివిగో రామ భవ ఖండన తారకనామ
"నీవాడను దేవకీ నందనా
"ఓ రామయ్యా మ్రొక్కెదవేగరారా
"శ్రీరఘునందన రారా ఆశ్రితసముదయమందార

"నీవేర నాప్రాణనాధా
"గురుదేవతానందమూర్తి
"స్వామినాథ శివలింగా
"ఎంత వేడిన దయరాద నీకు
"పాండు రంగ హరి
"హారతులిచ్చెద చూడవే
"ఓ పార్వతీ నాయక మంగళం
"రామనీ దయ

ఈ కీర్తనలన్నీ అచ్చులో ఉన్నాయి. అయినా పుస్తకాపేక్ష లేకుండా వీరు పాడటం విశేషంగా గమనింపతగింది.

"యతిరాజ్ పల్లె" లోని వేంకటదాస భక్త సమాజసభ్యులను కలిసినప్పుడు వారు కీర్తనలపై తెలిపిన అభిప్రాయాలు ఇట్లా ఉన్నాయి. ఈ పల్లెలో గత ముప్పది సంవత్సరాలనుండి భజన నిరాటంకంగా కొనసాగుతున్నదట. ప్రతి శనివారం భజనచేస్తారు. అంతేగాక ప్రతి ఏకాదశి తిథి వచ్చిన రోజున కూడా అది శనివారం కాకపోయినా భజన చేస్తారు. పగలంతా పనిపాటలతో తీరిక దొరకని ఈ పల్లీయులు తీరిక దొరికిన రాత్రి వేళలో భజన చేస్తారు. ఈ పల్లీయుల పూర్వీకులు శ్రావణ మాసంలో ఈ కీర్తనలు పారాయణం చేస్తే పుణ్యం వస్తుందని చెప్పారట. ఆ పెద్దల మాట చద్దిమూట అనే నమ్మకంతో వీరు కూడా శ్రావణ మాసంలో నియమం తప్ప కుండా కీర్తనల పారాయణం నేటికీ కొనసాగిస్తున్నారు. అచ్చులో ఉన్న అయిదు వందల కీర్తనలను ఈ మాసంలో పారాయణం చేస్తార. ఈ మాసం రోజులకు సరి పోయేట్లు కీర్తనలను సమానంగా విభజించుకుని కీర్తనల పారాయణం కొనసాగిస్తారు. ఇట్లా కీర్తనల పారాయణ నియమ పూర్వకంగా పూర్తిచేస్తే ఒక యజ్ఞం చేసిన పుణ్యం వస్తుందనే వారి పెద్దల నమ్మకమే వీరి నమ్మకం.

అట్లాగే ఈ శ్రావణంలో అయిదువందల కీర్తనలకు పారాయణం చేసే శక్తి లేనివారు ఈ మాసం రోజులు రాకమచర్ల కీర్తనలలోని మానసపూజకు సంబంధించిన ఇరువది మూడు కీర్తనలు పారాయణం చేస్తే గీతాపారాయణ చేసిన ఫలితం

వస్తుందట. అంతేగాక నిష్టతో ఈ మాసం రోజులు మానసపూజ కీర్తనలు పారాయణం చేస్తే వేంకటదాసుగారి అయిదు వందల కీర్తనలు పారాయణం చేసిన ఫలితల పొందగలుగుతారనేది వీరి ధృఢ నమ్మకం. దీనిని బట్టి దాసుగారి అయిదు వందం కీర్తనలు ఒక భగవద్గీతతో సమానం అనే అభిప్రాయం ధ్వనించింది. అది దాసుగారి కీర్తనలకు వీరు కల్పించిన హోదాయే।

ఈ అభిప్రాయాన్ని వినగానే మనకు అవైదిక పురాణ ప్రభావం వీరిపై తీవ్రంగా పడింది అనే విషయం తెల్లమౌతుంది. శ్రావణ కార్తీకాది, మాసపురాణాలలో ఇట్టి వచనాలే మనకు గోచరిస్తాయి. గుమ్మడికాయంత బంగారం లేదా అది చేతకానప్పుడు గుమ్మడికాయకు బంగారం ముక్కను గుచ్చి ఈ మాసంలో దానమిస్తే మోక్షాన్ని పొందుతారు అనే (మూఢ విశ్వాసాలు) వచనాలు పై పురాణాలలో కొల్లలుగా చూస్తాము.

వేంకటదాసుగారి కీర్తనల పారాయణానికి యజ్ఞఫలం అని చెప్పటం అజ్ఞానంతో కూడుకున్నమాటే। అసలు యజ్ఞమంటే ఏమిటి? అనే విషయాన్ని వేదోక్తంగా తెలుసుకుని ఉంటే ఆ అభిప్రాయాన్ని వెలిబుచ్చే సాహసంచేసి ఉండరు. అట్లా మోక్ష విషయం, పుణ్య పాప విచక్షణాది విషయాలన్నింటినీ వేదం సవివరంగా వివరించింది. ఈ విషయాన్ని రెండవ ప్రకరణంలో వివరించాను. వైదిక జ్ఞానం లేకపోవటమే ఇట్టి పల్కులకు కారణమౌతున్నది.

''సనాబుపేట"లోని వేంకటదాసు భజన సంఘంలో ''శ్రీ బీర్ల అడివయ్య" ఒక సభ్యుడు. అతనికి చదువురాదు. ఆ భజన సంఘంలో ప్రతి సభ్యుడు ముప్పది మూడు రాకమచర్ల కీర్తనలు భజన సమయంలో చెప్పాలి అనే నియమం ఏర్పాటు చేసుకున్నారు. ఈ నియమం అడివయ్యకు ఇబ్బంది కలిగించింది. అయినా నిరాశ చెందలేదు. చదువుకున్నవారి దగ్గరకు పోయి కీర్తనలను సంత చెప్పించుకుని పట్టుదలతో అడివయ్య నేర్చుకున్నాడు. ఈ కీర్తనలు పారాయణం చేస్తాడు. అందువల్ల అతడికి ఏ కష్టాలు రావటం లేదట. వచ్చినా తేలికగా తొలగిపోతున్నాయట. మనసు వికలమైనప్పుడు అడివయ్య ఈ కీర్తనలు పాడుకుంటాడు. దానితో అతడికి

మనస్థైర్యం కలుగుతుందట. కనుక వేంకటదాసు కీర్తనలతో ఏదో చెప్పలేని మహత్తు ఉందని, అది కాపాడుతూ ఉంటుంది అనేది అతని నమ్మకం.

ఇట్టి మహత్తు రాకమచర్ల కీర్తనలలో ఉన్నదనే నమ్మకానికి ఊతగా శ్రీ అడివయ్య ఈ సంఘటనను తెలిపారు. సుమారు పది సంవత్సరాల క్రితం (నేను సేకరించేనాటికి) జరిగిన సంఘటన ఇది. అది మార్గశిర మాసంలో పౌర్ణమితిథి ఆ రోజు మాణిక్య ప్రభులవారి జాతర జరుగుతున్నది. ఆ జాతరలో భాగంగా మాణిక్య ప్రభువు భజన జరుగుతున్నది. ఆ భజనలో శ్రీ పాటి గోపాలరెడ్డి ఏక ధాటిగా 12 గంటలు కూర్చొని భజన కీర్తనలు చెప్పారు. భజన పూర్తి అయిన తరువాత అతడు లేచి నడవలేక పోయాడు. అది చూచిన ధోబిపేట వాస్తవ్యులు శ్రీ రుద్రారపు నారాయణ రెడ్డి నలుబదియొక్క దినాలు వేంకటదాసుగారి మానస పూజ కీర్తనలు పారాయణం చేస్తేనీకు మేలు జరుగుతుందని శ్రీ గోపాలరెడ్డికి సలహా ఇచ్చారు. ఆ సలహా మేరకు గోపాలరెడ్డి నిత్యం ఒక దీపం ముందు పెట్టుకుని నలుబది యొక్క దినాలు మానసపూజ కీర్తనల పారాయణం పూర్తికాగా అతడు యధావిధిగా నడువగలిగాడు. కనుక వేంకటదాసుగారి కీర్తనలలో ఏదో చెప్పలేని ప్రభావం ఉంది అని నేను నమ్ముతున్నానని అడివయ్య తన దృఢ విశ్వాసాన్ని వివరించారు.

ప్రభావయుక్తమై, గొప్ప అనుభూతిని కలిగిస్తూ ఆపదలో ఆదుకుంటున్న ఈ రాకమచర్ల కీర్తనలు మొదట మార్గశిర శుద్ధ ఏకాదశి లగాయతు పౌర్ణమి వరకు మాణిక్య ప్రభువు జాతరలో పాడుతుండేవారు. అక్కడ నుండి నవాబ్‌పేట, యలిరాజ్ పల్లెలకు ఈ కీర్తనలు భజన చేయటం వ్యాపించింది. ఇట్లా వ్యాపించి సుమారు ముప్పది సంవత్సరాలకు పైబడిన కాలం గడిచింది. నాటినుండి నేటిదాకా అత్యంత భక్తి భావంతో ఈ రాకమచర్ల కీర్తనలు పాడుకుంటూ భజనచేసే పద్ధతి ఆ పల్లెలలో కొనసాగుతున్నది. సుమారు ముప్పది మంది సభ్యులతో భజన మండలులు కూడా ఆ పల్లెల్లో ఏర్పడ్డాయి. సభ్యులలో పిల్లలు కూడా ఉన్నారు. పెద్దలు వెల్లకొండ విఠలయ్యగారు చెప్పిన బాణీలలో ఈ రాకమచర్ల కీర్తనలు పాడుకుంటున్నా మని శ్రీ పర్మతి నాగిరెడ్డి, పోకల నరసింహులు, పరుతొట్టి మాల్‌రెడ్డి, గోపాలరెడ్డి,

నరసింహా రెడ్డి, కృష్ణారెడ్డి, అనంతయ్య, అనంతరెడ్డి, తాత్రిరాజు మొదలైన వారు తెలిపారు.

సంగారెడ్డి జిల్లా "కొత్తగిడి" పరిసర గ్రామాలైన "తేరపోలు, తాగర్‌పల్లి, మల్లేపల్లి, సంగారెడ్డి, కల్పగూరు, అలుగడ్డ, గోపులారం, ఎదురుగూడెం, హరిదాసుపురం, గుంతపల్లి, కిష్టగూడెం, తోడేలు (రాజంపేట దగ్గర) "మొదలైన గ్రామాలలో రాకమచర్ల కీర్తనల భజన మండలులున్నాయి. ఆ భజన మండలులలో ఈ కీర్తనలు అత్యంత భక్తి ప్రపత్తులతో గానంచేస్తారు ఈ సమాజాల పర్యవేక్షణ భారమంతా యువకుడైన "శ్రీ రఘువీరశర్మ" చేపట్టాడు. తనకు కీర్తన భావం తెలియక పోయినా తబలా, హార్మోనియం, మృదంగం, తాళాలు, ఫ్లూట్లు మొదలైన వాద్య సహకారాలతో కీర్తనలు పాడుతూ తన్మయత్వం అనుభవిస్తాడట.

పాలమూరు జిల్లాలో ముగిలి గిద్ద, మస్పూరి, కొందుర్గి, అన్నారం, రాయకల్లు, చౌదరి గూడెం, రావిరాల, రాపోలు, పోల్కంపల్లి, మంచనపల్లి, వేముల "మొదలైన పల్లెల్లో కూడా రాకమచర్ల వేంకటదాసుగారి భజన సంఘాలు ఉన్నాయి. ఒకొక్క భజన సంఘంలో సుమారు ఇరువది మంది సభ్యులున్నారు. ఈ భజన సంఘాలనిక ప్రతిశనివారం హనుమంతుని గుడిలో కార్యక్రమం నిర్వహిస్తారు. ఆ భజనలో రాకమచర్ల వేంకటదాసుగారి కీర్తనలు గానంచేస్తారు. వీరికి సంగీత శాస్త్రం తెలియక పోయినా. రాగజ్ఞానం లేకపోయినా కేవలం కీర్తన ధోరణిని బట్టి ఏదో ఒక పద్ధతిలో కీర్తనలు పాడుతున్నారు. మొగిలి గిద్దలో రాకమచర్ల కీర్తనలపైన నమ్మకం కలిగేందుకు కారణమైన సంఘటన ఇది.

1946 సంవత్సరంలో ఒక రోజున "కక్కునారాయణ" "గాండ్లవీరయ్య" అనేవారు హనుమాన్ల గుడి మీద ఓంకార ధ్వజాన్ని నిలిపారు. ఆ ధ్వజంనిలిపిన రోజు శనివారం. అది చూచిన మహమ్మదీయులు గుడిలో భక్తులమీద దాడి చేశారు. భజన కొనసాగకుండా ఆటంకం కలిగించారు. అచటి భక్తులంతా కలిసి కట్టుగా పట్టుదలతో వారి ఆటంకాన్ని లెక్కజేయకుండా ఇరువది యొక్క దినాలు భజనను కొనసాగించారు. ఇట్లా నియమంతో భజన పరిసమాప్తమైన నాటినుండి భక్తులలో

ఏదో నూతనోత్తేజం కలిగింది. గ్రామస్తులను కలుపుకుని భక్తులంతా మహమ్మదీయులను ఎదుర్కొని పారద్రోలారు. మహమ్మదీయుల బాధలు అనుభవించే వీరికి ఇట్లా నూతనోత్తేజం కలగటానికి కారణం నియమపూర్వకమైన ఇరువది యొక్క రోజుల భజనయే కారణమని అంతా తలంచారు. నాటినుండి వేంకటదాసుగారి కీర్తనలపై వారికి అపారమైన నమ్మకం కుదిరింది. ఆ నమ్మకమే నాటినుండి నేటి వరకు కొనసాగింపచేస్తున్నది.

"భజన రాత్రిపూట 9-30 గంటల నుండి 12 గంటల వరకు చేస్తాము. పని పాటలతో తీరిక చిక్కని మా అందరికి (భక్తులందరికి) రాత్రి సమయంలో భజన చేయటమే అనువుగా ఉన్న సమయం. భజన పూర్తికాగానే ప్రసాదం తీసుకుని ఇళ్ళకు చేరుతాము. దీనివల్ల మాకు మానసిక నిర్మలత్వం లభిస్తున్నదని" మొగిలిగిద్ద వాసియైన గాజుల శివప్ప అనే వృద్ధుడు భజన పద్ధతిని, దానివల్ల పొందుతున్న ప్రయోజనాన్ని వివరించారు.

"చౌదరిగూడ, రాప్రోలు, తొండపల్లి, చిట్యాల, చిటిగిద్ద, కొల్లూరు ముతరాసి పల్లె, టేకులపల్లె" మొదలైనవన్నీ కొందుర్గి సమీప పల్లెలు. ఈ పల్లెలు అన్నింటిలో సుమారు ముప్పది సంవత్సరాల నుండి రాకమచర్ల కీర్తనలు పాడుతున్నారు. వీరికి శాస్త్రీయ సంగీతం తెలియని కారణంగా కీర్తనలు సశాస్త్రీయంగా పాడలేకపోతున్నారు. అయినా కీర్తనలపై ఉన్న ఆసక్తి కొద్దీ ప్రస్తుతం జన సామాన్యానికి అందుబాటులో ఉన్న సినిమాపాటల బాణిలలో కీర్తనలు పాడుతున్నారు. "కదలానివ్వను చూడరా" (రా. వేం. కీ. 1930-31 పే) మొదలైన గురుకీర్తనలు పాడేప్పుడు వారికి కలిగే అనుభూతి అనుభవించాల్సిందే కాని మాటలతో చెప్పలేరట. రాకమచర్ల కీర్తనలు పాడటంవల్ల భగవంతుడు ప్రత్యక్షమైనాడు అనే తలంపు, అనుభవం వారికి మిగులుతున్నదట.

"రాకమచర్ల వేంకటదాసుగారి కీర్తనలు భగవన్నామ స్మరణతో నిండి ఉన్నాయి. కీర్తనలలో ఉన్న రామకృష్ణ శబ్దాల మాహాత్మ్యమే ఈ కీర్తనల విస్తృతికి కారణం "తారకనామం తలుద్దాం తాపత్రయంబులు గెలుద్దాం" (రా.వేం.కీ. 74 పే).

అనే వేంకటదాసుగారి నినాదమే జనులను ఉత్తేజపరచి వారి కీర్తనలయెడ మక్కువను పెంచుతున్నది" అంటూ వేముల నివాసి శ్రీమతి శంకరమ్మ తెల్పిన ఈ కీర్తనను పరిశీలిద్దాం.

"తారకనామం దలుతాం దలుతాం
తాపత్రయంబుల గెలుతాం గెలుతాం
వారి వీరి చంతజేరాగ మనకేల
నేరుపుతో హరిని జేరి బజింపుచు ॥తా॥ ॥ప॥
కామాది గుణమూల విడుతాం విడుతాం
పామరంబులనెల్ల గడుతాం గడుతాం
వేమూరి హరినామ మూహించి మదిలోన
రామరామ సీతారామ హరేయని ॥తా॥
మదమత్సరము లేక నిలుతాం నిలుతాం
మాధవ రమ్మాని పిలుతాం పిలుతాం
పదిలంబుగా బుద్ధి కుదురుపరచుకోని
వదలాని వైరాగ్యమొదవి చిత్తములోన
సుంధరాకారుని కందాం కందాం
మందార కారుని కందాం కందాం
మందారధరు కథ విందాం విందాం
అందాముగా మోదయందియే వేళలో
పొంది బ్రహ్మానందమొంది నిశ్చయముగ ॥తా॥

ఇట్లా నడచిన ఈ కీర్తన వేంకటదాసుగారి భక్తిమార్గానికి, భజన పద్ధతికి నిదర్శనంగా ఉంది. ఇది వేములపల్లెలో నెలకొన్న హరి మీద చెప్పిన కీర్తన అని ఈ కీర్తనలోని మొదటి చరణంవల్ల తెలుస్తున్నది. ఇందులో శ్రవణాసక్తి, స్మరణాసక్తి అనే వైష్ణవ భక్తిమార్గాలు తెలుపబడి ఉన్నాయి. "కామాది గుణమూల

విడుతాం, పామరంబులనెల్ల (అజ్ఞానం) గడుతాం, మదమత్సరములు లేక నిలుద్దాం మొదలైన వాక్యాలు జనులకు ఉపదేశదాయకంగా ఉన్నప్పటికి వాటిని సాధించేందుకు చెప్పిన హేతువు సరియైందికాదు. "వేమూరి హరినామ మూహించి మదిలోన సుందరాకారుని కందాం"

పైన తెలుపబడ్డ పల్లియుల అభిప్రాయాలను పరిశీలనా దృక్పథంతో చూసినపుడు

"ముద్దు ముద్దుగ ముచ్చటలాడు నావద్దకి రారా హరి నేడు
(రా.వేం.కీ. 1930-4 పే)

"రార శ్రీరామకృష్ణ రార (రా.వేం.కీ. 1930-3 పే)

"రాని కారణమేమిరా - నేగిలచితె రాని కారణమేమిరా
(రా.వేం కీ. 1930 11 పే)

"మూడు దినములాయె ముద్దుల కృష్ణ నా తోడ మాటాడకనూ
(రా.వేం.కీ. 1930-19 పే)

"ఎన్నాళ్లైనా నిన్ను కన్నుల జూడకయున్నాన రఘునందనా
(రా.వేం.కీ. 1930-76 పే)

"ముద్దు రామచిల్కావె - ముందు నాతో పల్కావె (రా.వేం.కీ. 1930.105 పే)

"ఏల మాటాడవె ఓ రామయ్య అంతకఠినూడవె (రా.వేం.కీ. 1930-106 పే)

"నిన్నుజూడక మనసోపదె నేడు నాజత గూడవే (రా.వేం.కీ. 1930-116 పే)

"మంచిది రార మాట్లాడర - నెనరుంచి నన్నేలు నీవాడరా
(రా.వేం కీ. 1930-153 పే)

"మాటాడవేలాయనా - శ్రీహరి నన్ను మన్నించి దయజూడుయరా
(రా.వేం.కీ. 1930-163 పే)

ఇట్టి వేంకటదాసుగారి కీర్తనలను ఆసరాగా తీసుకుని వారి అనుయాయులు వేంకటదాసుగారు మహిమాన్వితుడని దేవుడి ప్రతిరూపమని గోరంతలు కొండంతలు చేసి చెప్పిన ప్రచార వాక్యాలే పల్లీయులపై వారి జీవనంపై కీర్తనలు ఇట్టి ప్రభావానికి కారణం అనిపిస్తున్నది. పల్లీయులను కలసినపుడు ఏ ప్రాంతంలో ఉన్న పల్లీయులైనా వేంకటదాసుగారి మీద వారు చెప్పిన అభిప్రాయం ఒకే రకంగా ఉం "వేంకటదాసుగారు దేవుడు. ఆయనకు భగవద్దర్శనం అయింది. ఆయన రోజూ భగవంతునితో ఒక్కసారైనా మాట్లాడుతాడు. ఏదన్నా కోపంతో భగవంతుడు కనపడని నాడు అతడు తల్లడిల్లి పోతాడు. ఆ భావం వారి ముఖ కవళికలలో కనబడుతుంది. అప్పుడప్పుడు ఈరోజు భగవద్దర్శనం కాలేదు అని కూడ అప్రయత్నంగా పైకి అనేవారు. అందుకు "పిలిచిన రావుగదె శ్రీనివాసుదేవ" (రా.వేం.కీ. 1930. 157 పే) మొదలైన కీర్తనలు సాక్ష్యంగా ఉన్నాయి. వారు అవతార పురుషులు. ఈ విషయాలన్ని వారి కీర్తనలలోనే ఉన్నాయి." అని భ్రాంతిమూలకం, అజ్ఞానపూరితంగా ఉన్న ఇట్టి పల్లియుల పల్కులకు పైన ఉదహరించిన కీర్తనలు, ఆ కీర్తనలు ప్రచారం చేసిన దాసుగారి అనుయాయుల పల్కులు అనటంలో సందేహముండదు కీర్తనలలో ఏమి చెప్పబడిందో తెలుసుకుని వివేచించే జ్ఞానం లేని పల్లీయులు ప్రచారకుల ప్రలోభాలకు లోనై ఈ కీర్తనల ప్రభావానికి లొంగి పై విధమైన చిలకల పల్కులు పల్కుతున్నారు అని చెప్పటానికి సందేహించ నక్కరలేదు.

అంతేగాక "గుర్రమెక్కడబోయెనయ్యా రామగుణమెల్లగంటినయ్యా" (రా.వేం.కీ. 1930. 178 పే) మొదలైన కీర్తనలు ఆయన మహిమను వెల్లడిస్తున్నాయని లేకపోయినవేంకటదాసుగారి గుర్రం వారు కీర్తన పాడంగనే రావటం జరిగిందనే ప్రచారకుల అసత్యాలు పల్లీయుల అమాయకపు హృదయాలలో హత్తుకున్నాయి. అందువల్లె కీర్తనలు పాడి భజన చేసినందువల్లే పోయిన బర్రె దొరికింది, నాకు ఆపదలు తొలగిపోయాయి, మొదలైన అభిప్రాయా పల్లీయుల మస్తిష్కంలో స్థిరపడ్డాయి. ఏదేమైన పల్లీయుల మానసికతత్త్వానికి అనుగుణమైన ఘట్టాలు, పదాలు, ఆర్తి, ఆవేదన, పద్ధతులు వేంకటదాసు గారి కీర్తనలలోని నిండుగా ఉన్నాయి. పల్లీయులపై తమ ప్రభావాన్ని నిలుపుకుంటున్నాయి.

## కీర్తన పాడటంలో పల్లీయుల కట్టుబాట్లు

రాకమచర్ల కీర్తనలకు ప్రభావితులైన పల్లీయులకు భజనలో కీర్తనలు పాడే విధానంతో దాసుగారి ప్రచారకులు కొన్ని కట్టుబాట్లను కూడా తెలిపారు. వాటిని విడువకుండా పల్లీయులు అనుసరిస్తున్నారు. వరసతప్పి కీర్తనలు పాడితే ఏమవుతుందో అనే భయం పల్లీయులలో ఉంది. కనుకనే భయం నుండి భక్తి జనిస్తున్నది" (వ.ప్ర.జీ. 9 పే) అనే శ్రీ రఘుమన్నమాట యదార్థమనిపిస్తున్నది. ఇప్పుడా కట్టుబాట్లను తెలుసుకుందాం.

"వెల్లకొండనివాసులు" విఠలయ్య గారి కుమారుడు ప్రస్తుత వేంకటదాసుగారి మఠాధి పతి అయిన గోవిందయ్య గారికి అల్లుడు అయిన జోశిరామకృష్ణ పంతులును "తమ్మళి విఠలయ్య" గార్లను కలిశాను. వారు తమ అనుభవంద్వారా కీర్తనలను ఉపాసించేందుకు అనుసరిస్తున్న కట్టుబాటును లేక నియమాన్ని తెలిపారు. దాని సారాంశమిది. సుమారు ఇరువది సంవత్సరాల క్రితం రెండో ఝామున కలలో సన్యాసి రూపంలో నలుపురంగు కలిగి, కాషాయ వస్త్రాలు ధరించిన వ్యక్తి వచ్చి విఠలయ్య గారికి పాండురంగని విగ్రహం, రాకమచర్ల కీర్తనలపుస్తకం ఇచ్చి పారాయణం చేయమని చెప్పి అదృశ్యమయ్యారట. తరువాత కొంతకాలానికి శ్రీ విఠలయ్యగారు అప్రయత్నంగా పండరి పోయి పాండురంగని విగ్రహంకొని తేవటం జరిగింది. ఈ సంఘటన తరువాత నాడు కలలో కనిపించిన వ్యక్తి వేంకట దాసు గారేనని విఠలయ్య గారు నిశ్చయించుకున్నారు. నాటి నుండి కలలో వేంకట దాసు గారు సెలవిచ్చిన కట్టుబాటు ప్రకారం విఠలయ్యగారు ప్రతిరోజూ క్రమం తప్పకుండా కీర్తనలు పారాయణం చేస్తున్నారట. ఇట్లా చేసినందువల్ల ఆయనకు ఇల్లు భూమి వసతులు కలిసి వచ్చాయట. ఇది ఆయన నమ్మకం. ఆయనకు కలలో కీర్తనల పారాయణ విషయంలో తెలిపిన కట్టుబాట్లు ఇవి.

1. ఏ పరిస్థితి ఎదురైనా రోజూ కీర్తనల పారాయణం పూర్తి అయేంత వరకు భోజనం చేయరాదు.

2. ప్రతిరోజూ క్రమంతప్పకుండా ఆరులేక పన్నెండు కీర్తనలు పారాయణం చేయాలి.

3 పారాయణం ప్రారంభించె ముందు "శ్రీ గురుసత్యశీలవర శిష్యగుణ స్తుతపాల" "సద్గురుచరణం సరోజం సాంద్రసీలారాంబుదాభం" "గురుర్బ్రహ్మగురుర్విష్ణుః" అనే శ్లోకాలు చదవాలి.

4. అనంతరం వరుసగా అరులేక పంద్రెండు కీర్తనలు పాడి భజన ముగించాలి ఒక కీర్తన పాడిన అనంతరంనామ భజన నాలుగు సార్లు చేయాలి. ఆ పండ్రెండు కీర్తనలు కీర్తన తరువాత చేయవలసిన నామం ఈ క్రింద తెలిపిన విధంగా ఉండాలి.

1. కీ॥ గురువీరాయుతెనమోరమో ॥గురు స్తవకీర్తన॥
నామం॥ జగద్గురో హరిజగద్గురో

2. కీ॥ హరి చరణం భవ చరణం
నామం॥ భజనశాయరే రాములది మనలాజా రామచంద్రులది. ,,

3. కీ॥ శివదేవా మహానుభావ
నామం॥ శంభోమహాదేవ - శంకర మహాదేవ ।మనోబోధ।

4 కీ॥ మనసా శ్రీహరిని బిలువుమా
నామం॥ జై జై రామకృష్ణ - రామరామ జైహరి ,,

5. కీ॥ నారాయణ నీనామము నాపడి నాటి
నామం॥ నారాయణ దీనదయాళో - భజమనరాదే గోవింద

6. కీ॥ ఏదయా రామ నీదయా కోదండపాణీ
నామం॥ మహాపరాధిని మహాప్రభో
సర్వాపరాధిని మహా ప్రభో ।పాండురంగ కీర్తన।

7. కీ॥ పాండురంగ శ్రీవాసుదేవ
నామం॥ పండరినాథా - పండరి జైజై ,,

8. కీ॥ రామకృష్ణ జోజో - రామచంద్ర జోజో
నామం॥ హరే రామకృష్ణా - గోవిందా రామకృష్ణ హరె

9. కీ॥ యోగానంద మనోజ్ఞ భావమున బాగుగ నిల్వతె (అధ్యాత్మకీర్తన)
నామం॥ యోగానందం బ్రహ్మానందం

10. కీ॥ వందనమయ్యా రామ వందిత సుత్రామా (వంద కీర్తన)
నామం॥ రుక్మాయి చంద్రభాగా

పుండరీకా పాండురంగా

11. కీ॥ నిర్వికార బ్రహ్మ (మంగళ హారతి)

12. కీ॥ జయ మంగళం నిత్య శుభ మంగళం ,,

ఇందులో సంక్షిప్త భజన పద్ధతికూడా ఉంది. దాని స్వరూపమిది. ముందు పైన తెలిపిన శ్లోకాలు చదివి "జైజై రామకృష్ణహరే" అనే నామాన్ని స్మరించాలి. అనంతరము గురుప్రార్థన, మనోబోధ, ఆవాహన, పాండురంగ, ఆధ్యాత్మ, వందన కీర్తనలు చదివి హారతితో ముగించటం.

మాదిరెడ్డికి చెందిన పల్లీయులు రాఃమచర్ల కీర్తనల విషయంలో చేసుకున్న కట్టుబాటును ప్రసంగవశాన ఈ ప్రకరణంలో సమ్మేళాలు అనే శీర్షికలోనే తెలిపాను. ఇచ్చటవారు వేంకటదాసు కీర్తన భజన విషయంలో ఏర్పరచుకున్న నియమ (ఖరారు నామా) ప్రతిని జతపరుస్తున్నాను.

యతిరాజుపల్లె పల్లియులు కీర్తనలు పారాయణం చేసేముందు వేంకటదాసు గారి పటం, పండ్లు, పూలు, అగరవత్తులు, పన్నీరు, విడియం, అత్తరు, ఒక సెల్ల సమకూర్చుకుంటారు. సెల్లాను పరచి దానిపై వేంకటదాసుగారి చిత్రపటాన్ని ఉంచి 108 దీపాలు వెలిగిస్తారు. అనంతరం నియమం ప్రకారం కీర్తనల పారాయణం చేస్తారు. మానసపూజ కీర్తనలు పారాయణానికి సంబంధించిన విషయాన్ని సమ్మేళాలలో తెలిపాను. ఈ మానసపూజ కీర్తనలు పారాయణం చేసినంతకాలం జాతి కాపేక్ష లేకుండా నిష్టగా వేంకటదాసుగారి చిత్రపటానికి పంచామృత స్నానం చేయించాలట. పారాయణం ప్రారంభించే రోజున భజన బృందం గ్రామస్థులందరితో కలసి భోజనం చేసి పూజ ప్రారంభించాలట. "పూజలాయెరే మానసపూజ లాయెరె" (రా.వేం.కి. 1930-29పే) అనే కీర్తనతో పూజ పరిసమాప్తి చేయాలట. ఇది మానస

పూజా విషయంలోని కట్టుబాటు. ఈ కట్టుబాటులోని షోడశోపచార పూజా విధాన మంతా అవైదిక పురాణ ప్రభావమే

మొత్తం మీద వేంకటదాసుగారు అవైదికమైన పూజా విధానాన్ని, నామభజన పద్ధతులతో మత సంబంధమైన భక్తి మార్గాన్ని ప్రజలకు బోధించి, తానను సరించి పజల చేత ఆచరింపచేశారు. జనులకు, కీర్తనకారులు సత్యమైన వైదిక జ్ఞానం అందించితె అసలైన మేలు జరిగేది.

పూజశాయరె మానసపూజశాయరె ॥ప॥

1. పూజశాయరయ్య భక్తిబూనియోగమునను
రాజతేజుడైన శ్రీరామచంద్రుని పదముమదిలో ॥పూ॥

2. స్నాన సంధ్యశీతల జలముదానధర్మ క్రతువు
వ్రతము పూని సుకృతియేమిగాననగును దీనివలన ॥పూ॥

3. చెడుగు మంత్రయంత్రతంత్రజ్వర పిశాచనరుల బాధ
బడుగురోగచోరశత్రుబంధనముల దొలగజేయు ॥పూ॥

4. పలుధనంబులు భాగ్యమాయువు చెలగుకీర్తి
పరమసుఖము వెలయనొసగి రాకమచర్లనిలయుడెపుడు ॥పూ॥

5. వెరపుమరపు లేక మనసు హరికి పరవశముగ జేసి
గురునికృపను వేంకటదాసుడరని మీకు సేవజేయ ॥పూ॥

ఈ కీర్తనలోని రెండవ చరణంలో చెప్పిన విధంగా పూజావిధానాన్ని ఆచరించేందుకు పూజశాయరే మానసపూజ శాయరే అంటు జనులను పురమాయించారు. అందలి మూడు నాలుగు పాదాలలో పూజయొక్క ఆచరణ వల్ల కలిగే ప్రయోజనాలను చెప్పి ప్రజలకు ఆశచూపారు. సహజంగా శక్తులు, అమానుషశక్తుల, యెడనమ్మకం గలిగి ఉన్న పల్లీయులను ఈ పూజావిధానంతో అమితంగా

అకర్షించారు. ఆదే అదనుగా మానపూజ విధానానికి సంబంధించిన ఇరువది మూడు కీర్తనలలో షోడశోపచార పూజా విధానాన్ని కూడా ప్రజలపై రుద్దారు. దేవతా పూజలతో మైమరచే స్వభావంకలిగిన పల్లీయులు వేంకటదాసు గారి ప్రభావానికి పూర్తిగాలొంగిపోయారు. ఆ కీర్తనల మత్తులో తమకోర్కెలు నెరవేరుతున్న కారణం ఈ కీర్తనలే అని కలవరింతలు ప్రారంభించారు. నాటికీ నేటికి పల్లీయులు ఈ కలవరింతల ప్రవాహంతోనే కీర్తనలు బ్రతికి ఉన్నాయి.

అంతేగాక అమాయకులైన పల్లీయుల ఆటపాటలకు సన్నిహితంగా ఉన్న భజన మార్గాన్ని కూడా ప్రవేశపెట్టి వారి ఉత్సాహాన్ని రేకెత్తించారుదాసుగారు,

భజనశాయుగ బూనినాను—శ్రీరామనామా భజనా ॥ప॥

భజియించెద దుర్భవమును దొలుగగ
సుజనసంఘములు సొంపున వహింపగ ॥భజ॥

విఘ్నభేదయివమాని దలచే సద్గురునిగొలచీ
విమలావయిరాగ్యమూననిలచి తృష్ణతీరా
ననతోయజలోదన కృష్ణకృష్ణ శ్రీకృష్ణాతునినే ॥భజ॥

దాసాభావాము మదిలోన నమ్మి
కాకామచర్లవాసూని యందు మనసుగుమ్మి
వాసిగననుదయజేసి బ్రోవగల
వాసుదేవ శ్రీవాసుదేవయని ।భజ॥

(రా.వేం.కీ. 1930, 33 పే)

వేంకటదాసుగారు భజన చేయటానికి పూనుకున్న కారణమేమిటో ఈ కీర్తనలోని చివరి చరణం తెలుపుతున్నది. భక్తి మార్గంలోని భజన పద్ధతిని చేపట్టారు దాసుగారి పూర్వీకులు వైష్ణవ మతస్థులని రెండవ ప్రకరణంలో తెలిపాను వారిమార్గంలోనే వంశానుగతంగా వచ్చిన మతాచారాన్ని దాసుగారు కూడా అనుస రించారు.

ఇప్పుడు సమకాలీన కీర్తన కారులపై వేంకటదాసుకీర్తనల ప్రభావాన్ని దిఙ్మాత్రంగా సూచిస్తాను.

### సమకాలీన కీర్తనకారులపై వేంకటదాసు కీర్తనల ప్రభావం

### మన్నెంకొండ హనుమద్దాసు :

శ్రీమన్నెంకొండ హనుమద్దాసు, శ్రీవేపూరి హనుమద్దాసు అనే ఇద్దరు కీర్తన కారులు వేంకటదాసు సమకాలికులు. మన్నెంకొండ హనుమద్దాసు, రాకమచర్ల వేంకటదాసుల మధ్య కృష్ణాష్టమి రోజున జరిగిన సంఘటనను ఐదవ ప్రకరణంలో తెలియజేస్తాను. ఈ ప్రస్తావన వల్ల వీరిరువురు సమకాలికులే అనటంలో సందేహం లేదు. "మన్నెంకొండ హనుమద్దాసు కీర్తనలు" అనే పుస్తకంలో వేంకటదాసు అనే వ్యక్తి హనుమద్దాసులవారికి శిష్యుడైనట్లు చెప్పబడింది. అతడే రాకమచర్ల వేంకట దాసు అనే అపోహ కొందరి ద్వారా విన్నాను. కాని అది అపోహమాత్రమే అని స్పష్టముచేస్తున్నాను. రాకమచర్ల వేంకటదాసుగారిది ములగర వంశం. హనుమద్దాసుల వారికి శిష్యుడైన వేంకటదాసుది పూధత్తు వంశం. రాకమచర్ల వేంకటదాసు జన్మించిన గ్రామం పెద్దాపురం. అది అచ్చంపేట సమీపంలో ఉంది. హనుమద్దాసు జన్మించింది నందివడ్డమాను గ్రామం. ఇది నాగర్ కందనూలు సమీపంలో ఉంది. ఈ సమా చారం వల్ల హనుమద్దాసు శిష్యుడు రాకమచర్ల వేంకటదాసు కాదని గ్రహించాలి. "అటు జూచిన గురుడటుగానబడునే" (శ్రీ.మ.హ.చ. 1965 ప్ర. 91 పే) అనే కీర్తనలోని "భాసూర వేంకటదాసూని హృదయానివాసుడయిన హనుమద్దాసు వరదుడిందు" అనే చివరి చరణం వల్ల హనుమద్దాసుకు వేంకటదాసు శిష్యుడైనట్లు తెలుస్తున్నది.

ఈతనిది ఆశహరి వంశం. కృష్ణాంబ వేంకయ్యలు ఈతని తల్లి దండ్రులు. మన్నెంకొండలో వేంకటేశ్వరుని ప్రతిష్ఠించిన ఆశహరికేశవయ్య గారి మనుమడే మన్నెంకొండ హనుమద్దాసు. వీరిగురువు బంగారు భావనాచారులు. తాతగారు ప్రతి ష్ఠించిన మన్నెంకొండ వేంకటేశుని ఆరాధిస్తూ భక్తితో కూడిన భజన పద్ధతిలోనే ఈయన కీర్తనలు రచించారు. మన్నెంకొండను అభివృద్ధి చేసేందుకు పాటుపడిన

వ్యక్తి. అందుకే ఈతనికి మన్నెంకొండ హనుమద్దాసు అనే పేరు స్థిరపడి ఉంటుంది.

వేంకటదాసు కీర్తనల ప్రభావం ఏరి కీర్తనలలో ఎట్లా ప్రతిబింబించిందో గమనిద్దాం.

వేంకటదాసు వలె ఈతడు కూడా తన దైవమైన వేంకటేశుని ఆర్తితో ఆరాధిస్తూ కీర్తనలు రచియించి గానంచేశాడు. ఈ కీర్తనలలోని పోలికను గమనించండి.

"ఏమిశాయ దలచినావురా నీమానసమున
ఏమిశాయవలచినావురా ।ప।
(రా.వేం.కీ. 1960 ప్ర. 17 పే)

అంటూ "కోరినిన్ను జేరివేమారు వేడుకున్నగాని గారనంబు అంటూజేసి నన్ను జేర రావికేమందు" న్న రాకమచర్లేశుని ఆర్తితో ప్రశ్నిస్తున్న ఈ కీర్తన రాకమచర్ల వేంకటదాసుది. దీనిని పోలి ఉన్న హనుమద్దాసు కీర్తన చూడండి.

"ఏమిశాయూదలాచినానోకో
శ్రీరామరామయేమిశాయదలచినావాకో ।।ప।।
(శ్రీ.మ.వా.భ. 1965 ప్ర. 127 పే)

అనే కీర్తనలో తనువు మనము ప్రాణములును తగనీకు ధారజోమినవి సేయుచున్న దాల మమతతో ననుబ్రోవుమనుచు. ఈతడు ఆర్తితో మన్నెంకొండ వేంకటేశ్వరుని వేడుకున్నాడు.

రామనారాయణ రామనారాయణ
రామశ్రీవైకుంఠధామ నారాయణ ।।ప।

వామనశ్రీధర వసుదేవనందన
కామితార్థ ప్రదాత స్వామి నారాయణ ।।ప।।

రక్షితాఖిల మహాధ్యక్ష విరూపాక్షసుత
రక్షించవయ్య ప్రత్యక్ష నారాయణ ॥ప॥

(రా.వేం.కీ. 1980 ప్ర. 47 పే)

అంటు వేంకటదాసు రాకమచర్లేశుని యేబది రెండుచరణాలతో స్తుతిస్తే

పాహినారాయణ పాహినారాయణ
పాహిభద్రాద్రి వైదేహ నారాయణా ॥ప॥

శ్రీమద్రమారయణ కామితార్ధప్రద
జ్యామాభురామజయరామ నారాయణ ॥పాహి॥

వేదాంతవేద్య నీపాదములు నామదిని
పాదుగానిల్పునిష్యేద నారాయిణా ॥పాహి॥

అంటూ హనుమద్దాసు భద్రాద్రి వాసుని నూట ఇరువది ఐదు చరణాలతో స్తుతించారు. ఇరువురును "పాహిరామప్రభో - పాహిరామప్రభో" అన్న భద్రాచల రామదాసు కీర్తనకు ప్రభావితులైనట్లు ఈ కీర్తనచే చెప్తున్నాయి.

"చెలియరో పోవే శ్రీహరినిందు పిలుచుకరావే ॥ప॥

పలుమారు హరి పాదజలజాయుగళాము
తలచినా బుద్ధితాళవశముగాదు ॥చెలి॥

రా.వేం.కీ. 1980 ప్ర. 3 పే)

అనే వేంకటదాసు మనోబోధ కీర్తనకు ఛాయగా ఉన్న ఈ హనుమద్దాసు కీర్తన తిలకించండి

"జలజాక్షి పోవే మన్నెంకొండ నిలయునిదేవే ॥ప॥

పలుమారు హరిపాదపంకజములు మదిని
దలచి తలిచి యింక తాళవశముగాదు ॥జల॥

(శ్రీ.మ.హ.కీ. 1965 ప్ర, 73 పే)

అట్లే

"సీతారామదాసులాను చేరేవారమూ
భజనజేసేటి పుణ్యాత్ములానుగోరినారమూ ॥ప॥
గట్టుదెలని గుణములన్ని గోసినారమూ మేము
పట్టువిడువరానిపనులు బాసినారము ॥సీతా॥

(రా.వేం.కీ. 1980 ప్ర. 73 పే)

అనే కీర్తనకు ఛాయగా ఈతడు

శ్రీరాములాల భజనేమేము సేవించేటి వారమూవా
భారాముద్దై వాముదేయని భావించేటి వారము ॥ప॥
పరమాత్ముని నామామృతమది పఠించే వారము
పరమానందంతోడూత నిర్భయమెందినవారము ॥శ్రీరా॥

(రా.మ.హ.చ. 1965 ప్ర. పే 75)

అంటూ తమవైష్ణవాభిమానాన్ని గొంతెత్తి చాటారు. వేంకటదాసు గురుస్తవ కీర్తనలను బోలిన కీర్తనలతోనే ఈతడు కూడా గురుస్తుతిచేశాడు. పరిశీలించండి.

"గురుమహరాజ గురుమహరాజ
పరబ్రహ్మ సద్గురు మహరాజ ॥ప॥

(రా.వేం.కీ.)

1. "గురుమహరాజ దయానిధె సద్గురు మహరాజ దయానిధి ॥ప॥

1. అంతరంతరాద్యంత ప్రబోధిత
అఖండతేజ దయానిధే ॥గురు॥

2. మంత్ర తంత్రి తన్మంత్ర ప్రకాశిత
మంత్రాధారాదయనిధే ॥గురు॥

3. స్థూల సూక్ష్మ ప్రణవాలయ తేజం
బాలబ్రహ్మందయానిధే ॥గురు॥

(శ్రీ.మ.హ.భ. 1965-14 పే)

2. "గురుమహరాజ గురుమహరాజ
గురుమహరాజ గురుమహరాజ ॥ప॥

1. నిరుపమ నిర్గుణ శికరసదానంద
భరితదయానిధే గురుమహారాజ ॥గురు॥

2. మండిత మణిమయకుండలధరబుధ
మండలవినుత సద్గురు మహరాజ ॥గురు॥

(శ్రీ.మ.హ.చ. 1965.101 పే)

ఇంతేగాక

చూడబోదమురావే చిత్తమా హరిని
వేడుకదర్శింపత్తమా ॥ప॥

అనే వేంకటదాసు మానసపూజలోని మనోబోధ కీర్తనను అనుసరిస్తూ

"గురుపూజ శేతామా చిత్తమా భక్త
వరదూనిదూని జూతామా చిత్తమా ॥ప॥

హరిరామయందామా చిత్తమా మన
ఆత్మలోగందామా చిత్తమా ॥గురు॥

పూలు పత్రియును దెచ్చి చిత్తమా
గురునిపూజ గావింతావా చిత్తమా ॥గురు॥

అంటూ హనుమద్దాస గురువునకు ఈ కీర్తనతో మానసపూజను గావించాడు.

"గురు వీరాయతె నమోనమో శ్రీ
గురు వీరాయతె నమోనమో ॥ప॥

(రాం.వేం.కీ, 1980-44పే)

అంటూ వేంకటదాసు గురుస్తవం చేసిన కీర్తనను అనుకరిస్తూ హనుమద్దాసు

"నారాయణతె నమోనమో హరి
నాద బ్రహ్మణె నమోనమో ॥ప॥

1. నాదబిందు కళనటనా తేజం
నాశికాగ్రగతిబిస విరళబీజం ॥నారా॥

2. సాంఖ్యతారక సుస్వాతీతం
సగుణ నిర్గుణాసాక్షి స్వరూపం ॥నారా॥

అంటూ నారాయణుని స్తుతించారు. (శ్రీ.ము.హా.చ. 1965-16 పే)

ఇట్లా హనుమద్దాసు కీర్తనల అడుగుజాడలు కనిపిస్తున్నాయి.

## వేపూరి హనుమద్దాసు

రాయచూరు జిల్లా (ప్రస్తుతం మహబూబ్‌నగర్) కల్వకుర్తి తాలుకాలోని వేపూరు గ్రామంలో జన్మించారు ఈ హనుమద్దాసుగారు. బాలమ్మ, అచ్చన్నలు వీరి తల్లిదండ్రులు. వీరి పితామహుడు తెప్ప రామన్న. ఆయన భక్తి వలనడు సంగీత శాస్త్ర పరిజ్ఞానము గ్రహించాడు. వారివల్లనే ఈ హనుమద్దాసుగారు సంగీత జ్ఞానాన్ని పొందాడు. వేపూరి నర్సింభట్లగారి కుమారుడు వెంకయ్య దగ్గర ఛందో వ్యాకరణాది శాస్త్ర విద్యలను అభ్యసించారు. అని "శ్రీవేపూరు హనుమద్దాసు

కీర్తనలు" అనే పుస్తకంవల్ల తెలుస్తున్నది. వీరు శారదరామాయణం, గీ
కృష్ణలీల, రామమూర్తి శతకం. బొబ్బిలి బుర్రకథ, పుత్రకామేష్టి
పాటలను వ్రాసినట్లు "సంకీర్తన కవులు వేపూరు హనుమద్దాసు" అ
13-4-1981) లింగమూర్తిగారి వ్యాసంవల్ల తెలుస్తున్నది.

గరీబువాడను మహారాజా పరాకునలదిక మారాజా
గరీబువాడను గలీజుమాయలో
ఖరాటుసేయక ధరాతలము బహు

(వే.హ.కీ. 1

అనే కీర్తనవల్ల ఈయన పేదరికంలో ఉన్నట్లు తెలుస్తున్నది వేం
కూడా పేదరికాన్ని అనుభవిస్తూ రాకమచర్లేశుని ఆశ్రయించి కీర్తనలు
ఈ హనమద్దాసుగారు కూడా పేదరికంలోనే వేపూరి హనుమంతుని ఆరాధి
వ్రాశారు. అంతేగాక వేంకటదాసు వలె వీరును సంచారం చేసేవారట
చేస్తూనే నవాబుపేటలో మరణించారట. ఇది విదురుపురి జీవన విధాన
పోలిక. హనుమద్దాసుగారు సుమారు 95 సంవత్సరాలు జీవించారు. వీరి
కాలం తెలియలేదు, శాలివాహన శకం 1854లో అంటే క్రీ.శ. 1932లో
గద్వాల మహారాణి ఆదిలక్ష్మిదేవి సహాయంతో అచ్చు వేయింపబడ్డాయి.
160పే) ఈ సమాచారంవల్ల రాకమచర్ల వేంకటదాసు మరణ కాలానికి
ద్దాసుగారు యవ్వన వయస్కులై ఉండవచ్చునని ఊహింపవచ్చు.

ఇట్లా సమకాలికులవటం చేత ఈ హనుమద్దాసు కీర్తనల మీద వే
వారి ప్రభావం కనపడుతున్నది. వేంకటదాసువలె హనుమద్దాసుకూడ
భక్తిని, భజన మార్గాన్ని అనుసరించారు శైవ వైష్ణవ భేదాన్ని
పాటించనట్లై హనుమద్దాసు కూడా "రామా దీనజనావనా" (వే.హ.కీ. 31
నీనామమెంతరుచిరా - ఓరామ నీనామమెంతరుచిరా" (వే.హ.కీ.
అంటూ వైష్ణవమత పరంగా రాముని కీర్తిస్తూ పన్నగభూషణ నన్నుగన్న
(వే. హ. కీ. 63 పే) "జాలి గీర్వ జాలాన న్నేలు గ

(వే.హ.కీ. 63) అంటూ శైవమత పరమైన ఈ కీర్తనలు కూడా రచించారు. కీర్తనల ఎత్తుగడలలో నడకలో కూడా వెంకటదాసుగారి ప్రభావం వీరిపై ఉందని స్పష్టపడుతుంది. ఈ క్రింది కీర్తనలలో గమనిద్దాం.

వేంకటదాసుగారి గురుస్తవ కీర్తన ఇట్లా సంస్కృత సమాసాలలో సాగింది.

"గురుమహరాజ గురుమహరాజ పరబ్రహ్మసద్గురు
మహరాజ ॥ప॥

పరతత్వాశ్రిత సరసిజసంభవహరిహరరూపక గురుమహరాజ
తారక సాంఖ్యవిచారత్రికూట విహార కారణాగురుమహరాజ
॥గురు॥

హనుమద్దాసుగారి గురుస్తవకీర్తన వేంకటదాసు కీర్తనవలె సంస్కృత సమాసాలు దీర్ఘంగా లేకున్నా సంస్కృత పదాలతోనే నడిచింది. గమనించండి.

"గురుమహరాజ గురుమహరాజ
పరమాత్మరఘువంశోద్ధర మహరాజ ॥గురు॥

శరణువితరణ యాదరణ దయాభరణ
ధరణిజారమణ సద్గురు మహరాజ ॥గురు॥

(వే.హ.కీ. 5 పే)

"గురుదేవతానంద మూర్తీ భక్తకోటి మానసచక్రవర్తీ ॥ప॥

అంటు వేంకటదాసుగారు గురుస్తవం చేస్తే గురుపునకు గురువా పరబ్రహ్మ సద్గురుకీర్తిగిరిని గురువులకు పరమానందం పరిపూర్ణంబె పరమార్థం నిజభక్తులకు" అంటూ హనుమద్దాసు కీర్తన రచన సాగించి.

వేంకటదాసుగారు వైష్ణవ పురాణాలను అనుసరించి దశావతారాలను

కీర్తించిన వైనం ద్వితీయ ప్రకరణంలో చూపాను. అదే మార్గంలో హనుమద్దాసు గారుకూడా తన కీర్తనలలో దశావతారాలను కీర్తించారు. ఆ కీర్తనలివి.

1. మత్స్యావతారం :

"మత్స్యావతారా శ్రీరఘువీరా మమ్ముబోవరారా
హెచ్చువార్ధిలోజొచ్చి సోమకతుచ్ఛ దైత్యునిద్రచ్చి వేదము
లిచ్చతోడుతదెచ్చి బ్రహ్మనుఇచ్చిధర్మసురక్షిత ముజేయు ॥మ॥
(వే.హ.కీ. 50 పే)

2. కూర్మావతారం :

"రార రవికులవీర కూర్మావతార శ్రీ రఘునాయక
ధరణిలో తనదాసుడను భవవారధిలోనను ద్రోయరా ॥రార॥
(వే.హ.కీ. 50 పే)

3. వరాహావతారం :

"సైరసైర శ్రీరఘువీర
వైరమేలరవరహావతార ॥సైర॥
(వే.హ కీ. 51 పే)

4. నరసింహావతారం :

"ననుబ్రోవనవయ్యా పేర్మిమ
నరసింహావతార రామా ॥నన్ను॥
(వే.హ.కీ. 51 పే)

5. వామనావతారం :

వామనరూపా బిరానరారా కృష్ణా ॥వామ॥

6. పరశురామావతారం :

" నీ అంశయేకదా పరశురాముని ప్రబలముగ జేసినదిల ॥నీ॥
(వే.హ.కీ. 52పే)

7. రామావతారం :

రామావతారమెత్తి నీవు - రావణుని ద్రుంచ (వే.హ.కీ. 53పే)

8. కృష్ణావతారం :

"కృష్ణావతార రామయ్యా నన్ను
కృపతోడ దండియవయ్యా రామయ్యా ॥కృ॥
(వే.హ.కీ. 54పే)

9. బుద్ధావతారం :

"నేరుగ నివె రావె బౌద్ధావతార నన్నేలుకోవే (వే.హ.కీ. 54పే)

10. కలికావతారం :

నీచులను తెగటార్చు ధీరుడవూ
కలికేలమాఖరు నీవేగద కలికావతారుడవు (వే.హ.కీ. 55పే)

"భజన శాయంగ బూనినాను శ్రీరామనామ భజన
భజియించెద దుర్భరములు దొలుగగ
సుజన సంఘములు సొంపువహింపగ ॥భజ॥

విష్ణుడె దైవమని దలచీ
సద్గురుని గొలచివిపుల వైరాగ్యమున నిలచీ
తృష్ణహరణ నవలోతుజలోచన
కృష్ణ కృష్ణా శ్రీ కృష్ణాయని" (రా.వేం.కీ. 1980-30పే)

అనే వేంకటదాసుగారి భజన కీర్తనను అనుకరించిన హనుమద్దాసుగారి భజన కీర్తనను గమనించండి.

"భజనజేతమా ముదముబెనగగా
నిజభక్తిగొనగా అజాహరదూలు పొడగనాగా
విజయముగను ఘన సృజనలు బొగడగ
త్రిజగము మునులతోడీ వెనలందీయు ॥భజ॥

చెడు రానివ్వాకా బుద్ధిని బాట్టి
వో రామరామా శరణుశరణాని కేకబట్టి
తదిమిదిమీ తతకిటతకిటయని
మృదుశబ్దములీను మృదంగధ్వనులతో ॥భజ॥
(వే.హ.కి. 26 పే)

"పూల వసంతములాడుదమా
గోపాలుని లీలలు పాడుదుమా ॥ప॥

అనే వేంకటదాసుగారి కీర్తనను అనుకరించిన హనుమద్దాసుగారి ఈ కీర్తన వారి ప్రభావాన్నే సూచిస్తున్నది.

"ఆటలాడుదమా - రాముని పాట బాడుదమా
ఝాటమానవుల జోలినివీడి బహు
మేటి దేవతల తోటి గూడుకొని" (వే.హ.కి. 26 పే)

అల్లె "నమామి వెంకటరమణా సురశారదవందిత చరణా" (రా.వేం.కి 13 పే) అనే వేంకటదాసు కీర్తనకు అనుసరణయే "నమామి జానకి రమణా సూత్రమాదినందిత చరణా" అనే హనుమద్దాసు కీర్తన.

"మంగళం నందతనయుతే
వాసుదేవ మంగళాయానుమోదతే ॥ప॥

ఇంగిత ప్రసంగ భవ భంగహాని
పుంగవార్చితాంత ఖగతురంగ (రా.వేం,కీ. 82పే)

అని వేంకటదాసుగారు మంగళహారతిని సంస్కృత పదాలతో గానంచేస్తే

"మంగళం రాములవారికి జయ
మంగళం రాముల రాణికి ॥మం॥

అంగనాగభరత శత్రుఘ్నులక్ష్మణులాను
రంగుమీర ఊర్మిళభగా విశృతకీర్తు రామా ॥మం॥

"మంగళము జయరామా
రఘుకుల పుంగవానర సేవితా
సంగరహిత విహంగరాజతు
రంగ సగుణవిరాజితా ॥మం॥
(వే.హ,కీ, 74పే)

అంటూ అలతి అలతి పదాలతో హనుమద్దాసుగారు రచించారు.

వేంకటదాసుగారి కీర్తనలు ఆర్తి, ఆత్మనివేదన దానత్వాది అవైదిక భక్తి తత్త్వం కలిగిఉన్నాయి. ఈ విషయాన్ని రెండవ ప్రకరణంలో వివరించాను. హనుమద్దాసుగారి కీర్తనలలో కూడ అవైదిక భక్తి తత్త్వమే నిండి ఉంది. భాషా విషయంలో ఇరువురిలో మాండలికాలు ఉన్నాయి. ఈ హనుమద్దాసు గారి కీర్తనలలో మాండలిక పదప్రయోగం కొంచం అధిక మనే చెప్పాలి. వీటితో పాటు హుజూరు బేజారు'' మొదలైన ఉర్దూపదాలు కూడా వీరి కీర్తనలలో చోటుచేసుకున్నాయి. ఇట్లా వేంకటదాసు కీర్తనల ప్రభావం హనుమద్దాసుకున్నాయి. అట్లా వేంకటదాసు కీర్తనల ప్రభావం హనుమద్దాసు కీర్తనలలో చోటు చేసుకుంది. ఇంక వేంకటదాసు కీర్తనలతో సంగీత సంప్రదాయాలను తెలుసుకుందాం.

❦

# నాల్గవ ప్రకరణం

## వెంకటదాసు కీర్తనల్లో సంగీత సంప్రదాయాలు

వేంకటదాసు కీర్తనల్లో సంగీత సంప్రదాయాలు పరిశీలించేందుకు ముందుగా సంగీత సాహిత్యాలను గురించి కొంత వివరించటం సమంజసంగా ఉంటుంది. సంగీత సాహిత్యాలు రెండు అవినాభావ సంబంధాన్ని కలిగి ఉన్నాయి. సంగీతానికి బాహ్య అవయవం సాహిత్యమైతే సాహిత్యానికి అంతర సాధనం సంగీతం. సంగీతం సాహిత్యానికి ప్రాణసదృశమైంది. అట్టి ప్రాణ సూత్రంలో దారం వలె సాహిత్యంలో వ్యాపించి ఉంటుంది. ఉత్తమ సాహిత్యం లయబద్ధంగా అనిస్తుంది. సంగీతానికి "సృతిర్మాతా, పితాలయా" (శ్రీ.సం.ద. 545పే) అని చెప్పబడటంచేత ఈ లయ ప్రాముఖ్యం వ్యక్తమౌతున్నది. ఇట్టి లయల అధారంగా నేసాహిత్యం జనిస్తుంది అనేందుకు లౌకిక సంస్కృత బాషలో శ్రీమద్రామాయణాన్ని వెలయించటానికి పూర్వం వాల్మీకి నోటినుండి వెలువడ్డ, ఈ శ్లోకమే ప్రబలమైన నిదర్శనం క్రౌంచమిధునాన్ని బాణంతో బోయకొట్టిన సంఘటన చూచిన వాల్మీకి హృదయం కరుణతో ద్రవీకృతమైంది. వెంటనే అతని నోటినుండి

"మానిషాద ప్రతిష్టాంత్వ
మమశాశ్వతీ స్సమాః
యత్ౌసిం చమిథునాదేక
మవధీః కామమోహితమ్"

అనే శ్లోకం వెలికి వచ్చింది. పాదబద్ధం, సమాక్షరం, తంత్రీలయ మన్వితమై ఛందోబద్ధమైన ఈ శ్లోకం పుట్టుక పైవిషయాన్నే వ్యక్తం చేస్తున్నది. దీనిని బట్టి సంగీతం సాహిత్యానికి ప్రాణ సదృశమని చెప్పవచ్చు. అట్టి సంగీతాన్ని గూర్చి సంక్షిప్తంగా తెలియజేస్తాను.

## సంగీత పరిచయం

సంగీతం అంటే గానం అని అర్థం. గీతమంటే పాట "మానవోత్పత్తి అయిన తోడనే మానవ హృదయంలో సంగీతం ఏదో ఒక రకముగా ఏర్పడినది. లోలోన ఏదో యొక కూనిరాగము, ఇష్టమో ఆ రాగము ననుసరించియైన పదములు అమర్చి తమకిష్టమైన భావములను ఆ పదములలో ఇమిడ్చి పాడుచు మానవులు గాన కళను మొదలు పెట్టిరి" (గా.క.బో. 1,2, పే) ఇట్లా సంగీతం సాహిత్య నిర్మాణానికి ప్రేరకమైంది

"ఓంకారం చ పరబ్రహ్మ
యావదోంకార సంభవః
అకారోకారమకార
ఏతే సంగీత సంభవాః" (క్రో.సం.ద. 1పే)

అనే ఈ శ్లోకం సమస్త జగత్తుకు కారణమైన 'ఓం' కారం నుండే సంగీతం ఉద్భవించిందని తెలుపుతున్నది. దీనివల్ల సంగీత ఉత్పత్తి యొక్క ప్రాచీనత వ్యక్తమౌతున్నది. ఇట్టి గానకళకు సప్తస్వరాలు పునాదులు.

సప్తస్వరాలు :-

స్వకీయంగా రంజింపబడేది స్వరం. వీటికి సంగీతంలో సరిగమపదని అనే, సరాలు సంజ్ఞలు సామవేదంలో సప్తస్వరాలు ప్రత్యేకమైన సంజ్ఞలతో గుర్తించబడ్డాయి. అవి ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, మన్ద్ర, క్రుష్ట, అతిస్వార అనేవి. మధ్యమాది స్వరాలకు గానంలోనూ ఈ విధమైన పేర్లున్నాయి. వేణువుతో మొదటి

స్వరం మధ్యమం, రెండవది గాంధారం, మూడవది ఋషభం, నాల్గవది షడ్జమం, ఐదవది దైవతం, ఆరవది నిషాదం, ఏడవది పంచమం అని సామవేదం తెలుపుతున్నది. (సా.భా. (హిందీ) పీఠిక)

## సప్తస్వర ఉత్పత్తి స్థానాలు :-

నారదీయ శిక్షలో సప్తస్వర ఉత్పత్తి స్థానాలు స్వరాల పేర్లు వాటి అర్థం ఈ విధంగా వ్రాయబడింది. (సా.భా (హిందీ) పీఠిక)

1. షడ్జమం :-

నాశిక, కంఠం, ఉరము, తాలువు, నాలుక దంతాలు ఉత్పత్తి స్థానాలుగా పుట్టేది.

2. ఋషభం :-

నాభి నుండి బయలుదేరిన వాయువు కంఠం, శీర్షంను తగిలి ఎద్దు ధ్వనివలె ప్రకంపన బయటికి వచ్చే ధ్వని.

3. గాంధారం :-

నాభి నుండి బయలుదేరిన వాయువు కంఠము శీర్షం గుండా నాశిక నుండి సుగంధ వాయువును వెలికి తెచ్చేది.

4. మధ్యమం :-

నాభి నుండి బయలుదేరిన వాయువు ఉరం, హృదయం నుండి వచ్చి వెలువడును ఇది నాభి నుండి బయలుదేరిన మహానాదం.

5. పంచమం :-

నాభి నుండి బయలుదేరిన స్వరం ఉరం, హృదయం, కంఠం, శీర్షం నుండి బయటికి వస్తుంది.

6. ధైవతం :-

పై స్వరాలతో అనుసంధానం కలిగి ఉంటుంది. కాబట్టి ధైవతం.

7. నిషాదం :-

ఏది కారణంగా అన్ని స్వరాలు నొక్కబడతాయో అది నిషాదం.

వెద మంత్రాలకు ఉదాత్త, అనుదాత్త, స్వరితాలనే స్వరాలు చెప్పబడ్డాయి. ఈ స్వరాలను గురించి సామవేదం ప్రత్యేక పద్ధతిలో తెలిపింది. నాదం హృదయంలో ఉన్నపుడు "మంత్రం" కంఠంలో ఉన్నపుడు "మధ్యమం", మూర్ధంలో ఉన్నపుడు "తారం" అని పిలువబడుతుంది. నారదీయ శిక్షలో పాణిని ద్వారా తెలుపబడిన ఉదాత్త, అనుదాత్తాది స్వరాల మధ్యలో సంగీత శాస్త్రానికి సంబంధించిన ఏడు స్వరాలు ఈ విధంగా వివరించబడ్డాయి. ఉదాత్తంలో నిషాద, గాంధారాలు, అనుదాత్తంలో ఋషభ, ధైవతాలు, స్వరితంలో షడ్జను, మధ్యమ, పంచమాలున్నాయి. (సం.భా. (హిందీ) పీఠిక).

నాదం

సంగీతానికి ప్రాణం వంటిది నాదం.

"నకారం ప్రాణ నామానం
దకార మనలంవిదుః
జాతః ప్రాణాగ్ని సంయోగా
త్తైన నాదోభిధీయతే"

అనే శ్లోకం వల్ల ప్రాణాగ్నుల సంయోగమే నాదం అని తెలుస్తున్నది. ఆత్మ మనస్సును ఉత్తేజిస్తుంది. మనస్సునాభియందున్న అగ్నిని కొడుతుంది. ఆ అగ్ని వాయువును ప్రేరేపిస్తుంది. తద్వారా నాదం పుడుతుంది. అట్లాజనించిన నాదం బ్రహ్మ గ్రంధియందుంటుంది. ఆత్మనుండి ఊర్ధ్వముఖంగా సంచరించి క్రమంగా నాభి, హృదయం, కంఠం, మూర్ధం, ఆస్యాల నుండి నాదం పుడుతున్నది. (కో నం,వి.ద. 4,5 పే) ఇట్టి "నాదం వల్లనే అక్షరం, అక్షరం చేతపదం, దానిచేత

ధ్యాన, యజ్ఞ జపాదులు ధర్మార్థకామాలనే త్రివర్గ ఫలాన్నే ఇస్తాయి. సంగీత జ్ఞానం ధర్మార్థకామ మోక్షాలనే చతుర్వర్గ ఫలాన్నిచ్చేందుకు సమర్థత కలిగి ఉందని పై శ్లోకభావం. ఈ చతుర్వర్గ ఫలం దీనివల్ల ఎట్లా లభిస్తుందో వివరించిన ఈ శ్లోకం గమనించండి.

శ్లో॥ హరీశాదిస్తుతే ధర్మో
ధనకామౌనృపాదితః
నిష్కామస్తదనుష్ఠానా
న్మోక్ష మాప్నోత్సదశయమ్"

ఈ సంగీత జ్ఞానంతో హరీ, శరాదిస్తుతులు చేయటంవల్ల ధర్మానుష్ఠాన ఫలం లభిస్తుంది. రాజులు మొదలైన వారిని స్తుతించినందువల్ల ధన కామాదులు లాభిస్తాయి. నిష్కామంగా కేవల పరమాత్మను అనుష్ఠించినందువల్ల మోక్షం లభిస్తుందని భావం.

## సాహిత్యం

ఇప్పుడు సంగీతానికి బాహ్యావయవమైన సాహిత్యంస్వరూపం క్లుప్తంగా చెప్పి, అనంతరం సంగీత సాహిత్యాలకున్న సామ్యాన్ని పరిశీలిద్దాం.

సహితం = సాహిత్యానికి సమానార్థకమైన ఆంగ్లపదం ''లిటరేచర్". పద్య కావ్యం, నాటకం, నవల, కథానిక, గేయం మొదలైన ప్రక్రియలన్ని సాహిత్య పదార్థములే ప్రాచీన అలంకారికులు కేవల పద్యకావ్యాలను దృష్టిలో ఉంచుకొని మాత్రమే కావ్యలక్షణాలను, ప్రయోజనాన్ని చర్చించారు.

''వాక్యం రసాత్మకం కావ్యం" (సా.ద. 23 పే) అని విశ్వనాదుడు "విశ్వశ్రేయః కావ్యం" (అం.శ.చ. 1.1) అని నన్నయ కావ్యస్వభావాన్ని తెలిపారు. కావ్యశరీరలక్షణాన్ని కావ్యాలంకార సంగ్రహం

"విగతదోషంబులును, గుణాన్వితము లధిక
లసదలంకారభావోపలక్షితములు

నైన శబ్దార్థములు కావ్యమనదెలంగు" (కా.సం. 33 పే)
అని తెలిసింది. ఇంకా "శబ్దార్థ సహితేకావ్యం" అని భామహుడు, "గుణాలంకార యుక్తార్దేకావ్యం" అని వామనుడు, "నిర్దోషం గుణాలంకార రసవత్ కావ్యం" అనిభోజుడు, "గుణాలంకార రీతి రసోపేతః సాదు శబ్దార్ధ సందర్భం: కావ్యం" అని వాగ్భటుడు, "ఇష్టార్థవ్య వచ్ఛిన్నా పదావలీ కావ్యం" అని దండి, "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం" జగన్నాథుడు ఇట్లా ఆలంకారికులెందరో కావ్య లక్షణాన్ని గూర్చి తెలిపారు. ఇట్టి కావ్యానికి ధర్మార్థ కామమోక్షాది చతుర్వర్గ ఫలం ప్రయోజన మంటూ

"ధర్మార్థ కామమోక్షేషు
వైచక్షణ్యం కలానుద
కరోతి కీర్తం ప్రీతించ
సాధుకావ్యనిషేవణం

అని భామహుడు తెలిపాడు. ఇదే కావ్య ప్రయోజనాన్ని గూర్చి మమ్మటుడు

"కావ్యం యశసేఽర్థకృతే
వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతా
సమ్మితతయోపదేశయుజే"

కీర్తి, ధనం, వ్యవహారదక్షత, మంగళం, ఆనందం, కాంత సమ్మితోపదేశం ఫలంగా చెప్పాడు.

పైన తెలిపిన కావ్య లక్షణాలకు వ్యాఖ్యానంగా "సాహిత్యోద్దేశం - ప్రయోజనం ("సాధన అక్టోబరు 1986 సం॥ 19 సం. 10) అనే వ్యాసంలో జాతీయ విప్లవ కవి యెల్దండ రఘుపతి ఇట్లాతమ అభిప్రాయాన్ని తెలిపారు.

"మాతృ సమ్మితోపదేశ్యం కావ్యం విశ్వస్యశ్రేయసే
పరమార్థకృతే చైవసద్య సిద్ధిర్భవేత్తదా"

ఋషి పరంపరాగత సాహిత్యాన్ని పరిశీలించిన తరువా
కట్టా నామాటల్లో ఉద్దేశం, ప్రయోజనం నిర్దేశించి చూప్చినాను. అం
"విశ్వశ్రేయః కావ్యమ్' అనేది ప్రతిపాదించిన బద్ధఉద్దేశం వేదాలను
భారతేతిహాసాల వరకు ప్రతి అక్షరం దాన్నే ఊపింగా ప్రబోధిం
పరమాత్ముడే కవిగా ఈ సమస్త సృష్టిని ధ్వని గర్భిత కావ్యంగా

"సపర్యగాచ్ఛుక్రమకాయ మవ్రణ మస్నావిరగ్ం
శుద్ధమపాపవిద్ధమ్" కవిర్

స్వయంభూర్ యథాతథ్యతోఽర్థాన్
వ్యదధాచ్ఛాశ్వతీభ్యః సమాభ్యః" (యజు

ఆ సృష్టి కావ్య గర్భిత ధ్వని దర్శనమే ఋషికవులకు సాధ్యమయిం

"జగమంతా ధ్వని కావ్యం. మనమంతా శబ్దమయం.
దివ్యమ్. జగద్రక్షానందమయం" ఆధ్వని దర్శనమే క్రాంతదర్శనమే
(కవయః క్రాంత దర్శనః) క్రాంతదర్శనమే కవిత్వం"

అని కవిత్వమంటే ఏమిటో వైదికంగా వ్యాఖ్యానిస్తూ ఇంకా"
నాన్ని గూర్చి "ధర్మార్థకామమోక్షేషు" అన్న భామహుని ధర్మ ప్రా
ఆధర్మోపదేశాన్ని మరుగుపరచారు. "కావ్య ప్రకాశకర్తని" కావ్యం
అను శ్లోకాన్ని స్వీకరించి రూఢికెక్కించారు. దీని ప్రకారం కావ్యం
అర్థం, వ్యవహార విధం, శివేతర క్షతి, సద్యః పరనిర్వృత్తి, కాంత
ప్రాప్తిస్తాయి ఇవి చాలామటుకు స్వల్ప ఉద్దేశ్యంతో కూడిన అ
ఇందులో యశస్సు ధనార్జనం వంటి వాని మీదనే నేటి కవులం
సాహిత్యాన్ని అలౌకికం లౌకికం అంటూ వేరుచేసి, వేదాలు అ
దాసాదుల కావ్యాలన్నీ లౌకికాలనీ, ఈ లౌకిక సాహిత్యానికే "కా
వంటివి వర్తిస్తాయని సమర్థింపుకోవటం జరిగింది. కాని లౌకికా లౌకి
సంబంధమైనవి, ఇవే ఇహంపరం అనబడుతాయి. వీని ఉద్దే

ఒక్కటే. ఇహపర సుఖప్రతిపాదనమే పరమార్థం విశ్వశ్రేయం. ఏతత్ సద్యః సిద్ధిని వేదాలు, మాతాసమ్మితంగానే "తత్యమేవమాతా" (అథర్వవేదము. 20.108 2) ప్రబోధించినాయి. ప్రభుసమ్మితాదుల ప్రసక్తి కొందరి ఊహకల్పితమే తల్లి తన సంతానాన్ని నిర్మించటంలో సమయ సందర్భంగా శాసిస్తుంది, సంస్కరిస్తుంది, సందేశమిస్తుంది. సన్మార్గాన నడుపుతుంది. సామ, దాన, భేద దండోపాయాలను అవసరంకొద్ది ప్రయోగిస్తుంది. తనబడినుంచి తరువాత చదువు సంధ్యలకోసం గురుకులానికందిస్తుంది ఇట్టి తల్లినిర్మాణ కళ అపూర్వమైంది, అనిర్వచనీయమైంది. ఇట్లా మాతృ సమ్మితోపదేశంగానే వేదమంత్రోపదేశాలున్నాయి. అని లౌకికంగా చేప్పే కావ్య ప్రయోజనాన్ని ఖండించారు. ''ఇంతటి తల్లి కర్తవ్య నిష్ఠ సాహిత్య సమ్మితంగా కావ్యనిర్మాణం ఒకప్పుడు జరిగింది. విశ్వశ్రేయమే ఉద్దేశ్యంగా, ప్రయోజనంగా, ఏంకటి ధర్మార్థకామమోక్ష బద్ధంగా సాగింది. నేడుమళ్ళీ ఇట్టి సాహిత్య నిర్మాణం జరుగవలసి వుంది. అనే వీరి సత్యోపదేశంతో కూడిన అభిప్రాయాన్ని సమర్థిస్తూ, విజ్ఞానులందరికీ అవశ్యాచరణీయమార్గమని నేను అభిప్రాయపడుతున్నాను. అట్లా అయితేనే "హితం కూర్చేది సాహిత్యం" అన్న నిర్వచనం సార్థకమౌతుంది.

అలౌకిక, లౌకిక సాహిత్య విభజనతో, సత్య ప్రయోజనానికి భంగంకలిగిస్తున్నట్లాయితే సంగీత విషయంలో కూడా ఇట్టి విభజన సంగీత ఉద్దేశ్యానికి భంగం వాటివల్ల చేస్తున్నది. వర్తమానకాలంలో సంగీత విద్వాంసులనేకులు నేటి కవులవలె ధనకామాలపైననే దృష్టిని నిలిపి ఉండటం గమనింప తగిన విషయం అట్లుగాక కేవలనిష్కామబుద్ధితో చేసిన సాధనే ముక్తినిస్తుంది.

## సంగీత సాహిత్యాల సామ్య భేదాలు

ఇప్పుడు సంగీత సాహిత్యాలమన్న సామ్య భేదాలను ''స్థాలీపులాకన్యాయం" గా సూచిస్తాను.

"వాక్యం రసాత్మకం కావ్యం " మొదలైన నిర్వచనాలను బట్టి కావ్యానికి, రసం ప్రధానమని తెలుస్తున్నది. సాహిత్యంలో రసంవలె సంగీతంలో రాగం ప్రాధాన్యాన్ని వహిస్తున్నది జన్యరాగాలు, జనకరాగాలని ఇవి ముఖ్యంగా రెండు

విధాలు. వీటిలోని భేదాలు ఉపభేదాలతో రాగాలు అనంతాలుగా ఉన్నాయి. సంగీత శాస్త్రంలో వీటిని విపులంగా తెలుసుకోవచ్చు. అట్లే రసాలు ముఖ్యంగా తొమ్మిది విధాలుగా విభజింపబడినా "అనంతావైరసాః" అని చెప్పక తప్పలేదు. సాహిత్యం లోని ఆయారసాలకు అనుగుణంగా సంగీతంలో రాగనిర్ణయం జరిగింది. అట్లాగే సంగీతంలోని ఆయారాగాలకు అనుగుణంగా రసీభూతమైన సాహిత్యమున్నపుడే రెండూ శోభిస్తాయి.

సాహిత్యంలో పద్యాలు గేయాలు వచనాలు మొదలైన అనేక రకాల కవిత్వం ఉన్నది సంగీతంలో కూడా కల్పిత సంగీతం అనే విభాగం ఉంది. అందలి ఆశు కవిత్వం లాగా సంగీతంలో మనోధర్మ సంగీతం అనే విభాగముంది. (గా.క.భో. 80 పే).

ఇంకా సాహిత్యంలో లక్షణబద్ధ కవిత్వం, కేవల మాత్రాఛందోబద్ధమైన కవిత్వాల సామ్యాన్ని వర్ణం, గీతం అనే సంగీత ప్రక్రియలు కలిగి ఉన్నాయి.

సాహిత్యంలో క్రొత్తగా సృష్టించిన గ్రంధాన్ని "కృతి" అంటారు. సంగీతంలో కూడా 'కృతి' అనే రచన ఉంది. ఈ కృతి కూడా సంగీత విద్వాంసుని యొక్క స్వంత సృష్టి, నూతన రచనే అయినా దానికి, దీనికి రచనాలక్షణంలో భేదమున్నది. (గా క బో, 88 పే) సంగీత సాహిత్యాలకున్న ఇట్టి సామ్యభేదాల పరిశీలనం చాలి నంత సంగీత పరిజ్ఞానం లేని నాకంటే సంగీత సాహిత్య పరిజ్ఞామున్న విద్వాంసు లెవరైన చేస్తే న్యాయసమ్మతంగా ఉంటుంది.

## కీర్తనలలో సంప్రదాయ పోకడలు

సంగీతంలో అన్నమయ్యను గాని, "నాదబ్రహ్మ" అని సంగీత ప్రపంచంలో పూర్వసిద్ధుడైన త్యాగయ్యను గాని అనుసరించిన వారు అరుదు, కాని వీరిద్దరికి మధ్యస్థుడు 16వ శతాబ్దానికి చెందినవాడైన భద్రాచలరామదాసును మాత్రం ఆంధ్ర దేశంలో ఎంతోమంది అనుకరించారు. అందుకు అతని కీర్తనలోని జనరంజకత్వం, సులభశైలియే కారణం. అంతేగాక అతని కీర్తనలతో భక్తి భావబోధ, భజన సంప్రదాయం ఎందరికో స్ఫూర్తినిచ్చింది. వేంకటదాసు కీర్తనలలో కూడా ఆ ప్రభావం కనపడుతున్నది.

భక్తిభావానికి తగినట్లు వేంకటదాసు తన కీర్తనలకు ఏ బాణీలను [illegible] రించారో చెప్పేందుకు ఆధారాలు లేవు. కనుక ఆ కీర్తనల[illegible] అనుసరించి ఏది ఉచితమో నిర్ణయించవలసి ఉంది. ఇట్టి నిర్ణయము సంప్ర[illegible] పద్ధతిలో ఇప్పటి వరకు జరిగియుండలేదు. సి హెచ్. భాస్కర్ గారి చేత [illegible] కీర్తనలకు సంప్రదాయరాగాలను నిర్ణయంచేయించి ఇందుపొందు పరుస్తున్నాము

## గురుస్తుతి కీర్తనలు

1. గురుమహారాజ గురుమహారాజ
   పరబ్రహ్మ సద్గురు మహారాజ
   రాగము:- సౌళగభైరవి
   తాళం:- ఆది

2. హరి చరణం భవశరణం
   సద్గురుచరణం భవతారణం
   రాగము : కురంజి
   తాళం : ఏక

3. గురుదేవతానందమూర్తి!
   భక్తకోటి మానస చక్రవర్తి
   రాగము : గౌరీమనోహరి
   తాళము : మిశ్రచాపు

4. గురువేరాయతెనమోనమో శ్రీ
   గురువేరాయతెనమోనమో
   రాగము : శ్రీరాగం
   తాళము : ఆది.

సంవాద కీర్తనలు (భక్తి - జ్ఞానమార్గ కీర్తనలు) భక్తి మార్గ కీర్తనలు

1. పావనమై ఉన్నదయ్యా రామనామం
భక్త జీవనముగదయ్యా శీతారామనామం"
రాగము : అరభి
తాళము : మిశ్రగతి-ఏకతాళం

2. మదిలోన సేవించరాదా స్వామి
పదములు భజియించరాదా"
రాగము : అరభి
తాళము : ఖండగతి - ఏక

3. హరిధ్యానంచె పరమపదము స
రుద్భనిభజించుటె సుఖతరము"
రాగము : పూర్వీకళ్యాణి
తాళము : ఆది.

4. మాటలాడిన ముక్తిరాదు-బుద్ధి
పొటిదప్పిన భక్తి పథమేమి గాదు"
రాగము : అరభి
తాళము : ఖండగతి - ఏక

5. ఎంతోచక్కని దేవుడమ్మ లక్ష్మి
రాంతూని కసుగొనిరమ్మ"
రాగము : కేదారగౌళ
తాళము : మిశ్రగతి - ఏక

6. వాలాయణుని పేరె తారకమో
తారకమౌ భవతారకమా" ॥ప॥
రాగము : సావేరి
తాళము : మిశ్రగతి - ఏక

7. దొరలకెల్లను దొరగదమ్మ
మా రామచంద్రుడు" ॥ప॥
రాగం : అరభి
తాళము : ఖండగతి - ఏక.

8. సీతారామదాసులాను చేరినారము
భజనచేసేటి పుణ్యాత్ములను గోరినారము" ॥ప॥
రాగం : సావేరి
తాళం : చతురత్రిగతి - ఏక

9. కనుగొందునయ్యా మీపద సేవా
శ్రీవాసుదేవా ॥ప
రాగం : బిల్హరి
తాళం : మిశ్రగతి - ఝంపతాళం

10. ఎరిగినందుకుగమతు ఎరుకయే సాక్షి
ధరకల్ల నిజములకు దైవమే సాక్షి ॥ప॥
రాగం : సావేరి
తాళం : ఝంపే

11. మనము సందేహించనేలా - హరిని
కనుగొందుము యుయవలీల ॥ప॥

రాగం : బిల్హరి
తాళం : ఖండగతి - ఏక

జ్ఞాన మార్గ కీర్తనలు :

1. యోగికే ఎరుక పరమయోగములెరగు
భోగియే యెరుగాడు పురుషుని మరుగూ ॥ప॥
రాగం : మధ్యమావతి
తాళం : ఝంపె

ఈ కీర్తన ''తెలియలేదు రామభక్తి మార్గమునూ" అనే త్యాగయ్య కీర్తనను అనుసరించింది.

2. "కనుల జూడరాదా - మంచి
ఘననాదమును వినిరాదా" ॥ప॥
రాగం : మధ్యమావతి
తాళము : ఆది

3. "ఇదిగో గురుకీలకము - వినర
అదుగోరయోగ సాధనము" ॥ప॥
రాగం : సావేరి
తాళము : ఆది

4. ఏమనర నిదదీ - అది
ఏమోకాని ఎచరికిద్చోచనిదీ" ॥ప॥
రాగం : అఠాణ
తాళము : ఆది

5. "సేవాబినానే - అహోజ్యోతిను
నే జూచినానే" ॥ప॥

రాగం : రీతిగౌళ
తాళం : ఝంపె

6. చూడు చూడు హరిని చూడునేడు మనమున
చూడు చూడు నీచూపు మనసునొనగూడజేసి ॥ప॥
రాగం ; సావేరి
తాళం : ఆది

ఇది ఆదిగో భద్రాద్రి - అనే రామదాసు కీర్తనను తలపిస్తున్నది.

7. దొరవలెగూరుడున్నాడు - స
గురునాధుడితడే మొచూడు ॥ప॥
రాగం : మధ్యమావతి
తాళము : ఖండగతి - ఝంపె

8. "బయలుదెలియవలెరా
కేవల బ్రహ్మము గనవలెరా ॥ప॥
రాగం : మాయామాళవగౌళ
తాళం : ఆది

9. "ఉన్నదేమో ఉన్నదీ గురురారోడాలు ॥ప॥
రాగం : శంకరాభరణం
తాళం : మిశ్రగతి - ఏక

10. "ఏకశ్రియించె పండుగాదదమ్మా
ఈ విశ్వమందుతెలియరాదమ్మా" ॥ప॥
రాగం : శంకరాభరణం
తాళం : మిశ్రగతి - ఏక

11. "మనము సందేహించనేలా హరిని
కనుగొందమయ్యా అవలీలా" ॥ప॥
రాగం : ఆనందభైరవి
తాళం : మిశ్రగతి - ఏక

మానస పూజ కీర్తనలు

1. మనోబోధ కీర్తన :
''చూచబోదము రావె తిత్తమా హరిని
వేడుక దర్శించి వత్తమా ॥ప॥
రాగం : బిల్లరి
తాళం : తిశ్రగతి - ఏకా

2. రామాతారకనామ సీతారామ ॥ప॥
రాగం : కాఫీ
తాళం ; ఆది

3. ధ్యానం ;
ధాన్యపారీణనారాయణ మాంపాహి
నిత్యధాన్య పారీణ నారాయణ ॥ప॥
రాగం : హంసానంది
తాళం : చతురశ్రగతి - ఏక

4. సింహాసనం :
రారా గోపాల బాల రారా
రారా మనవిగైకొనవేర ॥ప॥
రాగం : బిల్హరి
తాళం : ఆది

5. పాద్యం :
పాద్యం బిచ్చెదరామా నన్ను

పాలించనే గుణధామా ॥ప॥
రాగం : ఆనందభైరవి
తాళం : ఆది

6. అర్ఘ్యం :
ఇదుగో ఆర్ఘ్యము ఇచ్చేదనయు చాల
ముదమంది గైకొనరయ్యా ॥ప॥
రాగం : ఆనందభైరవి
తాళం : ఆది

7. మజ్జనం :
మజ్జనమొనరింపవే రామయ్యా
నామనవిచిత్తగించవే ॥ప॥
రాగం : బిల్హరి
తాళం : ఆది

8. చమనీయం :
ఆచమనము లిడ్తునయ్యా
నన్నాదరించవె ముద్దులయ్యా ॥ప॥
రాగం : నీలాంబరి
తాళం : ఖండగతి - ఆది.

9 అభివస్త్రం :
అభివస్త్రము తిత్తునయు రామయ్యా
మీరంగుగ ధరించరయ్యా రామయ్యా ॥ప॥
రాగం : బిల్హరి
తాళం : మిశ్రగతి - ఏక

10. గంధం :
కర్పూర గంధము బూసెదా శ్రీ

కాంతమిమ్ములను తిజేనెదా ॥ప॥
రాగం : కేదారం
తాళం : ఖండగతి - ఏక

11. అభరణం :
కరుణతో జూడరా
భరణమ్ములర్పించరా హరి ॥ప॥
రాగం : కేదారం
తాళం : ఆది

12. పుష్పపూజ :
పూజసేతువయ్యా రాఘవా - మహానుభావ ॥ప॥
రాగం : శంకరాభరణం
తాళం : రూపక

13. ధూపదీపం :
ధూపమాఘ్రాపయామి
శ్రీరామనామ దీపందర్శయామి ॥ప॥
రాగం : ఆనందభైరవి
తాళం : ఏక

14. నైవేద్యం :
చేయవయ్యా భోజనంబు జానకిలోలను
చేయవే రుపలతోడ చెలగిబండరు పళ్ళెరమున ॥ప॥
రాగం : నీలాంబరి
తాళం : రూపక

15. తాంబూలం :
విడెములర్పించెదరామయ్య
రామభవతారకనామ ॥ప॥

రాగం : ఆనందభైరవి
తాళం : ఆట

16 మంగళహారతి :
హారతులిచ్చెద చూడవే - రామయ్య
మరగళ హారతులిచ్చెద చూడవే ॥ప॥
రాగం : బిల్హరి
తాళం , ఖండగతి - ఏక

17. ప్రదక్షణం :
మ్రొక్కెదనయ్య రాఘవ
నీకు మ్రొక్కెదనయ్యా ॥ప॥
రాగం ; కేదారం
తాళం : ఖండగతి - ఏక

18. రాజోపచారం :
రాజోపచారములొనరించెదా - శ్రీరామచంద్రా ॥ప॥
రాగం : అఠాణ
తాళం : ఖండగతి - ఏక

19. ఎంత చక్కని దేవుడమ్మ శ్రీ
కాంతుని కనుగొనిరమ్మా ॥ప॥
రాగం : కేదారగౌళం
తాళం : మిశ్రగతి - ఏక

20. దొరలకెల్లను దొరగదమ్మ
మా రామచంద్రుడు దొరలు ॥ప॥
రాగం : అరభి
తాళం : ఖండగతి - ఏక

21. సుప్రపష్టి :
నిదురించవె రాఘవా - మహానుభావ

నిదురించవె రాఘవా ||ప||
రాగం : నీలాంబరి
తాళం : ఝుంపె

22. లాలిపాట :
నా చిన్ని కృష్ణున్కు నవమన్మథాకార - లాలిలాల్
ఓ చక్రధర పద్మలోచన సర్వేశ లాలిలాలి ||ప||
రాగం : ఆనందభైరవి
తాళం : ఖండగతి - ఏక

23. జోలపాట :
రామకృష్ణ జోజో ||ప||
రామచంద్ర జోజో
రాగం : నీలాంబరి
తాళం : రూపక

## మరికొన్ని కీర్తనలు

1. ఎక్కడి సంసారమెడబాయజాలదు రామచంద్రా
మరిచిక్కములో బద్ధజింక విధంబాయెరామచంద్రా ||ప||
రాగం : రేవతి
తాళం : ఖండగతి - ఏక

ఈ కీర్తన "నానాటి బ్రతుకు నాటకమూ" అనే అన్నమయ్య తత్త్వాన్ని తలపిస్తున్నది.

2. నీ పాదంబులు చూడగలిగే దేవ
నిఖిలపాపములెల్ల తొలగే ||ప||
రాగం : రేవతి
తాళం : ఖండగతి - ఏక

3. అన్నన్న ఇదియేమి చిత్రమూ
నన్నాదరించ వెంతమాత్రమూ
రాగం : బిల్హరి
తాళం : ఝుంపె

(ఈ కీర్తనలో ప్రయాగ రంగదాసు ప్రభావం కనపడుతున్నది)

4. భవసాగరము జుట్టుకొనెరానా
ప్రాణేశ చెైబట్టుకొనరా ॥ప॥
రాగం : ధన్యాసి
తాళం : ఖండగతి - ఏక

(ఈ కీర్తన "సంగీత జ్ఞానము" అనే త్యాగయ్య కీర్తనను పోలిఉంది)

5. నారాయణామృత కృష్ణా ॥ప॥
రాగం : నీలాంబరి
తాళం : ఖండగతి - ఏక

6. తడవైన నిన్ను జూడక తాళలేనయ్యా రామయ్యా
ఎడలేని ధనము నీవని ఎంచినానయ్యా రామయ్యా ॥ప॥
రాగం : బిల్హరి
తాళం : ఖండగతి - ఏక

7. ఆనందమొందవే మనసా
అనుమానమెందుకె మనసా ॥ప॥
రాగం : ఆనందభైరవి
తాళం : ఖండగతి - ఏక

8. తలచగ సుజ్ఞానమొక్క తరువయయ్యున్నది అది
తలపునా హరినామ ఫలము కలిగియున్నాది ॥ప॥
రాగం : చక్రవాకం
తాళం : రూపక

9. యోగానంద మహోజ్జ భావమున బాగుగ నిలుపే రామయా
సామ రాగమున సమ్మతి జేసెతమోము జూపవే రామయా
రాగం : సామరాగం
తాళం : ఆది

10. రామ రార నాస్వామి రార
ఏమితోచకున్న నన్నేలురాద
రాగం : ఆనంద భైరవి
తాళం : ఆది

11. నారాయణ నమోస్తుతే భగవ
నారాయణ నమోస్తుతే
రాగం : భైరవి
తాళం : ఆది

(ఇది నారయణలేనమోనమో అనే అన్నమయ్య కీర్తనను తలవిస్తు

12. నందనందనుని పాదములు బ్రహ్మ
నందమిల పొందిన పాదములు
రాగం : అసందభైరవి
తాళం : త్రిశ్రగతి - ఏక

13. రామజీవపావనా - రాజయోగి జీవనా
రాగం : మధ్యమావతి
తాళం : అది

14. శ్రీవేంకటరమణా బుధ
జీవసేవకపరితోషా
రాగం : మధ్యమావతి
తాళం : ఆది.

15. గిరిధరగోపాలకా - నిరుపమనిటలాలకా ॥ప॥
రాగం : మోహక
తాళం : ఆది.

16. హరినిందు దేవమ్మ మనసా శ్రీ
హరి విందు దేవమ్మమనసా ॥ప॥
రాగం : ఆనందభైరవి
తాళం : ఖండగతి - ఏక

17. కరుణించి ననుబ్రోచుటెన్నడో నన్ను
గారమున జూచుటెన్నడో ॥ప॥
రాగం : భైరవి
తాళం : ఖండగతి - ఏక

18. ఎందుకు దయరాదు రామ
నాకేమిదోచదు పరంధామా ॥ప॥
రాగం : ములారి
తాళం : మిశ్రగతి - ఏక

19. రావయ్య నాచిన్నికృష్ణ రావుచేయక
కావవె నీపాదనన్న కరుణ దప్పక ॥ప॥
రాగం : ఆనందభైరవి
తాళం : ఝంపె

20. నిన్నుమానలేను రామయ్య
నిన్నుమానలేనూ ॥ప॥
రాగం : సావేరి
తాళం : ఆది.

21. తరమానీదయ దాచెదవే మిద దండము బెట్టెదను
దొరవని మీపద నరనిజయుగళము ॥ప॥

మరుగుఁజేసి తెకరుణించరావే
రాగం : బిల్హారి
తాళం : ఆది

22 భక్తలోల సుందరా నీబంటును యిందాక రార
ముక్తిగోరియుండురా మునిసి సన్నుగందురా ॥ప॥
రాగం : బిల్హారి
తాళం : ఖండగతి

23. ఏదయా రామ నీదయ
కోదండపాణి ఏదయా ॥ప॥
రాగం : బేగడ
తాళం : త్రిశ్రగతి - ఏక

24. దినమణికు లజలధి సోమా రామా
ఘన తరశుభకలితనామా రామ ॥ప॥
రాగం : బిల్హారి
తాళం : ఆది.

దినమణివంశతిలక" అనే త్యాగరాజు కీర్తన ఛాయ ఇందుకనపడుతుంది.

25. బాలచముకుందం పరమానందం ॥ప॥
రాగం : సింధు భైరవి
తాళం : ఆది

26. తారంగం తారంగం నత సారంగం ॥ప॥
రాగం : యదుకుల కాంభోజ
తాళం : ఆది

జానపద బాణీలు

వేంకటదాసు కీర్తనలతో కొన్ని జానపద బాణీలను పుణికి పుచ్చుకుని ఉన్నాయి. వేంకటధాసుగాసు కంకల్లుమొదలైన గ్రామాలయువకులకు కొంత కాలం

కోలాటం నేర్పటమే కాక కొన్ని పాటలు రచించారనే, అంశం ఈ సందర్భంలో గుర్తు చేసుకోవలసి ఉంది. ఈ ప్రభావమే తరువాత అతడు గానం చేసిన కీర్తనలలో చోటుచేసుకుని ఉంటుంది. "జానపదము సంగీత రచనకంటె ప్రాచీనమైంది. కనుక ఈ పాటలు లక్షణ బద్ధాలు కావు. వీటికి కష్టమైన సంచారముగాని, సంగతులుగాని ఉండవు. ఇవి పూర్వరాగాలలో రచింపబడి ఉంటవు. (గా.క.బో. 121 పే) సంగీత శాస్త్రబద్ధ కాని గీతాలన్నీ జానపదాలే) (గా.క.బో. 123 పే) ఇట్టి కీర్తనలు కొన్ని వేంకటదాసు కీర్తనలలో ఉన్నాయి. ఉదాహరణకు కొన్నింటిని ఇచట సూచిస్తాను.

లాలి జోల పాటలు :

"నావన్ని కృష్ణమ్మ సవమున్మ నాకాగ లాలి లాలీ

"రామకృష్ణ జోజో రామచంద్ర జోజో

మంగళ హారతులు :

"మంగళం నందతనయతే మంగళాయామమోదతే

"హారతులీచ్చెద చూడవే రామయ్య మంగళహారతులిచ్చెద చూడవె.

"మంగళం పాండురంగతే జయ

మంగళం పాండురంగతే శుభమంగళకరుణాంతరంగ జయజయ

"మంగళం పాండురంగా వాసుదేవ

మహిత విభవను ప్రసంగా

"పార్వతి నాయక మంగళం పన్నగభూషణ మంగళం"

ఉత్సవంలో పాడిన

"సర్తానజేసేదచూడునీ

కీర్తానజేకొందునేడు

రాగం : అరభి

తాళం : ఖండగతి - ఏక

"పూలవనంతప్పులాడుదమా

గోపాలుని లీలలు పాడుదమా

రాగం : ఆనందభైరవి
తాళం : ఆది

అనే పాటలలో లోలాల పాటల ప్రభావమే గోచరిస్తున్నది,
ఇంతేగాక "ముద్దురామచిల్కవే
ముందునాతో పల్కవే"
"గుటిగి మెక్కటామైనయ్యా

తమద రొట్టె తాపాము బుట్టె మొదలైన కీర్తనలకు సాంప్రదాయరాగాలలో పాడటం కంటే ఆయా కీర్తనల స్వభావాన్ని గమనించి తగినలయలో పాడుకుంటేనే శ్రావ్యంగా ఉంటాయి. ఉదాహరణకు "ఎంకి పాటలను" సంప్రదాయ బద్ధం చేసి పాడేకంటే తగినలయలో పాడితేనే విన్నసొంపుగా ఉంటాయి" అని ఈ కీర్తనలకు రాగనిర్ణయం చేసిన సి.హెచ్. భాస్కర్ గారు అభిప్రాయ బడ్డారు. అంతేగాక 'సాహిత్యపు విలువ ఉన్న కీర్తనకే సరియైన సంగీతం పాడుతుంది' అన్న వీరి మాటలు సంగీత సాహిత్యాలకున్న అవినాభావాన్ని తెలుపుతున్నాయి. అయినా పై కీర్తనలలో సంప్రదాయంలో బడిగే కొన్ని కీర్తనలకు రాగతాళ నిర్ణయం చేయటం జరిగింది.

ఇట్లా సంగీత విద్వాంసులెవరైన పూనుకుని ఈ వేంకటదాసు కీర్తనలకు సంప్రదాయ పద్ధతిలో రాగ, తాళ నిర్ణయాలను చేసి గానంచేస్తే ఇవి మరింత ప్రచారాన్ని పొందే అవకాశముంది. ఇంక వేంకటదాసు జీవిత విశేషాలను తెలుపుతాను.



ఐదవ ప్రకరణం

# వేంకటదాసు జీవిత విశేషాలు

వ్యక్తి పుట్టింది మొదలు మరణించేంతవరకు జరిగిన కాలాన్ని ఆ వ్యక్తి యొక్క జీవిత కాలం అంటాం. ఈ జీవిత కాలంలోని కర్మలన్ని కాలక్రమేణా చరిత్ర అని వ్యవహరింపబడతాయి. మనస్తత్వం, ప్రవర్తన, సంప్రదాయ ఆచరణ మొదలైన వన్ని ఆ వ్యక్తి జీవితానికి ముఖ్యాంశాలుగా ఉంటాయి. వ్యక్తి యొక్క మానసిక వికాసానికి పునాది వంశం అని చెప్పవచ్చు. ప్రతి వ్యక్తి సాధారణంగా వారి వారి వంశమందలి పూర్వీకులను ఆదర్శంగా, ఆధారంగా చేసుకుని మానసికంగా ఎదుగుతుంటాడు. దీని తరువాత వ్యక్తి మీద చెప్పుకోతగిన ప్రభావం నూపేది సమాజం, నాటి సమాజానుగుణంగా అతని ప్రవర్తన రూపుదిద్దుకుంటుంది. కాబట్టి వ్యక్తి జీవితం సమాజం ఆలంబనంగా ఉంటుంది. సమాజం యొక్క నాడిని తెలుసుకున్న వ్యక్తి తన జీవితాన్ని ఒక శక్తిగా రూపొందించుకుని తానే సమాజాన్ని నడిపించే శక్తివి కలిగి ఉంటాడు. ఫలితం యొక్క మంచీ చెడులు నడిపే వ్యక్తి యొక్క మానసిక వికాసంపై ఆధారపడి ఉంటుంది. పదునెనిమిదవ శతాబ్దివాడుగా భావింపబడుతున్న రాకమచర్ల వేంకటదాసు గారి జీవిత విశేషాలలో భాగంగా ముందు వారి జీవిత విశేషాలలో భాగంగా ముందు వారి వంశ చరిత్రను గూర్చి తెలుసుకుందాం,

## దాసుగారి వంశ చరిత్ర

వేంకటదాసుగారి జీవిత విశేషాలు తెలుసుకునేందుకు "శ్రీ రామపుచర్ల మహాత్మ్యము వేంకటదాసుగారి జీవితము వీరి భక్త బృంద చరితములు" అనే పుస్తకం తప్ప అచ్చులో మరి యొక ఆధారం లేదు. ఈ పుస్తకమునకు సంబంధించిన వ్రాత ప్రతిని భాగ్యనగరంలో ఉన్న మాన్యుస్క్రిప్టు గ్రంథాలయంలో (గ్ర. సం 4057 కేటలాగు పే. 217) చూశాను. దీనితో పాటుగా నేను పెద్దల నుండి సేకరించినవి, దాసుగారి వంశీకుడైన తిరుమలరావు గారి మనుమడు మొల్గర రంగారావు గారి నుండి సేకరించిన వేంకటదాసు గారి జీవిత విశేషాలు ఆధారంగా విషయాన్ని వివరించటం జరుగుతున్నది.

వేంకటదాసుగారిది 'మొల్గర' వంశం. అనంతమాంబ పురుషోత్తములు వీరి తల్లి దండ్రులు. పెద్దాపురం అగ్రహారం వీరి నివాసం. నేడు ఈ గ్రామం పాలమూరు జిల్లా అచ్చంపేట తాలూకాలో ఉంది. నిజాం రాష్ట్రంలో దేవరకొండ తాలూకాకు చెందిందీ ఊరు. వీరు భారద్వాజస గోత్రీకులు. ఆపస్తంబ సూత్రులు. రామానుజ మతస్థులు. అక్కన్న, మాదన్న మంత్రులు వీరి వంశానికి చెందిన వారే. (వ.శీ.న. 2 పే.)

దాసు గారి తండ్రి అయిన పురుషోత్తం గారు పెద్దాపురం గ్రామకరణీకం చేస్తుండేవారు. ఈ గ్రామానికి సుమారు అరమైలు దూరంలో మొలగర అనే గ్రామం ఉంది. ఈ గ్రామనామమే వారి వంశనామమై ఉంటుంది. లేదా మొల్గర వంశీకుల అగ్రహారం అవటం చేత ఆ గ్రామానికి 'మొలగర' అనే పేరు పెట్టి ఉంటారు. పెద్దాపురం, మొలగర, లక్ష్మాపురం, దానర్లపల్లి, ఉల్పర, నడగోడు, గ్రామాలు మొల్గర వంశీకుల పలుబడిలో ఉండేవి. ఈ వంశీయులైన పూర్వీకులు కోఠారి వారింటికి ఆడపిల్లనిచ్చి అరణంగా మొలగర గ్రామాన్ని ఇచ్చారు. తరువాత కోఠారి వారి ఇంటి ఆడ పడుచు కూతురైన జానకమ్మ మొల్గర వంశీకుల కోడలయింది.

కోల్లాపురం, జటప్రోలు సంస్థానాధీశులైన సురభిదేశ్ముఖులు పెద్దపురాన్ని నాటి ప్రభువయిన పెద్దిరాజుడు పేర పదునాల్గు తరాల క్రిందట ప్రకటించారు.

ఒకప్పుడు 'గోదలు' పరగణాను ఏలిన మాదానాయని కుమారులలో పెద్దవాడు ఈ పెద్దినాయుడు. ఈతడు మిక్కిలి ధర్మాత్ముడు ''వేంకటదాసు గారి జన్మస్థలమైన 'పెద్దాపురం' ఈతని పేరనే స్థాపింపబడినది. (ప.శ్రీ.న. 2 పే)

భారద్వాజస గోత్రీకులై , కాస్యాదేశ పాండ్యులు మచ్చే దారులు. చరిత్రలో ప్రాముఖ్యం కలిగి ఉన్న గోదలకే 'కాస్యా' అనికూడా పేరున్నది. సురభి వంశ ప్రభువులు సురగి పట్టణాన్ని వదలి పెట్టి గోదలలో కేంద్రం ఏర్పరచుకున్నారు. తరువాత వీరిలో ఒకశాఖ లింగాలకు, రెండవశాఖ పెద్ద పల్లికి, మూడవ శాఖ కొల్లాపురానికి తరలిపోయారు. కొల్లాపురం చేరిన సురభి వంశప్రభువులు జటప్రోలు గ్రామం ఇచ్చాడు జటప్రోలు జటచోళ భీముని పేర నదీ ప్రాంతములో స్థాపింప బడిన ఒక గ్రామం జట అనగా చీడి ప్రాయ అని అర్థం. (ప.శ్రీ.న. 2 పే) పెద్దపల్లి లింగాల చేరిన సురభి వంశీయులు దేశముఖులుగా వ్యవహరింపబడ్డారు.

పెద్దపల్లి చేరిన సురభి వారి శాఖీయులైన తెల్కపల్లి సురభి వారు రేచర్ల గోత్రికులు పేరు రాచకొండ దేవరకొండలను ఏలిన పద్మనాయకుల సంతతి వారు. ప్రభుత్వం పతనమైన పిమ్మట పెద్దాపురం దగ్గరలో ఉన్న 'దుందుభి' నదికి అవలగా "సురభి ... ఇం" అను పేర ఒక పట్టణాన్ని ఏరు స్థాపించారు. తరువాత దాన్ని కూడా విడచి గోదలకు పోయారు. అక్కడ స్థిరపడి సురభి వారనే వంశనామంతో ప్రసిద్ధి చెందారు. పద్మనాయకులలోని భేతాళనాయకుడు ఈ వంశంవాడే.

పూర్వం పెద్దాపురం, మొలగర మొదలైన గ్రామాలు కూడా కుతుబ్ షా కాలంనుంచి ప్రసిద్ధిలో ఉన్న గోదల పట్టిలో చేరినవే. కాని మొలగరలో ఉన్న దొరలు తమ ఆడపడచుకు వనపర్తి సంస్థానం వారితో వివాహం చేసినందువల్ల వారికి సంబంధించిన ఇతర గ్రామాలు కొడవటి కల్లు, లింగపట్నం, రుమ్మేనుపేట, పాలమూరు, గౌరవరములను వనపర్తి సంస్థానాధీశులకు స్వాధీనం చేశారు. ఆ సంస్థానాధీశులు ఆ గ్రామాలను మొలగర పట్టితో చలామణి చేశారు. ఇట్లా పెద్దాపురం మొలగర పట్టితో చలామణిచేశాగ పెద్దపురం మొలగర గ్రామాలు గోదల పట్టి నుండి విడగొట్టబడి మొలగరపట్టిగా వ్యవహారంలోకి వచ్చాయి,

భారద్వాజస గోత్రికులైన కస్బా బ్రాహ్మణులు గట్టు తమ్మేను, కొండారెడ్డి పల్లి, పోలిశెట్టిపల్లి, గ్రామాలలో నివాసమేర్పరచుకుని చుట్టుప్రక్కల పది, పన్నెండు గ్రామాల కరణీకం చేస్తుండేవారు. ఈ గ్రామాలన్నీ మఖ్తారుగా ఉండేవి. మఖ్తే, దారులైన ఈ కస్బా బ్రాహ్మణులు దేశపాండ్య ఒరుదాలతో వ్యవహరింపబడేవారు. వీరిది, మొలగర వారిది ఒకే వంశం. పది తరాల వెనుక ఈ కస్బా బ్రాహ్మణులలో కొంతమంది మొలగర వచ్చి స్థిరపడ్డారు మరపత్తి వారికి ఆడపిల్లకు అరణంగా మొలగర నిచ్చిన తరువాత మొలగరను వదలి వేరువేరు గ్రామాలలో నివాసాలను ఏర్పరచుకున్నారు. కాలక్రమేణ చుట్టుపట్ల గ్రామాల కరణీకాన్ని చేపట్టారు. ఇదంతా గోలకొండ కుతుబ్‌షా కాలంలో జరిగిన చరిత్ర. వీరికి అక్కన్న, మాదన్నల ప్రాపకం లభించిందట.

పెద్దాపురంలో ఉన్న మొలగర వంశీకుల కుటుంబంలో తిరుమలరావు ఒక్కడే మగ సంతానం. ఈతని తండ్రి పేరు శేషయ్య. ఈతడు లక్ష్మీపురంలో నివాసమేర్పరచుకుని పెద్దాపురం, లక్ష్మీపురం గ్రామాల కరణీక వ్యవహారాలు చూస్తుండేవాడు. ఈ శేషయ్య గారి కాలం నాటికే వేంకటదాసుగారి దాయాదులు పెద్దాపురం విడచి వెళ్ళారు. తండ్రి మరణించిన తరువాత తిరుమలరావును అతని అక్కగారు చినఅమ్మన్న పెద్దాపురంలో ఉంచి పోషించేది తల్లి దండ్రులు లేని తిరుమలరావు అల్లరిని భరింపలేక, విద్యాబుద్ధులు నేర్పించే అవకాశంలేక అతనిని తీసుకుని పెద్ద ఉమ్మెంతాల చేరింది. అక్కడ వేంకటదాసు గారికి తిరుమలరావును అప్పజెప్పి తిరిగి పెద్దాపురం చేరింది. ఉమ్మెంతాల చేరేవరకు తిరుమలరావుకు ఎనిమిది సంవత్సరాల ప్రాయముంది. ఆ సమయంలో వేంకటదాసుగారే అతనికి సమస్తమై ఉపనయనం చేసి, గాయత్రీ మంత్రోపదేశం చేశారట. ఇది సంక్షిప్తంగా మొలగర వంశ చరిత్ర. ఈ విషయాన్ని తెలిపిన రంగారావు గారు మొలగర వంశంలో పదవ తరానికి చెందినవారు. వారు నేటికీ సజీవులై ఉన్నారు.

ఈ వంశ చరిత్ర వల్ల వేంకటదాసు గారి పూర్వీకులు రామానుజులుల వారి వైష్ణవ మతాను సారులని తెలిసింది. కాబట్టే తత్త్వ విషయంలో వేంకటదాసు గారు కూడా మానసికంగా అవైదికమైన ఆ మత పద్ధతినే అనుసరించి భక్తి మార్గంలో భజన సాంప్రదాయాన్ని జనులలో ప్రచారంచేశారు. దీని వల్ల వీరిని అభిమానించి. అనుసరించిన జనానికి వైదిక ప్రతిపాదిత విషయావగాహన లేకుండా పోయిందని చెప్పవచ్చు.

# మొల్గుర వారి వంశ వృక్షం
## నాటి నుండి నేటి వరకు

కొండమ రాజు
- వెంకట రాజు
  - పాపయ్య
    - శేషయ్య
      - కిష్టయ్య
        - గోపయ్య
          - పెదరామయ్య
        - పాపయ్య
      - మల్లయ్య
        - పురుషోత్తం (పెద్దాపురం)
          - చినశేషయ్య
            - రామారావు
              - వెంకటరావు (దత్తపుత్రుడు)
                - రామారావు
                  - అనంతలక్ష్మమ్మ (దేశపాండ్య వెల్దండవారి కోడలు)
                  - రంగారావు
                    - వేణుగోపాలరావు (అడ్వకేటు)
                    - ఇందిర
                    - పద్మావతి
                  - తిర్మలరావు
                    - సునంద
                    - చంద్రకళ
                    - సుమతి
                  - అంకోశ (వెల్దండవారి కోడలు)
                  - రాంకిషన్‌రావు
                  - హనుమంతరావు
                    - శారద
                    - మధుసూధనరావు
                    - నిర్మల
                    - వాసుదేవరావు
          - రామయ్య
            - నర్సయ్య (దానర్లపల్లి)
          - శేషయ్య లక్ష్మీపురం
            - తిర్మలరావు (పెద్దాపురం)
              - వాసుదేవరావు
          - గోపయ్య
            - కిష్టయ్య
              - వెంకటరామయ్య (అవివాహితుడు)
          - వెంకయ్య (రాకమచర్లవేంకటదాసు)
      - కొండయ్య
        - సింహయ్య
          - అప్ప కొండయ్య (పెద్దాపురం)

## వేంకటదాసు కాల నిర్ణయం

వేంకటదాసు జనన మరణ కాలాన్ని గూర్చి ఒకేఒక్క ఆధారమైన "శ్రీరాకమచర్ల మాహాత్మ్యము వేంకటదాసు జీవితము పి భక్తబృంద చరితములు" అనే పుస్తకంలో

"ఈ ధాత్రి నందనుండగు ముచుకుందుడను రాజర్షి శ్రేష్ఠుండునే జన్మించుటకు తగిన దంపతులు సకల సద్గుణ సంపత్తిలో పురుషోత్తముండును తత్పత్ని అనంతమాంబలని తలంచి గర్భంబున ప్రవేశించి నవమాసపూర్తి యగు నాటికి సరియైన శాలివాహన శకవర్షంబులు ఇంచుమించు 1730 సంవత్సరాలుగతించి యుండు ప్రాంతమున సకల గ్రహంబులుచ్ఛస్థానంబున నుండగా సర్వోత్కృష్టమైన ఒక్క శుభ ముహూర్తంలో పెద్దాపురంబున ముకుందునాజ్ఞ ముచుకుందుడవతరించెను అతనికి వెంకటాఖ్య నామమిడిరి" (పూర్వార్థం 3 పే) అని తెలుపబడింది.

మరణ కాలాన్ని "శాలివాహన శకవర్షంబులు పదునేడు నూర్లయెనుబై ఒక్కంటికి సరియైన సిద్ధార్థి నామసంవత్సరం మార్గశీర్ష శుద్ధ 13 (త్రయోదశి) నాటి దినమందు మలినంబగు భౌతిక శరీరంబు పరిత్యజించి దివ్యదేహంబు గైకొని" (49 పే) అని తెలుపబడింది.

వేంకటదాసు ముచికుందావతారులని తెలుపబడ్డ విషయంలోని ఉచితానుచితాలు ఇచ్చట ప్రస్తుతంశం కాదుకాబట్టి ఈ ప్రకరణంలో తరువాత చర్చిస్తాను. జనన మరణకాలాన్ని బట్టి ఏబది యొక్క సంవత్సరాల కాలం దాసుగారు జీవించారనీ, గతించి నేటికి 128 సంవత్సరాల కాలమైందని తెలుస్తున్నది.

సూర్యాపేట నివాసి శ్రీ రామాచార్య (ప్రస్తుతం జీవించి ఉన్నాడు) రచించిన "వేంకటనాథ చరితము" అనే బుర్రకథలో (ఈ బుర్రకథ ఇంకా అచ్చుకాలేదు) "అనంతమాంబ గర్భంధరించి క్రమ క్రమంగా క్రమ క్రమంగా నవ మాసాలు గడిచిన శా॥ శ॥ వర్షంబులు 1730-1738 మధ్యకాలంబున శుభ లగ్నంలో జన్మించాడని, మరణాన్ని గూర్చి "శాలివాహన శకం 1781 వర్షంబులో సిద్ధార్థి సంవత్సర మార్గశిర శుద్ధ 13వ నాడు శివంగతుడైనాడు" అని ఉంది. ఇది పూర్తిగా

పై పుస్తకం ఆధారంగా వ్రాసిందే అనేందుకు సంశయించనక్కరలేదు. అయితే పై గ్రంథంలో వేంకటదాసు గారి జన్మకాలం "శా.శ. 1730 సంవత్సరాలు గతించి యుండు ప్రాంతంలో" అని చెప్పియుండటం చేత, దాసు గారు నలుబదియైదు సంవత్సరాల తరువాత రెండు మూడు సంవత్సరాలే జీవించియున్నారని (శ్రీ.రా.మూ.వేం.దా.జీ. 38 పే) తెలిపి ఉండటం చేతను రామాచార్యులు తమ బుర్రకథలో దాసుగారి జన్మకాలాన్ని "శా.శ. 1730 - 1733 మధ్యకాలమని తెలిపి ఉండవచ్చు. పై గ్రంథాన్ని బట్టి దాసుగారి జీవితకాలం నలుబది ఏడు లేక నలుబది సంవత్సరాలుగా చెప్పాలి. అదే పుస్తకంలో తెలిపిన దాసుగారి జన్మకాలం విషయంలో శా.శ, 1730 గతించియుండు ప్రాంతం అంటే శా.శ. 1731 అనుకోవలసి ఉంది. మరణకాలం శా.శ. 1781 అని చెప్పియుండటం చేత దాసుగారు 50 సంవత్సరాలు జీవించినట్లు తేలుతున్నది. కాని అదే గ్రంథంలో నలుబదియైదు సంవత్సరముల వయస్సు తరువాత దాసుగారు రెండు, మూడు సంవత్సరాలే అనటం చేత రెంటికి పొంతన లేకుండా పోయినది. దాసుగారి జీవితకాలం 48 లేక 49 సంవత్సరాలు అనే విషయాన్ని ప్రమాణంగా తీసుకుని దానికి సరిపోయేట్లు రామాచార్యులు తమ బుర్రకథలో వేంకటదాసు గారి జన్మకాలం 1730-1733 మధ్యకాలం అని తెలిపినట్లు అవగతమౌతున్నది. దాసుగారు మరణించింది శా.శ. 1781 అని ఖచ్చితంగా తెలిపి ఉండుటంచేత ప్రస్తుత శాలివాహన శకం 1909 కాబట్టి వేంకటదాసు గారు గతించి నేటికి 128 సంవత్సరాలైంది. దాసుగారు జన్మించి సుమారుగా 177 లేక 178 సంవత్సరాలైంది.

ఈ విషయంలో వేంకటదాసు గారి వంశస్థులు, రెండవ మఠాధిపతి అయిన తిరుమలరావు గారి మనుమడు మొలగర రంగారావు గారు తెలిపిన విషయం ఈ దిగువ గమనించవచ్చు.

రంగారావు గారి పూర్వీకులు వేంకటదాసు గారు 1244 ఫసలీలో అంటే క్రీ.శ. 1834 శా.శ 1756లో జన్మించినట్లు చెప్పుకునేవారట. జీవితకాలం 50 సంవత్సరాలుగా తీసుకుంటే 1294 ఫసలీలో అంటే క్రీ.శ. 1884 సంవత్సరం, శా.శ. 1806లో వేంకటదాసు మరణించి ఉంటారని తేలుతున్నది. అంటే దాసుగారు గతించి వర్తమానకాలానికి (1988-1883 = 103) 103 సంవత్సరాలైంది. చరిత్ర

ప్రకారం 128 సంవత్సరాలు. వారి వంశీకుల అభిప్రాయానికి చరిత్ర కథనా ఇరువది అయిదు సంవత్సరాల తేడా కనపడుచున్నది.

అయితే రంగారావు గారే తెలిపిన వారి తాతగారైన తిరుమలయ్య వివరాలను పరిశీలిస్తే వేంకటదాసు జనన విషయంలో వీరు చెప్పిందే విశ్వాసనీయం ఉంది. వేంకటదాసు మరణానంతరం ఈ తిరుమలయ్య (తిరుమలరావు) మఠాధి అయ్యారు. అందువల్ల దాసుగారి కాలనిర్ణయానికి ఈ వివరాలు పరిశీలించ సమంజసంగా ఉంటుంది. రంగారావు గారి కుటుంబంలోని పెద్దలు చెప్పుకు తిరుమలయ్య గారి వివరాలు ఈ క్రింద తెలుపుతున్నాను.

తిరుమలయ్య గారి మరణం : క్రీ. శ. 1906
జీవన కాలం : 58 సం॥లు
జనన కాలం : క్రీ. శ. 1848
వివాహంనాటికి వయస్సు : 34 సంవత్సరాలు.

చరిత్రననుసరించి తిరుమలయ్య గారి వివరాలు ఇట్లా తెలుస్తున్నాయి.
నిర్యాణం : క్రీ.శ. 1911

వేంకటదాసు నిర్యాణ సమయంలో వీరి వయస్సు 15 సంవత్సరాలు. దాసుగా తరువాత ఒక సంవత్సర కాలానికి అంటే పదునారవ ఏట వీరు మఠాధి పత్యాని చేపట్టారు.

జీవించిన కాలం మొత్తం : 52 సంవత్సరాలు
మఠాధిపత్యంలో ఉన్న కాలం : 52—16 = 36 సం॥లు.
అయితే "తిరుమలయ్య గారు ఇంతకాలం మఠాధిపత్యం కొనసాగించలేదని వ పెద్దల అభిప్రాయం." అని రంగారావు గారు తెలిపారు.

తిరుమల్లయ్య వివాహం చేసుకొని పెద్దాపురం నుంచి పెద్ద ఉమ్మెంతాల వెళ్ళారట. తనకు చెప్పకుండా వివాహం చేసుకుని వచ్చిన తిరుమలయ్యత వేంకటదాసు మాట్లాడలేదట పాదాభివందనం చేసిన తిరుమలయ్యను వాచ్యంగా

వించలేదట. అది చూచిన దాసుగారి భార్య రాజ్యలక్ష్మమ్మ గారు భర్తకు నచ్చజెప్పి దాసుగారి కోపాన్ని శాంతింప జేశారట. ఈ సమాచారాన్ని బట్టి తిరుమలయ్య వివాహానంతరం దాసుగారు జీవించి ఉన్నారని, వివాహితులై ఉన్నారని తెలుస్తున్నది. దీనిని బట్టి దాసుగారి మరణ సమయానికి తిరుమలయ్యకు 15 సంవత్సరాలని చెప్తున్న చరిత్ర వీరి పూర్వీకుల మాటలకు పూర్తి విరుద్ధంగా ఉంది. అందువల్ల వంశీకుల మాటలనే సత్యప్రతిపాదనకు ఆధారంగా తీసుకోవటం సమంజసంగా ఉంటుంది, అని నేను భావిస్తున్నాను. వాటిని ఈ క్రింద సమన్వయ పరుస్తాను.

దాసుగారి వంశీకుల మాటల ప్రకారం

| | | |
|---|---|---|
| వేంకటదాసు జననం | : | క్రీ.శ. 1834 |
| మరణం | : | క్రీ.శ. 1884 |
| జీవించిన కాలం | : | 50 సం॥లు. |
| రెండవ మఠాధి పతి : | | |
| తిరుమలయ్య జననం | : | క్రీ.శ. 1848 |
| మరణం | : | 1906 |
| జీవించిన కాలం | : | 58 సం॥లు. |
| వివాహకాలానికి తిరుమలయ్య వయస్సు | : | 34 సం॥లు. |
| వివాహమైన కాలం | : | 1848 + 34 = 1882 క్రీ.శ. |

వేంకటదాసు మరణం క్రీ.శ. 1884 అని పైన వివరించాను. దీనిని బట్టి వేంకటదాసు గారు తిరుమలయ్య వివాహనంతరం రెండు సంవత్సరాలు జీవించి ఉన్నారని తెలుస్తున్నది. శ్రీమతి రాజ్యలక్ష్మమ్మగారు తన భర్తయైన వేంకటదాసులకు తిరుమలయ్య విషయం నచ్చ చెప్పగల చనువు కలిగి ఉందంటే అప్పటికి దాసుగారి వివాహమై రెండు మూడు సంవత్సరాలు జరిగి ఉండవచ్చు. దాసుగారికి వివాహకాలానికి వయస్సు నలుబదియైదు సంవత్సరాలు. క్రీ.శ. 1834 + 45 = 1879లో దాసుగారి వివాహమై ఉంటుంది. తరువాత అయిదు సంవత్సరాలు జీవించి క్రీ.శ. 1884లో మరణించి ఉంటారు. మరణ కాలానికి దాసుగారి వయస్సు ఏబది సంవత్సరాలు.

వేంకటదాసు గారి మరణానంతరం తిరుమలయ్య ఇరువది రెండు సంవత్సరాలు జీవించి ఉన్నారు.

| | | |
|---|---|---|
| తిరుమలయ్య మరణం | : క్రీ.శ. | 1906 |
| వేంకటదాసు మరణం | : క్రీ.శ. | 1884 |
| | | 22 |

34 + 2 + 22 = 58 సంవత్సరాలు తిరుమలయ్య జీవించి ఉన్నట్లు తెలుపుతున్నది.

తిరుమలయ్య మఠాధిపత్యం స్వీకరించింది క్రీ.శ. 1885వ ప్రాంతం. దాసుగారి మరణకాలం క్రీ.శ. 1884. వారు మరణించిన సంవత్సర కాలానికి తిరుమలయ్య మఠాధి పత్యం స్వీకరించినట్లు చరిత్రవల్ల తెలుస్తున్నది. నాల్గవ మఠాధిపతి అయిన గోవిందయ్య గారు తిరుమలయ్య సుమారు ముప్పది సంవత్సరాలు జీవించినట్లు తెలిపారు. బహుశ: అది దాసుగారి మరణానంతరం కావచ్చు. మొత్తం మీద తిరుమలయ్య మఠాధిపతిగా ఉన్నకాలం ఇరువది యొక్క సంవత్సరాలు.

యతిరాజ పల్లెకు చెందిన బీర్ల అడివయ్య అనే భక్తుడు తెల్పిన సమాచారం ప్రకారం మాణిక్య ప్రభువు మరణించిన ఒక సంవత్సరం ముందు వేంకటదాసు మరణించాడట. చాళుక్య, రాష్ట్రకూట రాజుల కాలంలో ప్రఖ్యాతి వహించిన కల్యాణి నగరవాసి ఈ మాణిక్య ప్రభువు మహారాష్ట్రలో ఉన్న శివరామస్వామి సదానందుని వదవ శిష్యుడట ఈ మాణిక్య ప్రభువు. సమర్థ రామదాసు కాలంనాటి యోగి పంచకంలో ఈ మాణిక్య ప్రభువు "శ్రీమాణిక ప్రభు చరిత్ర" (6 పే) అనే గ్రంథం తెలుపుతున్నది. ఈ మాణిక్య ప్రభువు మరణ కాలం 29.11.1865 సంవత్సరం దీనికి ఒక సంవత్సరంముందు అంటే క్రీ.శ. 1864వ సంవత్సరం వేంకటదాసు మరణించి ఉంటారని చెప్పాలి. అప్పుడు జననకాలం క్రీ.శ. 1814

అంటే శా.శ. 1736 అవుతుంది. చరిత్ర ప్రకారం శా.శ. 1730 చివరి భాగంలోను, ఈ సమాచారం ప్రకారం శా.శ. 1736 లోను జన్మించినట్లు తెలుస్తున్నది. ఏది ఏమైన విషయ నిర్ణయంలో ఇది సరియైంది అని చెప్పేందుకు తగిన ప్రమాణాలు లేవు. వేంకటదాసు అప్పుడప్పుడు మాణిక్య ప్రభువు పిలిచేవారని చెప్పుకోవటమే కాని, లిఖితపూర్వక ఆధారాలు లేవు ప్రత్యేకంగా మాణిక్య ప్రభువును గూర్చి వ్రాసిన "శ్రీ మాణిక్యప్రభు చరిత" అనే గ్రంథంలో కూడా ఎక్కడా ఈ ప్రస్తావనలేదు. కాకపోతే ఒక విషయం గమనించాల్సి ఉంది. మాణిక్య ప్రభువు మరణించింది మార్గశిర శుద్ధ ఏకాదశి. వేంకటదాసు గతించింది; మార్గశిర శుద్ధ త్రయోదశి. ఈ సామ్యం కాకతాళీయం కావచ్చు కదా!

మూడవ మఠాధిపతి అయిన ఏకనాథస్వామి వారు క్రీ.శ. 1911 లో మఠాధి పత్యం వహించినట్లు తెలుస్తున్నది అంటే తిరుమలయ్యగారు మరణించిన అయిదు సంవత్సరాల తర్వాత శ్రీ ఏకనాథస్వామి మఠాధిపత్యము వహించారు. ఇంత ఆలస్యం జరిగి ఉంటుందా? అనే సంశయానికి జరిగి ఉండవచ్చు అనే సమాధానికి ఆధారం "శ్రీ నేకుచర్ల మహాత్యము వేంకటదాసు జీవితము వీరి భక్త బృంద చరితములు" అనే గ్రంధం (72 పే) లో ఇట్లా ఉంది. "తిరుమలయ్య గారు గతించిన తరువాత తొమ్మిది మాసాలు దేవకార్చన, హరినామ స్మరణ జరుపుతూ ఉండేంతలో ఆశ్వీజ బహుళ షష్టి ఎదురుకోలు ఉత్సవం వచ్చింది దానికి తిరుమలయ్య గారి తాంబూరనుంచి ఉత్సవం జరిపారు. మరునాటి రథోత్సవం నాటి రాత్రి పూట ఈ ఉత్సవానికి నేనే అధ్యక్షుణ్ణని "చల్లబల్లి కిషన్ రావు" గారు వాదించారు అచటి యాత్రికులు ఈ వాదపరిష్కారం కోసం వేంకటదాసు గారి ధర్మపత్ని అయిన రాజ్యలక్ష్మమ్మ గారిని కోరారు. తరువాత వారు ఏకనాథస్వామికిమ్మని తెలిపారు. ఈ సమాచారాన్ని బట్టి తిరుమలరావు గారి తరువాత పీఠాధిపతి నిర్ణయం విషయంలో కొంత ఆలస్యం జరిగినట్లు విదితమౌ తున్నది. ఆ కాలం అయిదు సంవత్సరాలు కావచ్చు. ఈ వివాదం పరిష్కరించిన రాజ్యలక్ష్మమ్మ గారు క్రీ.శ. 1925-26 ప్రాంతంలో మరణించారని శ్రీ రంగారావు తెలిపారు. ఏకనాథ స్వామి మరణం పార్థివనామ సంవత్సరం ఫాల్గుణ శుద్ధ చతుర్దశి శుక్రవారం అని నాల్గవ మఠాధిపతి అయిన శ్రీ గోవిందయ్య గారు

ఈ అవతారవాదాన్ని ఏర్పరిచారని సత్యార్థ ప్రకాశిక (స.ప్ర. 242 పే) తెలిసింది పరమాత్మ అజనుడు. కాబట్టి ఆయన జన్మించుట అనేది లేదు. జీవుడికి మాత్రం పునర్జన్మ ఉంది. 'తద్యథాతృణ జలాయుకా తృణ స్యాంతం గత్వా2న్యమాక్ర మమాక్రమ్యాత్మాన ముపసంహరతి. ఏవమే వాయమాత్మేదం శరీరం నిహత్య, అవిద్యాం గమయిత్వా, అన్యమాక్రమ మాక్రమ్యాత్మానముప సంహరతి' (బృ.ఉ. 4-4-3) గొంగడి పురుగు తృణాంకం చేరి రెండవ తృణాన్ని ఆధారంగా పట్టుకుని తన తృణాంకం మీదికి చేర్చుకుంటుంది. అట్లాగే ఆత్మకూడా ఈ శరీరాన్ని వదలి, తొలగిపోయిన అవిద్యకలదై ఇంకొక శరీర సహాయంతో ఆచటికి చేరుతుంది. జీవుడు మరణించినపుడు అతని విద్య, కర్మ, పూర్వప్రజ్ఞ అనే మూడు వస్తువులు ఆత్మవెంటపోతాయి. (బృ.ఉ. 4-4-2) సామాన్యంగా జీవులు బద్ధులు. ముక్తులు అని రెండురకాలుగా ఉంటారు. అందులో బద్ధ జీవి ముక్తి లభించేంతవరకు, ఒక శరీరాన్ని వదిలి మరొకశరీరంలో ప్రవేశికచ్చేంతవరకు దుఃఖదుఃఖాను భూతులను పొందుతుంటాడు (బృ ఉ. పే).

ఈ వైదిక ప్రమాణాన్ని పట్టి వేంకటదాసు గారు బద్ధ జీవి అని మాత్రం చెప్పవచ్చు. వేంకటదాసు గారు ముచుకుంద అవతారులు అని చెప్పటం మాత్రం వారి అభిమానులు, అవైదిక మతాభినివేశులైన ఎరను చూపి గాలంవేసేందుకు జనులలో చేసిన అసత్య ప్రచారమని చెప్పవచ్చు. అందుకు నిదర్శనంగా దాసుగారు ముచుకుందావతారులని నిరూపించటానికి పేరు చూపించిన హేతువులను పరిశీలిస్తే పై విషయం స్పష్టపడుతుంది.

## అవతార వాదహేతువులు - ఖండనం.

వేంకటదాసు గారు ముచుకుందావతారులని "శ్రీ రాకమచర్ల మహాత్మ్యము వేంకటదాసు గారి జీవితము వీరి భక్తబృంద చరిత్రములు' అనే పుస్తకంలో చూపిన ఆధారాలిట్లున్నాయి.

శ్లో॥ జ్ఞాత్వా ధర్మస్థితో జన్తూన్ వ్యవదీద్మృయాదిభిః
సమాహితస్తత్రపహ జహ్యాఘం మదుపాశ్రయః

శ్లో॥ జన్మన్యన స్తరే రాజనీ సర్వభూత సుహృ త్తమః
భూత్వా ద్విజవర స్త్వం పై షామువైష్యని కేవలమ్ః

(శ్రీ మధ్భాగవతం (సం,) 641 పే 454 శ్లో 63, 64 ఉ త్తర్థం,)

వ॥ "నరేంద్రా! నీవుతల్లి క్షత్రియ ధర్మంబున నిలిచి, మృగయా వినోదంబుల జంతువుల వధియించినాడవు. తపంబున దత్కర్మా విముక్తుండవై తర్వాతి జన్మంబున సర్వభూతసఖత్వంబు గలిగి బ్రాహ్మణ శ్రేష్ఠుండవై నున్నుంజే రేదవని పీడ్కొలిపిన హరికి బ్రదక్షిణంబు వచ్చి నమస్కరించి గుహ వెడలి సూక్ష్మ ప్రమాణ దేహంబులతో నున్న మనుష్య పశు వృక్షాలలోదులంగని కలియుగంబు ప్రాప్తంబుగునని తలంచి"

(శ్రీ మహాభాగవతం(తె) ద.స్కం.పూ.భా.వ. 1665 పే 1224)

అనే భాగవత వల్కులు వేంకటదాసుగారు ముచుకుందావతారులసేందుకు చూపిన మొదటి ఆధారం.

ఖండన :

పై భాగవత శ్లోకాలలోగాని, వచనంలో గాని ముచుకుందుడు వేంకటదాసుగా జన్మిస్తారని చెప్పబడలేదు. సంస్కృతభాగవతంలోని "భూత్వాద్విజవరస్త్వం వై మామువైష్యసి కేవలం' అనే పాదాన్ని, తెలుగు భాగవతంలోని 'తర్వాతి జన్మంబున సర్వభూత సఖత్వంబు గలిగిన బ్రాహ్మణ శ్రేష్ఠుండ వైనన్ను.' అన్న వాక్యాన్ని బట్టిగాని దాసుగారే ముచుకుందావతారులటం న్యాయసమ్మతంగా ఉండదు. కారణం ఏమిటంటే కాలంకలియుగమే అయినా 1800 సంవత్సరాల తరువాత జన్మించినవాడు వేంకటదాసు గారు. అన్ని సంవత్సరాలు ముచుకుందుడు జన్మను పొందలేదని చెప్పేందుకు ఆధారంలేదు. అంతేగాక ఈ లోగా ఎందరు బ్రాహ్మణులుగా జన్మించి శ్రీహరిని సేవించిన వారుండరు? అట్టియెడదాసుగారే ముచుకుందులు అని చెప్పేందుకు నిర్దుష్టమైన ఆధారంలేనందున ఈ హేతువు సరైందిగా తోచటం లేదు. "సర్వభూత సఖత్వంబుగిలిగి బ్రాహ్మణ శ్రేష్ఠుండవై" అని భాగవతంలో తెలిపిన

దానికి విరుద్ధంగా కొన్ని సమయాలలో సర్వభూత సఖత్వంబు నుపేడి కోపించి నట్లు దాసుగారి జీవిత చరిత్రలో వ్రాయబడింది. కొన్ని సన్నివేశాలు.

"దాసాదార్యుల వారుసయ్యంపల్లె గ్రామానికి వెళ్లిరి. అక్కడ నివసిస్తున్న ఒకశైవ మతస్తుడు మీ కీర్తనలు తప్పుల కుప్పలని వాదించెను, అందుకు దేసాదారుల వారు అంధుడ వీవెరుంగవని అన్నంత మాత్రాన వాడు అంధుడై పోయెను" (రా.వేం.జీ.వి.భ.చ. 23పే).

"అర్యుల వారు ఉమ్మెంతాలలో ఉంటున్నారు. అప్పుడు యాదవస్త్రీ పుల్లమ్మ వాకిలి ఊడ్చేది. ప్రతిఫలంగా సంవత్సరానికొక కొత్త చీర ఇచ్చేవారు. అప్పుడప్పుడు ఆస్త్రీ దాసుగారికి అంగమర్దన చేస్తుండేది. ఇట్టి సమయంలో ఒకసారి అంతకు ముందు రోజే తనకిచ్చిన కొత్త చీరను కట్టుకుని వచ్చి యుండటంతో దాసుగారికి చూపించాలని తహతహ పడింది. దానితో పాటు దాసుగారి సౌందర్యానికి మోహితయైన ఆస్త్రీ చీర చరగును జార్చి స్తనములు కనపడునట్లు చేసిచేతులెత్తి దాసుగారి సమీపానికి వచ్చిందట. అప్పుడు దాసుగారు పుల్లమ్మను అసహ్యించుకుని "ఛీ నీచీరగాలా" అనితోసివుచ్చారట" (రా.మా.వేం.జీ వి.భ.చ. 29పే)

తరువాత అనుగ్రహించినా ఇట్టి సంఘటనలలో దాసుగారు కొంత కోపం వహించి నట్లు తెలుస్తున్నది. దీనిని బట్టి కొన్ని సమయాలలో "సర్వభూతసఖత్వంబు కలగి" ఉండటం అనేవిషయాన్ని దాసుగారు అతిక్రమించినట్లు కనబడుతుంది. ముచు కుందుడు అమాయక జంతువులను హింసించేగగా మనశ్శాంతిని కోల్పోయింది. కృష్ణుని చేత సర్వభూతసఖ్యంబున కలిగియుండుమని చెప్పబడి కూడా జన్మాంత రంలో ఇట్లా కోపించి ఉంటాడా. అనే విషయం ఆలోచింపతగ్గది. దీనిని నట్టి దాసుగారు ముచుకుందావతారమని చెప్పవిలుకాకున్నది.

2. దాసుగారు ముచుకుందావతారులే అని నిర్ణయించటానికి రెండవదైన హేతువు దాసుగారి కీర్తనలు.

1. "దాతావు సేతావు ధర్మశాలినీ నాతండ్రీ నామీద

దయవుంచరా" ॥ప॥
(ప్ర. 1930 రా.వే.కీ,వె, 89)

అనే కీర్తనలో "కరుణించినానూనినువెసువకన్నమాట స్థిరమాని చేతులోచెయ్యి వెయ్యరా" అనే చరణం,

2. ఘను లెందరైతేమిమన నందుమాపమునజూచి
సట్లుండదు నీదయ లేదు అనుకొన్న ఫలమబ్బదు ॥ప॥
(ప్ర. 1930 రా.వే.కీ. 115పే) అనే కీర్తనలో

"దిన దినంబును నన్ను దిప్పకురా
చరిము-దుమాతోచనువు జేసిన మాటదప్పకురా
శరణంటిగదరా కనికరంబుజూడగలిగితె
కావవెచలమింత లేకనుపనికి మాలిన చిత్తం
మోహము పాలు దేయను నీకు మ్రొక్కెదరా ॥ఘను॥
టేడనేరసినా ఏడువననుచు ముచ్చటాడిన ఫలమేదిరా
దాసు త్రోవ నాత్మలో పలలేదురా, మాటిమాటికి నన్ను
త్రిప్పకురా
నీయూనయువరిని వేడలేనిక కావవెందుకురా"

అనే చరణాలు, పూర్వం హరియొసంగిన ఆజ్ఞను సూచించున్నవని,

3. "సీతారామదాసులాను చేరినారము
భజనచేసేటి పుణ్యాత్ములానుగోరినారము" ॥ప॥
అనే కీర్తనలో

(ప్ర. 1930 రా.వే.కీ. 81పే)

"రట్టు లేని భజన సేయబట్టి నారము
మేము ఘట్టిగా వైకుంఠపురము ముట్టివారము (సీ)
అనే చరణం

4. "శ్రీరామచంద్రులె జగతిదయివంబనుచు చిత్తమందున
నేల్పనా

ఆ రామ మంత్రమే అనుభవర్ధంబనుచు ఆర్యులను
బలికింతునా ॥ప॥ అనే కీర్తనలో
(1930 ప్ర.రా.వే.కీ. 108 పే)

నా దేహమును కేశవార్పితం బనుమాటనమ్మి అనలము జూత్తునా
మోదమున శ్రీపతెముక్తి కాధారమని భూమిచేపలికింతునా (శ్రీ)

అనే ప్రతిజ్ఞ పలకటం చేత ఈ వాక్యాలన్నీ పూర్వజన్మను సూచిస్తున్నాయి కాబట్టి ఆర్యుల వారిది ముచుకుందావతారమని నిశ్చయించనయినది. (రా.మూ.వేం.జీ.వి భ.చ. 3 పే)

ఖండనం :

పై కీర్తనలన్నింటిని సావధానంగా పరిశీలిస్తే అవైదికమైన వైష్ణవ భక్తి తత్త్వం తప్ప మరియే యితర అంశం గోచరంకాదు. కీర్తనలోని ఏఒక్క పదాన్నో, వాక్యాన్నో, ఊతగా గొని తాను కనుగొనదలచిన లక్ష్యానికి అంటే దాసుగారు ముచుకుందావతారమని నిర్ణయించటం పాడిగాదు. భాగవతంలో కృష్ణుని వచనాలు విన్న తరువాత ముచుకుందుడు మారుమాటాడక గుహనుండి వెడలాడు. అంటే కృష్ణుని మాటపై నమ్మిక కుదిరేకదా! కాని ఇందు ఉదహరించిన మొదటి కీర్తనల "దాసుని వెరువకన్నమాట స్థిరమాని చేతులో చెయ్యివెయ్యరా" అని దాసుగారు అడగటం పై విషయానికి అసంబంద్దమే గదా! లేక మరోజన్మ ఎత్తిన ముచుకుందునికి కృష్ణుని వాక్యాలపై నమ్మకం పోయిందని చెప్పవలెనా! అట్లా రెండో కీర్తనలో "మాతో చనువుజేసిన మాట తప్పకురా" అంటూ గుర్తు చేయాల్సిన అగత్యమేమున్నది? అట్లై కృష్ణుడు మరపుతో మాటతప్పే ప్రమాద ముందని భావమా! అదే కీర్తనలో "నీయాన ఎవరిని వేడలేనిక" అనటం వైష్ణవ భక్తిని సూచిస్తున్నదే కాని దాసుగారి అవతారవిశేషాన్ని కాదు అట్లాగే మూడు,

నాలుగు కీర్తనలలో "మేము గట్టిగా వైకుంఠం ముట్టే వారము" అనటం "నాదేహంకేశవార్పితం" అనే ప్రతిజ్ఞ వైష్ణవ మతనమ్మకాన్ని నిశ్చయాన్ని తెలుపుతున్నాయి. అంతేగాని వేంకటదాసుగారు అవతార విశేషాన్ని కాదు.

ఇట్లా దాసుగారి అవతరావాదన ఖండనానంతరం ఒక విషయం చెప్పవచ్చు. శ్రీ వేంకటదాసు బద్ధజీవి. పూర్వజన్మ సుకృతిననుసరించి ఈ జన్మలో భక్తుడై, కర్మానుసారం బాధలను అనుభవిస్తూకూడా ముక్తికై ప్రయత్నించారు. కాని వైదిక సత్యమార్గ దర్శనం కానప్పుడు ముక్తి లభించేదెట్లు?

ఇక అవతార నిర్ణయానికి స్థల చరిత్రకూడా ఒక ముఖ్యాంశమే గనుక పరిశీలింతము. పై గ్రంథంలోని ఆరవపేజిలో వేంకటదాసుగారి అవతారానిర్ణయానికి సంబంధించిన స్థలహేతువు ఇట్లా తెలుపబడింది.

"దండకారణ్యమని, ఆంధ్రదేశమని చెప్పబడే కృష్ణా, గోదావరి మధ్యభూమియైన నిజాం రాష్ట్రంలో ఆంధ్రజిల్లా మహబూబ్‌నగరము ఉత్తరదిశకు శ్రీ రాకమచర్ల అనే పుణ్యక్షేత్రం ఒకటయిన్నది. దానికి ముచుకుందాక్షేత్రమని ముచుకుందానది మూలమని దేశజనుల చేత పేర్కొనబడుచున్నది. ఇందుకు తార్కాణంగా :

1. ఈ రాకమచర్లకు పశ్చిమంబున గలభైరవ విఛాండయ క్షేత్రములలో నిదైన అనంతగిరి క్షేత్రం అని వ్రాయబడింది.

2. కంకల్లు గ్రామనివాసి కీ.శే. శ్రీ నరసింహాచార్యుల వారు వ్రాసిన రాకమచర్ల క్షేత్రస్థల మహాత్మ్యం అనే సంస్కృత గ్రంథంలో ఇట్లా వ్రాయబడి ఉంది.

శ్లో॥ హిరణ్యకశిపోర్నాశహేతో లోకశ్య శాంతయే
అవతీర్య నృసింహశ్య వపుషాకరజైర్ద్విష్యం ॥
విదార్యతనయంతస్య ప్రహ్లాదం సైత్యకేపదే
స్థాపయిత్వాజగామోథ రాకమాద్రి మధీ నధి ॥

శ్లో॥ ముచుకుందశ్చయవనంహంతుంకృతమతి స్తతః
రాజ్ఞే ప్రసాదమాకాంక్షి ధాతుంగిరి పుంగవం ॥

శ్లో॥ గౌతమీ కృష్ణయోర్మధే ముచుకుందనదీ తటే
శేషాద్రిపుచ్ఛ భూతోయం వర్తతే పుణ్యకాననః

ఈ శ్లోకాల ప్రకారం హిరణ్య కశిపుని చదివిలోకాలకు శాంతి కలిగించేందుకు అవతరించిన నృసింహుడు హిరణ్యకశిపుని చంపి, అతని కుమారుడైన ప్రహ్లాదుని తండ్రి పదవిలో ఉంచి, నృసింహుడు యవనుని చంపేందుకు స్థిర నిశ్చయుడైన ముచికుందుకోర్కె తీర్చేందుకు రాకమచర్లాద్రిని గూర్చి వెళ్ళాడు. గౌతమీ కృష్ణా

నదీ మధ్యభాగంలో ముచుకుందాక్షేత్రం రాకమచర్ల అని ముచుకుందావతార, వేంకటదాసుగారని చెప్తున్నారు.

ఖండన :

శ్రీ మహాభాగవతంలో నిరాయుధుడైన కృష్ణునివెంట కాలయవనుడు పరుగెత్తు సందర్భంలో

క॥ దారితశాత్రవ భవనున
పౌరమహావేగ విజిత పవనునే యవమనీ
ధూరముగొని చని కృష్ణుడు
ఘోరంబుసనొక్క శైలగుహపడి దోచ్చెనీ.
(శ్రీ.మ.భా.వె) 1632వ 10 స్కంపూ. భా)

కృష్ణుడు గుహలోనికి వెళ్ళాడని ఉంది గాని ఆ గుహకు ఎల్లలుకాని, నిర్దిష్టమైన తావున ఉందని గాని తెలుపబడలేదు. తననేత్రాగ్నిచే కాలయవనుని దగ్ధంచేసిన అనంతరం శ్రీహరి అనుగ్రహాన్నిపొంది; ముచుకుందుడు సంశయాన్ని వదిలి గుహను వెడలి ఉత్తరాభిముఖుడై తపోనిష్టతో బదరికాశ్రమం చేరినట్లున్నది.

(శ్రీ.మ.భా.(తె) 10 స్కం. పూభా. 1566వ). ఈ బదరికాశ్రమం ఎక్కడ ఉంది. ఇది ఆంధ్రదేశానికి ఉత్తరభారతంలోనే ఉందా? నాటికీ నేటికి ఎల్లలతో వ్యత్యాస మొందాలేదా? ఇట్లనేక విషయాలు సాకర్యంగా పరిశీలించి ఈ స్థలచరిత్ర. ఈ విషయాన్ని చరిత్ర కారులు నిర్దిష్ట పరిశోధన చేసితేల్చవలసిన విషయం. ఇట్టి విషయాన్ని అనిర్దిష్టముగా ఉన్న భాగవత ప్రమాణాన్ని లెక్క చేయక రాకమచర్ల ముచుకుందాక్షేత్రమని వేంకటదాసుగారే ముచుకుందావతారమని చెప్పటం సాహసమే అవుతుంది. అంతేగాక చారిత్రక విషయాలలో ప్రజలను తప్పుతోవపట్టించటమే అవుతుంది. ప్రమాణం నిర్దుష్టంగా లేకుండా దాసుగారిపై అభిమానంచేతనో లేక రాకమచర్లపై ఉన్నభక్తి చేతనో ముచుకుందావతారం, ముచుకుందాక్షేత్రమనే ప్రచారం న్యాయసమ్మతంగా ఉండదు.

## రాకమచర్ల స్థల చరిత్ర

రాకమచర్ల స్థల చరిత్రను గూర్చినేను సేకరించిన విషయాలను తెలుపుతాను. 'రేకమ' గ్రామదేవత. రేకమ అంటే పార్వతి. ఒక చెరువు గట్టుపై ఉన్న ఈ దేవత పేరుమీద ఆ చెరువును రేకమ చెరువు అని పిలిచేవారు. కాలక్రమేణ రేకమ చెరువే "రాకమచర్ల" అయింది. రాకమచర్ల గుడి పూజారి పూడూరు నరసింహాచార్యులవారు రాకమచర్ల స్థలచరిత్ర నిట్లాతెలిపారు. "పూర్వం గుడి సమీపాన పెద్ద చెరువులో తోట కలదని దానిని రేకమ్మతోట లేక రేకమ్మ చెరువు అనే వారసి అదే క్రమంగా వేంకటదాసు గారి కీర్తనలలో "రాకమచర్ల" అయిందీ. నేటికిని రాకమచర్లలో గుడి ప్రక్కనే తోట ఉంది. ఆతోట గట్టున రాకమ అనే పేరు గల చిన్న రాతి విగ్రహానికి గుడివలె ఆచ్ఛాదన ఏర్పరచబడి ఉంది. దీనిని బట్టి పూర్వం ఆ గ్రామానికి చెరువు త్రవ్వించి మేలు చేసిన 'రేకమ్మ' లేక 'రాకమ్మ' అనే స్త్రీ మూర్తి పేర ఆ గ్రామనామం ప్రసిద్ధిలోనికి వచ్చి యుండవచ్చు.

రాకమచర్లలో గుట్ట మీద గుడి ఉంది. ఆ గుడిలో యోగానంద లక్ష్మీ నరసింహుని విగ్రహమున్నది. ఆ విగ్రహం చరిత్ర ఇది. ఇచట ఉన్న యోగానంద విగ్రహం ఒక బెల్లపురోతును (ఎరుపు రంగు రాయి) గండు చీమలు తొలచగా ఏర్పడింది. దానికి దృష్టాంతంగా ఇటీవలి కాలంలో అంటే సుమారు నలుబది,

యేబది సంవత్సరాల క్రిందట ఆంజనేయస్వామి విగ్రహాన్ని అట్లా చీమలు తొల చటం తానుచూశానని, గవర్నమెంటు వారి చిట్టాలో యోగానంద స్వామికి బదులుగా "తిరుమలనాథస్వామి" అని ఉన్నదని, భక్త సంప్రదాయంలో రాకమచర్లేశుని యోగా నందలక్ష్మీ నారసింహస్వామి అంటారని పరిగి నివాసియం. లక్ష్మీకాంతరావు గారు తెలిపారు. ఇప్పటికి రాకమచర్ల గుడిలో యోగానంద లక్ష్మీనరసింహా విగ్రహానికి కుడి భాగాన ఆంజనేయస్వామి విగ్రహం, దాని ముందుగా నాగేంద్రుని ప్రతిమ ఉన్నాయి.

దేవాలయ సమీపాన ముచుకుందా పుష్కరిణి లేక ముచుకుందానది అని పిలువబడె' మడుగు ఒకటి ఉంది. పూర్వం నదిగా పారుతున్న ప్రవాహం కొంత కాలం క్రితం ఎండిపోయింది. అప్పుడు ఏకనాథస్వామి (శైవ మఠాధిపతి) నది మొదట్లో ఉన్న గుహలోకి వెళ్లి నీరు తెచ్చారట ఆ గుహలోపలె ముచుకుందానది అని వ్యవహరింపబడే ఆ మడుగు పుట్టుక అని చెప్తారు. కొన్ని సంవత్సరాలు ఎండి ఉన్న ఈ మడుగుకు తరువాత నీరువచ్చాయట, నాటి నుండి ఈ మడుగు ఒకకోకలాగా పుష్కరణి ఏర్పడ్డది. ప్రస్తుతం పెద్దగుంటలో నుంచి (పుష్కరిణి) సన్నని కాలువతో నీరు పారుతుంటాయి ఈ నీరు కొంచెం తగ్గిన మరలా పూర్తిగా ఎండిపోలేదట. ఇంతకు ముందు ముచుకుందానదీ వ్యవహారంతో ప్రవహించిన ఈ ప్రవాహం రెండు పాయలుగా చీలి ఒకపాయ అనంతగిరి గుట్టమీదుగా ఉస్మాన్‌సాగర్‌లో కలిసేది. మరొకపాయ హైద్రాబాదులోని హిమాయత్ సాగర్‌లో కలిసేది మళ్లి ఈ రెండు పాయలు ఒకచోట కలిసేవట. ఆ కలిసిన చోటే మూసా నది అని వ్యవహరింపచే వారని అదే ముచుకుందానది అని శ్రీ లక్ష్మీకాంతరావు తెలిపారు. దీనికి అధారం పీరిమాటలే. ఇది ఆధారంగా చరిత్రకారులు పరిశోధించి సత్యవిషయాన్ని కను గోవటం ఉచితంగా ఉంటుంది.

రాకమచర్ల దేవాలయానికి ఉత్తరదిశలో ఈశాన్యమూలగా సుమారు రెండు కిలోమీటర్ల దూరంలో ఒక గుహ ఉన్నది. ఆ గుహలో వేంకటదాసు గారు తపస్సు నిశారట. ఆ గుహ ముచుకుందుడు తపస్సు చేసిన స్థలమని అచటి జనుల నమ్మకం. దీనికి నిర్దిష్టమైన ప్రమాణం లేదని, అది కేవలం వేంకటదాసుగారి పై అభిమానంతో

వ్యాపించిన వ్యవహారమేనని ఇంతకు ముందు తెలిపిన అవతారవిషయవాదనలో తెలిపాను.

## వేంకటదాసు జీవిత విశేషాలు

బాల్యదశ :

అనంతమాంబ, పురుషోత్తములు దాసుగారి తల్లి దండ్రులు. వారు తమకు జన్మించిన కుమారునికి విధ్యుక్తంగా జాతకర్మనామకరణాదులనుజేసి "వేంకయ్య" అని పేరు పెట్టారు. ఆ బాలుడు బాలసూర్యుడివలె దినదిన ప్రవర్థమానమౌతునాడు. అట్లా ఎదుగుతున్న వెంకయ్య గారిని చూసి తల్లిదండ్రులు సంతోషించారు. వీరి సంతోషాన్ని పాలివారు సహించలేకపోయారు. ఈర్ష్యతో ఒకనాడు వెంకయ్య గారి తల్లిపొరుగింటికి పోయిన సమయంలో బాలుడు ఊయులలో ఉండటం చూచి ఆ ఊయులలో నిప్పుకణుకులు వేశారట. వెంకయ్యగారి తల్లి తిరిగివచ్చిచూచేవరకు గుడ్డలు కాలనారంభించాయి కాని పిల్లవానికి మాత్రం ప్రమాదం జరుగలేదు. జరిగిన పనికి తల్లడిల్లిన తల్లి హృదయం బాలుని చిరునగువులతో శాంతించింది.

వెంకయ్య గారికి ఐదేండ్ల ప్రాయం వచ్చింది. పాలివారు బాలుని ప్రేమగల వారివలె ఎత్తుకుని సమీపంలో ఉన్న నదీతీరానికి తీసుకుని పోయి అచట మండూ కాలతో భయపెట్టారట. ఈ సంఘటనలు వెంకయ్య గారి కుటుంబానికి పాలివారి బాధ అధికంగా ఉండేదని తెలుపుతున్నాయి.

ఏడెనిమిది సంవత్సరాల ప్రాయంలో వెంకయ్య గారుతోటి పిల్లలతో ఆడు కుంటూ పాడుపడిన గోడపై కూర్చున్నారట. కూర్చున్న ఆ బాలుడు ఆ గోడను గుర్రమునకు వలె పదపదమని తోలుతుండగా అది కదిలిందట. ఆశ్చర్యకరమైన ఈ సంఘటన వెంకటదాసుగారు వెనుకటి జన్మలో భ్రిష్టయోగియై ఉండవచ్చునని ఊహింపజేస్తున్నది.

అంతేగాక రాకమచర్ల గుడిపూజారి పూడూరి నరసింహాచార్యులు వీరి తాత గారైన అనంతచార్యులు ఒక రోజు మధ్యాహ్నం రాకమచర్లలో పూజాది కాలు నిర్వర్తించుకుని గుడినుండి వెలుపటికి రాగా వేంకటదాసులవారు గగనమార్గాన వేళ్లటం చూశారట. అని తెలిపారు. ఈ సంఘటన కూడా పై విషయాన్ని బలపరు స్తున్నది. యోగి ప్రాణ, అపాన, వ్యాన ఉదాన సమానములనే పంచవిధ ప్రాణలను

ప్రాణాయామం ద్వారా వశీకృతం చేసుకుని మధివ్యాపసైజాది పంచభూతాల పంచ రూపాలైన స్థూలం, స్వరూప, సూక్ష్మ, అన్వయ, అర్థత్వముల యందు సంయము చేసినచో పంచతత్త్వను వశమౌతాయి. ఇట్లా భూతజయసిద్ధిని సాధించిన యోగి అణిమాది సిద్ధులను పొందుతాడు. అని పాతంజల యోగదర్శనం తెలుపుతున్నది. (సం.పా.యో.చ. 3-39-44,35) అణిమ, లఘమ, మహిమం, ప్రాప్తి, ప్రాకామ్యం, వశిత్వం, ఈశిత్వం, కామావసాయిత్వం అనేవి అణిమాదులు. వీటినే అష్టఐశ్వర్యాలు అని కూడా అంటారు. ఇందులో లఘిమ అంటే యోగి తెలికగ దేని సహాయం లేకుండి సర్వత్ర ఏక్కడికైనా పోవటం, కామావసాయిత్వం అంటే పంచభూతాలు ప్రకృతియోగి సంకల్పాన్ని పూర్తిచేయటం. పై సంఘటనలతో కామావసాయిత్వం, లఘిమ అనేవి కనిపిస్తుండటంచే అతడు పూర్వజన్మలో భ్రష్టయోగి అయివుంటాడని చెప్పవీలగుచున్నది. పూర్వజన్మ కర్మఫలితాలను ఈ జన్మలో జీవుడు అనుభవిస్తాడని ప్రథమ ప్రకరణంలో తెలిపాను. హధారణ మానవులను అలసికాని ఇట్టి విచిత్రాలు చూచిన మానవులు ఆకర్మలను మహిమలుగా కర్తను దేవునిగా కొని యాడటం అనుభవిస్తున్న విషయమె.

వేంకయ్యకు ఎనిమిదవఏట తల్లి తండ్రులాతనికి ఉపయనయనాది సంస్కారాలు చేశారు. పాలివారితోపాటు, దారిద్ర్యం కూడా వీరి కుటుంబాన్ని పీడించ సాగినవె. బాధలను భరించలేక వెంకయ్యా గారి తండ్రి పురుషోత్తముడు మరణించాడు. అనంతరం తల్లియైన అనంతమంబ తన బిడ్డలతో స్వగ్రామమైన పెద్దాపురాన్ని విడిచి ముచుకుందాక్షేత్ర ప్రాంతం (రాకమచర్ల) కొణుదురుపట్టియైన రాయప్రోలు గ్రామం చేరింది.

యువదశ :

రాయప్రోలు నిచేరేప్పటికి వెంకయ్య గారికి పదునెనిమిది సంవత్సరాలు. భౌతికంగా దార్రిద్య బాధను అనుభవిస్తున్న తండ్రిగారి సుగుణసంపత్తి తల్లిగారి కారుణ్యాలతో అలవడిన సాత్త్వీక సంపత్తె దాసుగారి మూలధనం. జీవనం గడి చేందుకు తగిన ఆధారమెలేకపోవటం చేత వెంకయ్య గారికి పెద్దగా చదువుకునే

అవకాశం లేకపోయింది. అయినా పద్యాలను, కీర్తనలను శ్రావ్యంగా చదివేశక్తి ఉండటంచేత రాయపోళ్ళు గ్రామ పెద్దలు జోగన్న, దాసయ్య, భీమారావు, కులకర్ణి గార్ల సహాయంతో ఆ గ్రామములోని బాలురకు చదవటం, వ్రాయటం నేర్పించటం ప్రారంభించినాడు. తద్వారా వచ్చే స్వల్ప పారితోషికంతో జీవనం కొనసాగిస్తున్నాడు. ఆ సమయంలోనే వెంకయ్య గారు కొన్ని దసరా పాటలను వ్రాసి పిల్లలకు నేర్పారట. కాని ఇప్పుడవి లభ్యం కావటం లేదు.

ఇట్లా ఒక సంవత్సరకాలం గడిచింది. వెంకయ్య గారికి పందొమ్మిది సంవత్సరాలు వచ్చాయి ఒకనాడు బాలురకు "దీపం జ్యోతీ పరంబ్రహ్మ" అనే శ్లోకాన్ని బోధిస్తుండగా అదే గ్రామంలో ఉంటున్న జలగం వీరయ్య అనే శివభక్తుడు 'దాని భావం తెలుపమని వేంకయ్య గారిని కోరగా నాకు తెలియదని వెంకయ్య గారు సమాధానమిచ్చారట. అది వినిన వీరయ్య మీరు కంటి లింగమ్మ గారిని విచారించండి ఆమె మీకు దీనిభావం వివరించగలదని చెప్పివెళ్ళిపోగా మరునాడు దాసుగారు ఆమె వద్దకు పోగా ఆమె దాసుగారికి తత్త్వోపదేశం చేసిందట.

తరువాత ఉమ్మెంతాల గ్రామస్తులు ఆహ్వానించగా వెంకయ్య గారు రాయపోళ్ళు గ్రామాన్ని విడచి అచటికి చేరారు. తనదీన దశను చిరునవ్వు మాటున దాస్తూ అచటి యువకులకు కోలాటం నేర్పటం ప్రారంభించారు. క్రమంగా తన జీవిత పరమావధిని గూర్చిన చింతన మనసులో జనించిన వెంకయ్య గారు బాహ్య ఆడంబరాలను విసర్జిస్తూ చిత్తం పరమాత్మ చింతనపై వైపు ప్రారంభించారు. తత్ఫలితంగా నిత్యం నిమ్మకాయలంతటి గులకరాళ్లపై కూర్చుండి, మనస్సును సంయమించి పరమాత్మయందు ఆత్మను అనుసంధించి ధ్యానం చేయటం ప్రారంభించారు. ఇట్లా రెండు సంవత్సరాలకాలంసాగించారు. అప్పటికి దాసుగారికి ఇరువది యొక్క సంవత్సరం వచ్చింది. ఆసమయంలో తన అక్కయైన రామమ్మగారి ఆజ్ఞను తీసుకుని రాకమచర్ల చేరారు. రాకమచర్ల క్షేత్రం పెద్ద ఉమ్మెంతాలకు సుమారుగా నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉంది. ఈ విషయం వల్ల వేంకటదాసు గారు హఠయోగాన్ని అభ్యసించినట్లు తెలుస్తున్నది. హఠ యోగం పాతంజల యోగదర్శనానికి విరుద్ధమైనది.

పరిగి గ్రామ నివాసి లక్ష్మీకాంతరావు గారు వేంకటదాసు గారిది జ్ఞానేశ్వర మహరాజ్ గారి మార్గము అని తెలిపారు. ఈ జ్ఞానేశ్వరి మహరాజ్ మహరాష్ట్రకు చెందినవారు. నాథ సంప్రదాయాన్ని అనుసరిస్తూ తనదైన భక్తి మార్గంలో పయనించాడు. ప్రచారంచేశారు ప్రచారాన్ని పొందిన జ్ఞానేశ్వరీ భగవద్గీత కర్త ఇతడే.

"నాథుని పరతత్త్వంగా స్వీకరించి అతన్ని ప్రసన్నం చేసుకునేందుకై యోగ సాధన చేసే సాధకుల సంప్రదాయమె నాథా సంప్రదాయం. ఈ నాథ సంప్రదాయానికి సంబంధించిన సాహిత్యంలో నాథ శబ్దానికి పరమతత్త్వం లేక బ్రహ్మ, గురువు అనే అర్థాలున్నాయి. దీక్షానంతరం సీమాంతంలో నాధుడు అనే బిరుదును తాల్చిన వారి సంప్రదాయమే నాథ సంప్రదాయం. ఈ నాథ సంప్రదాయాన్ని అనుసరించిన మత్స్యేంద్రదాథాది నవనాథులు హఠయోగ సాధకులు "(భారతి జూన్ 1985 18, 19 పే) కాబట్టి ఇట్టి నాథ సంప్రదాయాన్ని జ్ఞానేశ్వరీ మహరాజ్ సంధాను అనుసరించిన వేంకటదాసు గారు కూడా హఠ యోగాన్ని అభ్యాసిస్తూ భక్తి మార్గంలో పయనించారని చెప్పవచ్చు. "గురుమహరాజ్" అనే సంబోధన వైష్ణవ సంప్రదాయ విరుద్ధంగా నాథ సంప్రదాయం నుండే వేంకటదాసు గారికి సంక్రమించి ఉంటుంది.

వెంకయ్య గారు పెద్ద ఉమెంతాల చేరటం గురించి "మహాక్షేత్రం మామిళ్ళ పల్లి" అనే పుస్తకం (41వ పే) లో ఇట్లా తెలుపబడి ఉంది. వెంకయ్య గారు బాలలునుండి సాత్త్వికుడై ఉన్నందున జ్ఞాతుల బాధలకు విసిగి స్వామినాశ్రయించెను. రెయింబవళ్ళు తనబాధను, మనోవేదనను స్వామికి మొరపెట్టుకుంటుంటే ఒకనాడు స్వప్నంలో వెంకయ్య గారికి స్వామికనుపించాడు. నీ స్వగ్రామా। వదలి ఉత్తరదిగా వేళ్ళు. అచిరకాలంలోనె నీసేవ లభిస్తుంది. ముక్తుడవౌతావని స్వామి చెప్పగా వెంకయ్య గ్రామాన్ని వదలి పాలమాకుల గ్రామాన్ని చేరాడు. అక్కడ పిల్లలకు చదువు నేర్పుతూ కొంతకాలం కాలక్షేపంచేసి తరువాత కొందుర్గు కనకల్లు చేరి అక్కడినుండి పెద్ద ఉమ్మెంతాల చేరాడు. అక్కడ చంచేడు దొరలు దాసుగారి భక్తి, వైరాగ్యాలకు ముగ్ధులై కొంత భూమిని దాసుగారికి దానం ఇచ్చారు. ఆదానం గ్రహించిన దాసుగారు అక్కడనే స్థిరపడి సమీపంలో ఉన్న రాకమచర్లలోని యోగ

నారసింహుని నిత్యం సేవిస్తూ పెక్కు కీర్తనలను చెప్పి రాకమచర్ల వేంకటదాసుగా తెలంగాణంలో కీర్తనా చార్యుడుగా ప్రసిద్ధి పొందాడు.

ఈ విషయంలో స్వప్న వృత్తాంతం జనులను నమ్మించి తన వశం చేసుకోటానికి ప్రయోగించిన ఎత్తుగడగా తోస్తుంది. సహజంగా పురాణ ప్రబంధ కవుల గ్రంథారంభంలో ఇట్లాంటి వృత్తాంతాలు గోచరిస్తాయి.

రాకమచర్ల చేరి స్వామిని దర్శించిన వేంకటదాసు అచటనే ఎనిమిది దినాలు గడిపి స్వామి కృపాకటాక్షాలను పొంది తిరిగి వచ్చారట. స్వామి కృపను పొందిన నాటినుండి దాసుగారికి ఓత్తసైర్య అపారధైర్యం, అఖండ భక్తి అమానుషచర్యలు అలౌకిక భావం ప్రాప్తించాయట.

దాసుగారి భక్తి భావాన్ని మెచ్చిన రాకమచర్లేశుడు తానే స్వయంగా సమీపానికి వస్తానని స్వప్నంలో దాసుగారికి తెలిపారట, తదనుకూలంగా ఆ గ్రామ చౌదరి యొకడు పొలానికి ఎరువు తోలుకునే సమయంలో ఆ ఎరువుతో అంగుష్ఠ మాత్ర ప్రమాణంగల సాలగ్రామం కనపడిందట. చౌదరి ఆ సాలగ్రామాన్ని దాసుగారు ఇంట్లో లేకపోవటం చేత వారి తల్లిగారైన అనంతమాంబ గారికిచ్చారట. ఆమె ఆ సాలగ్రామాన్ని ఒకదొప్పలో పెట్టి పూజా మందిరంలో భద్రపరచి దాసుగారు ఇంటికి రాగనే చూపిందట. స్వామి తనకు కలలో చెప్పిన మాట నిలబెట్టుకున్నాడన్న తృప్తితో దాసుగారు ప్రతి ఆశ్వీజ శుక్ల పౌర్ణమి నాటి రాత్రి చొప్పకట్టతో చేయబడ్డ రథంపై సాలగ్రామాన్ని ఉంచి ఉత్సవం జరపటం ప్రారంభించారు. ఆశ్వీజ శుక్లపౌర్ణమి సాలగ్రామం దాసుగారికి లభించిన రోజు.

ఈ విగ్రహాన్ని గురించి ప్రస్తుత మఠాధిపతి అయిన శ్రీ గోవిందయ్య మాటల ప్రకారం ఒకనాడు అమిత శ్రమకోర్చి వేంకటదాసు స్వామి పూజకు వెళ్ళి వచ్చారట. వారిశ్రమను చూడలేక స్వామి దాసుగారికి పైన చెప్పబడ్డ స్వపక వృత్తాంతానుసారంగా రాకమచర్ల దేవాలయంలోనే సాలగ్రామ రూపంలో లభించాడట.

పై రెండు విషయాలు పరిశీలిస్తే దాసుగారికి సాలగ్రామ రూపంలో స్వామి ప్రతిమ దొరికింది అనే విషయమె వాస్తవమైందిగా కనపడుతున్నది. మిగిలిన భాగమంతా జనాకర్షణకు చెప్పబడ్డ విషయమే అనిపిస్తున్నది.

తరువాత ఆ సాల్గ్రామం పెద్ద ఉమ్మెంతాలకు తెచ్చారు. వేంకటదాసుగారి, కాలంలోనే ఆ సాల్గ్రామానికి గుడి నిర్మాణం జరిగింది. అనంతరం ఐదురోజుల ఉత్సవం చేయటం ప్రారంభించారు ఐదురోజుల ఉత్సవ వివరాలివి. మొదటి రోజు ధ్వజారోహణ, రెండవ రోజు ఎదురుకోళ్లు, ఈ ఎదురుకోళ్ళ ఉత్సవంరోజు భక్తి, జ్ఞాన మార్గాల కీర్తనలు పాడతారు. మూడవ రోజున రథోత్సవం. ఈ రోజు రామ స్తుతి కీర్తనలు పాడతారు. నాల్గవ రోజున వసంతోత్సవం. ఈ రోజున ఉత్సవంలో కృష్ణ భక్తికి సంబంధించిన కీర్తనలు పాడతారు. ఐదవ రోజు మానవపూజ కీర్తనలు పాడతారు.

## గురూపదేశం

కొంత కాలానికి దాసుగారు రాకమచర్లేశుని అజ్ఞతో "నీలంగిరి వీరప్పయ్య" మహారాజుగారినే ఉపదేశాన్ని పొందేందుకు నిశ్చయించుకున్నారు. కార్యసాధనకై అక్కగారి ఆశీస్సులను తీసుకుని వేంకటదాసు పండరి క్షేత్రం బయలుదేరారు. అచట గల విఠలేశుని దర్శించుకునేందుకు వేంకటదాసుగారితో పాటు మోముల పట్టణ వాసులైన గుండేరావు దేశ పాండ్య మొదలైన ప్రముఖులు కూడా బయలు దేరారు. అందరూ కలసి సాయం సమయానికి "కోహిర" అనే గ్రామం చేరారు. అక్కడ వీరితో కలసిన "నాగోరంబావ" అనే కోమటితో కలసి ప్రయాణం సాగించారు. విహిత స్థలములలో విడిది చేస్తూ "దిగువాల" గ్రామం చేరారు. అక్కడ "బాలసిద్ధు బావ" అనే బ్రాహ్మణ సాధువు వీరితో కలిశాడు. అతడును నీలంగిరికి ఉపదేశార్థియై వెళ్ళుచున్నవాడే! అందువల్ల అందరు కలసి నీలంగిరికి బయల్దేరారు. ఇక మూడుదినాలలో నీలంగిరి చేరుకుంటారనే సమయంలో వేంకటదాసు మనస్సులో ఒక శంక బయలుదేరిందట తాను వైష్ణవుడు. అందుకు విరుద్ధంగా శైవమతస్థుడైన "వీరయ్యప్ప" గారితో ఉపదేశం చేయించుకోవటం సమంజసమా దాసుగారి సందేహం. ఇట్టి సందేహంతో పయనిస్తూ మార్గాయాసంచేత అందరితో పాటు ఒకచోట విశ్రమించారు. ఆ సమయంలో అపరశేషావతారుని చెప్పబడే నీలంగిరి వీరయ్యప్ప' మహారాజు గారు పాము రూపంగా అంతదూస్తుండగానే వేంకటదాసు సమీపానికి వచ్చి వారికి బ్రహ్మోపదేశం చేసి అంతర్ధానమైనారట. ఈ విషయం శ్రీ రాకమచర్ల

మహాత్యం వేంకటదాసు గారి జీవితము వీరి భక్తబృంద చరితములు అనే గ్రంధంలో చెప్పబడింది. కాని నీలంగిరి వీరయ్యప్ప గారు అపరశేషావతారులంటానికి అధారాలు ఏమిటో తెలిపియుండలేదు. ఇది కూడా వేంకటదాసుగారి ముచుకుందోవతార విషయ ప్రచారంలాగా భావనా ప్రచారం అనిపిస్తున్నది.

అందరు నీలంగిరి చేరారు. అచట విరయ్యప్ప గారు వేంకటదాసుని ఐదు రోజులుండమని తెలిపారట. ఒకరోజున వేంకటదాసును ఏకాంత గృహానికి తీసుకుని పోయిన విరయ్యప్పగారు ఆత్మా. వివేకం, ప్రకృతి పురుష సంయోగ క్రమం, కార్యకారణలనైనం, కూటస్థలక్షణం, బ్రహాండాది కల్పనం శరీరత్రయ అవస్థాత్రయ షడ్మూరి విభాగం, జ్ఞానభక్తి యోగాల తారతమ్యం, తత్సిద్ధుల విచారం, జీవాత్మ పరమాత్మనిరూపణం, సుగుణనిర్గుణోపాసనల లక్షణం, ముంతిలక్షణం, బ్రహ్మక్యాను సంధానం, మొదలైె బ్రహ్మ విద్యావిశేషాలన్ని వశమయ్యేట్లు బోధచేసి శ్రీమదారిమతిరకమంతోపదేశం చేపారటా.

(శ్రీ.రా.మా.వే.జీ.వా.భ 12,13 పే)

ఉపదేశానంతరం నీవు జగదీశ్వరకృపాలబ్ధ సహజ పాండిత్యవర కవిత్వ మహత్య శోభితుడవేతావు. ఆ పాండిత్యంతో లక్ష కీర్తనలు రచింపుమని నియమించి వస్త్రమాల్యాదులతో సత్కరించి ఒక తాంబూరనిచ్చి ఆశీర్వదించి దాసుగారిని పంపాడట. ఈ విషయానికి కూడా పై గ్రంథమె ఆధారం. తాంబూరను స్వీకరించిన వేంకటదాసుగారు గురువైన విరయ్యప్ప సంతోషాన్ని పొందెట్లుగా "గురుమహరాజ గురుమహరాజ పరబ్రహ్మ సద్గురు మహరాజ" (రా.వేం,కీ.ప్ర. 1930.1 పే) అనే కీర్తనుపాడి గురుభక్తిని వ్యక్తికరించారని పెద్దలు చెప్తున్నారు.

## గురుపరంపర

2.7.1982 నాడు వెల్లకొండ నివాసి శ్రీ వితలయ్య గారిని కలసినప్పుడు వారు వేంకటదాసు గారిది నాథ సాంప్రదాయం అని చెప్తూ వారి గురు పరంపరను ఇట్లా వివరించారు (ప్రస్తుతం వీరు మరణించారు. తేది 27.10.1982) వీరు తెలిపిన గురుపరంపర ఇట్లుంధి.

1. ఆది నాథం చమత్స్యేంద్ర గోతక్ష గహనస్తథా
నివృత్తి జ్ఞానదేవాయ దేవచూడామణిః

2. అఖండానందరూపాయ దివ్యజ్ఞాన ప్రదాయినే
భవధ్వాంతనివేశాయ గుండాక్ష గురవేనమః !!

3. పరమానందరూపాయ భవజ్ఞాన ప్రదాయినే
అద్వైత పూర్ణ రూపాయ శ్రీగురునీరాయతేనమః

సకలమైన నాధులకు ఆధినాధుడైన ఈశ్వరుడు అతని శిష్యులు మత్స్యేంద్రనాధుడు, గోరక్షనాధుడు, జ్ఞానదేవుడు, గుండాక్షుడు, నిరయప్ప అనేది వేంకటదాసు గారి గురుపరంపర

గురువు యొక్క అనుగ్రహాన్ని పొందిన వేంకటదాసు పంచరిలో పితలేశుని దర్శించి, గృహోన్ముఖుడై ఉమ్మెంతాల చేరేముందుగా రాకమచర్లవచ్చి రాకమ చర్లేశుని దర్శించి ఉమ్మెంతాల చేరారు. అక్కడ నిత్యం అక్క రామమ్మ, తల్లి అనంతమ్మ గార్లతో సహా శిష్యులను కూడి నిత్యం స్వామి భజనలలో సుఖజీవనం సాగిస్తున్నారు. అప్పటికి దాసుగారికి ఇరువది ఐదు సంవత్సరాలు నిండాయి.

ప్రౌఢదశ

వేంకటదాసు గారికి నలుబది సంవత్సరాలు వచ్చాయి, ఆ సమయములో శిష్యులు, స్నేహితులు, ఆత్మీయులు దాసుగారిని వివాహం చేసికొమ్మని బలవంతం పెట్టసాగారు. అందుకు విముఖులైన దాసుగారు "నారాయణుని భజన తప్పనాకు కోరతగింది మరియొకటిలేదు బంధహేతువైన దాంపత్యం నాకక్కరలేదని" వారికి ఖండితంగా చెప్పారు. అయినా వారు తమపట్టు వీడక పోవటం చేత అయిష్టంగనే దాసుగారు వారి కోర్కెను అంగీకరించి "ఆయూరు" వ్యాపారకుటుంబీకులైన శాంతాంబ కిషన్ రావుల కూతురైన "రాజలక్ష్మి" గారిని వివాహం చేసుకున్నారు. వివాహం "ఆలూరు సీతారామారావు" గారి ఇంట్లో వైభవంగా జరిగింది.

దాసుగారికి నలుబది ఐదు సంవత్సరాలు వచ్చాయి. గురువాజ్ఞ లేకుండా వివాహం చేసుకున్నందుకు దాసుగారు మనస్సులో కుమిలిపోసాగారు. ఆ బాధ దిన దినం ఎక్కువకాసాగింది. అ సమయంలోనే "భవసాగరము జుట్టుకొనెరా" ప్రాణికి చె బట్టుకొనరా "ఎక్కాడిసంసార మెద్దబాయజాల దూరాముచంద్రా" మాటాడితే జాలు మర్మమునాలోన లేదు" మొదలైన కీర్తనలద్వారా తన మనసులోనిబాధను గురుదేవులకు నివేదించుటకున్నాడని ఆ కీర్తనలోని అవేదననుబట్టి పెద్దలు నిర్ణయించి చెప్పారు

వివాహానంతరం కాలంగడుస్తున్నకొద్ది దాసుగారి మనసులోని బాధ ఎక్కువ కాసాగింది. దాసుగారి తల్లి రోగ గ్రస్తురాలైంది. అమె ఒకనాడు వేంకటదాసును పిలిచి తనకు అంత్య ఘడియలు సమీపించాయని తెల్పగా దాసుగారు తన తల్లితో "అమ్మా! నీవు చింతపడకు. నీకు స్వస్థత చేకూరుతుంది. నీకంటె మూడు సంవత్స రాలు ముందుగా నాకు మరణం సంభవిస్తుంది. ఈ మతాధిపత్యం నాతో మూడు తరాల వరకే వెలుగొందుతుంది. తరువాత సామాన్యంగా ఉంటుంది" అని తెలి పారట. ఈ విషయం దాసుగారు చెప్పారో లేదో గాని నేటికది సత్యంగానే తోస్తున్నది. నేనామతాన్ని దర్శించి వచ్చాను.

## చరమ దశ

వివాహమైన రెండు సంవత్సరాలకే వేంకటదాసు గారికి మతి విభ్రాంతి కలిగింది. దీనికి కారణం గురువాజ్ఞను ధిక్కరించి లక్షకు పైబడి కీర్తనలను చెప్పటం, వివాహమాడడం అని ఆ ప్రాంతంలోని పెద్దలు చెప్తారు. ఇందలి సత్యా సత్యములు ఆ రాకమచర్లేశునికే ఎరుక. మతి విభ్రాంతి కలిగిన సమయంలోనే "శ్రీహరేనాయెడ మోసమాయెనే" "ఎంత మరులుజెందితినేనేమి జేతు శ్రీపతి" వంటి కీర్తనలు రచించారని పెద్దల ఊహ. ఈ కీర్తనల ద్వారా తన బాధను అవేదనను ఆ రాకమచర్లేశునికి నివేదించుకుంటూనే తదనంతరం మతాధి పత్యం తన అన్న కుమారుడైన "తిరుమల్లయ్య" కిమ్మని అజ్ఞచేసి హరినామ స్మరణతో దేహాన్ని చాలించారు.

దాసుగారు దెహాన్ని చాలించబోయే ముందుగా తాను మరణించిన పిదప తనను సమాధి చేయమని తన శిష్యులకు, ఆత్మీయులకు తెలిపారట. కాని వేంకట

దాసుగారు మరణించిన వెంటనే కులాచారాన్ని అనుసరించి దాసుగారి శరీరం దహనం చేశారట. శరీరం మొత్తం కాలికుడి చేయిమాత్రం కాలకుండా ఉండటం చూచి ఆ చేతిని తెచ్చి భూస్థాపితం చేశారని "మాదిరెడ్డి పల్లెకు "చెందిన "శ్రీపరమయ్య" తెలిపారు. ఆ భూస్థాపితం నేటికి ఉంది.

## దాసుగారి స్వరూపం

వేంకటదాసు గారి స్వరూపాన్ని "శ్రీ రాకమచర్ల మహాత్మ్యం వేంకటదాసు గారి జీవితము వీరి భక్త బృంద చరిత్రములు" అనే గ్రంధం ఆధారంగా ఇట్లా గ్రహించవచ్చు. "కురుచపాదాలు, నిడుద హస్తాలు, ఉచితమైన బొజ్జ, విశాలమైన హృదయం, ఉచితమైన కంఠం, గుండ్రని ముఖం, గొప్పశిరం, ఉబ్బు చెంపలు, ఉన్నత ఫాలభాగం, దీర్ఘమైన నాశిక, అందమైన కనుబొమ్మలు, సోగకన్నులు, ఉచితమైన చెవులు, గంభీరము శ్రావ్యము అయిన స్వరం. చామనచాయతో సర్వావయవ స్ఫూర్తి కలిగి ముక్కాలి పొట్టిగాను, అంత పొడవుగాను కాక, మరీలావు కాదు, అంత సన్నము కాక సమమైన సుందరమైన దేహం కలిగి ఉండేవారు." వేంకటదాసు గారు. ఈ వర్ణనం చిత్రకారుడు చిత్రం గీసేందుకు అనుకూలంగా ఉంది.

## జీ వి త వి శే షా లు

వేంకటధాసు గారు గురూపదేశాన్ని పొంది ఉమ్మెంతాల చేరిన కొద్దికాలంలోనే వీరి కీర్తిసుదూరం వ్యాపించింది. అందుకు వీరి భక్తి, భక్తిరస పూరితమైన కీర్తనలను గానం చేయటం ప్రధాన కారణం. దాసుగారు కీర్తి చంద్రికలను సహించలేని "కంకల్లు" గ్రామనివాసులైన కొందరు బ్రాహ్మణ పండితులు దాసుగారి కవిత్వ పటిమను పరీక్షింపనెంచి ఉమ్మెంతాలకు వచ్చారు. దాసుగారు వారి అభిప్రాయాన్ని తెలుసుకుని వారు వచ్చిన నాటి రాత్రి భజనలో "రాసువా అనే కీర్తనలోషకార ప్రాసతో విష బీజ సంయుతంగా పాడారట. ఈ కీర్తనవల్లవిలో ఏడు షకారాలు, కీర్తనలో ఒకటి వేసి గానం చేస్తుండగనే ఆ పండితులు దాసుగారికి నమస్రిభావం వహించారట. ఈ విషయానికి పెద్దల మాటలు, పైన తెలిపిన గ్రంథంలో వ్రాయబడి ఉండటం తప్ప వేరు ప్రమాణం లేదు. అయితే ఇది కొంత సత్యమైన విషయంగా

తోస్తుంది. సహజంగా సమాజంలో ఒకరి ఉన్నతిని మరి ఒకరు సహించలేని మన స్తత్వం కలిగిన వ్యక్తులే ఎక్కువగా ఉంటారు. అట్టి మనస్తత్వం కలిగిన వ్యక్తులే ఆ బ్రాహ్మణ పండితులు, ఇక రెండవ విషయం కీర్తనలో 'ఘ' కారప్రాసతో విష బీజాలు వేయటం వారిని వశం చేసుకోవటం. ఈ విషయంలో అక్షరమైత్రిని, వైరజాతులను, ఏ అక్షరం ప్రయోగించి నందువల్ల ఏమి లాభం కలుగుతుందో లేక నష్టం కలుగుతుందో కొన్ని లక్షణ గ్రంథాలు తెలుపుతున్నాయి. ఈ కారణాల చేత పై విషయం నమ్మతగ్గదిగనే ఉంది. కాని ఆకీర్తన మాత్రం ఇప్పుడు లభించటం లేదు. అట్లా నమ్రభావం వహించిన తరువాత కీర్తనలో శాంతి బీజంవేసి దాసుగారు ముగించారట.

## అతిమానుష శక్తి

దాసుగారి అతిమానుష చర్యలకు నిదర్శనంగా కొన్ని సంఘటనలు కూడా ఉన్నాయి.

ఒక రోజు మధ్యాహ్నం వేళ దాదాపురం రాజాగారింటికి వెంకటదాసు గారు వెళ్ళగా వీరి రాకను తెలుసుకొని కూడ రాజాగారు ఇంటినుండియే లేదని భటునితో కబురుచేశారట. అట్లైతేనమ్మని పల్కి దాసుగారు పాముబండ గ్రామానికి పోయి అచట శివసన్నిధిలో ''ఎంతాయెగదరాపలింగా నిను ఏమందు కరణాంతరంగా'' అనే కీర్తనను గానం చేశారట. దాసుగారి మహిమోపేత వచనం ప్రకారం ఆరోంజతా రాజావారు నిర్జీవులై పరుండిరట. అది గమనించిన రాణిగారు భయభ్రాంతులై దాసుగారిని మరల తమ గృహానికి వచ్చుటకై అనేక విధాల ప్రార్థించిందట. దాసుగారు రాలేదు కాని కరుణించి "లేవగలడు'' పొమ్మని మాత్రం పలికారట. వెంటనే రాజుగారు నిద్రమేల్కొంచినట్లు లేచారట.ఈ సంఘటనకు అచ్చులో లేని ఈ కీర్తనే ప్రమాణం. నేను సేకరించిన ఈ కీర్తనను పరిశీలించవచ్చు.

ఎంతాయెగ దరామలింగా
నిను ఏమందు కరుణాంతరంగా ॥ప॥

1. అంతరంగములోన ఆత్ముడవు నీవుండి
చింతనొందగ మది చేసినావురభళి ॥ఎంతా॥

2. పరుల మాటలు వ్యర్థమాయె
ఇంతఫలనకౌట మది తెల్యదాయె ॥ఎంతా॥

3. సరగనా అభిమానభారమె నీదాయె
వదినమ్మినాడని మనసుడానితినయ్య ॥ఎంతా॥

4. దండివానకు దడచుటాయె
నాసుచుండి వణకుచ్చుటయె ॥ఎంతా॥

5. ఉండిలేడనిపించున్నాడు యజమాని
పండుకున్నా స్థలమందు పలికించలెరై రి ॥ఎంతా॥

6. పొదుగ శ్రావణంబు ననూ
బహుళ షష్ఠి గురువారంబు నాడు ॥ఎంతా॥

7. నీదు సత్కృపనమ్మి నిర్హేతుకము నొంది
దాదాపురము చేరి బహుబాధ నొందితి ॥ఎంతా॥

పై సంఘటన జరిగినది శ్రావణ మాసంలో బహుళ షష్ఠి గురువారమని, ఆసమయం లో వర్షం కూడా పడుతున్నదనే విషయాలు ఈ కీర్తనవల్ల తెలుస్తున్నాయి.

"కంది" గ్రామానికి "కిషన్‌రావు" దొరగారు ఆహ్వానించగా దాసుగారు వెళ్ళారు. అచట వేణుగోపాలస్వామి వారి ఉత్సవం పూర్తి అయిన తరువాత కిషన్ రావు దాసుగారిని ''స్వామి మాయొద్ద మీరు తృప్తిగా భుజించాలని' కోరారట. అందుకు దాసుగారు అంగీకరించినవెంటనే పదునారు శేర్ల బియ్యం వండించారట. దాసుగారు వెనుకాదకుండా ఆ అన్నం ఆరగించి భక్తుని కోర్కె నెరనేర్చారట

ఒకప్పుడు ఒకసాలెవాని వద్ద దుప్పటి కొన్నారట. ఆనాడు పైకం లేక ఎనిమిది రోజుల తరువాత రమ్మని సాలెవానికి చెప్పారట; దాసుగారు, ఆసమ యానికి అయన సంచారంవెళ్ళిరాలేదు. చెప్పిన సమయానికి వస్తున్న సాలెవానికి

రాకముచర్లేశుడే దాసుగారి ఆకారంలో కనపడి తమ ఇంటి గూటిలో పైకం ఉన్నది తీసుకోమ్మని తెలిపారట.

ఇట్టి సంఘటనలు భక్తుల జీవిత విశేషాలలో ఉండటం సర్వసాధారణ విషయం. ఈ సంఘటన వారి జీవితంలో జరిగిందా లేదా అనే ఆలోచనకంటె వారి మీది అపార భక్తి భావంలో చెప్పుకొని సంతోషంతో తృప్తిని ప్రకటించుటమే వీటి నిరూపణకు ప్రమాణం విషయం ఎట్లున్నా "అటుగో తోక అంటే ఇదిగో పులి" అన్న సామెతను మాత్రం గుర్తుచేస్తుంటాయి.

## సిద్ధించిన భక్తి

దాసుగారి భక్తికి నిరూపణగా ఉన్న కొన్ని సంఘటనలు ఉన్నాయి. అవి ఇచ్చట గమనించుదాం :

ఒక మారు ఉమ్మెంతాలలో స్వామి ఉత్సవానికి వేల సంఖ్యలో భక్తులు వచ్చారు. వారిని కొల్లగొట్టెందుకు మేచ్చులు మాటువేశారు. ఆ సమయంలో వేంకట దాసు గారు స్వామి రథం ముందు నిలబడి భక్తబృందంలో కలసి భజన చేస్తు న్నారు. ఆదను చూసి సమీపానికి వచ్చి ఆ దోపిడి మూకను చూచి ప్రజలు, భక్తు లంతా భయంతో పరుగెత్తారు. ఆచార్యుల వారు మాత్రం చలింపక మూర్తీ భజన చేస్తూ నిలబడిఉన్నారు. ఇట్లా ఉన్నదాసుగారి ఎదుటకు వచ్చిన ఆమ్లేచ్ఛులు రజ్జు బంధిరతులవలె తెల్లవారు వరకు అచటనే కదలక ఉండటం చూచిన జనులు ఆశ్చర్యపడ్డారు. ఈ సంఘటన దాసుగారి ధైర్యానికి నిదర్శనం. అంతేగాక భక్తి పారవశ్యాన్ని కూడా చాటి చెప్తున్నది.

ఇట్లాగే మరియొక సమయంలో "ఉమ్మెంతాల నివాసి అగసాల మునయ్య" కు దాసుగారు శ్రీకృష్ణలీలలు గురించి బోధిస్తున్నారు. ఆ సమయంలో బాలకృష్ణుడు ఎదుట ప్రత్యక్షమై నాట్యమాడు చుండగా గజ్జల మోత మాత్రమే విని ఎవరో పిలిచినట్లైనరిగా దర్శన కాలంలో అక్కడ నుండి వెల్లారట. తరువాత వచ్చిన దీమునయ్యను జూచి నీవు దురదృష్టవంతుడవని దాసుగారన్నారట. ఈ సంఘటన

దాసుగారు రసవత్తరంగా భక్తిరసాన్ని బోధించగలరని తెలుపుతున్నది. బాలకృష్ణుడు ఎట్లా ప్రత్యక్షమైనాట్యమాడాడు అని చెప్పటంపై భావాన్ని వ్యక్తీకరించటమే.

ఒక మారు దాసాచార్యుల వారు పాలమూరు సమీపంలో ఉన్న "మన్నెం కొండ"కు వెళ్ళారట. అచట "హనుమద్దాసు" అనే వైష్ణవ భక్తుడు నిత్యం స్వయం కల్పిత కీర్తనలతో భగవదర్చన చేస్తుండేవాడు. దాసుగారు అచటికి వెళ్ళినరోజు కృష్ణాష్టమి అవటం చేత స్వామి వారికి డోలారోహణ ఉత్సవం జరుపుతున్నారు. ఆ సందర్భంలో హనుమద్దాసు తన భజన కార్యక్రమం కొనసాగిస్తున్నాడు. అచటికి పోయిన దాసుగారు కూడా శ్రీకృష్ణ పరబ్రహ్మ స్తోత్రాన్ని గానం చేశారట. ఆ సమయంలో డోలారోహిత విగ్రహం దాసాచార్యుల వారున్న దిక్కునకు తిరగటం చూచిన వైష్ణవ భక్త శిఖామణి హనుమద్దాసు దాసాచార్యుల వారి మహత్తును ప్రసంశించారట. ఈ సంఘటన వల్ల హనుమద్దాసుగారి కంటె దాసాచార్యుల వారు మధురంగా గానంచేయగలరనే విషయం గ్రహించాలి. అంతేగాని విగ్రహం వారివైపు నుండి వీరివైపుకు తిరిగింది అని చెప్పటం అభిమానుల అతిశయోక్తి మాత్రమే.

ఇట్లా ఈ సంఘటనలు వేంకటదాసుగారి భక్తిభావ ఉత్కృష్టతను తెలుపుతుంటే మరికొన్ని దాసుగారి మహత్యాన్ని దివ్యశక్తి సంపన్నతను తెలిపేవిగా ఉన్నాయి.

వేంకటదాసు గారు సంచారార్థం "చిట్టగిద్ద" అనే గ్రామానికి వెళ్లగా అచట వారి వాహనం అయిన అశ్వం ఎటోపోయిందట. ఆ సమయంలో "గుర్రమెక్కడ బోయెనయ్యా" అనే కీర్తనను పాడగా గుర్రం వెంటనే వచ్చి దాసుగారి ముందు నిలిచిందట. ఇది చూచిన జనులు దాసుగారి మహత్త్వాన్ని కొనియాడారు. ఇట్టి సంఘటనలు దాసుగారి మహత్త్వాన్ని తెలిపేకంటే ప్రజల లోతుపాతుకున్న అవైదిక మౌఢ్యాన్ని తెలుపుతుంటాయి. పై కీర్తన పరిశీలిస్తే ఈ విషయం తేటపడుతుంది. ఈ కీర్తన ఇట్లా ఉంది.

"గుర్రమెక్కడ బోయెనయ్యా
దాసగుణమెల్ల గుంటి నాయయ్య ॥ప॥

1. గుర్రమెక్కడ బోయె గురుతు తెలియదాయె
వెర్రి బట్టిన రీతివెతుకనాయెర మరగు ॥గుర్ర॥

2. ఎందు చూచిన కానరాదు
దాన్ని యెవరు బట్టుక పోయినారు ॥గుర్ర॥

3. మంది దగ్గర దెచ్చి మరియాద బోనాయె
సందేహమేలనే నింద బొందితి రామ ॥గుర్ర॥

4. చిటి గిద్దెలోపలా లేదు
చుట్టు పల్లెలోపల గానరాదు ॥గుర్ర॥

5. కుటిలాత్ము లెవరైన కొనిపోయినారో కాని
ఎటులో దోచక నేరమేమని చెప్పుదు

6. ఈ పూరిలోపల లేదూ
పొరుగూరికె కొనిపోయినారో ॥గుర్ర॥

7. ఏవూరు దూరమో బాపురజిక్కెనో
తేరకానివతె ఊరుకున్నవదేమి ॥గుర్ర॥

8. మరవక మమ్మేలరయ్యా
దాన్ని సరగున తెప్పించరయ్య ॥గుర్ర॥

9. సరసరాకమచర్ల స్వామివివని
అరమరలేక నీబరుదు పేదరికమూ ॥గుర్ర॥

(రా వేం.కీ.ప్ర. 1930 పే 178)

ఈ కీర్తనలో వేంకటదాసు గుర్రంపోయిన బాధను వ్యక్తం చేశాడు. సహజంగా మానవులు కష్టం వచ్చినపుడు తాము నమ్మిన దేవతనో, మాపుణా ప్రత్యక్షంగానో,

పరోక్షంగానో లేక మానసికంగానో, కాయికంగానో వేడుకోవటం చూస్తూనే ఉంటాం. అట్లా దాసుగారు కూడా అది అరువు తెచ్చుకున్న గుర్రమని, అది ఎక్కడికి పోయిందో వెతికించినా అంతుబట్టక, అ గుర్రపు యజమానికి సమాధానం ఏమి చెప్పాలో తోచక, ఎదిచెప్పినా తానునిందల పాలౌతానని, ఎవరు తీసుకెళ్లారో తెలియక తన మానసికమైన బాధను వ్యక్తం చేస్తూ గుర్రం తొందరగా దొరికేట్లు చేయమని రాకమచర్లేశుని ప్రార్థించారు. అదృష్టవశాత్తు గుర్రం దొరికింది. ఈ సంఘటనను మహాత్తుగా చిత్రించటం జనుల మౌఢ్యానికి నిదర్శనమే కదా !

ఒక సమయంలో దాసుగారి ఇంటిలో భోజన సామగ్రి నిండి ఉండటం చేత దొరికిన కొన్ని తమిదెలను పిండి చేసి రొట్టె కాల్చుకొని తినవలసి వచ్చింది. తమిదెరొట్టె తినటం దాసుగారికి అలవాటు లేక పోవటం చేత కడుపు నొప్పి కలిగిందట, ఆ సమయములో "తమిద రొట్టె పాపాముబుట్టె" అనే కీర్తన చెప్పారట. అచ్చులో ఉన్న ఆ కీర్తన ఇది.

"తమిద రొట్టె తాపాము బుట్టె - తమిద రొట్టె ॥ప॥

1. అమరాగ దారిద్ర్య సమయమందూన
మంచివి ములూలైన బాధవేగ చేయుదువే ॥త॥

2. కూరలెన్నైనాను దూరముగా జేసి
ఊరికె చెలరేగి ఉబ్బు చుండుదువే ॥త॥

3. నెయ్యి బెల్లామయిన నయ్యాన దిగమ్రింగి
అయ్యయ్యో నీపంతమట్టె చూపుదువే ॥త॥

4. ఎర్రాని పొడలాచే విర్రవీగుచుపెరుగు
జుర్రిన నిర్దయజూపు చుండుదువే ॥త॥

5. సత్తువ తక్కువ నోరుచప్పదనంబు
కుతికెలోపల జిక్కికోపగించుదువే ॥త॥

6. కరుణలేశము లేక సరసరాకమచర్ల
హరికైన వెరునాక తిరుగుచుండుదువే ॥త॥

ఈ కీర్తనలో తను దార్రిద్య బాధ చేత అనుభవించే కష్టం వ్యక్తం చేశారు దాసుగారు. దార్రిద్య బాధతో ఆహారం లభించని సమయంలో తమిదె రొట్టె తినాల్సి వచ్చింది, ఆ రొట్టె తినటం అలవాటు లేక పోవటం చేత కూరలు, నెయ్యి బెల్లం, పెరుగు మొదలైన వాటితో కలిపితిన్నప్పటికి తమిదె రొట్టె తన సహజ లక్షణాన్ని విడువకుండా ఉబ్బి పొట్ట ఉబ్బరింత చేతబాధపెట్టటం అనే విషయాన్ని, దాసుగారు ఆశువుగా చెప్పారు ఇంతవరకు బాగానే ఉంది. అయితే ఈ కీర్తన పాడిన మరునాడు రాకమచర్లేశుని ప్రేరణ చేత ఎక్కడనుండో ధనవంతులు వచ్చి దాసుగారికి డబ్బిచ్చిపోవటం వారి మహత్తుకునిదర్శనమని జనులు చెప్పటం జరుగుతోంది.

ఒక ఆషాడ మాసంలో ఉమ్మెంతాలలో పశువులకు మారీ ఉపద్రవం రాగా దాసుగారు రాకమచర్లేశుని ధ్యానించి తీర్థజలం ప్రోక్షణ చేయగా పశువులకు నెమ్మ తించిందట. ఆనాటినుండి ఆషాఢ శుక్ల ఏకాదశినాడు రాకమచర్లలో స్వామి సేవ చేసి తీర్థం తీసుకుని దాసుగారు దండహస్తులై గ్రామ ప్రదక్షిణం చేసి తీర్థ జల ప్రోక్షణం చేసేవారట. అట్లాచేస్తే గ్రామం క్షేమంగా ఉంటుందని నమ్మిన జనులు అది ఆచారంగా మార్చుకోవటం వారి అజ్ఞానికి నిదర్శనం. బహుశః దాసుగారు హఠ యోగ అభ్యాసం చేశారు కాబట్టి అట్టి చర్యవల్ల కొంత ఉపశమనం లభించి ఉండ వచ్చు. అంతమాత్రాన గుడ్డిగా అది దాసుగారి దివ్యశక్తి అని చెప్పటం జనులలో నెలకొన్న అవైదిక జ్ఞాన ప్రభావమే. ప్రస్తుత కాలంలో ఈ ఆచారం పాటించటం లేదు. కారణం ఊహించవచ్చు. అట్లాగే ఉమ్మెంతాలలో జరిగే ఉత్సవంలో ఒక మారు పూల వసంతోత్సవం రోజునక్కండ పోతగా వర్షం పడిందని, అది దాసుగారి దివ్యశక్తి, మహిమ అని చెప్పుకునే జనుల అమాయకత ద్యోతకమవుతుంది.

## పాండిత్యం - ఆశుధార

వేంకటదాసు గారు ఒకమారు "నడుకూడె" దొరవారు అహ్వానిస్తే "అమ్మపల్లి" ఉత్సవానికి వెళ్ళారు. ఉత్సవాన్ని చూచేందుకు వైష్ణవ మతానికి చెందిన కొందరు

విద్వాంసులు కూడ అక్కడికి వచ్చారు. దాసుగారు భజన ప్రారంభించి కీర్తనలు పాడుతుంటే అసూయా పరులైన ఆ విద్వాంసులు ఇది ఆంధ్ర కవిత్వం బ్రాహ్మణులకు యోగ్యమయింది కాదు అని దాసు గారిని అధిక్షేపించారట- అంతేగాక

శ్లో॥ ఆంధ్ర భాషామయం శాస్త్రం
అయోమయ సమన్వితం
గీర్వాణ రత్న సంచారా
న్విద్యాన్మత్తే భశృంఖలం"

అని పరిహసించారట. అందుకు ప్రతిగాదాసుగారు సాయంత్రం సప్తాంగలక్షణమైన సభామధ్యంతో తాంబూరను చేబూని

"రామరామ దినరాజుకు లాంబుధి సోమా
సార్వభౌమ కాముదమున నుత ఘున
వితరణ సత్కలిత ధర్మరూపాభూపా ॥ప॥
(రా.వేం.కీ.ప్ర. 1977 పే 160)

అనే కీర్తనను సంస్కృత సమాసాలతో మొదలు పెట్టి సూర్యోదయం అయేంత వరకు సంస్కృతంలోనే కీర్తనలను గానం చేశారట. వైష్ణవ పండితులాశ్చర్యపడి దాసుగారి పాండితీ ప్రతిభను కొనియాడారు.

వేంకట దాసుగారు ఒకమారు సంచారార్థం "పరిగి" గ్రామం వెళ్ళగా అచ్చట శతావధాని పండితులైన "అనంతాచార్యులు" వీరు కీర్తనలను గానంచేయగా విని "ఇట్టి పాటలు ఎన్నైనా పాడవచ్చు ఛందోబద్ధ మత్తాలను చెప్పగలగటం ప్రజ్ఞ" అని దాసుగారితో అన్నారట. అదేరోజు సాయంకాలం ఏర్పాటు చేయబడ్డ సభలో అనంతాచార్యులకు సమాధానంగా దాసుగారు నూరు పద్యాలను ఛందోబద్దంగా అలంకార సహితంగా చెప్పారట. ఆ పద్యములు ఇప్పుడు లభించటం లేదు. ఇట్టి సంఘటనలు దాసుగారి పాండితీ ప్రతిభకు నిదర్శనాలుగా ఉంటాయి
వేంకటదాసు గారి కీర్తనలు పరిశీలిస్తే

"కృష్ణా తాండవ కృష్ణా మురహర
కేశవ గిరిధర వైష్ణవ సాగర వరహితకరశ్రీ ॥ప॥
1. మురహరధర భాసురవరశోభిత
కరుణారస సుందర దరహాసా ॥కు॥
(రా.వేం.కీ.ప్ర. 1930 పే 24)

వంటి అచ్చపు సంస్కృత సమాస భూయిష్ట కీర్తనలు.

"నేరం లేదే - నీదయరాదే
భారము గాదె పలుకుట వాదె ॥ప॥

1. మ్రొక్కితి జూడు ముందుగ నేడు
అక్కరతోడ మనమున గూడు ॥నేర॥

(రా.వేం.కీ. 1930 పే 187)

మొదలైన విధంగా తేనెసోనల కమ్మని తెలుగుతనం వెదజల్లే కీర్తనలు

"కొంగు బంగారముగ దర
నీనామం కోరిన వారికి భయమేమిరా ॥ప

1. అందజారి తాంగ గరుడ తురంగ
సంతతమంగళాంగద సంగరారి
విభంగకతితోత్తుంగ భవ్యమ తంగరక్షిణ ॥కొంగు॥

(రా.వేం.కీ. 1930 పే 187)

అనే విధంగా తెలుగు సంస్కృతం కలిపిపాడిన మిశ్ర కీర్తనలు గోచరమౌతాయి. ఇవన్నీ దాసుగారి పాండిత్య పటిమకు నిదర్శనాలే।

దాసుగారికి సంగీతం కూడా తెలుసు అనేందుకు మానసపూజలోని ''రాజోప చారములొనరించెదనూ'' (రా.వేం.కీ. 48) అనే కీర్తన ఉదాహరణంగా చెప్పవచ్చు. ఈ కీర్తనలోని

"నరసులెల్లాను మెచ్చగాను వెంకటదాసు
చరణమీ స్మరణ శాయగానూ
సంగీత రాగసరళి చెన్నిమ్మ పొగడేదనూ"

అంటూ

"బహువెప్పుగానూ వరవీణె తంతువులు
మందర మధ్య తారకములు
నీరయు కళ్యాణి లాంబర భైరవి సావేరి
మరి మోహననాట పూరిమాళవిజంఝూటి
ధన్యాసి వరాళి సురట
అరయు సరిగమ పదసిస సనిదస
మగరిన స్వరముల మరియింపల రగబాడుడు"

అని స్వర రాగాదులను తెలిపియుండటం చేత వేంకటదాసుగారికి సంగీత శాస్త్ర పరిచయం ఉందని చెపవచ్చు.

దాసుగారికి పద్య కవిత్వంలో కూడా మంచి ప్రతిభ ఉంది అని తెలిపేందుకు వీరి మానసపూజా కీర్తనల నడుమనున్న పద్యాలన్నీ ఉదాహరణాలే. ఈ పద్యాలు ఆశుధారగా దాసుగారు చెప్పినవే అని, మిగిలిన కీర్తనల క్రింద ఉన్న పద్యాలు భాగవతం, నారాయణశతకాలనుండి గ్రహించి కీర్తనలు అచ్చు వేసే సమయంలో పెద్దలు చేర్చినవని ప్రస్తుత మఠాధి పతి అయిన "గోవిందయ్య" తెలిపారు. మానస పూజ కీర్తనలు నడుమనున్న పద్యాలన్నీ కందములే దాసుగారి పద్య కవిత్వ ప్రతిభకు మచ్చునకొక ఉదాహరణ.

మానసపూజలోని "రామతారకనామ రామ" (రా.వేం.కీ. 1930 పే 30 అనే కీర్తన క్రింద నున్న ఈ కందం చూద్దాం.

కం॥ "నానా జన్మ ఫలంబుల
బూనిన కర్మలును బోవు పొందుగ మిమ్మున్
ధ్యానించెద నామనమున
మాన కదయల జూడుమన్ను మరువకు రామా"

అలతి అలతి పదాలతో సలక్షణంగా సులభ గ్రాహ్యంగా ఉన్న ఈ కంధం వలెనే మిగిలిన కందాలు కూడా ఉన్నాయి.

వేంకటదాసు శిష్యుడైన శ్రీ గోపయ్య ఒక్క కీర్తనే ఒక్క నాటి భజనకు సరిపోయేట్లు గానం చేయమని దాసుగారిని కోరగా

"రామనారాయణ రామనారాయణ
రామ శ్రీవైకుంఠధామా నారాయణ ॥ప॥

1, వామన శ్రీధర వసుదేవ నందన
కామతార్థ ప్రదాస్వామి నారాయణ ॥రామ॥

2, రక్షితాఖిల మహాధ్యక్ష రూపా
రక్షించవయ్య ప్రత్యక్ష నారాయణ ॥రామ॥

(రా.వేం.కీ.ప్ర. 1930 52 పే)

అంటూ మూడు వందల చరణాలకు పైగా గానం చేశారట. "పులి మామిడి" వానియైన గోపయ్య ఏబది చరణాలకు మాత్రమే వ్రాయగలిగాడట. కాని అచ్చులో

ఇది "ఆధ్యాత్మ కీర్తన" పేరతో అచటి భక్తులు పాడుతుంటారు. సామాజిక విషయాన్ని యోగ విషయంతో పోలుస్తూ దాసుగారు పాడిన ఈ కీర్తన రెండురాలను కలిగి ఉంది. ఇందు సాలెవారి జీవన విధానాన్ని పనితనంలోని ప్రతిభను చెప్పటం సామాజిక విషయం. "ధరణి వస్త్రములను నేయటం, ముప్పూటలా నేయటం, సంతలో అమ్మటం" సాలెవారి జీవన విధానానికి సంబంధించిన విషయం. భక్తితో అంటే శ్రద్ధతో పోగుసిలకదజేసుకుని రంగు వస్త్రాలను, అందులోనూ పంచరంగుల వస్త్రాలు నేయటం వారి పనితనంలోని ప్రతిభను చాటి చెప్పటమే. ఇక రెండవ అంశం "ధరను గురుని జేసి కోరిక లెల్లను అధిగమించి హఠ యోగంతో రేచక పూరకాది ప్రాణాయామ క్రియలను అభ్యసించి "గంగా యమునల మధ్య రంగాము లోపల లింగానికిరువుగ!" అంటే హృదయస్థ ఆత్మలింగాన్ని తెలుసుకోవటం, అట్లా తెలుసుకున్న ఆధ్యాత్మిక విషయాన్ని రాకమచర్ల అంగడిలో అమ్మటం అంటే అందరికీ అందివ్వటం అనే ఇందులోని యోగ సంబంధ విషయం.

## భజన పద్ధతి

వేంకటదాసు నిత్యం భజన సమయంలో ముందు ఒక దీపాన్ని, గీతా పుస్తకాన్ని ఉంచుకుని పద్మాసనంలో కూర్చుండేవారు. వాసుదేవుని ప్రార్థించి భజన అరంభింపనిచేవారు. గురుస్తవం, తరువాత మానస బోధకీర్తనలు చదివి నిశ్చల చిత్తంతో బాహ్యవ్యాపారాలు మరచే వారట. అనంతరం యథావిధిగా తమ అశుధారతో నూతన కీర్తనలు ధారాళంగా పాడుతుండేవారట. ఆ సమయంలో అక్కడ ఉన్న భక్తులలో ఆసక్తి కలవారు ఆ కీర్తనలను వ్రాస్తుండేవారు. లుప్త చరణాలను మరునాడు దాసుగారిని అడిగి పూరించే వారట.

## శిష్యబృందం

దాసుగారి అమానుష చర్యలు, అద్భుత మహిమలు అసాధారణ వాగ్విలాసాలు నాలుగు దిక్కుల వ్యాప్తి చెందాయి. అట్లు వ్యాప్తి చెందిన వారి మహిత శక్తికి, భక్తికి ఆకర్షితులై "పులిమామిడి గోపయ్య, కందవాడ వెంకయ్య. శివారెడ్డి పల్లి కిష్టయ్య, రేపల్లె జానకిరాముడు, సంగీతం కినయ్య, తొండపల్లి వీరయ్య, అవసాలెమునయ్య, ఉపోషాల శేషమ్మగారు, కంకంటి నివాసి జంగం వీరయ్య" మొదలైన వారు శిష్యులయినారని పూర్వోక్త గ్రంథం వల్ల తెలుస్తున్నది. ఆ గ్రంథంలో ఒక ఉపోషాల శేషమ్మ గారి వివరాలు తప్ప పైన వివరించిన ఏ శిష్యుని వివరాలు లేవు. ఉపోషాల శేషమ్మ గారి చరిత్రను సంక్షిప్తంగా గమనించుడు.

శేషమ్మ గారు "చిటిగిద్దె" నివాసి. బ్రాహ్మణ కుటుంబంలో జన్మించింది. సద్గుణవంతురాలు. ఎనిమిదవ ఏ విద్యుక్తంగా తల్లి దండ్రులు ఈమేకు వివాహం చేశారు. విధివశాత్తు ఈమె పదునారవ ఏట భర్త మరణించాడు. నాటి నుండి శేషమ్మ గారు శ్రీరామనామధ్యాన చిత్త అయింది. ఒకనాడు సంగారెడ్డి పేటలో శ్రీ వేంకటదాసు దర్శనం ఈమెకు లభించింది. నాటి నుండి ఈమె ప్రవర్తనలోకులకు పిచ్చిదాని వలె అనిపించసాగింది. నీటిపై నడపటం, జలస్తంభన వంటి పనులచేత లోకులు భయపడ సాగారు. ఈమె విషయం దాసుగారికి తెలుపగా ఆమె పరమ భక్తురాలు, ఆమెను గూర్చి భయపడనవసరం లేదని తెలిపారట.

తరువాత కొన్నాళ్ళకు అవైర్యామూర్తికి దాసుగారు శ్రీరామతారక మంత్రం ఉపదేశించారట అ నాటి నుంచి ఈమె వంటకష్టలను వర్జించి పండ్లు, పాలు మాత్రమె ఆహారంగా తీసుకోవటం చేత ఆమెను ఉపోషాల శేషమ్మ అని పిలువటం ప్రారంభించారు. ఆమె మరణ పర్యంతం దాసుగారి సన్నిధిలోనె కాలంగడిపింది. క్రోధనామ సంవత్సరం ఆషాడ బహుళ పంచమి నాడు ఈమె మరణించింది.

## సమాచారం

ఉమ్మెంతాలలో ఉన్న వేంకటదాసు గారి మఠంలో ప్రస్తుతం వేంకటదాసు గారితో కలిపి నాల్గవతరం నిడుస్తుంది. ఈ ప్రకరణాంతంలో వారి పరిచయం భవిష్యత్తులో ఉపయోగపడవచ్చునన్న తలంపుతో నేను సేకరించిన విషయాలను పొందుపరుస్తున్నాను.

ఉమ్మెంతాలలో మఠం స్థాపించి అధిపతి అయిన మొదటి వ్యక్తి శ్రీ వేంకటదాసు. వారి అనంతరం మఠాధిపతియైన రెండవ వ్యక్తి దాసుగారి అన్న కుమారుడు శ్రీ తిరుమలయ్య. ఎనిమిదేండ్ల వయస్సు నుండి రామచర్లలో వేంకటదాసు గారి వద్దనే ఉన్నారు. ఎనిమిదవ ఏటనే ఉపనియనాది సంస్కారాలు ఈతనికి వేంకటదాసే చేశాడు. దాసుగారివలె ఈతడు కూడా దివ్యశక్తి సంపన్నుడు. "ఆపాదపిశరాదపి" అన్నట్లుండేవాడు ఉమ్మెంతాల ఉత్సవ సందర్భంలో వందిళ్ళకు కావలసిన పొరకలు వతనగోకురవలు" తెచ్చి ఇస్తుండేవారట ఒక సంవత్సరం ఎందులకో తేలేదు. అందువల్ల తిరుమలయ్య గారే వెళ్ళి తెచ్చుకుంటుండగా ఆ గ్రామవాసి ఒకరు పొరకలు మీరు తెస్తున్నారేమిటి? అని పశ్నించాడట? ''కురవల ఇళ్ళు కాలాయి'' అని తిరుమలయ్య గారు సమాధానం చెప్పిందె తడవుగా వారి ఇళ్ళు తగలపడటం ప్రారభించాయట కురవలు వచ్చి తిరుమలయ్యగారి పాదాలపై పడగా వారు శాంతించి పొయినని పోగా మిగిలిన ఇళ్ళు ఉన్నాయి అన్నారట.

వెంటనే మంటలు అరి పోయాయట. అట్లాగే ఉమ్మెంతాల మాలీపటేల్ "చంద్రారెడ్డి" గారు భజనకు మామిడి పండ్లు పంపకకాయటం లేదని అబద్ధమాడాడట, అట్లగేలే అన్న తిరుమలయ్య గారి వాక్కుతో వారింటి మామిడి చెట్టు కాయటం మానెసిందట. ఇట్లా శక్తివంతులైన తిరుమలయ్య గారి జనన మరణకాలన్ని గూర్చి ఈ ప్రకరణం మొదట్లో చర్చించాను.

రాకమచర్ల మూడవ మఠాధిపతి శ్రీ ఏకనాథస్వామి. వీరు మహారాష్ట్రలోని "కురువాడి" సమీపంలో ఉన్న "ముగిలి అంబుల్" గ్రామవాస్తవ్యులు. వీరికి చిన్నతనంలోనే తల్లి దండ్రులు పోయారు. తరువాత ఏకనాధుడు అతని తమ్ముడు గోవిందరావు హైదాబాదు చేరారు. అక్కడ శ్రీనివాసరావు జాగీర్దార్ వద్ద విద్యాభ్యాసం ముగించుకుని "కన్కల్"కు నాయిబ్ తహసీల్దారుగా నియమితులయ్యారు. క్రమంగా తిరుమల్లయ్య గారితో స్నేహంకుదిరింది. వీరి 12, 13 సంవత్సరాలమైత్రి బంధం ఒకరినొకరు విడిచి ఉండ లేకుండా చేసింది. తిరుమల్లయ్యగారి మరణానంతరం అధికారం ఎవరికి ఇవ్వాలి అనే సంశయం బయలు దేరింది. వేంకటదాసు గారి శిష్యుడైన శ్రీ గోపాలరావు గారికి స్వప్నంలో దాసుగారు కనపడి ఏకనాథ స్వామి కిమ్మని అజ్ఞాపించారట మరునాడు శాస్త్రోక్తంగా ఏకనాథ స్వామికి మఠాధిపత్యం అవ్వటం జరిగింది.

ఏకనాథ స్వామికి మహారాష్ట్ర, ఉర్దు, హిందీ భాషలలో ప్రవేశముంది. క్రమంగా తెలుగు కూడా నేర్చుకున్నారు. వీరుకూడా తెలుగులో దాదాపు ముప్పది కీర్తనలు చెప్పారు. ఏకనాథ స్వామి వారికి భాగవతం అంటే అభిమానం ఎక్కువ సిద్ధపురుషులైన ఏకనాథ స్వామి సిద్ధార్థి నామ సంవత్సరంలో జన్మించాడు. షార్వరి నామ అరువది ఐదు సంవత్సరాలు జీవించాడు. షార్వరి నామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ చతుర్దశి శుక్రవారం నాడు సాయంత్రం 6 గంటల ప్రాంతంలో మరణించారు.

ఇక రాకమచర్ల ప్రస్తుత మఠాధిపతి "గోవిందయ్య" గారు నాల్గువవాడు. ఒకనాటి పరిగి తాలూకా నేటి వికారాబాద్ తాలూకాలో ఉన్న "కోనమల" అనే గ్రామం వీరి జన్మస్థలం వీరి తాతల ఉమ్మెంతాల గ్రామం పురోహితులు వీరిని మఠానికివ్వమని గోవిందయ్యగారి తండ్రిని ఏకనాథ స్వామి కోరారట. అందుకు సమ్మతించి చిత్రభాను సంవత్సరం అశ్వీజ బహుళ పంచమి నాడు గోవిందయ్య గారిని తీసుకుని వారి తండ్రి రాకమచర్లకు వచ్చారట. అప్పటికి గోవిందయ్య గారి వయస్సు పది సంవత్సరాలు.వీరిజన్మించటానికి ముందే వీరి పెద్దలతో మఠానికిచ్చే ఒప్పందం చేసుకున్నారట ఏకనాథ స్వామి. గురు సాంప్రదాయంలో వీరుకూడా ఎదురులేనివారే! వీరి తండ్రి పేరు "అయ్యగారు శేషాచారి" తల్లి "కమలమ్మ".

# సింహావలోకనం

"రాకమచర్ల వేంకటదాసు కీర్తనలు - జీవిత విశేషాలు'' అను ఈ సిద్ధాంత వ్యాసం, విషయానుగుణంగా ఉంటుంది అనే ఉద్దేశ్యంతో వ్యవహారిక భాషలో వ్రాయటం జరిగింది. సామాన్య పాఠకునికి కూడా అర్థం కావాలనే ఉద్దేశ్యంతో వాక్య నిర్మాణంలో విసంధులను పాటించాను,

మొదటి ప్రకరణంలో భారతీయతత్త్వాన్ని ఆవిష్కరించి చూపించాను. అందు కనుగుణంగా పరమాత్మ, ప్రకృతి, జీవాత్మ, తత్త్వాలను, వైదిక ధర్మాన్ని వివరించాను. భారత సమాజవైశిష్ట్యం తెలిపి మతాలు దానినివక్రీకరించి మానవ జీవన పతనానికి కారణమైన విధానాన్ని వివరించాను.

రెండవ ప్రకరణంలో వేంకటదాసు కీర్తనలలో భక్తి అన్న అంశాన్ని చర్చించాను. వేదం తెలిపిన యదార్థ జ్ఞానం కర్మ ఉపాసన, నిదిధ్యాసలకు మత సాహిత్యమైన పురాణాలు చెప్పిన కువ్యాఖ్యను తెలిసి వేదవిరుద్ధమైన ఈ మత పురాణాలు అవైదికమని తెలిపాను. వైష్ణవ మతస్థుడైన వేంకటదాసు కీర్తనలను గురూపదేశానికి ముందు, గురూపదేశానంతరం కీర్తనలుగా విభజించి అవైదికమైన మతపురాణాదులు ప్రవేశపెట్టిన భక్తిమార్గంలో పయనించిన తీరుతెన్నులు ఆతని కీర్తనలు ఉదహరిస్తూ సమన్వయించాను, వైష్ణవభక్తి స్వరూపాన్ని తెలిపి కీర్తనలలో ఏకాదశ విధ భక్తులను చూపించి, మానసపూజ నామం, ఆవాహనం, అపరాధి, గురుభక్తి, మనోభోధ పేర్లతో ఉన్న కీర్తనలన్ని మతసంబంధమైనవనే అని స్పష్టపరచాను.

మూడవ ప్రకరణంలో పల్లీయుల జీవనంపై కీర్తనల ప్రభావాన్ని పరిశీలించాను. అవైదిక మత వచనాలతో నిర్మలమైన పల్లీయ జీవనం ఎట్లా పతనమైందో సూచించాను. వేంకటదాసు ప్రవేశ పెట్టిన ఉమ్మెంతాల ఉత్సవ స్వరూపాన్ని తెలిపి పల్లీయ జీవనంపై దాని ప్రభావం, కీర్తనలు పాడటంలో కట్టు బాట్లు వారిలో

పెంచిన మౌఢ్యాన్ని విశదీకరించాను. సమకాలీన కీర్తనకారులైన మన్నెంకొండ హనుమద్దాను. వేపూరి హనుమద్దాసు కీర్తనలలో ఉన్న వేంకటదాసు కీర్తనల అడుగు జాడలను సూచించాను.

నాల్గవ ప్రకరణంలో వేంకటదాసు కీర్తనలలో సంగీత సంప్రదాయాలు అనే అంశాన్ని ప్రస్తావించాను సంక్షిప్తంగా సప్తస్వరాలు, నాదం, రాగం, తాళం - లయలను తెలిపి సంగీత పరిచయం చేశాను. సత్యమైన సాహిత్య ప్రయోజనం ఎట్లా సిద్ధిస్తుందో తేటపరచి సంగీత సాహిత్యాల సామ్యభేదాలను సూచించి. కొన్ని వేంకటదాసు కీర్తనలకు సంప్రదాయ బద్ధంగా రాగ, తాళాలను తెలియజేశాను.

అయిదవ ప్రకరణంలో వేంకటదాసు జీవిత విశేషాలను వివరించాను. బాల్యదశ, యువదశ, గూరూపదేశం, గురుపరంపర, ప్రౌఢదశ, చరమదశలతో పాటు వీరి స్వరూపం, భజన పద్ధతి, శిష్యబృందాన్ని తెలిపాను. అతిమానుషశక్తి, సిద్ధించిన భక్తి, పాండిత్యం, అశుధాల సోదాహరణంగా విశదపరచి మఠాధిపతుల సమాచారాన్ని అందించటంతో పరిశోధనం ముగించాను.

# ఉపయుక్త గ్రంథ సూచిక


తెలుగు సంస్కృత గ్రంథాలు : కర్త

1. అమరకోశము : అమరసింహుడు.
2. ఆర్యాభి వినయము : మహర్షి దయానంద సరస్వతి విరచితము
   అనుకర్త : పండితగోపదేవ్.
3. ఈశావాస్యోపనిషత్తు : వ్యాఖ్యాత : పండితగోపదేవ్
4. ఈశ్వర రహస్యసారము : ఆంధ్రానువాదం : వైనారాయణ మూర్తి
   సంశోధకుడు : అన్నె కేశవాచార్య శాస్త్రి
5. ఐతరేయోపనిషత్తు : వ్యాఖ్యాత : పండిత గోపదేవ్.
6. కఠోపనిషత్తు : వ్యాఖ్యాత : పండిత గోపదేవ్.
7. కావ్యాలంకార సంగ్రహము : సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి
8. క్రొత్త సంగీత విద్యార్వదణము : కూర్పరి : ఏకా సుబ్బారావు.
9. గానకళాబోధిని : ఎస్.పి. పార్థసారథి
10. ఛాందోగ్యోపనిషత్తు : సంశోధకులు : పండితగోపదేవ్
11. జానపద సాహిత్యం : ఎల్లోరా
12. తిరునామములు-సమగ్రపరిశీలనము : డా॥ కిళాంబి నరసింహాచార్యులు.
13. తైత్తిరీయోపనిషత్తు : వ్యాఖ్యాత : పండితగోపదేవ్.
14. దేశిసారస్వతము స్త్రీల రామాయణపు పాటలు : సంకలనం : ముద్దు కృష్ణ
15. నారద భక్తి సూత్రాలు : అనువాదకుడు : దొడ్ల వేంకటరామరెడ్డి
16. పల్లెపదాలలో ప్రజాజీవనము : డా॥ యెల్దంద రఘుమారెడ్డి.
17. పూజ : మూలం : గంగా ప్రసాద ఉపాధ్యాయ
    అనువాదం : పండిత గోపదేవ్.
18. ప్రశ్నోపనిషత్తు : వ్యాఖ్యాత : పండిత గోపదేవ్

19. బాలవ్యాకరణం : చిన్నయ సూరి
20. బృహదారణ్యకోపనిషత్తు : వ్యాఖ్యాత ; పండిత గోపదేవ్.
21. భక్తి తత్త్వదర్శనము (శాండిల్యనారద సూత్రములు) : వ్యాఖ్యాత : చర్ల గణపతిశాస్త్రి
22. భగవద్గీత
23. శ్రీ మహాభాగవతము : పరిష్కర్త : బులుసు వేంకటరమణయ్య
24. శ్రీమద్భాగవత మహాపురాణం : హిందీవ్యాఖ్యం : గోరఖ్‌పూర్
25. శ్రీమదాంధ్రమహాభారతము శాంతి పర్వము : సంశోధిత ప్రచురణము తెలుగుశాఖ. ఉస్మానియావిశ్వవిద్యాలయం
26. మనుస్మృతి : ప్రచురణ ; ఆర్యసాహిత్యప్రచార ట్రస్ట్
27. శ్రీమన్నేలకొండ హనుమద్దాసు చరిత్ర : ముగిస్థలం అయ్యమాచార్యులు.
27. A. మామిళ్ళపల్లి మహాక్షేత్రము : రచయిత ; కపిలవాయి లింగమూర్తి
28. శ్రీమాణిక్యప్రభుచరిత్ర : అనువాదకుడు : గటిరెడ్డెయ్య.
29. మాండూక్యోపనిషత్తు : వ్యాఖ్యాత : పండితగోపదేవ్
30. ముండకోపనిషత్తు : వ్యాఖ్యాత : పండితగోపదేవ్
31. యజుర్వేద భాష్యము సప్తమాధ్యాయము : సంస్కృత భాష్యం : మహర్షిదయానంద సరస్వతి ఆంధ్రానువాదం : పాలడగు శేషాచార్య అన్నే కేశవార్యశాస్త్రి
32. యోగదర్శనము : పతంజలిముని ప్రణీతము వ్యాఖ్యాత : పండిత గోపదేవ్.
33. రత్నయుగళి : రచయిత : కె.టి.యల్. నరసింహాచార్యులు
34. ~~రామచర్ల కీర్తనలు~~ : ప్రచురణ : 1930 : 1977 : 1980.
35. ~~శ్రీ రామచర్ల మహాత్మము~~ : రచయిత : సోమనసుర్తి కిషన్‌రావు
~~వేంకటయ్య గారి జీవితము వీరి భక్త బృందచరితములు~~ : మేడిపల్లి వెంకయ్య.

36. వేదాంత దర్శనము (వ్యాసకృత బ్రహ్మసూత్రములు) : వ్యాఖ్యాత : గోపదేవ్.
37. వేదతత్త్వ ప్రకాశము (ఋగ్వేదాది భాష్యభూమిక) : అనువాదం : పండిత గోపదేవ్.
38. వైశేషికదర్శనము : వ్యాఖ్యాత : పండిత గోపదేవ్.
39. శ్రీవేపూరుహనుమద్దాసు చరిత్ర : వేపూరు హనుమద్దాసు
40. శబ్దరత్నాకరము : బహుజనపల్లి సీతారామచార్యులు.
41. శ్వేత శ్వతరోపనిషత్తు : వ్యాఖ్యాత : పండిత గోపదేవ్.
42. సత్యార్థ ప్రకాశము : సంశోధకులు : పండితగోపదేవ్.
43. సంక్షిప్త పాతంజల యోగదర్శనము : మూలం : శ్రీశ్రీశ్రీ స్వామి సచ్చిదానంద యోగి అనువాదం : నిర్మలయోగభార
44. సత్యార్థ ప్రకాశసందేశం : డాక్టర్ సత్యకామవర్మ
45. సాంఖ్యదర్శనము : కపిలమహర్షి ప్రణీతం వ్యాఖ్యాత : పండిత గోపదేవ్
46. సామవేదహిందీ భాష్య : భాష్యకర్త : స్వామిశ్రీతులసీరామస్వామి
47. హిందూస్వరూపము : మూలం : పం. వైద్యగురుదత్త హాయానువాదం : పం. రుద్రదేవ్‌శాస్త్రి
48. క్షేత్రయ్య పదసాహిత్యం : డా॥ యస్. గంగప్ప

పత్రికలు వ్యాసాలు

1. పరిశీలన వార పత్రిక : మార్చి 14, 1978 మరియు 13.4.198
2. భారతి సాహిత్య మాస పత్రిక : జూన్, 1985.
3. వేదధర్మము మాస పత్రిక :
4. సాధన మాస పత్రిక : అక్టోబరు 1986. జులై, అగస్టు 1986.